అంతర భారతీయ పుస్తకమాల

# మరణానంతరము

రచన :

శివరామ కారంత

అనువాదము :

తిరుమల రామచంద్ర



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూ ఢిల్లీ

# పీఠిక

భారతదేశం విశాలమైన దేశం. సాంస్కృతికంగా దేశమంతా ఒక్కటే అయినప్పటికీ మన జాతీయ శక్తిని బలపరిచి దేశానికి కావలసిన అభ్యుదయాన్ని సాధించేందుకు ఈ సమైక్య సూత్ర సంధానాన్ని మరింత పటిష్టం చేయవలసిన అవసరం ఇంకా వుంది.

మన దేశంలో చాలా భాషలున్నాయి. ప్రపంచంలో మరి ఏ దేశంలో కూడా ఇన్ని భాషలు ఉన్నట్లు కనిపించదు. కాని మన ఇరుగు పొరుగు భాషలను గురించి తెలుసుకోవాలనే ఆసక్తి మనకు చాలా తక్కువ. ఇతర భాషల యందలి పరిజ్ఞానం కూడా మనకు తక్కువే. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ మొదలయిన యూరోపియ భాషా సారస్వతాలను గురించి కానీ, ఆ భాషలు మాట్లాడే వారి సాంఘిక జీవితాన్ని గురించి కానీ తెలిసినంతగా మనకు మన దేశ భాషల సారస్వతాన్ని గురించి తెలియదు.

భావాత్మకంగానూ, సాంస్కృతికంగానూ, దేశంలో సమైక్యం సమకూర్చుకునేందుకు నాగరిక దేశ మనిపించుకుంటున్న మన దేశంలోని వివిధ భాషల్లో వెలువడుతున్న సారస్వత రచనలను గురించి సమగ్రంగా తెలుసుకుని, ఆయా భాషలు మాట్లాడే ప్రజల జీవిత విధానం, వారి ఆశయాలూ, ఆచారాలూ, వారి సాంస్కృతిక దృక్పథం పూర్తిగా అవగాహన చేసికోవటం చాలా అవసరం.

పాశ్చాత్య దేశాల్లో ఏ దేశానికి అది వేరుగా వున్న దేశాలెన్నో వున్నాయి. ప్రతి దేశానికీ ప్రత్యేకమైన ఒక భాష కూడా వుంది. అయినప్పటికీ ఆ దేశవాసులు తమ పరిసర భాషల్లో ఎప్పటి కప్పుడు వెలువడుతున్న సారస్వతాన్ని గురించి అవ్యవహితంగా, సూక్ష్మ పరిజ్ఞానాన్ని సమకూర్చుకుంటారు. కాని మనకు మన దేశభాషలను గురించి అంతటి పరిచయం లేకపోవటం విరోధ భావంగా తోస్తుంది. యూరపులో ఏ భాషలోనైనా ఒక ఉత్కృష్ట రచన జరిగితే అది వెంటనే అనువాద రూపంలో మిగిలిన భాషల్లోకి వచ్చితీరుతుంది. కాని జాతీయత సమకూర్చుకున్న మన భారత దేశంలో మనకు మన ఇరుగు పొరుగు భాషల స్థితిగతులను గురించి

తెలుసుకోవాలన్న ఆసక్తి ఎక్కువగా కనిపించదు. ఈ పరిస్థితి కొంత వరకు మారుతున్నది. కాని మారవలసినంత త్వరగా మారటము లేదు.

ఈ విషయాన్ని గమనించి భారత ప్రభుత్వం ప్రతి భారతీయ భాష నుండి ఉత్తమ సమకాలిక రచనలను సేకరించి వాటిని మిగిలిన భారతీయ భాషల్లోకి అనువదింప జేయాలని ఒక ప్రణాళిక తయారుచేసింది. ఈ ప్రణాళిక ననుసరించి సామాన్యంగా పాఠకలోకానికి ఆస్వాద్యంగాఉండే రచనలు అంటే కథలు, నవలలు, మనోహర యాత్రా వర్ణనలు, స్వీయ చరిత్రలూ — అనువాదానికి ఎన్నుకొనటం జరుగుతుంది.

ఈ గ్రంథమాల క్రింద ప్రచురింపదలచిన రచనలు, విస్తృత జనా దరణ పొందిన ఉత్తమ రచనలు అవడమే కాక, ఆయా భాషలకు సంబంధించిన సంఘ జీవితాన్నీ, భావసంపదనూ, ఆశయాలనూ -, ఆదర్శాలనూ ప్రతిబింబించ గలిగేవిగా ఉండేలా చూడటం జరుగుతుంది.

భాషా బహుళమైన మన సమాజంలోని వివిధ భాషల మధ్య పరస్పర పరిచయం, అవగాహనం, భావ సమన్వయం సమకూర్చేందుకు ఈ ప్రణాళిక చాలావరకు తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

వివిధ భారతీయ భాషల నుండి ఉత్తమ రచనలను ఎన్నుకొని వాటిని అనువదింపజేయటం అంత సులువైన పని కాదు. ఈ విషయంలో మాకు సరియైన దారి చూపి, మాతో సహకరించిన సలహాదారులకూ, అనువాద కులకూ మేము కృతజ్ఞులం. వారి సహకారమే లేకుంటే ఈ పని ఇంత జయప్రదంగా సాగేది కాదు.

బాలకృష్ణ కేస్కర్

# మున్నుడి

నవలనేమో వ్రాస్తున్నాను. అయితే, వ్రాసిన నవలకు మున్నుడి వ్రాయడమంటే, ఔదాసీన్యం. నవల తెలుపని దానిని మున్నుడి తెలుపాలా? వ్రాసిన నవలే తన ఉద్దేశాన్ని స్పష్ట పరచకపోతే, వ్రాసి ఫలమేమిటి? మున్నుడి వ్రాయకపోవడానికి ఇన్ని కారణాలున్నాయి.

అయినా, కొన్ని కొన్ని సార్లు ఒకటి రెండు మాటలు వ్రాద్దామనిపిస్తుంది; వ్రాస్తాను. 'అళిదమేలె' అనే ఈ నవలలో మానవుని బ్రతుకులో మిగిలేదేమిటని వెదికిచూచే ప్రయత్న దృష్టి వుంది. వట్టి స్మృతులే ఆ మీదట మిగిలే విషయాలు. నడుస్తూ దారిని సాగిపోయేవాడు తన అడుగుల జాడను వదలిపోయేటట్టు, గడచిన జీవితం ఇతరులలో ఉదయింపజేసిన ప్రభావాలతో నశించిపోగల వస్తువు. తమ జీవితం దానికన్నా గాఢమైన ముద్ర వేయగలదని నడిచిన వారందరూ అనుకోనక్కరలేదు. అటువంటి అదృష్టం అందరికీ లభించదు. ఈ నవలలోని యశ్వంతులవలె జనం పుడుతున్నారు; బ్రతుకుతున్నారు; మరణిస్తున్నారు. బ్రతికినవారు, తమతో సంబంధం కలిగిన కొందరికి హితులు; పలువురికి తెలియనివారు. బ్రతికిన సంబంధంలో ఏర్పడిన హితా హితాల ప్రభావాలను మేళవించి యశ్వంతుల జీవితం ఎటువంటిదై వుంటుందని అన్వేషించడానికి ప్రయత్నించాను, ఇక్కడ ఇది ఆయన వదలిన అడుగు జాడలను వెన్నంటి పోయినట్టు.

దారిలో సాగిపోయిన వారు ఆయన; కొద్దిపాటి పరిచయంతో కుతూహలం తాల్చి, ఆ జాడలు వెదుకుతూ పోయిన వాడిని నేను. ఇక్కడ నా కొలమానంతో కొలచడానికి ప్రయత్నిస్తున్నాను. నాది నిరీక్షకుని పాత్ర. "బెట్టద జీవనం" (పర్వత జీవితం అనే నవల) లో అలాటి పాత్ర వహించినట్లు ఇక్కడ మరొకమారు వహించాను. అదొక తీరు; ఇదొక తీరు. అది బ్రతికినప్పుడు చూచినట్టిది; ఇది చనిపోయిన తర్వాత తెలుసుకొన్నది.

రేపు, మన మరణానంతరం, మన జీవితాన్ని ఇదే రీతిగా నిరీక్షించవచ్చు. ఇలాగే తెలుసుకోవచ్చు. తెలుసుకోనీ, తెలుసుకోకపోనీ, మన బ్రదుకులో అచ్చొత్తిపోయిన ముద్ర పరిసర జీవితంమీద పరిణామం కలి

గించనే కలిగిస్తుంది. చావుకు పాల్పడిన ఏ బ్రతుకూ వ్యర్థం కాదు. అది చాలి నంత సార్థకం అయ్యేట్టు సాగిపోతే చాలునని నా మనస్సు చెబుతున్నది.

వ్రాసిన నవల అచ్చయిన పిదప నా పలువురు మిత్రులకు పంపే వాడుక పెట్టుకొన్నాను. వారు దీనినంతా చదువుతారు; తప్పక చదవాలి. అనే ఆశ పెట్టుకోలేదు. కొందరు చదివి అభిప్రాయం వ్రాయడం కద్దు; కొందరు కలుసుకున్నప్పుడు వ్రాసిన వ్రాతలలో సంశయాలు తిరగదోడు కోడం కద్దు. నా మిత్రులయిన శ్రీ బి. ఎస్. తుంగగారు ఈ స్వభావం గల వారు. ఈ నవల వ్రాసే సమయంలోనే నేను ఆయనకొక జాబు వ్రాశాను. "మనస్సిప్పుడు తీక్ష్ణవేదనకు, వ్యథకు, తల్లడింపునకు పాల్పడింది. ఈ సమయంలో ఒకటి రెండు అనిరీక్షిత సంతోష సంఘటనలూ జరిగాయి. అయితే, వాటిని ముంచివెయగల వ్యథా సంఘటనలూ సన్నావరించాయి. వాటిని కడిగివేసికొనడానికే ఒక కొత్త నవల సృష్టికి పూనుకున్నాను. అటువంటి సంతోషమయినా నాపాలిట వున్నది కదా!" అని వ్రాశాను.

వ్రాసిన గ్రంథం అచ్చుకు పోయింది. రేపు అచ్చయి, ఆ రోజే నా మిత్రుల చేతులకు అందుతుంది. తీక్ష్ణవేదనతో సృష్టిపొందిన ఈ నవల ఎటువంటిదనే కుతూహలం ఆయనలో ఉదయించవచ్చు. ఆయన సంశయాలను కెరలించవచ్చు – అన్నాను. ఆ సమయం మాత్రం రాలేదు. నవల ముద్రణాలయంనుంచి వెలికి రావడం తీరా ఆలస్యమయింది. ఆలోనే మిత్రులు శ్రీ తుంగగారు అపఘాతానికి (ప్రమాదానికి) గురిఅయి మరణించారు. దీనిని ఆయన స్నేహస్మృతిగా అర్పించే ప్రమేయం ప్రాప్తించింది. ఆయన నాకంటే, ఇరవయి సంవత్సరాలయినా చిన్నవారు. ఈ రచనను నేను ఆయనకు అర్పించే బాష్పాంజలి అవుతుందని ఎప్పుడూ అనుకోలేదు.

తుంగగారి పుట్టిన వూరయిన బాళకుదురు నా జన్మ గ్రామానికి సమీపంలో వుంది. ఐదే ఐదు మైళ్లి దూరంలో వుంది. అయినా, మా యిద్దరి పరిచయ స్నేహ సంబంధాలు ఇటీవలి ఏడెనిమిది సంవత్సరాలవి. 1951 లో జరిగిన సాధారణ ఎన్నికలలో ఆయన పి. టి. ఐ. విలేఖరిగా మా జిల్లాకు వచ్చినప్పుడు, నాకు ఆయన ప్రథమ పరిచయం కావడం.

ఆ అల్ప పరిచయం సోదర వాత్సల్యం కన్నా గాఢమయిన స్నేహంగా పరిణమించింది.

తుంగగారు, సామాన్యమయిన కాయవాటు శరీరం కలవారు; తెల్లని

మేని ఛాయ. ముఖం మీద ఎప్పుడు ఒకవిధమయిన తుంటరి నవ్వు మెరుస్తూ వుండేవి. ఆ మృదుహాసమూ, మెరిసే కళ్లూ ఆయన సూక్ష్మ బుద్ధికి ప్రతీకలు. ఆయన బుద్ధి ఎంత తీక్ష్ణమో, నాలుక అంతే పదును. చురుకైన బుద్ధికి సమమైన నిష్కపట మనస్సు ఆయన స్వభావాన్ని సూచించేది. నడి వయస్సు, సాహస చిత్త వృత్తి గల ఆయన పత్రికలలోను, పి. టి. ఐ. వార్తా సంస్థలోను పేరు సంపాదించారు. ఆయన స్నేహ సంబంధాలు, వ్యవహార సంబంధాలు బహు విస్తారం. పాకిస్తాన్‌లో రెండు మూడు సంవత్సరాల కాలం పి. టి. ఐ. సంస్థ పరంగా విలేఖరిగా ఉన్నారు. భారత ప్రభుత్వం ఆయన సమర్థతను మెచ్చిందనే అనుకోవాలి. అయూబ్ సర్వాధికారాలు స్వీకరించినప్పుడు, మొట్టమొదటి వార్తను ప్రకటించిన వారు ఆయన; పాండుచ్చేరి విప్లవోద్యమంలో అరవిందాశ్రమం కైవాడం ఎంత ఉన్నదీ బయటపెట్టినవారూ ఆయనే. మరణించడానికి ఒకటి రెండు నెలల ముందు నీఫాకు వెళ్ళాలని ఉబలాట పడ్డారు; అప్పుడు అస్సాములో ఒక బస్సు ప్రమాదానికి గురిఅయి మరణించే దౌర్భాగ్యం కలిగింది. అటువంటి వ్యక్తిని గురించి భారత ప్రభుత్వం సమాచార శాఖా మంత్రి శ్రీ కేస్కర్ గారు తెలిపిన సంతాపం అతిశయోక్తి కాని గౌరవం.

ఆయన పుట్టింది తీరా పేదతనంలో. తండ్రి చిన్ననాడే మరణించారు. తల్లి మమతనూ త్వరలోనే పోగొట్టుకొని, అనాథ జీవితం నడిపారు. చదివింది కేవలం ఎస్. ఎస్. ఎల్. సి; ధైర్యమొక్కటే ఆయన జీవితాన్ని నడిపించిన మహాశక్తి. డబ్బు కాని, గౌరవం కాని ఆయన నుంచి మన్నన పొందలేదు. మానవ సంఘంలోని గంభీరమయిన లోతులలోకి దిగి తొంగి చూచే సాహసమే ఆయన జీవితపు లక్ష్యం.

“అళిదమేలె” నవలలోని యశ్వంతులు మనిన వ్యక్తియో, అలాగే నా మిత్రులయిన శ్రీ తుంగగారు తమ మిత్రులనేకుల స్మృతిలో గాఢమూ, చైతన్యవంతమూ అయిన బింబాన్ని మిగిల్చారు.

మనం ఇప్పుడు ఆయనను మాట్లాడించ లేకపోయినా, ఆయన అదృశ్య జీవం మనను మాట్లాడిస్తూనే వుంటుంది.

29–1–1960

పుత్తూరు, ద. క. శివరామ కారంత

# ఒకటి

జీవిత మనేది ఒక దీర్ఘకాల యాత్ర. అది ప్రారంభమయిన నాటినుంచి ఆరేడు సంవత్సరాల వరకు మన జ్ఞానమే మనకు ఉండదు. తల్లి, తండ్రి, అన్న, తమ్ముడు, బంధుజనము - ఇలాటి పలువురి సంబంధం లేత్రాయపు మన మొద్దు జీవితంలో కలిగినా, పరాశ్రయం లేక అప్పటి మన జీవితం సాగనప్పటికీ, వాటి ఆలోచనలలో మనకు మిగిలే జ్ఞాపకాలు తీరా తక్కువ. ఇలా శైశవం గడిచి, బాల్యం ప్రారంభమయితే, బడిలోపల, వెలుపల సమవయస్కులతో ఆట పాటలు మనకు దొరికితే, అప్పుడు మన చెలికాండ్ర ఆలోచనలలో మనకు ఎక్కువ జ్ఞాపకాలు మిగులుతాయి. ఆ జ్ఞాపకాలు కూడా తాత్కాలిక మయినవే. విద్యార్థి దశ ముగిసి, మనం కౌమార దశ నుంచి యౌవనావస్థలో అడుగు పెడుతున్నప్పుడు, మన బతుకు చాలినంత మధుర జ్ఞాపకాలతో వున్నా ముందు యౌవనం వచ్చి సంసారపు జంజాటంలో కాలుపెట్టామంటే, జ్ఞాపక భండారంలో మిగిలే మిత్రుల సంఖ్య అనేది ఒకటో, రెండో; మహా ఎక్కువయితే, పదో పన్నెండో. ముందు ప్రపంచమే వేరె. జీవితరంగంలో కలిసే మిత్రవర్గమే వేరె. అప్పుడూ గాఢమయిన జ్ఞాపకానికి చిక్కి వారి బదుకుకు ఒదిగే వారి, లేక బదుకుకు విఘ్నంగా వచ్చి, మనను తాకి, మనస్సులో జ్ఞాపకాన్ని చెక్కి వుంచగల వారి సంఖ్య విశేషంగా వుండదు. అక్కడి నుంచి ముసలి ముప్పతనానికి అడుగు పెడితే, పాత జ్ఞాపకాల ఉగ్రాణం బట్టబయలవు తుంది. ముసలి ముప్పు దినాలలో సమవయస్కులు కానివారితో మన వ్యవహారాలు తక్కువవుతాయి. మన సుఖానికో, దుఃఖానికో, శాంతికో ఒదిగే వారి సంఖ్య ముష్టిపరిమితికే నిలిచిపోతుంది. అరవై డెబ్బయి సంవత్సరాల జీవితయాత్రలో చూచి మాట్లాడిన వారి సంఖ్య, కలిసి ఆటలాడిన వారి సంఖ్య, వ్యవహార క్షేత్రంలో కలిసి వేరయిన వారి సంఖ్య-వీటినన్నిటినీ కూడితే, వేయి గుర్రాల సరదారు లాగ విపులమయిన పరిచయం! వచ్చిన జీవితం వదలి తొలిగిపోయేటప్పుడు, అదే సరదారు ఇంటి యిల్లాలి ఖాసాదారు (బంటు) లాగ అజ్ఞాత వ్యక్తి అయి, ఎంతో

అల్పుడయి మరుగయి పోవచ్చు. చాల భాగ్యశాలి అయితే, పది పన్నెండు గురు మిత్రులు అతని అవసానకాలం జ్ఞాపకపరచుకొని "పాపం పోయాడా! వయస్సయింది, ఇంకేమిటిది?" అంటూ అతని మరణం జ్ఞాపకంతో ఒక చుక్క కన్నీరు చిందించనూవచ్చు; కన్నీరు చిందించక మాటలతోనే ముగించనూవచ్చు. ఎంత పెద్ద పయనం? ఎంతకాలం నడిచింది? ఏమి పురుషార్థాలు సాధించింది? ఏమి సంపాదించింది? ఏమి కష్టపడింది? ఏమి వదలిపెట్టి వెళ్ళింది? వీటినంతా లెక్కవేస్తే - ఇల్లూ వాకిలీ, డబ్బు దస్కం, ఏదో కొంత మిగులవచ్చు. ఇతరుల మనో భిత్తిమీద "ఇలాటి ప్రాణి ఒకటి వుండినది; అది పోయింది కదా?" అని వ్రాయించిపోగల జీవన భాగ్యం ఎంతమందికి వుంటుంది?

జీవిత యాత్రే అలాటిది. ఆ నాటకంలోని క్షణిక దృశ్యం - మనం ఊరూరికీ చేసే ప్రయాణం. ఇది వాస్తవిక మయిన ప్రయాణం. మనం ఏదో పనిమీద రైలులోనో, పడవలోనో, మోటారులోనో తిరుగాడుతూనే వుంటాము. స్వంత వూరు వదలి పెరవూరికి పోతాము. పనికోసం వెళ్లు తాము. విలాసం కోసం వెళ్లుతాము. నేనూ, మీరూ, అందరూ అలాగే చేస్తాము. కొన్ని గంటల బస్సు ప్రయాణం మినహా మనమందరం ఒకటి రెండునాళ్లు పడవలోనో, రైలులోనో పయనించిన వాళ్లమే. ఆ సమయంలో మనకు స్థావర జగత్తు మరుగవుతుంది. మనం చలిస్తూ - కదలాడుతూ వుంటాము గదా! మనం పడవలోనో, రైలులోనో కూర్చుని వుంటాము. ఆ రైలులోనో - బండిలోనో పడవలోనో నూరారు లేక వేయారు మైళ్లు ప్రయాణం చేసే ఇతరులూ నిండివుంటారు. ఒక మారు అలాటి బండినో పడవనో ఎక్కామంటే, దిగేవరకు అది మన ఇల్లు. దానిలో మొదటే జనం నిండివుంటే, ఆ జనం పాలిటికి కొత్తగా రైలు ఎక్కే మనం సామాన్య శత్రువుల వంటి వారం. మన ముఖం చూచి మరింత వెడల్పుగా కూర్చుం టారు కొందరు. పట్టపగలయినా విప్పిన పక్కను కొంచెమయినా మడవ కుండా నిద్ర నటించేవారూ వుంటారు. "వచ్చిన వానికీ ఒకింత చోటు యిద్దాము" అనే మనసు రావడం చాల తక్కువ జనానికి. అక్కడ చోటే లేకపోతే ఇచ్చే ప్రశ్నే లేదు. గంటల తరబడి నిలబడే వెళ్లవలసి వుంటుంది. అలాటి వేళల్లో మనమూ ఉద్విగ్నులయి వుంటాము. బండిలోవున్న వారి మీద మనకూ కోపం వస్తుంది. వేయి విధాల మృగ పక్షులను ఒకే మృగా

లయంలో చేర్చినట్టు, ప్రయాణ సన్నివేశం రూపు చెందుతుంది. అంత యినా, జనం గొణగొణ ధ్వని వినబడుతూనే వుంటుంది. బయలుదేరేటప్పుడే మిత్రుల గుంపును వెంటబెట్టుకొని పోయివుంటే, అవసరమయిన, అవసరం లేని విషయాలు మాట్లాడుతూ, రైలు కష్టమంతా గడపవచ్చు. ఇలాటి సందర్భాలనే జాతరలని అనుకొని, గుర్తులేని వారిని కూడా మాట్లాడించి, రెండు గంటలలోనే బండిలోని వారంతా తమ పక్కింటి బంధువులనే టంతటి చనువుతో, తియ్యదనంతో కాలం గడిపి, బండి దిగుతూ, వారికి నమస్కరించి వెళ్లే జనమూ వున్నారు. ముందు వారెక్కడో! వీరెక్కడో!

ప్రవాస జీవనమే బ్రతుకులో ఒక అంగమయిన జనంలోను రకరకాల వారుంటారు. ఇంగ్లెండువంటి దేశంలో రైలు ప్రయాణం చేస్తే మరొక విచిత్ర పద్ధతి కనిపిస్తుంది. అక్కడ ఒకరు మరియొకరి చోటు ఆక్రమించు కోరు. చోటులేని వాడు నిలబడి వుంటాడు. చోటు ఉన్నవారు కూర్చుని ఉంటారు. పక్కన పక్కనే కూర్చుని పది పన్నెండు గంటల ప్రయాణం చేస్తారు. చేతిలో పుస్తకం వుంటే చదువుతారు. లేకపోతే మూగ దయ్యాల లాగా కూర్చుని ఉంటారు. "మీది ఏ వూరు?", "ఎక్కడికి వెళ్ళు తున్నారు?" "ఏమిటి పని?", "ఎంత సంపాదన?" ఇలాటి ఒక ప్రశ్నయినా అడుగరు. వాళ్లపాటికి వాళ్ళుంటారు. స్నేహం పెంపొందించు కోడానికి ఏర్పాటయింది కాదు రైలు వ్యవస్థ; కేవలం దారి సాగడానికి ఏర్పాటయింది – అని అనుకుంటారు అక్కడి జనం. దీనిలో ఏది సరి? ఏది తప్పు?

నేను, నా జీవితంలో ఉత్సాహం కలిగేవరకు మొదలుకొని వేసట వచ్చేవరకు పడవలలోను, రైళ్ళలోను అప్పుడప్పుడు సంచారం చేసిన వాడిని. ఆ ప్రయాణాలన్నిటిని వర్ణించడానికి ఇప్పుడు బయలుదేరలేదు. కేవలం ఒక ప్రయాణపు మనస్తత్త్వాన్ని ఒక సందర్భంగా చెబుతున్నాను. నాకు జనం సమ్మర్దం చూస్తే ఇష్టం లేదు. జన సంఖ్య హెచ్చయినా, మాటలు హెచ్చయినా, పూర్తిగా మూగవాడినయిపోవడం నా స్వభావం. నేను కూర్చున్న బండిలో పక్షుల్లాగ జట్టుగా గుంపు గూడి నిండిన జనాన్ని చూచాను. భగీరథ తపస్సు చేసినవారినీ చూచాను. సంపూర్ణ శవాసనం వేసినవారినీ చూచాను. జనం గుంపు ఎక్కువయి, రైలులో ఊపిరాడడమే కష్టమయితే, వాళ్లను చూచి "ఎప్పుడు ముగిసీని ఈ ప్రయాణం?" అని

అనిపిస్తుంది నాకు. అందువల్ల ఇటీవల కొన్ని సంవత్సరాలుగా డబ్బు చెల్లించి అయినా స్వస్థచిత్తంతో ప్రయాణం చేద్దామనే ఆశ ఎక్కువయింది. అందువల్లనే, ఆ దృష్టితో నాకు మూడో తరగతి ప్రయాణం అనుకూలం కాదు. నా జేబుకు అనుకూలమయిన ఇంటర్మీడియట్ క్లాసు లేక ఇప్పటి రెండవ తరగతిలో ప్రయాణం చేస్తే అనుకూలం కావచ్చు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశంలోని ఈ మధ్య తరగతి జనం అధమావస్థకు దిగ జారినట్లే, ఇంటర్ లేక రెండవ తరగతి అనేది డబ్బు చెల్లించే వరకే సుఖం, మూడో తరగతి తోపిడులు, గోలలు అక్కడా నిండాయి. అందువల్ల ఇష్టం వున్నా, లేకపోయినా, నాపాటికి నేను వుండాలనే ఉబలాటంతో మొదటి తరగతిలోనే ప్రయాణం చేస్తుంటాను. అక్కడయినా, నేను కోరినదంతా దొరుకుతుందని ఎవ్వరూ అనుకో నవసరంలేదు. ఎక్కువ సందర్భాలలో ముందుగానే టికెట్టు కొని చోటు రిజర్వు చేసుకోడం వల్ల కూర్చోడానికి ఇబ్బంది వుండదు. ఒక మూలలో – కాలు దించుకొనో, పద్మాసనం – బాసిపెట్టు – వేసుకొనో, కావలసినట్టు పక్కకు వాలిగాని కూర్చునే అవకాశం దొరికితే నేను సంతృప్తుడిని. మరి ప్రయాణంలో తటస్థపడే సహచరవర్గం విచిత్రంగా వుంటుందని చెప్పనక్కరలేదు. ఫస్ట్ క్లాస్ రైలుకు డబ్బు చెల్లించిన మీదట "ఇది మన యిల్లు, తక్కిన వారికి యిక్కడ స్థలం లేదు" అనే భావంతో నాల్గయిదు బెడ్డింగులు, పది పన్నెండు ట్రంకులు, పండ్ల బుట్టలు, ఫలహారాల డబ్బాలు, పిల్లల కమోడు– వీటిని బ్రేక్ వ్యానులో నింపినట్టు నింపి, డబ్బు చెల్లించిన మేరకు పూర్తిగా రాబట్టుకుందా మనుకొనే దొరలూ వస్తారు. సామాను ఎక్కువలేకపోయినా, ఈ రైలునే తాము వెలకు కొన్నామనే ధిమాకుతో ప్రవర్తించే వారూ వుంటారు; జనం జనమే. డబ్బు దస్కం వున్నంత మాత్రాన వారు దేవత లవుతారా? వారిలో ఒకింత సంస్కారం హెచ్చుగా ఉంటుందని మన ఊహ. అదిలేకపోయినా, ఈ జనంలో పలువురు మూడో తరగతి ప్రభృతులకన్నా ఎంతో శుభ్రంగా వుంటారు. ఈ ఒక్క కారణంతోనైనా ప్రయాణం ఇష్టంగా ఉంటుంది. అంతేకాక ఈ రీతి దండుగ డబ్బు చెల్లించే వారి సంఖ్య తక్కువయినందున, ప్రయాణీకుల సంఖ్యకు పరిమితి ఉన్నందున అంతమంది జనం యిక్కడ క్రిక్కిరిసి వుండరు. రాత్రి నిద్రపోవచ్చు. నే నయితే నిద్ర పోగొట్టుకోడానికి ఇష్టం లేనివాడిని. "బతుకులో తీరా సుఖంతో

గడిచే సమయం ఏది?" అని అడిగితే "సుఖదుఃఖాల బాధలేని నిద్ర" అని భావించేవాడిని. అయినా, నా నిద్రకూ మితివుంది. చాల మందికిలాగా ఫస్ట్‌క్లాస్ పెట్టె చూచిన వెంటనే నాకు నిద్ర రాదు. పగలు నిద్ర అక్కర లేదు. ఒకవేళ నిద్రవచ్చినా, మధ్యాహ్నం ఒక గంటసేపు. అలాంటప్పుడు, మిగిలిన వేళలో మెలకువతో ఉండవలసి వస్తుంది. నిజమే, మెలకువతో ఉంటాను. ఆ సమయంలో ఏదైనా ఒక గ్రంథం పట్టుకొని చదువుతూ వుంటాను. చదువనప్పుడు ఊరికే వెనక్కు చేరబడి కూర్చుని ఉంటాను. ప్రయాణమనే నాటకంలో, నా ఎదుటి రంగస్థలంలో మెదిలే పాత్ర ధారుల మాటలు, నడవడి మొదలయిన వాటిని మూగవాడయి చూస్తుం టాను. ఎక్కువగా, నేనయి సంభాషణ పేచీకి చిక్కుకొనడం తక్కువ. మంచి మిత్రులు, అదృష్టవశాత్తు దొరికితే, మాట్లాడనని కాదు. అప్పుడొకరు, ఇప్పుడొకరు, అలాంటివారు దొరకనే దొరుకుతారు. పరస్పరం గౌరవం ఏర్పడేటట్టు దొరికిన ప్రవాసి మిత్రులు కొందరయినా నా స్మృతిలో మిగిలి పోయారు. ఇప్పుడు అలాటి ఒక వ్యక్తి కథ చెప్పడానికి బయలుదేరాను. ఒక ప్రయాణంలో అరదినమంతా నా జతలో కూర్చున్న ఒక వయోవృద్ధుడయిన గృహస్థును గురించి ఒక నవలే వ్రాయడానికి బయలుదేరానంటే మీకు ఆశ్చర్యం కలగనూ వచ్చు. అలాటి ప్రయాణంలో ఆ వ్యక్తి స్వల్ప పరిచయ మయి, కారణాంతరాలతో నా ఆసక్తి పెరిగి, ముందు ముందు దృఢ స్నేహంగా పరిణమించినందున ఇది వ్రాస్తున్నానంతే. జీవితయాత్రలో తటస్థంచిన ఆ వ్యక్తి నా స్మృతి పటం మీద అచ్చుపడి నిలిచి, హెచ్చయిన ఆసక్తి రేకెత్తించి, ఆ ఆసక్తికి పుష్టి కలిగించగల ఒకరిద్దరు గృహస్థులో, ఇల్లాండ్లో, ఆయన వదలిపెట్టి పోయిన దినచర్యయో దొరికినందున ఒక జీవితచరిత్ర వంటి రచనను రచించడం సాధ్యమయింది. దానిలో మధ్యన దారి తప్పి, పక్కదారి పట్టిన దృశ్యాలు, అపూర్ణ చిత్రాలూ నూరారు వుండ వచ్చు. ఇలాటి అవకాశం లభిస్తుందని నాకు తెలిసివుంటే, ఆ వ్యక్తి బ్రతికి వున్నప్పుడు, అతని ఏకాకి జీవిత భూమికలో అంతటి అనుభవాలు పొదిగి వున్నవని తెలిసివుంటే, నా యీ శబ్దచిత్రం మరింత రసమయమయ్యేది. నవలకు మారు ఒక జీవిత చరిత్రమే సృష్టి అయ్యేది. నాకు తెలియని భాగా లను, సమస్యలను ఆయన బదికున్నప్పుడు, ఆయన నుంచే విని తెలుసుకొన వచ్చునయి వుండేది. నా మైత్రి వ్యవధి పట్టి ఐదారు సంవత్సరాలది

మాత్రమే. అదిన్నీ సంవత్సరంలో ఒకటి రెండు సార్లు, ఒకటి రెండు నాళ్లు. ఆ నాళ్లలోను కేవలం ఒకటి రెండు గంటల కాలం పెరిగిన స్నేహం. మనసు వచ్చిన వారు వచ్చినప్పుడు, నేను ఎంతటి వాచాలుడిని కాగలనో! ఆ నా మిత్రులు నాలో సగమయినా మాటకారి కారు. నా పరిచయం ప్రారంభంలో ఆయన నూటికి పదిపాళ్ళు కూడ మాట్లాడినవారు కారు. ఆ పది పాళ్ళు నూటికి 50 పాళ్ళు కావడానికి ఐదు సంవత్సరాల వ్యవధి పట్టింది. మధ్యన మాకు ఉత్తర ప్రత్యుత్తరాలూ విశేషంగా పెరగలేదు. ఆయన పరిచయమయిన తర్వాత ఆయనను ఆయన యింట్లోనే చూచి, ఊరికి తిరిగివచ్చిన మీదట నేనూ వూరికే వుండే వాడిని. మరొకసారి ఆయన ఊరికి వెళ్లే సందర్భం ఏర్పడినప్పుడు "నేను మీ వూరికి నాలుగు నాళ్లు వుండడానికి వస్తాను. వచ్చినప్పుడు కలుసుకొంటాను" అని జాబు వ్రాసే వాడిని. ఆయన "తప్పకరండి. నా కెప్పుడూ తీరికే; మీకోసం వేచివుంటాను; రాకుండా వుండగూడదు" అని జవాబిచ్చేవారు. ఇంతే – మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాల స్వరూపం – చివరి రెండు సంవత్సరాలలో మాత్రం మూడు నాలుగు నెలల కొకమారు జాబు వ్రాసేవారు. నేనూ వారికి వ్రాసేవాడిని. ఆయన నాకంటే పెద్దవారు. ఆయన గాఢ జీవితంలో నాకు విశ్వాసం వుండేది. చిన్నవాణ్ణయిన నాకు ఆయన జాబు వ్రాయ వలసిన కారణం లేదు. అనేక విషయాలలో ఆయనది పక్వమయిన అనుభవం. సగం ఎచ్చిపచ్చి జీవితం గడిపిన నన్ను ఆయన "ఇది ఎలా? అది ఎలా?" అని అడిగినప్పుడు నాకు విస్మయ మయ్యేది. బదుకు ప్రశ్నలు నన్ను పీడించేలాగే, అందరినీ పీడించేలాగే, ఆయనకూ హెచ్చుగా గుచ్చుకొని వుంటాయి–అనే భావం ఆయన జాబులవల్ల నాకు కలిగింది. ఆయన వేసే ప్రశ్నలు గహన మయినవి కావడంవల్ల, నా ఊహ పెంచి "అది అలా వుండి వుండదా?" అనే అనుమానాలను ఆయనకు నేను ప్రత్యుత్తర రూపంలో వ్రాసేవాడినే కాని, అంతకన్నా ఎక్కువగా వ్రాయ డానికి తొందరపడే వాడిని కాను. ఆయన ఎత్తే ప్రశ్నలు వాదం కోసం ఎత్తేవికావు. ఇతరులకన్నా తను ఎక్కువ తెలిసిన వాడినని చూపడానికి ఎత్తిన ప్రశ్నలూ కావు. "బదుకు ఎందుకు?", "బదుకు ఎలాగు?" అనేటటువంటి ప్రశ్నలు వాద పాండిత్యాలకు సంబంధించిన విషయాలు కావు. వివేచనకు, ప్రామాణికతకు సంబంధించినవి అవి. మన విశ్వాసాలనే

కదిలించి, రెచ్చ గొట్టే సమస్యలు. మూఢవిశ్వాసంతో సమాధానం చెప్ప రానివి. అలాంటప్పుడు — ఆయన జాబులకు నేను తగిన సమాధానం చెబుతా ననే విశ్వాసం పెట్టుకొన్న వాణ్ణే కాదు. మహా అయితే "మీలాగే నాకూ ఈ సందేహం కనిపిస్తూంది" అనేవాడిని.

పాఠకులకు ఈ నవల పీఠికే ఒక పొడుపు కథగా జటిల సమస్యగా కనిపించవచ్చు. ఔను. జీవితం ఎంత పెద్ద పొడుపో, నా మిత్రుల బ్రదుకూ అంత పెద్ద పొడుపు. నా మిత్రులు నాకు వ్రాసిన కట్టకడపటి జాబులో "మీరిక బొంబాయికి ఎప్పుడు వస్తారు? మూడు నెలల క్రిందట మాత్రమే వచ్చి వెళ్ళారు. నా ఆత్రానికి మన్నించండి. ఎందుకో నా మనస్సుకు మరొకమారు మిమ్ముల్ని చూస్తాను - అనే ధైర్యం రానందున ఈ ప్రశ్న అడుగుతున్నాను. మీరు అయినంత త్వరలో వచ్చివుంటే బాగుండేది. నేనేమో కొన్ని కొన్ని పిచ్చి మాటలు ఒక తట్టు వ్రాసి పెట్టాను. వాటిని ఇంతవరకు ఎవరికీ చూపలేదు. సద్యః చూపే కోరికా లేదు. నేను ఉన్నంతవరకు దానిని చూపను. అయితే వ్రాసింది వ్యర్థ మయింది కదా. ఆలా కాగూడదు — అనుకోడం వల్ల దానిని మీ చేతికి అందించాలి. నేను కాలమయిన తర్వాత మీరు దానిని చూడాలి - అనే ఆశ; మరి ఎక్కువగా ఏమీ లేదు."

"ఒక మాట - చూడండి. మన పూర్వ ఋషులు కొందరు జగత్తు, సృష్టి విషయంలో - ఇది ఇలా, ఇదే సత్యం; ఇదే చివరి మాట — అనే రీతిగా చెప్పారు కదా! వాటిని మీరు వేదాలనండి, ఉపనిషత్తులనండి, మరే మన్నా అనండి, తపస్సుతో తెలుసుకొన్నదనండి, భగవంతుడే ఒక చెవిలో ఊదినాడనండి, నా కొక సంశయం. ఈ విశ్వం, సృష్టి వీని విషయంలో కొద్దిగా నేనూ చదివి తెలుసుకొన్నాను. జీవకోటి ఈ యాత్ర ఎప్పుడో ఆరంభమయింది. ఎక్కడికో సాగుతున్నది; ప్రయాణం ప్రారంభమయిన ఎంతో కాలం తర్వాత, దారిలోని రైలుస్టేషనులో బండి ఎక్కే ప్రయాణి కునిలాగ, మనుష్యుడనే ప్రాణి లోపల ప్రవేశించాడు; ప్రవేశించిన వాడు ప్రవేశించినట్టు దిగిపోనూ పోయాడు. జీవిత ప్రయాణ మేమో ఇంకా ముందుకు సాగింది. దాని లక్ష్యం ఇంతవరకూ తెలియలేదు; ముందు దారి లెక్క పెట్టలేనంత దూరం, అలాటి సమయంలో ఎవరైనా సరే "నేను దీని రహస్యం తెలుసుకొన్నాను." "ఇదే సత్యం" అని ఘంటా

పథంగా చాటితే నగుబాటు కాదా?'' అని తమ జాబులో వ్రాశారు. ఆయన ఈ ప్రశ్నలు యావత్తు మత ధర్మాల కూకటి వేళ్లనే కదలించినవి కాదా?

ఆ మిత్రులు, జీవితాన్ని శ్రద్ధతో, ప్రామాణీకతతో పరీక్షించి, తాము తెలుసుకొన్నది మితసత్యం-అని ఆత్మజ్ఞానం పొంది జీవితం గడిపిన వ్యక్తి. ఆయన ఏవైనా నాలుగు విషయాలమీద పది పన్నెండు పంక్తులు వ్రాసినా, అది ఊసుపోక కబుర్లు కావడం సాధ్యంకాదు. నేను బ్రతికి వున్నంత కాలం దానినెవరూ చూడనవసరంలేదు - అని కోరే ఆ వ్యక్తి ప్రతిష్ఠ కోసం వ్రాసివుంటే, వ్రాయడం ఎందుకు? ఎవరి కోసం? దానిలో ఏమి ఉంటుంది?- ఇలాటి ఎన్నో ఉప ప్రశ్నలు నా మనస్సులో పుట్టాయి. ఏమైనా, ఆయన వున్నంతవరకూ ఆయన వ్రాతలు నాకు దొరకవు. అలాంటప్పుడు ''ఎందుకు ఈ విచిత్రమైన కోరిక పెట్టుకొన్నారు?'' అని తోచింది. నాకు పుట్టిన ఒకే ఒక అనుమాన మేమిటంటే, ఈయన బాహ్య జీవితంలో అసంతృప్తి పొంది తాబేలులాగ తన కాళ్లు చేతులు లోపలికి కుంచించుకొని ఒంటరి జీవితం గడిపారు. వెలుపల అలాగ; లోపలా అలాగే. తమ మాటలలో తమకు నమ్మకం లేదని కాదు - తమ మాటల ధ్వని ఇతరులలో నవ్వు పుట్టించవచ్చు; తాము మరణించిన తర్వాత ఎవరేమనుకున్నా చింతలేదు- అనే కారణంతో అలాంటి ఆశ ఆయనకు కలిగివుంటుంది - అనిపించింది.

నాకు, ఆయన వుండే బొంబాయికి వెళ్లే పని సద్య లేదు. అలాటి ప్రమేయం ఇక నాలుగైదు నెలలవరకు రాగూడదనిపించింది. ఒక మారు ''ఆయన కోసం నేను బొంబాయికి వెళ్లి వస్తే ఏమిటి?'' అనే చాపల్యం పుట్టినప్పటికీ, చాపల్యానికి తగిన చురుకుదనం నాకు కలుగలేదు. చాపల్యం వాంఛ అయి, వాంఛ తృష్ణ అయి నన్ను ఒత్తిడిచేయాలి. తక్కిన పది పన్నెండు తాపత్రయాల మధ్యన, వాటినిమించి ఈ పని చేసేటంతటి తృష్ణ నాకు కలుగలేదు. అంటే - ఆయన ఇహలోక లీల ముగిసేలోపల నేను ఆయనను చూడడం పడలేదు. దానికోసం బొంబాయి నుంచి ఒక తంతి రావలసివచ్చింది. ఆయన పక్కింటివారు ''మీ చుట్టం జబ్బు పడ్డారు; బయలుదేరి రండి,'' అని తంతి ఇవ్వవలసి వచ్చింది. తంతి ఇచ్చిన వారి మనస్సులో 'నేను ఆయన బంధువు' అన్న భావం ఉండి వుండాలి. తంతి

ఇవ్వడానికి కారణం నా మిత్రులే చెప్పివుండాలి. ఏమైనా, నేను ఆలసించక బొంబాయి వెళ్లాను. అయన ఇంటికి వెళ్లి, ఆయన ఇంట్లో లేకపోవడం చూచాను. ఆయన పొరుగింటివారి నుంచి, ఆయనను కె. ఇ. ఎమ్. ఆస్పత్రికి తీసుకొని వెళ్లారని విని అక్కడికి పరుగెత్తాను. మరెవరూ ఇష్ట మిత్ర బంధు బాంధవులు తనకు లేనట్టు ఆ నా మిత్రులు నన్ను చూడగోరినందుకు నేను ఆయనకు ఎంతో ఋణపడి వున్నాను. అయితే, ఆయన నా మీద వుంచిన విశ్వాసాన్ని చెల్లించడానికి నాకు యోగ్యతలేదు. ఖండితంగాలేదు. ఉండి వుంటే, ఆయన చివరి జాబుకు సమాధాన రూపంగా నేనే ఆ దినమే బయలు దేరి వెళ్లి ఆయనను చూడవలసింది.

ఇప్పుడు ఆయనను చూడడానికి ఆస్పత్రికి వెళ్లి, ఆయన ఏ స్థితిలో ఉన్నారో తెలుసుకోవలసివచ్చింది. జబ్బు ఏమిటని పక్కింటివారు స్పష్టంగా చెప్పలేదు. అంత ఆసక్తి వారూ చూపవలసిన కారణం కనిపించలేదు. "మీ చిరునామా వ్రాసిన ఒక కాయితం ముక్క నాకు చూపారు. అప్పుడా యనకు విపరీతంగా జ్వరం. తక్షణమే నేను ఒక వైద్యుణ్ని పిలిపించి చూపించాను. ఆయన, 'వీరిని వెంటనే ఆస్పత్రికి సాగించండి' అన్నారు. రెండు మూన్నాళ్లుగా ఆయన పడుకొనే వున్నారు. ఆయన తన గది తలుపులు తెరవనందున నేనే తెరిచి, ఆయన స్థితి చూచి భయపడ్డాను. మేము చూచినప్పుడు ఆయనకు మాట్లాడే శక్తికూడా మిగులలేదు. మీ చిరునామా వ్రాసిన బల్లమీది చీటీని, తన దుర్బలమయిన వేళ్లతో చూపడం మాత్రమే నాకు తెలుసు. మీకు తంతి యిచ్చాము; మీరు వచ్చారు. తర్వాతి భారం మీది" అని అన్నప్పుడు నా మనస్సు ఆలో చించ లేక తడబడింది – తబ్బిబ్బయింది. ఆయన చెప్పినట్టు ఆస్పత్రికి పరు గెత్తాను. దానికి కొంచెము ముందే కాబోలు ఆయన కళేబరాన్ని మంచం నుంచి దింపి, శవాలయంలో పెట్టారు.

నేనిప్పుడు వచ్చీరానట్టే అయింది; ఉండీ ఉండనట్టే అయింది. అక్కడే నిలబడ్డాను – అరగంట సేపు. ఎలాటి యాతనా లేక ప్రశాంతంగా పడు కొన్న ఆయన ముసలి ముఖం చూచాను. ఇక దీర్ఘాలోచనకు సమయం లేదు. "తర్వాతి ఏర్పాట్లు చేయవద్దూ?" అని అడిగారు. "చావగానే బది కిన వారి పని ముగియలేదు గదా!" అనిపించి బొంబాయిలోవున్న కొందరు నా మిత్రులను జ్ఞాపకపరచుకొన్నాను. అక్కడినుంచి వెలుపలికి వచ్చి

టెలిఫోన్ చేసి నా ఆత్మీయు లొకరిని పిలిపించుకొన్నాను. ఆయన సహాయంతో ఆ మిత్రుల అంత్యక్రియలు ముగించాము. ఇకముందు...?

ఆయన గదికి తిరిగి వెళ్ళాలా, వద్దా? నేనెవడిని? ఆయన ఎవరు? అనే ప్రశ్నలు కలిగాయి. నేను ఆయన మిత్రుడననడం నిజం. అభాగ్య మిత్రుడూ కావచ్చు. అయితే, ఆయన వస్తువులమీద నా కేమిటి హక్కు?- ఇలా అనిపించింది. నాకు సహాయపడిన నా మిత్రులు "అలా కాదు; అక్కడికి వెళ్లండి. ఆయన గదిలోని సామాను స్వాధీనపరచుకొని, ఆయన బంధువులు ఎవరు, ఎక్కడున్నారు అని వెదికి వాటన్నిటినీ అప్ప గించే వరకూ మన బాధ్యత వుంది. ఆయనకు మీపైన అంతటి విశ్వాసం లేకపోతే, తమకుతామై ఆయన మీ పేరు ఎందుకు చెప్పేవారు?" అనడం వల్ల నేనూ, ఆ మిత్రులూ కలిసే నా మిత్రులున్న గదికి తిరిగి రావలసి వచ్చింది. పొరుగింటి వారి అనుమతితో ఆ రోజుకయినా, ఆ గదికి, ఆ సామానుకు యజమాని కావలసి వచ్చింది.

బొంబాయిలోని మలబార్ హిల్స్‌లో నా మిత్రుల నివాసం. మలబార్ హిల్స్‌లోని ఇళ్లన్నీ శ్రీమంతులవి అని సామాన్యులు అనుకోవచ్చు కాని, శ్రీమంతుల యిళ్ల నడుమ నడుమ నూరారు గుడిసెలూ వున్నాయి. ఒకప్పుడు శ్రీమంతుల వసతి గృహమై, శిథిలమై ఇప్పుడు గుడిసెలు, కుటీరాలులాగ కనిపించే యిళ్లు ఎన్నో అక్కడ వున్నాయి. నా మిత్రులు నివసిస్తూవుండినది అలాటి ఒక యింట్లో. "బేక్ బే" సముద్రాన్ని తాకుతూ ఒక చిన్న కాంపౌండు వుంది; ఒక పాత పద్ధతిలో బోట్ హౌస్ లాగ దానిని కట్టారు. దానికింది అంతస్తులో దుకాణాలున్నాయి; వెనుక వైపు తీరా దరిద్ర కుటుంబ మొకటి నివసిస్తున్నది. మాది పెద్దది. సముద్రాభి ముఖంగా ఒక మంటపం వుంది. దాని ఎదుటి భాగంలో రెండు కుటుంబా లకు వసతి వుంది. మేడ మెట్లకు తీరా దగ్గరి ఇంట్లోనే నా పాత మిత్రులైన యశ్వంతరావు ఉన్నది. మూడు గదులున్న ఆ భాగం బొంబాయి వారి పాలికి, అదిన్నీ మధ్య తరగతి వారికి విశాలంగా కనిపించి వుంటుంది. ఆ గదులు కూడా చిన్నవి కావు. వెలుతురు, గాలి, స్థలమూ ధారాళంగా వుండినవి. దాని ఆ చివరి భాగపు ఇంటివారినే నేను పొరుగింటి వారూ అన్నది. అదొక పారసీ కుటుంబం. కుటుంబ యజమాని అయిన జెమ్‌షెడ్జి కంట్రాక్టర్ అనే అతనే నాకు తంతి యిచ్చి పిలిపించనతడు.

ఇప్పుడు నాతోపాటు వచ్చిన వారు, యశ్వంతరావు అంత్యక్రియలకు తోడ్పడినవారు బొంబాయిలో చాల ఏళ్లుగా వ్యాపార జీవనం గడుపు తున్న మాధవరావు. ఆయనా, నేనూ చీకటి పడిన తర్వాత యశ్వంతరావు యింటికి బయలుదేరాము. ఇల్లు చేరి నాకు తీరా పరిచితమయిన ఆ యింటి తలుపులు తెరిచి, దీపం ముట్టించి, అక్కడున్న రెండు పేము కుర్చీలపై కూర్చున్నాము. నేనన్నాను– "మాధవరావుగారూ, మీరు ఈ రోజంతా నా కోసం కష్టపడ్డారు. చివరి శ్మశానయాత్ర కూడా పూర్తిచేయించి పెటారు. మీరు చాల అలసిపోయి వుండవచ్చు. నేనేమో ఈ పూట భోజనం చింత చేసే స్థితిలో లేను. ఇక్కడే పూరికే పడుకొని ఉదయం తీరికగా అన్నీ ఆలోచిస్తాను."

"మీకు ఈయన చుట్టరికమా? చాలకాలపు పరిచయమా?" అని అడిగారు ఆయన. అంతలో ఎవరో బూటు కాళ్లతో దడదడా వస్తున్నటు వినిపించింది. నేను "ఇప్పుడు వద్దు. రేపు వివరంగా తెలియజేస్తాను" అన్నాను. అంతలోగా పొరుగింటి కంట్రాక్టరుగారు వచ్చారు. తలుపు తీసి, దీపం వెలిగించి వుండడం చూచి అలవాటుకొద్దీ కాబోలు "హలో!" అన్నారు. యశ్వంతరావు పేరుపిలిచే వారేమో! మే మిద్దరమూ ఆయనకు కొత్తవారం. నన్ను ఆయన కొన్నిసార్లు చూచారు. ఇప్పుడు నా పేరూ ఆయనకు తెలుసు. అందువల్ల మాట ఆపి, తీరా చాల కుతూహలంతో "నాకు ఆస్పత్రికి రావడం పడలేదు. మనమంతా నిత్య దినచర్యకు గులా ములం. అది సరే. మన యశ్వంతరావుగారు ఎలా వున్నారు?" అని ప్రశ్నించారు.

నేను చేతి సైగతో "పోయారు" అని సూచించి "ఈ నా మిత్రుల సహా యంతో అంత్యక్రియలు ముగించి దాదరునుంచి ఇప్పుడే తిరిగి వచ్చాము" అన్నాను. ఆయన "ఏమిటి? పోయారా?" అని అనడమే కాక తన భార్యను గట్టిగా పిలిచి ఆ వార్త తెలిపారు. ఆయన బలగమే వచ్చి చేరింది. కంట్రాక్టర్ అత్యంత గద్గద ధ్వనితో "మీ పేరు కార్నాత్ కదూ?" అని అడిగారు.

"ఏదో ఒకటి లెండి. . ."

"కాదు. సరైన పేరు?"

"కారంత్."

"ఈయన?"

"నా మిత్రులు, మాధవరావుగారు."

"కారంత్ గారూ, మీరు ఇక్కడికి సంవత్సరానికి ఒకటి రెండు సార్లు వస్తూవుండడం వల్ల మీ గుర్తు వుంది. మీకు ఆయన పూర్తిగా తెలిసే వుంటారు. మీకు తీరా దగ్గరివారు కారూ? నేను వారికి దగ్గిరివాణ్ని. ఒకేమారు మే మిద్దరమూ ఈ యింటికి వచ్చిన వాళ్లం. అప్పుడు యుద్ధ భయంతో బొంబాయి ఖాళీ అయింది, అందువల్ల ఈ యిల్లు అంత సుల భంగా మాకు అద్దెకు దొరికింది! మీ మిత్రులు యశ్వంత్ రావుగారు చాల మితభాషి. నా పిల్లలు ఆయనను "తాతా" అని పిలుస్తారు. నా భార్యకూ ఆయనపై చాల గౌరవం! పిల్లలతో తప్పితే పెద్దవారితో ఆయన సంభా షించడం తక్కువ. నా పిల్లలు బాధ పెట్టినప్పుడంతా ఆయన చిత్రాలు గీచి యిచ్చేవారు; కథలు చెప్పేవారు. అంతటి కళావేత్త ఏమీ కాదు – ఆ సంగతి వేరే. . . . ఆయన ఒక విరాగి అని నాకు తెలిసింది. ఆయన ఎంత సరళంగా వుండేవారో అంతటి 'సేజ్' అనవచ్చు. వయస్సును బట్టి నేను ఆ మాట అంటున్నానని అనుకోకండి. . . . ఆయన నిత్య జీవితంలో, సరళతలో, సదా చింతనమయమయిన ముఖంలో ఏదో అపూర్వ కళ కనిపించేది! మీకూ అలా అనిపించదూ!" అని అడిగారు.

"నిజం" అన్నాను నేను.

"ఆయన అపురూపంగా నైనా నాతో మాట్లాడడం కద్దు. అయితే, మాటలు చాల తూకం! అవి బ్రదుకు చవిని, సారస్యాన్ని చెప్పేవి. క్షుద్ర మయిన విషయాలను గురించి ఆయన మాట్లాడిందే లేదు. నిజానికి చాల గొప్ప జీవితం ఆయనది. మీకు ఆయన ఏమి కావాలన్నారు?"

"ఇంత త్వరగా, ఆయన మన నుంచి వైదొలగుతారని నేను అనుకోనే లేదు. మొన్న కె. ఇ. ఎం. కు వెళ్ళి కనుక్కొని వచ్చాను. అది సెరెబ్రల్ మలేరియా కావచ్చు – అన్నారు; అంతేకాక నేను పిలుచుకొని వచ్చిన డాక్టరుగారు ఆయన బదుకుతారనే భరోసాను మొదటినుంచి చెప్పలేదు . . . ఊరికేనే కాకతాళీయంగా ఆయన బల్లమీద "Will you contact this friend for me?" అని వ్రాసిపెట్టిన కాయితం ముక్క నా కంట పడింది; మీకు తంతి యిచ్చాను."

"చాల ఉపకారం చేశారు."

"నాకేమో ఆయన లేని ఈ మేడ శూన్యంగా కనిపిస్తున్నది. నేను బాధపడి కష్టంలో ఉన్నప్పుడంతా వచ్చి నాకు హితోపదేశం చేశారు; ధైర్యం కలిగించారు. నేను ఒకసారి డబ్బు ఇబ్బందిలో వుండడం మా మాటలతోనే విని తెలుసుకొని తనంతట తానే వచ్చి, "ఏమి కావాలి చెప్పండి; కొంత కాలానికయితే నేను డబ్బు ఇస్తాను" అన్నారు. ఆ మాటలు విని నిర్ఘాంతపోయాను. చెక్ పుస్తకం తీసుకొని వేయి రూపాయలకు చెక్కు వ్రాసి యిచ్చారు. అంతవరకు నేను ఆయన వద్ద డబ్బు వుందనే అనుకోలేదు. సొంత జనం గురించి అడిగినప్పుడూ మాట్లాడేవారు కారు. ఆయనకు సంపాదించే పెద్ద పిల్లలు వుండాలి – వాళ్లు దూరప్రాంతం నుంచి ఈయన ఖర్చు వెచ్చాలకు పంపుతున్నారు – అని అనుకున్నాను! ఆ రోజు నా మర్యాదపోయే సందర్భంలో, నేను అడగకనే, అంత డబ్బు ఇచ్చి నన్ను ఆదుకొన్నారు. నేను దానిని సకాలంలో చెల్లించి ఋణ విముక్తుడిని అయ్యాను.

"ఆయన రెండు మూడు నెలల కొకమారు మహాబలేశ్వర్, పూనా, బోర్డి అని వెళ్లేవారు కదా – చిత్రాలు గీయడానికి! ఆ సమయంలో మాకు ఇల్లు ఖాళీగా కనిపించేది! ఆయన ఇక్కడ వున్నారంటే ఒక గులాబి మొక్క పూచి వాసనలు వెదజల్లుతున్నట్టు అనిపించేది."

ఆయన మాటలు ఆపారు; నేను మాధవరావుగారిని "మీరు ఇక వెళ్లండి" అని బలవంతం చేసి పంపించి వేశాను. కంట్రాక్టర్ మహాశయుడు ఇదో ఇప్పుడే వస్తానంటూ తన ఇంట్లోకి వెళ్ళారు. అక్కడా ఆయన మాట్లాడుతున్నది యశ్వంతరావుగారి సంగతే. ఆయన మరణవార్త విన్న ఆయన భార్య, ఇద్దరు చిన్న పిల్లలు ఏడ్వడం నాకు వినిపించింది. "ఇప్పుడు నేను ఎక్కడున్నాను?" "ఎందుకు వచ్చాను?" "ఇక ముందు ఏమి చేయాలి?" అన్న విషయా లేవీ నాకు తోచక, కూర్చున్న కుర్చీలోనే తూగసాగాను. జెమ్షేడ్జీ మళ్లీ నా ముందు వచ్చి నిలబడింది కూడా కనిపించలేదు. ఆయన వచ్చి "మీకు అలసట అయివుంటుంది. పడుకోవచ్చుగద ... అయితే మీరు భోజనానికి ఏమి చేస్తారు? ... దాదా ఆయనకు జబ్బు రాకముందు ఎనిమిది రోజులనుంచే పోట్లాట వేసుకొని వెళ్లిపోయాడు. ఐదు సంవత్సరాలు ఆయన నీడగా వున్నాడు ఆ వ్యక్తి. ఒక రోజు ఆయనను అప్పు అడిగి, ఆయన యివ్వలేదని కోపగించుకొని 'మీరు చచ్చేటప్పుడు దీన్నంతా వెంట

తీసుకొని వెళ్లుతారు గదూ!' అని ఉమ్మేసి తిట్టిపోయాడు. అబ్బా ఎంత కృతఘ్నతా!— అని అనిపించింది నాకు. తిండీ, బట్టా అంతా ఇచ్చి నెలకు నలభయి రూపాయలకు పైగా జీతం ఇచ్చేవారనుకుంటాను. అయినా అతనికి తృప్తి కలుగలేదు.

"వాడి నోటి దుడుకుతనం చూచే యశ్వంతరావుగారు అన్నారట! 'దాదా! నేను చచ్చేటప్పుడు ఏమవుతుందో నాకు తెలీదు. పైసాలు మాత్రమే కాదు. నా పీనుగునూ వదలిపెట్టి వెళ్లుతాను. అలాటి మాటలు మాత్రం నీవంటి వాని నోటినుంచి రాకుండా వుండవలసింది. నీవు ఆ రోజు బల్ల మీద పెట్టిన నూరారు రూపాయలు తీసుకొని 'తీసుకోనే లేదు' అని ఏవేవో ఒట్లు పెట్టుకున్నావు గదా! అప్పటినుంచే నేను నీవు మనుష్యుడివి కావని తెలుసుకొన్నాను. అప్పటినుంచి నీవు కాల్చిన రొట్టెలు తినడానికి నా గొంతుక బిగుసుకు పోయేది. అయినా, నా మట్టుకు నేను నిన్ను పొమ్మన లేదు... ఇప్పుడు చూడు, అలాటి సమయం వచ్చింది; వెళ్ళిపో' అని పంపించివేశారు. వాడిని పంపించి వేసేటప్పుడు దుఃఖం పొంగివచ్చి 'దాదా! దాదా! డబ్బు వస్తుంది, పోతుంది; నేను సంపాదించాను, పోగొట్టుకొన్నాను... అయితే పోగొట్టుకొన్న స్నేహం మళ్ళీ సంపాదించు కొనడం కష్టం" అన్నారు. దాదా రేగిపోయి, "మీ స్నేహం ఎవరికి కావాలి? డబ్బు పొగరు ఈ ముసలాడికి!" అని మరింతగా తిట్టడానికి పూనుకొన్నప్పుడు నా భార్య యిక్కడికి వచ్చి దాదాను బెదిరించి బయటికి పంపించి వేసింది. అటు తర్వాత ఆయనసవ్ ముట్టించి చాయ్, టోస్ట్ చేసుకొని జీవితం గడిపారు."

జెమ్‌షేడ్జీ ఈ మాటలు మాట్లాడుతున్నప్పుడు, ఆయన పత్ని తన పిల్లలతో నా కోసం కొంచెం పాలు, బ్రెడ్, పళ్ళు, వెన్న ఉపహారం కోసం పంపింది. ఆ సమయానికి యశ్వంతరావుగారే నా కట్టెదుట సజీవంగా వచ్చి నిలబడినట్టయింది. దాదాకు హితవు చెబుతూ నిలబడినట్టు కనిపించింది! కంట్రాక్టరు నా వైఖరి చూచి "ఫలహారం చేయండి" అన్నారు. "వద్దు" అన్నాను నేను. ఏమీ అక్కరలేదనిపించి.

"ఉదయం నుంచీ ఏమీ పుచ్చుకొని వుండరు మీరు......"

"నిన్నటి నుంచీ......"

"అలా అయితే, తప్పకుండా పుచ్చుకొనే పుచ్చుకోవాలి. నిజమే, మీ

బంధువు జ్ఞాపకం వచ్చి వేసట కలుగడం సహజం. కాని చావు ఎవరికైన తప్పడం కద్దా ?''

''నేను దానికోసం కష్టపడడం, వేసట పడడం లేదు ; నెలముందు 'మీరు మళ్ళీ ఎప్పుడు వస్తారు!' అని ఆయన నన్ను ప్రశ్నించారు. నేను అప్పుడే రావలసింది. ఆయననుంచి ఎన్నో తెలుసుకోవలసిన విషయా లుండేవి.''

''నిజమే. ఆయన పెద్దవాడు ; అయితే చూడండి ; పది మాటలకు ఒక మాట మాటలాడేవారు ఆయన. నేనింత దగ్గరలో వున్నా ఆయనతో సరళంగా మాట్లాడడమే పడేది కాదు..... అది అలా వుండనీ–మీకు ఆయన ఏమి కావాలి ?''

ఆ ప్రశ్నకు ఆ క్షణమే సమాధానం చెప్పడానికి నేను సాహసించలేక పోయాను. 'ఆయన స్నేహితుడిని' అనివుండవచ్చు. అలా అయితే ఆయన ఆస్తిపాస్తుల విషయంలో చేయివేయడం పడదు. అవి నాకు కావలసినవీ కావు. అయితే, ఆయన నన్ను కోరి ఉత్తరం వ్రాయడం ఎందుకు ? అని తెలుసుకొనడానికి ప్రయత్నించ వద్దా! ఆయన బంధువులలో ఎవరు బది కున్నారు, ఎక్కడున్నారు – అనే విషయాలు ఆయన కాయిత పత్రాలనుంచి తెలుసుకొని, ఆ బంధువులకు తెలుపవద్దా ? అందువల్ల నేను జెమ్‌షెడ్జీ గారికి సమాధాన మివ్వడానికి జంకాను.

నా సమాధానం ఆలస్యమయినందుకు ఆయన ''మీకు ఆయన దూరపు చుట్టమేమో'' అన్నారు.

''అంతే!'' అన్నాను. అప్పటికి నాకు అలసటతో నిద్ర ముంచుకొని వస్తున్నది. అది చూచి కంట్రాక్టరు ''మొదటి ఉపాహారం ముగించండి'' అని బలవంతం చేశారు. నేను ఏమి తిన్నానో, ఏమి వదలానో–అనేదే తెలి యని పరిస్థితిలో వున్నాను. అలసట, నిద్ర, మిత్రుల విషయమై కల–ఇవన్నీ కలపోసినట్టయింది. ఆయన యిచ్చిన వాటిలో పాలు కొంచెం పుచ్చుకొని వుంటాను. ఆయన వెళ్ళిపోయిన తర్వాతకి తలుపులు మూసి దీపం ఆర్పాను. పక్కన వున్న ఒక పాత సోఫా మీద కాళ్లు చాచుకొని పడుకొన్నాను. రాత్రంతా స్వప్నమయం. నాకు జబ్బు చేసినట్టు నా నుదిటి మీద యశ్వంత రావుగారు చేయి పెట్టి కూర్చున్నట్టు కనిపించింది. ''చావడానికి భయమవుతుందే'' అని నేను అంటున్నాను. ఆయన ''భయమేమిటి ?

ఇక్కడి పని పూర్తయింది కదా; నీవు వచ్చిన పని ముగిసింది. ముగిసి నందుకు సంతోషపడు" అని అంటునప్పుడు, "రేపు ఏమయ్యాని?" అని ఆయనను అడిగాను.

"రేపటి పని కొనసాగించడం ఇతరుల బాధ్యత" అన్నారు.

"నేను ఏమవుతాను?"

"లేకుండా పోతావు."

"పునర్జన్మమా?"

"ఎవరికి తెలుసు?"

"లేదా?"

"ఆ సంగతి నీకెందుకు? నీవు నేటివాడివి. నిన్నటి వాడివి కాదు; రేపటి వాడివీ కాదు" అన్నారు.

అంతకే నాకు నిద్ర పట్టివుండాలి. తెల్లవారి కిటికీ సందుల నుంచి ఎండ పొర కనిపించిన తర్వాతే లేచాను. శరీరం అలసటంతా మాయమయింది. కొత్త బతుకే నాకు కలిగినట్టుంది. యశ్వంతరావుగారిని తలచుకొనడంవల్ల మిత్ర మరణంవల్ల పొందిన కష్టం, ఆయాసం కూడ పరిహారమయినట్టు కనిపించింది. మనం నాటక మొకటి చూస్తాము. దానిని చూచినంతసేపూ మనమూ అనుకంపతో, నటులతో కలిసిపోయి, క్రీడాశీలు లవుతున్నట్టు కనిపిస్తుంది. నాటకముగిసి ఇంటికి వెళ్లేటప్పుడు మిగిలేది స్మృతిమాత్రం. ఆ స్మృతి తియ్యనిదో చేదో అయినట్టే సహనగుణం కూడా దానికి ఎక్కువ.

యశ్వంతరావుగారి జ్ఞాపకం నాకు అత్యంత ప్రియమయింది; తియ్య నిది; చవి మరువజాలనిది. నా స్వార్థపు ప్రయోజనంకోసం ఆయన ఇక లభించరు. అయినా, ఆయన నా జీవితంలో అంకితం చేసినంత జ్ఞాపకం ఎన్నెన్నటికీ నా చేతికి చిక్కేటటువంటిది. దానిని నేను జ్ఞాపకం పెట్టు కోనూవచ్చు; మరచిపోనూ వచ్చు. వ్యక్తి గుర్తు ఉండడం, నశించడం అతని చరితం నుంచి, ఆ చరితం మన స్మృతులను చైతన్యవంతం చేసి, మన జీవితం ద్వారా సజీవంగా మిగిలితే, పెరిగితే, కొనసాగితే, అదే పునర్జన్మ నాకు — అనిపించింది.

నేను యశ్వంతరావుగారిని పది పన్నెండు సార్లు చూచాను. ఇప్పుడు ఆయన మిగిల్చిపోయిన అడుగు జాడలు చూడడానికి వచ్చాను. నేను

ఆయనను నిజంగా తెలుసుకొన్న వాడినయితే, ఆయన అడుగుల జాడే ఆయన జీవనయాత్ర సాగించిన పద్ధతిని నాకు చూపించేది – అని తోచింది.

లేచి, ఒళ్లు విరుచుకొని, ముఖం కడుక్కొని వచ్చి అద్దం ముందు నిల బడి ముఖం రుద్దుకుంటూ ఎదుటవున్న గోడ చూచాను. ఆ అద్దం ఆ పక్క ఈ పక్క పది పన్నెండు చిత్రాలు వేలాడుతున్నాయి. యశ్వంతరావుగారు గీచిన చిత్రాలవి. ఆయన ఒక చిత్రకళాభ్యాసి. చిత్రకళా వ్యాసంగం చేయక, దాని పరిభాష రహస్యం తెలియక, పొద్దుగడపడం కోసం ఆయన దాని నిహ వ్యాసంగంగా పెట్టుకొన్నారు. ఆ చిత్రాలను నేను ఇంతకు ముందు ఎన్నోసార్లు చూచాను: వాటిలో ఎక్కువ భాగం నన్ను ఆకర్షించ లేదు! ఆయన కళాకారుడనే పేరుకు తగినవారూ కారు. అయితే ఏమి? తమ మనస్సులోని బింబాలకు రంగులు వేసి గీచడానికి ప్రయత్నించారు. దానివల్ల చెడుపేమీ లేదు గదా – అనుకొన్నాను.

ఈసారి ఆ చిత్రాలే చూచినప్పుడు, వాటిలో సాంకేతిక సౌందర్యం కనిపించకపోయినా, యశ్వంతరావుగారు వీటిని కేవలం పొద్దు పోవ డానికే గీచారా? అలా అయివుండదు కదా. చిత్రకళ ఆయన భాష కాదనడం నిజం! భాష తెలియని వాడొకడు పరదేశానికి పోతే చేతుల, నోటి సైగలతో, తనదే అయిన రీతితో "నేను ఇలాటి చోటికి వెళ్ళాలి. దారి చూపండి" అని చెప్పడానికి ప్రయత్నించరాదని వుందా?

అలా అయితే, ఈయన తన చిత్రాలలో ఏమి చెప్పడానికి ప్రయత్నిం చారు – అనే కుతూహలం రేకెత్తింది. అరగంట సేపు నేను వాటిని చూస్తూ గడిపినా, నాకవి అలాటి చిత్రాలుగా కనిపించలేదు. అవి అర్థం తెలుప లేదు.

అలా అయితే, ఏదైనా హోటలుకు – ఉపాహార మందిరానికి పోయి ఉపాహారం ముగించుకొని – ఆయన ఆస్తి పాస్తులను గురించి పరిచయం చేసుకొంటాను. సాధ్యమయినంత త్వరలో నా ఊరికి తిరిగి వెళ్లుతాను – అని నిర్ధరించుకొన్నాను.

# రెండు

ఆ ఉదయం నేను నిరీక్షించకపోయినా, నా మిత్రులు మాధవరావుగారు తమ పనికి సెలవుపెట్టి నేను వున్నచోటికి వచ్చారు. నాకు తమ నుంచి అయ్యే సహాయం చేయడానికే ఆయన రావడం, గుడ్డివానికి గుడ్డివాడే ఊత అయినట్టుంది - మా ఈ పని. పక్కింటి జెమ్‌షెడ్జీ ఉదయమే వచ్చి తన ముఖం చూపి వందనం చేసి, వెళ్లిపోయారు. మేమిద్దరమూ తలుపు వేసుకొని ముందుయోచనకు పూనుకొన్నాము. మొదట నేను మాధవరావు గారికి యశ్వంతరావుగారికీ నాకూ ఉన్న పరిచయం చరిత్ర చెప్పాను. "ఆయన నా నుంచి అపేక్షించిన కార్యసిద్ధి, సహాయం ఏమిటన్నదీ తెలియ లేదు కదా!" అనే బెరుకునూ సూచించాను. "అవన్నీ ఆయన కాయిత పత్రాలు చూచి చదివి, ఆ మీదట తెలుసుకొనడానికి వద్దాము" అని మాధవరావుగారు సలహా యివ్వడంవల్ల ఆ పనికి పూనుకొన్నాము. ఆ గది లోని ట్రంకుపెట్టెలలో పుస్తకాలు నిండవున్నాయి. వాటి మధ్యన చక్కగా వ్రాసిన ఒకటి రెండు లెక్కల పుస్తకాలు వున్నాయి. బ్యాంకు ప్యాసుబుక్కు ఉంది. కేవలం ఐదు రోజుల కింద 15,000 రూపాయల మొత్తం ఆయన బ్యాంకునుంచి వెనక్కు తీసుకొన్నట్టు కనిపించింది. ఆ మీదట ఆయన లెక్కాచారం ప్రకారం బ్యాంకులో మిగిలిన మొత్తం సుమారు 15 వందలు మాత్రం. ఇలా తీసుకొన్న మొత్తం ఏమైవుంటుంది? అది ఆ గదిలోనే వుండాలి కదా; ఆయన నౌకరు దాదా వెనుక నూరు రూపాయలను దొంగి లించినట్టు ఈ మొత్తం కూడా దొంగలించి పరారి అయి వుండవచ్చునా? అనే సంశయమూ పుట్టింది. సంశయమేమిటి? గాభరా. నిజానికి వాడు దొంగలించివుంటే పోలీసులకు ఫిర్యాదు చేయాలి కదా? దాని తీర్మానం అయ్యేవరకూ నేనూ బొంబాయిలో వుండి ఈ అనవసర వ్యవహారం కోసం కొట్టుకలాడవలసి వచ్చేను - అనే చింతకు గురి అయ్యాను. ఆ కలవరం నివారించుకొనడానికి పొరుగింటి శ్రీమతి కంట్రాక్టరును 'దాదా పని ఎప్పుడు వదిలాడు?' అని వాకబు చేసివచ్చాను. ఇంత మొత్తాన్ని ఆయన బ్యాంకు నుంచి తీసుకొన్న దినానికి ముందే అతడు పని వదలిపెట్టి పోయాడని తెలి సింది. అయినా నా సంశయం నివారణ కాలేదు. తర్వాత వాడు ఈయన

లేనప్పుడు యింటికి వచ్చివుండవచ్చా ? ద్వేషంతో ఆయన తినే ఆహారానికి ఏవైనా విష పదార్థాలు చేర్చివుంటాడా ? - అనే పెక్కు సంశయాలు తల యెత్తాయి.

అటు తర్వాత యశ్వంతరావుగారికి ఎవరెవరితో పత్ర వ్యవహారం వుండేదన్న దానిని వెదికాము. పెక్కు కాయితాలేమో దొరికాయి. ఆయన హెచ్చుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపడం పెట్టుకొన్నట్టు లేదు. ఆయన నాకు తామేదో వ్రాసి వుంచామని తెలియజేసినా, ఆ వ్రాత నాకు అందలేదు. ఇక్కడ దానికి సంబంధించిన కాయితాలూ దొరకలేదు. అక్కడున్న కాయితాలూ, ఉత్తరాలూ, పుస్తకాలూ వెదికి విసుగుకూడా పుట్టింది. చివరికి ఒక ఆలోచన తోచి, గోడకు వ్రేలాడుతున్న ఆయన చొక్కా తీసి, దాని పరిశోధన ప్రారంభించాము. దానిలో చెక్కుపుస్తకం దొరికింది. దాని మధ్యన ఒక తపాలా రశీదూ కనిపించింది. దానిని చూడగా ఆయన నాకు దేనినో టపాలో రిజిస్టరుచేసి పంపివున్నట్టు తెలిసింది. అంతేకాక ఆయన పర్సులో నూట యాభై రూపాయల నగదూ వుంది. ఆయన బ్యాంకునుంచి వెనక్కు తీసుకొన్న అంతటి మొత్తాన్ని ఏమి చేశారని నేను ఊహించలేకపోయాను. ఆయన డబ్బు దొంగతనం అయివుంటే, జేబులోని పర్సులో నూట యాభై రూపాయలు మిగులదు కదా ! నేను నా వూరికిపోయి, ఆయన నాకు పంపి వుంటారన్నది తెలుసుకొనేదనక నౌకరు దాదా మీద సంశయ పడేట్టు లేదు – అనిపించింది.

అట్టి యోచన చేస్తూ కూర్చుంటే, ముందు దారి కనిపించేట్టు తోచలేదు. మేమిద్దరం కలిసి అక్కడి యావత్తు సామగ్రి జాబితా స్థిరపరిచాము. చిత్రాలన్నిటినీ ఒక ట్రంకులో నింపాము. ఆయన చదువుతున్న పుస్తకాలు చూచాము. వాటిలో ఎక్కువ భాగం మతధర్మదర్శన శాస్త్రాలకు సంబంధించినవి. ఆయన వాటినన్నింటినీ చదివి అక్కడక్కడ ఎర్ర, నీలం పెన్సిళ్ళతో గుర్తులు పెట్టి మధ్య మధ్య ప్రశ్నార్థక చిహ్నాలు పెట్టి, ఆశ్చర్య సూచక చిహ్నాలతోను వ్యాఖ్య చేశారు. ఆ సమయంలో ఆయన కుతూహలాన్ని ప్రేరేపించిన విషయాలు ఏమయి ఉంటాయనే చాపల్యానికి నేను పోలేదు. నా మనస్సు ఆయన మరణంతో, డబ్బు నష్టమయిందనే కలవరపాటుతో చాల వ్యథితమయి వుండినది. ఉన్న సామగ్రినంతా ఒక వ్యవస్థతో కట్టిపెట్టిన తర్వాత, మేము ఆయన పెట్టెలలో దొరికిన చేతి

వ్రాత కాయితాల ముక్కలను, ఉత్తర ప్రత్యుత్తరాలను ఆ మూలాగ్రం చదువసాగినాము. వాటిలో ఎవరి చిరునామా దొరికినా, వారి విషయంలో కుతూహలమే. యశ్వంతరావుగారికి వారు ఏమి కావాలి – అని ఆలోచించాము. ఆయన నుంచి ధన సహాయం కోరినవారున్నారు. ఈయన చేసిన సహాయానికి కృతజ్ఞత తెలిపిన వారూ ఉన్నారు. ఉత్తరాలు వ్రాసిన వారు దూరదూరపు ఊర్లలో వున్నారు. అప్పుడప్పుడు ఆయన డబ్బు తీసు కొని ఖర్చు పెట్టినదీ కనిపించింది. కొందరికయితే నెలకు, ఆరు నెలలకూ ఒకసారి మన వృత్తి ఇచ్చినట్టూ ఉంది. ఈ మొత్తాలు – ఆయన రాబడిలో చాలినంత డబ్బు కలిగించిన తర్వాత కూడా పదిహేను వేలు, పదిహేను వందలూ, నూటయాభై రూపాయలు మిగిలి ఉంటాయనిపించింది.

అక్కడ చిక్కిన కాయిత పత్రాలలో కనిపించిన చిరునామా దార్ల ఒక జాబితానే తయారుచేశాను. ఎన్నో కాయితాల మీద ఆయన షరా వ్రాశారు. తగినవాడు కాడు; 'దానానికి పాత్రత వద్దా?' "ఎన్నోసారి అడ గడం?", "నీ కాళ్లమీద నీవు నిలబడడం ఎప్పుడు?" ఇత్యాది ఉద్గరా లను ఆయన ఆ కాయితాల మీద వ్రాశారు. ఆయన అద్దె యింటి యజమానిని కలుసుకొందామనే కోరికతో, వ్రాసిన లెక్క చూడగా! అ సంవత్సరం అద్దె పూర్తిగా యజమానునికి చెల్లింది; అయితే ఆ సంవత్సరంలో గడిచినది మూడు నెలల కాలం మాత్రం. ఇక తొమ్మిది నెలల అద్దెడబ్బు అడ్వాన్సుగా మిగిలింది. ఒకటి రెండు నాళ్లు, నాకు నా మిత్రునికి ఇదే పని అయింది. నేను నా యింటికి అంతకుముందే తంతి యిచ్చాను – బొంబాయినుంచి ఏదైన రిజిస్టర్డు కాయితమో, బంగీయో వచ్చివుంటె, ఆ విషయం తంతి మూలంగా తెలుపవలసిందనీ సూచించాను. అది చేరేవరకు నా పని ఏమిటంటే పక్కింటి జెమ్‌షెడ్జీ దంపతులతో నా మిత్రుల నిత్యజీవనం గురించి సంభాషణ జరుపడం. తీరిక వున్నప్పుడు మాధవరావుగారి యింటికిపోయి ముందుదారి గురించి ఆలోచించడం. ఆయన యింట్లో భోజనం చేసి యశ్వంతరావుగారి యింటికి తిరిగివచ్చి, అక్కడి సోఫామీద పొర్లాడడం, విసుగుపుడితే చదివే ఓపికలేనందున, ఆయన పెట్టెలు తెరిచి ఆయన గీచిపెట్టిన చిత్రాలను అవలోకించడం. ఆయన సాధన చేసిన చిత్రకారుడు కాదన్న సంగతిని ఇంతకుముందే చెప్పాను. చిత్ర కళకు కాన్వాస్, ఆయిల్, కలర్స్ వంటి విలువయిన వస్తువులను ఉప

యోగించిన వారు కారు; పెన్సిల్, క్రయోన్, పెస్టెల్, వాటర్ కలర్ - మొదలయినవాటితో చిత్రాలు రచించేవారు. ఆయన రచించని విషయం లేదు. ఆయన కుతూహలం రేకెత్తించని విషయం లేదు. అంతటి నూరారు కాయితాల ముక్కలలో పది పన్నెండు చిత్రాలు మాత్రం ఏ కారణంచేతనో నా మనస్సు లాగేట్టు ఉండేవి. కౌశల్యంతో కాదు; ఆశ్చర్యంతో; వాటిలో కనిపించే కళారాధకుని స్వాభావిక తేజస్సుతో ఆ చిత్రాలను అర్థం చేసుకొనడం కష్టం. శాస్త్ర పరిభాష కూడా లేనప్పుడు రంగులకు రేఖలకు మోహకత వుండదు. చిత్రంలోని వస్తువు భూమిక ఏమన్న విషయంలో మనకు కొంచమైనా సూచన లేనప్పుడు, ఆ కళలో సామాన్య పరిచయమున్న నేను వాటిని అర్థం చేసుకోడం కష్టమని పించింది. అలాటి చిత్రాల రాశిలో కొన్ని చిత్రాలలో మాత్రమే "యశవంత్" అని తమ పేరు వ్రాశారు; చిత్రంలో గీసిన విషయాన్ని తెలిపారు. అలాటి వాటిని నేను విడిగా ఏరి కట్టిపెట్టాను.

నేను బొంబాయికి వచ్చిన ఆరో దినమో, ఏడో దినమో "Draft with manuscripts received" అనే తంతి వార్త నాకు నా భార్యనుంచి వచ్చింది. అది మరింత ఆశ్చర్య కారణమయింది. ఏమి వీలునామా? డబ్బు నాకు పంపవలసిన ప్రమేయమేమి? యశ్వంతరావుగారు ఆకస్మిత పరిచయస్థుడయిన నామీద అంత విశ్వాసముతో పంపడానికి ఏమిటి కారణం? ఇవేవీ నాకు అర్థం కాలేదు. ఏమైనా ఆయన డబ్బు దొంగతనం కాలేదు. అంతే మనస్సుకు సమాధానం. దానిని నేను ఎవరికి చేర్చాలనేది నేను ఊరికి పోయిన మీదట తెలిసీని - అని ఆలోచించాను. అది కాక ఇంకా విస్మయకరమయిన విషయమేమిటంటే, - యశ్వంతరావుగారికి తాము అంత త్వరలో చావవచ్చుననే ముందు జాగ్రత్త ఎలా కలిగింది? నన్ను రమ్మని కోరుతూ వ్రాసిన జాబులోను అలాటి మాట ఒకటి వుండిందే. ఇప్పుడు ఆయన చేసిన వ్యవస్థ సంపూర్ణ ప్రజ్ఞతోనే చేసినట్టిది. తమ జీవిత యాత్ర ముగిసింది అని తెలిసినవారిలాగే పనిచేశారు. ఆయన మెదడుకు మలేరియా వ్యాధి తగలడం, కేవలం ఆకస్మిక సంఘటన కావచ్చు. ఆ జ్వరంతో ఆయన మంచం పట్టిన తర్వాత, ఇదంతా చేయడం సాధ్యంకాదు. తామే బ్యాంకుకు పోలేరు. నాకు అవన్నీ పంపించలేరు. లేక ఆయనకు తగిలిన వ్యాధి 'సెరెబ్రల్ మలేరియా' అని వైద్యులు నిర్ధారణ చేయడం తప్పయినా

కావచ్చు. జ్వరం ఎక్కువ కావడానికి ముందే ఆయనకు ఏదో ఒక విధ మయిన అనారోగ్య చిహ్నం కనిపించి వుండాలి – అని ఏమేమో ఆలోచించ సాగాను. ఆ మీదట ఆ యింటి యజమానునికి అన్ని సంగతులూ తెలిపి, ఆయన ఆస్తి పాస్తులకు నేనే ఉత్తరాధికారి అనే కల్పన తెచ్చుకొని, బొంబాయి నగరం వదలి మా వూరి చేరి నాకు వచ్చిన కాయిత పత్రాలు చూచేవరకూ నేను నేను గాలేను. మనస్సులో గడియ గడియకూ యశ్వంత రావుగారి జీవిత చిత్రాల్ని ఎలాగో గుదిగుచ్చుకుంటూ, ఆయన నా మీద మోపిన బరువు ఎలాటిదై వుండవచ్చునని ఊహించుకుంటూ బొంబాయినుంచి మంగళూరికి బయలుదేరె పడవలో కూర్చున్నాను. ఐదు వందల మంది కూర్చున్నా ఆ ఓడలో నేనే ఒంటరి వాడిలాగ కనిపించాను. నీల సముద్రంలో తేలాడుతున్న ఆ ఓడ ఎంత ఏకాకియో, పడవలోని జన సముద్రంలో నేనూ ఒంటరి వాడినయ్యాను. ఇలా రెండు రోజులు గడిచాయి. మూడవరోజు ఓడ మంగళూరు రేవు చేరింది. అక్కడి నుంచి రెండు గంటల దారి నా యింటికి తొందర పెట్టి, తెచ్చిన యావత్తు సామానుల ట్రంకులను మోయించి తెచ్చి, ఇంటి అరుగుమీద కూర్చునే వరకూ ప్రయాణంలో దిక్కు తోచని యాత్రికుడిలాగ నేనున్నాను. యశ్వంత రావుగారు తప్ప మరే వస్తువు నాముందు కనిపించేది కాదు.

వచ్చి కూర్చుని స్నానంచేసి ఉపాహారం ముగించి ప్రయాణపు అలసటను తీర్చుకొన్న మీదట నా దారిని నిరీక్షిస్తున్న పత్ర సంచయాన్ని తెప్పించు కొన్నాను. యశ్వంత రావుగారు పంపిన ఆ కాయిత పత్రాలకట్ట పెద్దదికాదు. ఆయన డైరీ యనదగిన ఒక సామాన్య పుస్తకం. దానిలో ఆయన తనకు మనసు పుట్టిననాడు తోచిన భావాలను, మనస్సు ఒప్పిన రీతిలో, అదికూడ మితమయిన వాక్యాలలో వ్రాసిపెట్టారు. ఆ పుస్తకం బాగా పాతది. దానిలో ఆయన పది పన్నెండు సంవత్సరాల తమ జీవితంలో కలిగిన అనుభవాలను నిశ్చిత మయిన లక్ష్యమేమీ వ్రాసినట్టు ఉండినది. లేక వ్రాత తీరికగా చదివి చూడదగినది. అటుమీద నన్నుద్దేశించే వ్రాసిన తగినంత వివరాలున్న ఒక కాయితం వుంది. దానితోపాటు తాము బ్యాంకునుంచి వెనక్కు తీసికొన్న పదిహేనువేల రూపాయల డ్రాఫ్టు ఒకటి పెట్టారు. ఏమైనా, దాదామీద నాకు కలిగిన సంశయం నిరాధారమయినదని ఆ డ్రాఫ్టు చూచిన మీదట స్పష్ట మయింది. ఇక అంత పెద్ద మొత్తం సంగతి. ఆయన – దూరపు వాడయిన

నన్ను నమ్మి దానినెందుకు పంపాలి? ఆ బాధ్యతను నేను ఎలా నిర్వ ర్తించాలి? ఇది ఆయన జాబు చదివిన తర్వాత కూడా స్పష్టం కాకపోయిన ఒక సమస్య అనవచ్చు. జాబులోని మొదటి వాక్యంలోనే "దీనిని మీకోసం పంపలేదు. నేను చాలకాలం ఉండననే నా మనస్సులోని సందేహం నిజ మయితే- మీరు నేనే అనే భావంతో ఖర్చు చేయవలసిన డబ్బిది. అలాటి పని మీకూ కష్టం కావచ్చు. నా భయం నిజం కాకపోతే, దానిని నా పేరు తోనే పెడుదురుగాని. అది నిజమూ కావచ్చు. అప్పుడు నేను లేను; డబ్బు ఏ ప్రయోజనానికైనా ఉపయోగపడవచ్చు. దానానికి పాత్రమయిన విష యాలుగాని, వ్యక్తులుగానీ ఉండనే ఉండవచ్చు. మీకు తోచినట్లు ఖర్చు పెట్టండి. దానిలో కొంత నేను ఈవరకు కొంతకు కొంత ఆశ్రయమిస్తూ వచ్చిన ముగ్గురు నలుగురికి వారున్నంతదాక నెలకు 25 రూపాయల ప్రకారం ఇస్తూరండి. వడ్డీతోనైనా సరే, మూల ధనంతోనైనా సరే, వారికి ఆ సహాయం జరుగనీ" అని వ్రాసి వారి చిరునామా తెలిపారు. తర్వాతి ఉత్తర భాగం చాలినంత పొడుగుగానే వుంది. దాని సారాంశం మాత్రమే మీ ముందు పెడుతున్నాను.)

"ఎంతో కాలంగా ఈ విషయం మీతో చర్చించాలని వున్నాను. మీ కెందుకు ఇబ్బంది కలిగించాలనుకొని మీరు ఇక్కడికి వచ్చినపుడు కూడ ఆ విషయం మీతో చర్చించడానికి జంకాను. మొన్న, ఉన్నదున్నట్టుగా, నా మనస్సులో నేను చాలకాలం బతకను. చాలకాలం కాదు, చాల దినాలు- అనే ఒక భావన కలిగింది. ఇక కేవలం కొన్ని నాళ్లే ఉండవచ్చు- అనిపించింది. మరణ భయం నాకు లేనే లేదు. అయితే, నేను బ్రతికి ఎవరికి ఏమి ఉపయోగమయింది—అనే లెక్కాచారం నాకు కష్టంగా కనిపించిన విషయం. మొత్తం మీద నా మనస్సును కొంతకాలంగా పీడిస్తున్న ఒకే ఒక సంగతి ఏమిటంటే, బదుకు లెక్కాచారంలో నేను తీసుకొన్న దాని కన్నా ఇచ్చింది తక్కువ కారాదు అనే భావన. ఇది వట్టి డబ్బు లెక్కాచారం కాదు. మానవ జీవితపు లెక్కాచారం. మానవుడు సమాజపు ఋణం మోసుకొని వచ్చాడు. ఆ ఋణంతోనే పెరిగి పెద్దవాడవుతాడు. రేపు మరణించేటప్పుడు తాను పొందిన దాని కన్నా హెచ్చు ఋణం చెల్లించి పోతే అతడు పుట్టినందుకు సార్థకం. లేకపోతే, అతని జన్మతో సమాజానికి

నష్టం-అని నా భావన. డబ్బు దస్కం మొదలయినవి ఈ దృష్టితో స్వల్ప పదార్థాలు. అయినా మనుగడ సాగించడానికి అవసరమయిన వస్తువులంతే.

*   *   *   *

నా బాల్య మనేది యల్లాపురం తాలూకాలోని ఒక పల్లెలో గడిచింది. కలిగిన కుటుంబంలోనే నేను పుట్టాను; చదువుకున్నాను; పెరిగి పెద్దవాడి నయాను. లే వయస్సులో పెద్దల సంపదకు అధికారి అయ్యాను. నాకు ఇతరుల దుఃఖం చూస్తే పడదు; దయ హెచ్చు; ఆ కాలంలో నేను కన్నీళ్లు కార్చిన వారికంతా పిడికెళ్లతో దోచి యిచ్చాను. అప్పుడు నా బావ, మామ మొదలయిన బంధువులు నన్ను హెచ్చరిందారు. "నీవు డబ్బు దుబారా చేస్తున్నావు" అన్నారు. నేను దుబారా చేసింది నిజమే. లోకాను భవం లేక, మేము సంపాదించని డబ్బును యితరులకు దోచి యివ్వడానికి మనకు ఎక్కడి అధికారం? ఆ మీదట మాత్రం నాకు ఆ తెలివి వచ్చింది. ఉన్నది పోగొట్టుకొని పేచీకి చిక్కుకున్న మీదట అలాటి అనుభవమయింది. దాని మరొక ప్రతిక్రియ ఏమిటంటే, నేను ఎవరినీ, ఎంతయినా నమ్మ రాదని; మనుష్య సమాజాన్నే నమ్మరాదు – అన్నంత కటువయిన మనస్సు ఏర్పడింది.

*   *   *   *

"సుమారు ఇరవయ్యయిదు సంవత్సరాల బ్రతుకు విచార శూన్యమయిన దుందుడుతనంతోనే గడిచిందన్నా తప్పు లేదు. అంతలోగానే నాకు పెళ్లయింది. నేను నిజమయిన సంసారినయి ఒక బిడ్డ తండ్రినీ అయ్యాను. అప్పుడు నాకు ఉన్న స్థితిపోయి, అప్పు చేసే ప్రసక్తి వచ్చి మనస్సు చింతా కుల మయింది. తేనె వున్నంతవరకే తుమ్మెదకు పూవు మీది ఆశ – అనే కటు సత్యం తెలుసుకొన్నాను. అయినా, గుండె చెడలేదు. నాకు పిత్రార్జిత మయిన సంపద వుంది. అప్పులకు పోను మిగిలిన ఆస్తి యింకా మిగిలింది. ఏమీ లేకనే వట్టి చేతులతో పుట్టి పెరిగి జీవన రథం నడిపే వారు లేరు – అనిపించింది నాకు. అప్పుడు నేనే నా జీవిత రంగం మార్చి వేశాను. నా మామాగారి ఇంటికి సమీపంలోని కుమటికి వచ్చి స్థిరపడ్డాను; ఒక వ్యాపారితో చేరి, మరొక అధ్యాయం ప్రారంభించాను. ఈ జీవితం, ప్రారం భంలో కష్టదాయకమయినా, నా పరిశ్రమ ఫలంతోనో, అనుకూల సన్ని వేశాలు ఒదగడం వల్లనో మళ్ళీ డబ్బు సంపాదించాను. పోగొట్టుకొన్న దాని

కన్నా ఎక్కువ సంపాదించాను. అలాటి యశస్సు వల్ల కలిగే సంతోషం నాకు కలుగలేదు. అది కేవలం సంపదకు సంబంధించిన యశస్సు. నేను ప్రజల జీవితం విషయంలో అపనమ్మకాలు, కటు విషయాలు నింపు కొన్నందువల్లనే అంతటి సంపద కలిసి వచ్చింది – అనిపిస్తున్నది. డబ్బున్న చోట మోహముంది ; దురాశ వుంది. మాత్సరముంది, చేదూ వుంది. అందు వల్లనే నా భార్య, పిల్లలు, అందరూ నాకు శత్రువులవలె అయ్యారు. నేను లోభి కావడం నిజం. అట్టి అధ్యాయానికి ఇక ముగింపురానీ అని నాకు పెద్దలనుంచి వచ్చిన ఆస్తికి కొంచెం ఎక్కువ డబ్బే కలిపి భార్య పిల్లలకు వదలి, నేను ఆ వూరినుంచే కనుమరుగయ్యాను. మీరు నన్ను బొంబా యిలో చూచినప్పుడు, నేను విచిత్ర వానప్రస్థుడయి ఆ నగరం చేరడం జరి గింది. పూర్వకాలం గృహస్థులు వానప్రస్థానికి అరణ్యాలకు వెళ్ళేవారట. నేను అలాటి అరణ్యం కనిపించక జన నిబిడ అరణ్యమయిన బొంబాయి చేరాను. అక్కడ అజ్ఞాత వ్యక్తిగా బ్రతికాను. పొరుగింటి జెమ్షెడ్జీ కంట్రాక్టరు కుటుంబం వారితో తప్ప మరెవరితోను సంబంధం పెట్టుకో లేదు. ఆ పారసీ బంధువులతోను నేను పెట్టుకొన్న సంబంధం సన్నిహిత మయినది కాదు. ఉన్నంతలో మనస్సు విచ్చి మాట్లాడినది ఏమైనా వుంటే అది నా నౌకరయిన దాదాతో. దాదా పొట్టకు లేక నా సేవకుడుగా చేరిన వాడు. మనం మానవ సంపర్కం వద్దనుకున్నా అది లేకుండా మనజాలం. పొట్టన పుట్టిన పిల్లలనే వదలి వచ్చిన నా వ్యామోహం ఈ దాదా మీద నాకు పెరిగింది. కాలక్రమాన, అతని మనస్సుకు అది నా దౌర్బల్యమనే జ్ఞానమూ కలిగివుంటుంది. నౌకరయి వచ్చిన వాడు 'దాదా దాదా' అని నా ప్రీతి సంబోధనకు పాత్రమయినా, అతడు చివర చివరకు నా నిజ మయిన అన్నకన్నా హెచ్చు అధికారం వహించాడు. అది నా సహనానికి మించిపోయింది. అతనిని పనినుంచి తొలగించడం నాకు క్షణం పని. నేను "నా కనికరపు ఒక గడియలోనే నున్నన్నినాళ్లు నిన్ను చూచుకొంటాను" అనే మాట యిచ్చిన తప్పిదానికి అలా చేశాను. అతడు నన్ను మోసం చేయసాగినాడు. నేను పెట్టిన డబ్బు దొంగలించసాగాడు ; పక్కింటి పిల్లల మీద అనుమానం కలిగేట్టు చేశాడు. ఏమైనా, చివరకు తానే పోట్లాడి వెళ్ళిపోయాడు. ఇటీవల ఒక సంవత్సరంగా నా వంట్లో అనారోగ్యం ఎక్కువగా కనిపిస్తూ వచ్చింది. అయితే, కుమటిలో వున్న,

సుఖంతో వుండే బంధువులవద్దకు తిరిగిపోవడానికి నేను ఇష్టపడలేదు. వారి ఏ సమాచారమూ నాకు తెలీదు......

"ఆ దినం పూనా నుంచి బొంబాయికి నాతో పాటు ప్రయాణం చేసిన జ్ఞాపకం మీకుందా? అప్పటినుంచే కదా నాకూ మీకూ స్నేహం పెరుగుతూ మీరు నా జీవిత ప్రతీకగా కనిపించారు. ఏదో ఒక భావం, భ్రాతృత్వం మనిద్దరిలోను ఉన్నట్లు నాకు తోచింది..... నా ఒంటరి జీవితానికి బొంబాయి ఇంతవరకు ఆశ్రయ మిచ్చినా, చివరికాలానికి ఇది తగిన ఊరు కాదని అనిపిస్తున్నది. ఇక ఎక్కడికి పోతాను? అని నేను అనుకొనేటప్పుడెల్లా మీ జ్ఞాపకం వస్తున్నది. మీ వద్దనయినా వుంటే, నా జీవిత చరిత్ర మీకు వివరంగా తెలిపివేద్దామనిపిస్తున్నది. ఇంతే; జీవితంలో నాలో రేకెత్తిన సంశయాలు మీ మెడకు కడుతున్నానో ఏమో! అందుకోసమే "ఎప్పుడు వస్తారు?" అని మీ రాకనే కోరి జాబు వ్రాశాను. దాదా వెళ్లిపోయిన తర్వాతనైతే ఎందుకో ఏమో "నా నాటకం ముగిసే కాలం వచ్చింది. ఇక తెర త్వరలోనే పడుతుంది" అని అనిపించసాగింది. ఆ తెర పడకపోతే నేను మీ వూరికి ఒక మారు రానూ రావచ్చు. తెరపడితే? నా జ్ఞాపకాలు నాతోనే మాయమవుతాయి కదా! అలాటి వేయి జ్ఞాపకాలలో ఒక నాలుగైదు మంచి విషయాలు వుండవా? వాటిని ఎవ్వరికైనా చెప్పవద్దా?- అని అనిపించినందువల్ల నేను వ్రాసిన దానిని పంపించాను.

"ఈ రెండు నాళ్లుగ నేను పడుకొని కళ్లు మూసుకొంటే చాలు నా సాకిన తల్లి విస్మృత రూపం కళ్ల ముందు మసలి "రా, అబ్బాయి ఇక్కడి నాటకం అయిపోయింది కదా, నీ పనులు నీవు చేశావు" అని చెప్పేటట్టు, నన్ను పిలిచేటట్టు కనిపిస్తున్నది. నాటక వేషధారి అయినా ఒకరోజు రంగు కడగాలి కదా. తన రంగస్థల పరికరాలను చిక్కినచోట పారవేయకుండా, ముందువచ్చే వేషధారులకు అనుకూలమయ్యేటట్టు ఒదిగించడం అతని కర్తవ్యం కాదూ! నేను పంపించింది అలాటి రంగస్థల పరికరం."

* * * *

ఇదొక అపూర్వమయిన జాబు. అది అమూల్యమయిన రికార్డన్నా సరే. దానితోపాటు వచ్చిన పదిహేను వేల రూపాయల డ్రాఫ్ట్ అనేది క్షుద్ర వస్తువు. ఆ డబ్బు ఆయనది. ఆయన ఇష్టప్రకారమే వినియోగించదగింది. బొంబాయినుంచి ఆయన మా వూరికి వచ్చివున్నట్టయితే, ఆయన పీడ

కూడా నాకు వుండేది కాదు. అది వారి కుదువ డబ్బు. దాని విషయమయిన యోచన నాకు త్వరలోనే మాయమయింది. అయితే, ఆయన తీరా విశ్వాసంతో పంపిన డైరీలో పొదిగిన జ్ఞాపక ముక్తా ఫలాలను నేను ఒక టొకటిగా పరిశీలించాలి. ఆయన గది నుంచి తెచ్చిన చిత్రాలలాగే వాటన్ని టికీ గాఢమయిన భూమిక వుంది. ఆ భూమికలను తెలుసుకోవాలి. ఆయన జన్మించిన భూమి, పెరిగిన యిల్లు, వహించిన దాంపత్యం, పొందిన సంసారం దానిలోని అన్ని విధాల తీయని, చేదుపండ్లు . . . . . ఇవి ఏవని తెలుసుకోవాలి. చివరి వరకు ఆయన దానమిస్తూ వచ్చిన ఆ కొన్ని పాత్రలు ఎలాటివి ? – అనడం పోయి చూడాలి. ఆయన అర్థం చేసుకొన్న జీవితం ఎలాటిదన్న దానిని నేను తెలుసుకోగలిగితే, ఆయన జ్ఞాపకం నాకు ప్రయోజనకరం, ఆయననుంచి నాకు, నానుంచి నా తర్వాతి వారికి.

ఈ స్మృతులన్నీ మాటలలో రూపొందుతాయి. అయితే అవి కేవల శబ్ద సముచ్చయాలు ; లేక ఛాయ తెలిపే వాక్య సమూహాలు. ఆ మాటలు అంతా తెలుపలేవు. ఉపనిషత్తుల వాక్యాలనుంచి, బుద్ధుని వంటివారు ప్రవచించి పోయిన వాక్యాలనుంచి మనకు ధర్మపు జ్ఞానం కలిగింది ; కలుగుతూనూ వుంది – అని పలువురిలాగ నేనూ భావించివుంటే, ఆ నా భావన శుష్క పాండిత్యం మాత్రమే కాదు ; మూర్ఖ పాండిత్యమూ అయ్యేని. ఒక సమాజం, ఒక సమయం, ఆ సమయపు నమ్మకాలు, ఆ సమాజపు వివిధ సన్నివేశాలు, ఆ సన్నివేశాలలో భాగస్వాములయిన వివిధ శీలగుణాల జనులతో ఏదో మాట చెప్పవలెననిపించి వెలువడుతుంది. ఆ సమయం గడిచి పోయిన తర్వాత, దాని భూమికను తెలుసుకొన్న వ్యక్తి గతించిన తర్వాత మనకు మిగిలేవి జడమయిన వాక్యాలు ; పది పన్నెండు అర్థాలు ఇవ్వగల ఒక్కొక్క మాటనూ పోహళించి గుదిగుచ్చిన వాక్య సరణులు. వాటిని బట్టి బుద్ధుడు ఇలాగే చెప్పాడు, వాల్మీకి రామునితో ఇలాగే చెప్పించాడు, కృష్ణుడు చెప్పింది ఇదే– అనే దిట్టతనం, హఠం ఎందుకో నాకు అర్థం కాదు. ఇవి చెప్పిన వారి కాలం వెళ్ళి వేయి, రెండు వేలు సంవత్సరాలే గడిచాయి. ఆ కాల ప్రవాహంలో తద్భూమిక అనేది సంపూర్ణంగా కోసుకొని పోయింది. వారు ప్రయోగించిన ఒక్కొక్క పదమూ మూలార్థ వ్యాప్తిని కోల్పోయి వుండాలి ; కొత్త అర్థచ్ఛాయలు వాటికి కలిగివుండాలి. ఇప్పటి భాష తెలిసినంత మాత్రాన మూలార్థం ఉన్నదున్నట్టుగా ఎలా తెలిసీని !

యశ్వంతరావుగారి డైరీ పుటలను త్రిప్పుతుండగా, అక్కడక్కడ వుల్లేఖించిన వాక్యాలు కూడ తగిన భూమిక లేక నాకు సంపూర్ణమయిన చిత్రం ఇవ్వలేకపోయాయి. ఆయనే గీచిన పది పన్నెండు చిత్రాలను కళ్ల ముందు పెట్టుకుంటే, అప్పుడు అవి ఏమిటో చెప్పగోరుతుండడం కనిపించేది. చిత్ర మనే వస్తువు కాలపు ముందు వెనుకలు లేని బొమ్మ. ఒక క్షణకాలపు స్థగిత రసభావాల చిత్రణం. ఆ చిత్రంలో ఉన్న వ్యక్తి ఎవరు? ఏమిటి సందర్భం? అనేవి తెలిస్తే సమానానుభవం పొందిన వానికి విశేషార్థం స్ఫురిస్తుంది. నా యీ మాటలు మీకు పొడుపు కథలుగా కనిపించనూ వచ్చు. నాకు కనిపించిన రీతిలో, కథా రూపంలో, నా చేతనయినంత సుసంబద్ధంగా వాటిని గుదిగుచ్చి చెబుతాను. కథ ప్రారంభం కావడానికి ముందు నాకూ, యశ్వంతరావుగారికీ జరిగిన ప్రథమ పరిచయ సన్నివేశం వర్ణిస్తాను.

ఇప్పటికి సుమారు ఆరు సంవత్సారాలకు ముందు మాట. నేను ఒక వేసవిలో ధారవాడలో రైలెక్కి బొంబాయికి ప్రయాణం చేస్తున్నాను. వెనుకటి రాత్రంతా రైలులోనే గడిపి, ఉదయం పూనా చేరి తర్వాతి రైలు అందుకోవలసి వుండినది. బొంబాయి వెళ్ళే బండిలోకి తోసుకొని పోయాను. అది పొడుగ్గా వున్న మొదటి తరగతి పెట్టె. నేను వెళ్లేలోపలే జనం గోల, సామానుల మోతలూ పెట్టె పొడువునా నిండివున్నాయి. నా సామాను ఎక్కువగా లేదు. వట్టి పక్కచుట్ట మాత్రం. దానిని మోసుకొన్న కూలి ఒక వైపు నుంచి లోపలికి జొరబడ్డాడు! నేను మరొక వైపు నుంచి జొరబడ్డాను. ఒకరి నొకరు వెదుక్కోడంలోనే కాలయాపన అయి కూర్చోడం కొంచెం ఇబ్బంది కలిగింది. ఏమైనా కిటికీ దగ్గర కూర్చుని దారి దృశ్యాలు చూచే నా ఆశ విఫలమయి, ఇటుగా కూర్చున్నాను. కిటికీ వద్ద పెద్ద వారొకరు కూర్చున్నారు. మా ఎదుట నల్ల దొరల కుటుంబ మొకటి కూర్చుంది. అది గోవానుంచి వచ్చి వుండాలి. ఆ కుటుంబంవారు తమ మనస్సులో తాము ఇంగ్లెండునుంచి వచ్చిన వారమన్న ధోరణిలో వున్నారు. నా పక్కన కూర్చున్నవారు నా కన్నా పది సంవత్సరాలకు పైగా పెద్దవారు కావచ్చు. నా మరొకవైపునా ఇంకొకరున్నారు. ఆయన గూడ దొరే! అక్కడి దొరలంతా మాటల గోలలో ఒక్కటయ్యారు.

నేను ఉదయం ఉపాహారమేమీ పుచ్చుకోలేదు. కాఫీ చాపల్యం తల

కెక్కింది. దానికోసం అటు ఇటు మెడనిక్కిస్తున్నాను. నా పక్కన వున్న వారు "ఏదైనా సామాను పోయిందా?" అని అడిగారు. ఆయనే యశ్వంత రావుగారు- నా కన్నా పెద్దవారన్నాను కదా!

"లేదు. ఉపాహారం కాలేదు. రాత్రి కూడా పొట్టకు సరిగా పడలేదు. అందువల్ల రెస్టోరాంట్ కుర్రవాడి కోసం చుస్తున్నాను."

("వస్తాడు ఇప్పుడు; రావడం వాడి పని..." అన్నారు ఆయన. బండి బయలుదేరింది. రెస్టోరాంట్ కుర్రాళ్లు పదిమంది సేవకోసం అటూ ఇటూ తిరుగసాగినారు. నేను చిటికవేసి పిలిస్తే వాళ్లకు వినిపించలేదూ, కనిపించనూ లేదు. దానికి ముఖ్య కారణం నా బీద దుస్తులు. దొరల గుంపులో మేకలాగ కనిపించి వుంటాను నేను వాళ్లకు! నా వృద్ధ మిత్రులు అప్పుడు "బాయ్, అని ఒకడిని కేకవేసి పిలిచారు." వస్తాను అని వెళ్లిన ఆ ఆసామి రానేలేదు. అప్పుడు ఆయన నా వైపు మెడతిప్పి.

"ఏమి బ్రేక్ ఫాస్ట్ కావాలి?" అని అడిగారు.)

"దేనికయినా బాయ్ రాలేదు కదా!" అన్నాను నేను.

"ఫరవాలేదు. నాకు ఫలాహారం కాలేదు; మీరేమి పుచ్చుకొంటారు?"

"వాడు వచ్చిన తర్వాత..."

"టోస్ట్, కాఫీ అంతే కదూ! లేకపోతే ఆమ్లెట్...?"

"ఆ బాబతువాడిని కాను...." అనగానే, ఆయన లేచి వెళ్లారు. మేనేజరు వద్దకువెళ్లి, నా పక్షాన ఫిర్యాదు చేసి, ఇద్దరి ఉపాహారమూ తమ వీపు వెంట మోయించుకొనే వచ్చారు. వచ్చి కూర్చున్న పిదప, "మనలాటి వాళ్లు కాఫీ ఉపాహారాలకు డబ్బు ఇవ్వలేరు అని ఆ కుర్రాళ్లు అనుకోనివుంటారు" అని పరిహాసం చేశారు. నేను నవ్వాను, ఆయనా నవ్వారు. ఒక బాయ్ వచ్చి ఒక ట్రేలో ఉపాహారం పెట్టాడు. టోస్ట్, ఛీస్, జేమ్, చేదయిన కాఫీ. ఆకలితో అటమటిస్తున్న నా దృష్టి అంతా ఉపాహారం వైపు మళ్లింది. దానిని ముగించే వేళకు ఆయన ఉపాహారమూ పూర్తయింది. మా కాళ్లవద్ద ఖాళీ గిన్నెలు పెడితే, వాటిని తీసుకొని వెళ్లడానికి చాలసేపటి వరకు కుర్రాళ్లు రాలేదు. దానికోసమూ వాళ్లను పిలువవలసి వచ్చింది. దానివెంట "బిల్లు" వచ్చింది. ఒకే బిల్లు చూచి నేను దిగులుపడ్డాను. జేబునుంచి పర్సు తీసి డబ్బు చెల్లించబోయాను. ఆ గృహస్థు వదల్లేదు. "ఆర్డర్ చేసింది నేను కదా!" అన్నారు. "కోరిన వాడిని నేను కదా? నా ఉపాహారానికయినా డబ్బు యివ్వాలి

కదా ?'' ''రైలులో ఈ నేను నీవు వచ్చిందా!'' అని నవ్వారు ఆయన. నన్ను డబ్బు ఇవ్వనివ్వలేదు. ''ఇదెక్కడి వ్యక్తిరా!'' అనిపించింది నాకు.

''ఒక్కణ్ణే కూర్చుని తినడం విసుగు పుట్టినందువల్ల అలా చేశాను'' అన్నారు.

''మీరు పెద్దవారు.''

''వయస్సులో కావచ్చు,'' అన్నారు. నేను ఊరికే నవ్వాను. అప్పటికి లోనావళ స్టేషను దాటింది రాబోయే 'కాండాలా గుట్ట' అనేది. ప్రయాణికుల పాలిటి షడ్రసోపేత భోజనం. అయితే నేను కిటికీ దగ్గర కూర్చోలేదు. నిలబడి చూద్దామంటే, ఎదుట కూర్చున్న దొరదొరసానులు కాళ్లు అడ్డంగా చాచుకొన్నారు. ఉన్నంతలోనే నా మెడ ఎత్తి తొంగిచూచాను. . . . . నా దృష్టి అంతా చలిస్తున్న, పునాదిలేని ప్రకృతి దృశ్యాలలో లీనమయింది. దానిని దారిలోని సొరంగాల చీకటి మరింత కత్తిరించి వేస్తున్నది. మొదటి సొరంగం దాటి బండి వెలుపలికి వస్తున్నప్పుడు, నా మిత్రులు లేచి నిలబడివున్నారు. నా భుజంమీద చేయివేసి ''కిటికీ దగ్గర కూర్చోండి'' అని బలవంతం చేశారు.

''అక్కరలేదు. ఫరవాలేదు. మీరే కూర్చోండి.''

''మీకు ప్రకృతి దృశ్యాలు చూచే చాపల్యం వుంది ; నేను ఏటా పది పన్నెండు సార్లు పూనా వచ్చి వెళ్లేవాడిని,'' అన్నారు. ఆయన నన్ను లాగి తమ స్థానంలో కూర్చోపెట్టారన్నా తప్పు లేదు.

''ఈ మానవుడు ఎవరు ? ఇతరుల ఇంగితాన్ని అంత లోతుగా గ్రహించి, ఈ విధమైన ఔదార్యం చూపేవాడు ?'' అనిపించింది. మొదట్లో అంతసేపూ కిటికీనుంచి తొంగిచూడడంలోనే నిరతుడయ్యాను. తర్వాత కొండ చరియల చాలు తక్కువయింది. తర్వాతి దృశ్యాలు సాధారణంగా కనిపించసాగిన తర్వాత కూర్చున్న చోటునుంచి లేచి నిలబడి ''ఇకనైనా తమ స్థానానికి రండి'' అని ప్రార్థించాను.

''ఇక రెండు గంటలే కదా. . . . . కూర్చోండి'' అన్నారు. ఆయన పరిచయం కావాలనే కుతూహలం నాకు, కాని గట్టిగా మాట్లాడేటట్టు లేదు. ఎదుటవున్న జనం నాటకశాల నటులలాగ బొబ్బలు పెడుతున్నారు. రైలు వాళ్ల యిల్లు. ఎదుట మేమున్నా లేనట్టే వారి ప్రవర్తన. అదే ఒక విధ

మయిన వేసట పుట్టించేది. అయినా నేను నెమ్మదిగా "ఏ వైపు మీ ప్రయాణం ?" అని వాకబు చేశాను.

"ఊరికి"

"బొంబాయి వారా మీరు ?"

"అది నేను ఎన్నుకొన్న ఊరు. పుట్టింది వేరే చోట. ఉండడమిప్పుడు బొంబాయిలో. తాము కూడ బొంబాయికి బయలుదేరినట్టున్నారు ? కన్నడం కదూ తమ యింటి భాష ?"

"ఇంతవరకూ మా సంభాషణ ఇంగ్లీషులో జరిగింది. ఈయన నేను కన్నడం వాడనని ఎలా గుర్తించారన్నదే నాకు ఆశ్చర్యమయింది. "ఎలా తెలుసుకొన్నారు నేను కన్నడం వాడినని ?" అని అడిగాను.

"ఆ రెస్టోరాంట్ కుర్రాళ్ళు రానప్పుడు మీలో మీరు "అబ్బా, ఎలాటి జనమో !" అని అనుకున్నారు ; అందువల్ల."

"మీకు కన్నడం వచ్చా ?"

"మాట్లాడకుండా చాలకాలమయింది. అయితే, మాతృభాష మరచి పోతుందా ?"

"ఊరు ?"

"ఉత్తర కన్నడంలో ఒక పల్లె...ఇప్పుడు బొంబాయిలో నివాస మున్నాను."

"ఏమైనా నౌకరీయా ?"

"హాఁ ! నాదే ఒక నౌకరీ చేసుకొన్నాను..."

"అంటే, స్వతంత్ర వ్యాపారమా ?"

"వ్యాపారం చేసి చాలయి, దానినుంచి స్వతంత్రుడయ్యాను."

"రిటైర్డ్ జీవితం !"

"జీవితం నుంచి రిటైరయ్యాను" అంటూ నవ్వారు. తర్వాత ఆయనే నెమ్మదిగా నన్ను గురించిన ప్రశ్నలు వేయసాగారు. ఆయనలాగ ఒకటి రెండు మాటలకు మారు కొన్ని వాక్యాలకు వాక్యాలే జోడించి సమాధాన మిచ్చి వుంటాను. లేకపోతే, "నేను ఇలాటి వాడిని ; బొంబాయికి ఇలాటి పని మీద వచ్చాను ; ఇన్నాళ్ళుంటాను" అని చెప్పిముగించే వేళకు దాదర్ రైలు స్టేషను రావాలా మరి ? హఠాత్తుగా రైలు ఆగింది. "దాదర్ కదూ !" అని తొందరపాటుతో లేచి నిలుచున్నాను. ఆ తొందరలో మూర్ఖునిలాగ

ఆయనతో చెప్పకనే దిగిపోయే వాడినో ఏమో! అయితే తెలివివచ్చి, "తొందర ఏమీ లేదు. బండి ఆగుతుంది. పది నిమిషాలపాటు" అని అను కొని, పక్కచుట్టడానికి ముందే ఆయనకు వందనాలు సమర్పించాను. ఋణి అయినట్టు "మరెక్కడో మనకు భేటీ? తమ పేరు అడగలేదు" అన్నాను. నా మనస్సులో స్థితి అది.

ఆయన తమ జేబునుంచి తమ చిరునామా చీటీ తీసి నా చేతిలో పెట్టి, "ఇక్కడుంది నా పేరు, చిరునామా. అవకాశం వుంటే, నేడు కాదు, రేపు, ఈసారి కాదు ముందుసారి వచ్చినప్పుడైనా నా యింటికి రండి, ఇక్కడికన్న విశ్రాంతిగా మాట్లాడుకుందామంటె."

"అలాగే" అని ఆయనను వీడ్కొల్పి, బండి దిగి ప్లాట్‌ఫారం మీద అడుగు పెట్టగానే, నా కోసం వచ్చి వేచివున్న మిత్రులిద్దరు "హల్లో" అంటూ, నా భుజాలకు అంటుకున్నారు. మళ్ళీ ఆ వృద్ధులను గురించి విస్మృతి కలిగింది. అప్పటికి నే నింకా ఆయన ఇచ్చిన కార్డు బాగా చూడ లేదు.

నా మనస్సు తీరా ఇతరత్రా పరుగిడుతున్నది. చీకటి గదిలో ఒక పసి పాప ఎదుట మిణుగురు పురుగొకటి రెండే రెండు క్షణాలు ఎగిరి, మెరిసి మాయమయితే, చివరకు ఎంత నిరాశ కలుగుతుంది – అలా ఉంది. ఇట్లు, నా మిత్రులు నన్ను పలకరించారు. నేను వారికి సమాధాన మిచ్చాను. టేక్సీ తెప్పించి వారు నన్ను ఎత్తుకొని పోయేట్టు తమ యింటికి తీసుకొని వెళ్లనే వెళ్ళారు. నేను వారి అధీనంలో వున్నాను. నా మనస్సు మాత్రం నా అధీనంలో లేదు. అది యశ్వంతరావుగారి వ్యక్తిత్వ ప్రభావం.

ఆ సారి నేను బొంబాయిలో నాలుగైదు నాళ్లు గడిపాను; కొంత తీరిక చేసుకొని ఒక సాయంకాలం నాల్గు గంటలప్పుడు మలబార్ హిల్స్‌లో వున్న ఆయన విడిదికి వెళ్లాను. సముద్ర తీరంలోని ఒక పాతకాలపు పెంకు టింట్లో – దానిని ఒక కుటీరమన్నా అనవచ్చు – దాని మేడ ఒక పక్కన ఆయన నివసించే వారు. ఆ కట్టడానికి ఒక వైపు రహదారి, మల బార్ గుట్టలు కనిపిస్తుండగా, మరొక పక్కన సుందరమయిన సముద్రం. మేడ ఎక్కినప్పుడు సముద్రం నన్ను ఆకర్షించినందున అక్కడే నిలబడి దానిని చూచాను.

నా మిత్రులు వున్నారా లేదా అని కూడా ఆలోచించలేదు. అంతలో

ఆయన నౌకరు కిందినుంచి పైకి ఎక్కి వచ్చాడు. "ఏమిటి పని? ఎందుకు నిలుచున్నారు?" అని నన్ను జబర్దస్తీగా ప్రశ్నించాడు. అతడు ఈ కథలోని దాదా; అతడు తన ఆకారంతో నౌకరుగా కనిపించేవాడు. కాని, అతడు మేడ మెట్లెక్కి వచ్చిన తీవి, నన్ను పలకరించిన రీతి యజమాని తనందే. అది కొంచెమయినా నాకు నచ్చలేదు... అందువల్ల అతనినే ఎగాదిగా చూస్తూ నిలబడ్డాను. అతడు ముఖం తిప్పి ఆ యింట్లోకి వెళ్లిపోయాడు. నేను కొంచెం సేపు సముద్ర దృశ్యపు పిపాస తీర్చుకొని మూసివున్న ఆ యింటి తలుపు తట్టి "యశ్వంతరావుగారూ!" అని పిలిచాను.

నా గొంతుక గుర్తు పట్టినట్టు "మీరా? రండి" అని ఆయన వెలుపలికి వచ్చి కరచాలనం చేసి లోపలికి పిలుచుకొని పోయారు. తర్వాత, ఆ గదికే అప్పుడప్పుడు వెళ్లేవాడిని. ఇదే దాదా నన్ను పెక్కు సార్లు చూచే అవకాశమూ కలిగింది. నేను యశ్వంతరావుగారి ఆదరానికి పాత్రుడనన్న సంగతి తెలిసినప్పటి నుంచీ దాదా రంగు మారింది. అతని నుంచి నాకు చాల చాల ఉపచారాలు లభించాయి. యశ్వంతరావుగారు నన్ను చూడగానే "వచ్చి ఎంతసేపయింది?" అని అడిగారు.

"పావుగంట!" అన్నాను నేను.

"అంత సేపు ఎక్కడున్నారు?"

"వెలుపల వరాండాలో కడలిని చూస్తూ నిలబడ్డాను. చాల సుందరమయిన దృశ్యం. ఇలాటి స్థలం దొరకడం మీ అదృష్టం" అన్నాను. ఆయన నా ప్రశ్నలకు సమాధాన మివ్వడానికి ముందు "దాదా, ఈయన వరాండాలో నిలబడి వుండడం నీకు కనిపించలేదా?" అని అతన్ని అడిగారు. దాదా ఏదో గొణిగాడు. అప్పుడు ఆయన "నాకు ఎందుకు చెప్పలేదు?" అని ప్రశ్నించారు.

అతడు బదులు చెప్పలేదు. అప్పుడు నేనే "అదేమీ కాదు, అతడు నన్ను పలకరించాడు. నేనే సమాధాన మీలేదు; అతడు మాట్లాడిన తీరు. . ." అని ఆపాను. ఆయన నవ్వుతూ, "ఈ యింటి యజమాని తానేనని చూపించుకొన్నాడు కదూ?" అన్నారు.

కొన్ని సంవత్సరాలుగా ఆయన వద్దవున్న దాదా గుణ స్వభావాలు ఆయనకు బాగా తెలిసివుంటాయి– అనిపించింది. సరే, ఆ సంగతిని మరిచి పోయినట్టు ఆయన "దాదా, రావుగారికి, నాకూ చహా తయారు చేయ్"

అని పురమాయించి దాదాను సందిగ్ధావస్థనుంచి తప్పించారు. దాదా తొందరగా పరిగెత్తిపోయి, పళ్లు, బిస్కట్లు, చహా తెచ్చిపెట్టాడు. తర్వాత నేను ఆయనతో సంభాషణ ప్రారంభించాను. "ఈ యింట్లో మీరొక్కరే ఉన్నారు కదూ ?" అన్నాను.

"ఈ దాదా, నేనూ."

"అతడు బంధువా ?"

"బంధుత్వం లేదు. ఋణానుబంధం," అంటూ నవ్వారు. "అలాటి ప్రశ్నలు వేయకండి. నేను నా పాతదంతా వదలి, ఇక్కడికి వచ్చాను. నాకు నావారనే వారందరూ వున్నారు. అయితే ఎవ్వరూ వద్దు ; నా పాటుకు వుందామని అని వచ్చాను. వచ్చి అప్పుడే పది సంవత్సరాలయింది. ఏమి కావాలి ? ఆరోగ్యం ఒక్కటి వుంటే ఇతరులు మనకు చేయవలసిందేమీ లేదు. . . ప్రపంచానికి దూరంగా కూర్చుని, దానిని చూడడమూ అందం కదూ ?" అన్నారు.

"కాలం ఎలా గడుస్తుంది ? పని లేకుండా. . . ."

"పని ఎందుకు లేదు ? పని లేకుండా ఎందుకుండాలి ! . . . దానిని చూడండి ; నేనొక ఔత్సాహిక కళాకారుడిని. నాకు చిత్రకళ వస్తుందనుకోలేదు. అయితే, అది నా మనస్సు పిచ్చికి ఒక అవకాశం ఒనగూడిస్తుంది. ఇంకా, పుస్తకాలున్నాయి ; కొంటాను ; లేకుంటే గ్రంథాలయాల నుంచి తెప్పించుకొని చదువుకొంటాను. రోజుకు రెండు సార్లు, సాయంత్రం, తెల్లవారి వాహ్యాళి వెళ్లి వస్తాను. విసుగు పుడితే, ఆ పక్కింటి పిల్లలున్నారు—వారితో స్నేహం. ఇంకా మార్పు కావాలంటే పూనా పట్టణానికో, మహాబలేశ్వరానికో, కాండాలాకో పోయి వస్తాను."

"అక్కడ – ?"

"చిత్రాలు గీయడం ; లోకాన్ని చూడడం ; సాహిత్యం సృష్టించే మీరే ఇలా అంటే ఎలా ?" అన్నారు. నేను నవ్వి నాతప్పు ఒప్పుకోవలసి వచ్చింది. "ఆలోచన, చింతన కూడా ఒక పనే –" అనేది తెలిసిన మాట. అయితే అది చింతనా, కాదా అని ఎవరు నిర్ధరించాలి ? తక్కిన వారికి చింతనాపరుడు సోమరిగా కనిపించవచ్చు. సోమరికూడ తను చింతనలో కాలం గడుపుతున్నాననవచ్చు.

"నేను ప్రశ్న వేయడం తప్పయిందా ?"

"అదేమీ కాదు - మీరు నన్ను అడగవచ్చు; నేను సమాధానం చెప్పాలనే నిర్బంధమేమీ లేదు కదా! నేను చెప్పే జవాబు నా సంతృప్తికి నేనేమీ పనిచేయడం లేదంటే, నన్ను ఎవరడుగుతారు? పని లేకుండా కూర్చోడమూ నా చేతకాదు ... కాలం గడవడం అంత కష్టంగా కనిపిస్తే- ఆ పక్కింటి పిల్లలతో నేనూ పిల్లవాడినై మేను మరుస్తాను." ఇలా అంటూండగా ఆరు సంవత్సరాల ఒక పారసీ బిడ్డ "దాదా" అని పిలిచింది. ఆ యింటి దాదా పరిగెత్తి పోలేదు. యశ్వంతరావుగారు నా ముఖం చూచి, "దాని దాదా నేను" అని పరుగెత్తిపోయి, ఆ బిడ్డను ఎత్తుకొని వచ్చారు. "మనకు ప్రపంచ సుఖం కావాలంటే, అందరి పిల్లలూ మన పిల్లలని అనుకుంటే సరి."

"నిజం. వాళ్లు పిల్లలయి వున్నంతవరకు అలాగే; తర్వాత వాళ్లెక్కడో, మనమెక్కడో!"

"అదీ నిజమే. కాని వాళ్లు పెద్దవాళ్లయ్యేలోపల వేయిమంది క్రొత్త బిడ్డలు పుడుతారు. బిడ్డలే లేకపోరుగదా!"

"పిల్లలు పెద్ద వాళ్లయిన తర్వాత మన ప్రీతిగాని, వారి ప్రీతిగాని ఒకే విధంగా వుంటాయా?"

"పెద్దవాళ్లయితే వాళ్లు పిల్లలు కాదు. వారి ప్రపంచమే వేరు; వారు స్వతంత్రులవుతారు. మనం అలాటి వారిని ప్రీతి చేయనక్కరలేదు. మన కరుణ, సహానుభూతులు ఏమున్నా- తమ బ్రతుకు తాము గడుపుకోలేని లేదూడల విషయంలో మాత్రమే. అది చాలదా!"

ఆ బిడ్డను ఆయన కాళ్లమీద కూర్చోబెట్టుకొన్నారు. అది గుర్రం కావాలి అన్నది. యశ్వంతరావుగారు పెన్సిలు, కాయితం తీసి గుర్రం బొమ్మ వ్రాసి యిచ్చారు. ఆ బిడ్డ "ఈ గుర్రం కథ చెప్పు" అన్నది. ... "ఒక ఊరిలో ఒక గుర్రం వుంది" అని ఆయన కథ చెప్పడం ప్రారంభించారు.

"ఒకే గుర్రమా?" అని అడిగింది ఆ పాప.

"ఛీ! ఛీ! చాల గుర్రాలున్నాయి. ఇక మీద అవి ఒక్కొక్కటిగా వస్తాయి చూడు" అని పాప నిరాశకు సమాధాన మిచ్చారు. కథ ముందుకు సాగింది. నేను పాపనై కథ విన్నాను.

ఆ రోజు ఆయనతో ఎక్కువ మాట్లాడలేదు. "ఇక ఎప్పుడు వస్తారు?" అని అడిగారు ఆయన నేను బయలుదేరడానికి లేచి నిలబడినప్పుడు.

"వచ్చే సంవత్సరం" అన్నాను.
"అలాగే. తప్పక రండి" అన్నారు.
ఇది నాకూ యశ్వంతరావుగారికీ జరిగిన మొదటి పరిచయం.

## మూడు

తన వారితో సంబంధం తెంచుకొన్న యశ్వంతరావుగారు దాదా వంటి నౌకరును అంత శ్రద్ధతో దగ్గర పెట్టుకొని ఎలా కాలం గడిపారన్నది ఒక ఆశ్చర్యకరమయిన సంగతి. అతడు చేయవలసింది ఈయన ఒక్కరి పని. తక్కిన సమయాలలో వాడే యజమానుడన్నా తప్పు లేదు. ఆయన లెక్కాచారం పుస్తకం చూచినప్పుడు, ఇంటి కోసం ప్రతి నెల మొదటి తారీఖునే ముప్ఫయి రూపాయలకు తక్కువ కాకుండా డబ్బు అతనికి ఇచ్చే వారు. అది ఐదు సంవత్సరాల వ్యవధిలో నలభై రూపాయలకు పెరిగింది. భోజనం ఖర్చు ఆయనది; బట్టలు ఆయనవి; తాము మెచ్చిన సినిమా ఏదైనా వుంటే "మేటినీ షో వుంది. చూచిరా," అని ఎన్నోసార్లు నా ఎదుటే డబ్బు యిచ్చి పంపిన సందర్భాలూ వున్నాయి. దాదా ఆయన విషయంలో చిత్తశుద్ధితో వున్నట్టు నాకు కనిపించలేదు. అతడు ఆయన ఎదుట మాత్రం శ్రద్ధ నటిస్తున్నట్లే నాకు అనిపించేది. అతనికన్నా యోగ్యులయిన ఉత్తర హిందూస్థానపు భయ్యాలను నియమించుకొనడం కష్టమేమీ కాదు. ఒకటి రెండు సార్లు అతడు నా యెదుటే దుడుకు మాటలాడడమూ నేను విన్నాను. అతడు లేనప్పుడు నేను "ఇతనిని ఎలా సహిస్తున్నారండీ" అన్నదీ కద్దు. ఆయన నవ్వుతూ "అదీ ఒక ఋణానుబంధం" అన్నారు.

"పూర్వ జన్మలో మీకు నమ్మకం వుందా?" అని అడిగాను.

"నాకు పూర్వమూ లేదు, అపూర్వమూ లేదు" అన్నారు.

"మరి?"

"ఇక్కడ దారిలో పడి వున్నాడు ఆ కుర్రవాడు. ఈ కింది దుకాణం అరుగు మీద జబ్బుపడి పొర్లాడుతున్నాడు. ఒక రోజు చూచాను. అక్కడే వున్నాడు; మరుసటి దినమూ అక్కడే వున్నాడు. అప్పుడు దుకాణదారు

"ఇక్కడి నుంచి తొలగిపోవోయ్" అని అతనిని బెదిరిస్తున్నాడు. అతనికి ఇరవై నాలుగేళ్లు వుండవచ్చు. ఎండి, వాడి వత్తలై జీవతంతి మాత్రం మిగిలి వుంది. పది పన్నెండు సార్లు అతడు తన శరీరం లాక్కుంటూ ఇక్కడే వెనుక సముద్రతీరానికి వెళ్లి రావడమూ చూచాను. ఇక్కడి వీధి బిచ్చ గాళ్లకు బొంబాయి కార్పొరేషన్ అనుకూలమయిన మరుగు దొడ్లను కట్టించ లేదు కదా! ఇతడు గడియ గడియకూ దొర్లుకుంటూ, జరుగుకుంటూ వెళ్లి రావడం చూచి ఏదో జబ్బునడం స్పష్టమయింది. దుకాణదారుకు ఆ అవ లక్షణపు కుళ్లు తన అంగడి ముందుండడం సహించడం కాలేదు. మంచి మాటలతో చెప్పాడు. తిట్టి చెప్పాడు. నున్నని పేము బెత్తం తీసుకొన్నాడు. మేడ మీద కూర్చున్న నాకీ గోల వినిపించింది. ఆ పేము దెబ్బల చప్పుడూ వినబడింది. "అహమ్మద్!" అని గద్దించి, ఆ పరిచితుడయిన దుకాణ దారును పిలిచాను. నాకు కోపం రావడం అతనికీ తెలిసింది. అతడు మేడ మీదికి వచ్చి, తన గోడు తిరగ దోడుతూ, "ఎక్కడైనా ఆస్పత్రికి పోయి పడవచ్చుగదా! నా దుకాణం ముందు ఈ అసహ్యం పడి వుంటే, చాయ్ తాగడానికి వచ్చే గిరాకులు తప్పిపోతారు కదా!" అన్నాడు.

"దానికోసం కొడతారా? అతనికి నడిచే త్రాణకూడ లేదు."

"మంచి మాటలతో చెప్పాను; వెళ్ళిపోకపోతే నేనేమి చేయాలి. పోలీసు లను పిలిపించీ చూపాను. ఇది మా పని కాదు" అన్నారు.

"మనకూ ఒక రోజు అలా జరుగదని ఎవరికి తెలుసు?"

అప్పుడు అహమ్మదుకు కోపం వచ్చింది. అతడు సహనం కోల్పోయి, "అలా అయితే, మీరే అతనిని పైకి పిలుచుకొని వచ్చి సాకండి" అని దిగి పోయాడు. తన్ను నేను అవమానించానని తోచిందో ఏమో కిందికి పోయి తన కోపం చల్లారడానికి "అదిగో చూడు, పైన నీ దాదా (పెద్దన్నయ్య) వున్నారు. అక్కడికి వెళ్లు. నిన్ను మంచి పక్కమీద పడుకోబెట్టి ఉపచారం చేస్తారు" అన్నాడు. ఆధ్వనిలోని కరకుతనం, మాటలలోని వ్యంగ్యం నాకూ వినిపించాయి. నేను కిందికి దిగిపోయాను. చూచాను. దుకాణం ముందు పడిన ఆ పదార్థం మానవ జీవిగానే కనిపించలేదు. నా మనస్సుకు అనిపించింది, నేను అహమ్మద్‌కు చేసిన ఉపదేశం నేనే ఆచరించాలని. నేను ముందు వెనుకా చూడలేదు. ఆ యువకుణ్ని నా రెండు చేతులతోనూ ఎత్తుకొని మెట్లెక్కి, లోపలికివచ్చి, నాపక్కమీదే పడుకోబెట్టాను. అప్పుడు

ఆ పిల్లవానికి భయమయి వుంటుంది. నాకు దిక్కు తోచలేదు. మళ్లీ దుకాణ దారు అహమ్మద్ పైకి వచ్చాడు. నన్ను క్షమాభిక్ష కోరాడు. "శేఠ్ జీ, మనిద్దరమూ కలసి టాక్సీ తెప్పించి అతనిని ఏదో ఒక ఆస్పత్రిలో చేర్చి వద్దాము. మీరు అతనిని ఇక్కడ పెట్టుకొని కాపాడడం సాధ్యమా? నేను మిమ్మల్ని అవమానించాను! క్షమించండి" అని ప్రార్థించాడు. నేను ఏమి మాట్లాడలేదు. చక్కగా కిందికి దిగిపోయాను. అక్కడే పదికట్టడాల తర్వాత దవాఖానా పెట్టుకొన్న డాక్టర్ దారువాలాను పిలుచుకొని వచ్చాను. అతనికీ ఈ అనాధవ్యక్తిని చూచి ఆశ్చర్యమయింది. అతడు వీధిలో పడిన పిల్లవాడని తెలిసింది. "ఇతనిని ఆస్పత్రిలో ఎందుకు చేర్చ రాదు?" అని ఆయనా అడిగాడు. దానికి నేను, "వద్దు. నేనే అతనిని చూచుకొంటాను. అతడు చస్తే సరే ఒక పనే ముగిసినట్టు. లేక బదికి ఆరోగ్యవంతుడు కానీండి. తర్వాత ఎక్కడకన్నా పోతాడు" అన్నాను.

"రెండు నెలలు పట్టింది అతడు మానవ రూపానికి రావడానికి. అతనికి తీవ్రమయిన ఆమశంక వ్యాధి జీర్ణమయింది. అతని మురికి బట్ట లను తీసిపారేసి వేరే బట్టలు తొడిగి పడుకోబెట్టి, ఆ అసహ్యమయిన వ్యాధి నుంచి బ్రతికించడానికి చాలకాలం పట్టింది. అదంతా డాక్టర్ దారూవాలా అనుగ్రహం. బ్రతికే ప్రాప్తివుంది ; బ్రతికాడు. ఆ పిల్లవాడి మలమూత్రా లను పదిసార్లు నేనే తీసివేయవలసి వచ్చింది. తానై మరుగుదొడ్డికి పోయే స్థితికిరావడం రెండు నెలల తర్వాత. మొదట్లో పదిహేను నాళ్లు ఆమశంకకు తోడు వేరే వ్యాధులూ చేరాయి. దారూవాలా నా గోడు చూచి తమ దవా ఖానా దాది మేరీ అనే ఆవిడను రోజుకు రెండు సార్లు ఇక్కడికి పంపించే వారు. అతని అసలు పేరు 'దాదా' కాదు. అహమ్మద్ ఏటు పోటు మాట లతో నేను అతనిని 'దాదా' అని పిలవసాగాను. మరాఠీ కుర్రవాడు. ఆత్మ గణ్‌పత్ అని పేరు. అతడు ఆరోగ్యం పొందిన మీదట "ఇక్కడే వుండనీ" అని నేనే పనికి పెట్టుకున్నాను. సతారాలో అతని అక్కో, చెల్లెలో ఎవరో బంధువులు వున్నారట. అటు తర్వాత అతడు ఏడాది కొక మారు సతారాకు వెళ్లి వచ్చేవాడు."

అప్పుడు నేను "అలా అయితే, చాల దండుగ ఇచ్చి కొన్న పదార్థం కాదూ ఇది ? అలాంటప్పుడు మీ మీద అతనికి ఎంత వినయం విధేయతా వుండాలి, ఏమి కథా ?" అని ఆశ్చర్యం సూచించాను.

ఆయన నవ్వారు. "దండుగ యిచ్చిందనడం నిజం. అయితే ఒక ప్రాణాన్ని కాపాడడానికి చెల్లించిన మూల్యం దండుగ అనడానికి అవుతుందా? డబ్బుకూ దానికీ సంబంధమా?" అన్నారు.

"సరే వీడిలో తగిన గుణమయినా వుండాలికదా! నన్ను బతికించిన వారు ఈయన అనే భావం వుండవద్దా?"

"అయితే గడియ గడియకూ దాసులు దేవుడిని కొనియాడినట్టు 'నీవే నాకు గతి; నీవే నాకు మోక్షం' అని అంటూ వుండాలా?"

"నడవడిలోనైనా?"

"నాకు అనిపించే దేమిటంటే, ఈ పిల్లవాడు పెరిగిన తీరు అలాటిది; సంస్కారం చాలదు. అతని తల్లికిద్దరు ఆడపిల్లలట. ఒక్కడే మగ పిల్లడు. ఆ తల్లి ముద్దుచేసి చేసి ఇతనిని పెంచి వుండాలి. తల్లి ప్రీతి తన హక్కని ఇతడు నేర్చుకొని వుండాలి. ప్రారంభం నుంచి నా మీదనూ ఆ శుంఠ భావనే పెరుగుతూ వచ్చింది."

"అలా వున్నప్పుడు?"

"వీడిని తరుమగొట్టి మరొకడిని పిలుచుకు వస్తానను కోండి. ఈ దాదాకూ మరొకచోట నౌకరీ దొరికేని, నాకు మరొక నౌకరు దొరకవచ్చు. కొత్తగా వచ్చిన వాడు ఈ రకం మనిషి కాకపోతే, మరొక రకం వ్యక్తి కావచ్చు. పెద్ద వ్యత్యాసం వుండదు.

"రాదంటారా?"

"నా కుమారుని నుంచే నాకు లభించవలసింది లభించలేదు."

"తమకు ఎందరు పిల్లలు?"

"వాళ్లందరినీ మరచిపోయి వచ్చిన తర్వాత ఆ సంగతి వద్దేవద్దు. అది ముగిసిపోయిన ప్రకరణం. ఈ దాదా నాకు మిగిలిన ఒక్క కుమారుడు. నా పిల్లల లాగ అతడు మంచివాడో చెడ్డవాడో, చాలు అక్కడికి" అని అంటూ ఖిన్నవదనులయ్యారు.

నేను బొంబాయికి రెండోమారు వచ్చి యశ్వంతరావుగారి వద్దకు పోయి నప్పుడూ, పై ప్రస్తావన రావడం. ఆయన నడవడి నాకు అర్థమే కాలేదు. ఆయన ఔదార్యం నుంచి లాభం పొందడానికి దాదా ముందు వెనకలు చూడని వ్యక్తి. ఋణానికి తగిన ఋణం చెల్లించాలనే భావన అతనిలో లేదని నాకు అనిపించింది. బహుశా ఆయనకు ఇంకా దాదా స్వభావం బాగా

మనసుకు తెలియలేదు. బాగా మనస్సులో నాటిక వుంటే, అతని విషయంలో ఒకనాడు నిరాశ కలుగవచ్చు. ఇంతకాలం తర్వాత నేను యశ్వంతరావుగారి దినచర్య తెరచి చదవినప్పుడు; అందులోను ఆయన గీసిన ఆ ఒక చిత్రం చూచినప్పుడు, నా అభిప్రాయం తీరా తప్పని అని పిస్తుంది.

"చలి, గాలి వానలకు వడవడ వడకి కింద పడిన చిలుక పిల్లను తెచ్చి సాకాను. చిలుక పిల్ల అందమయిన పక్షి అనే భావనతోనే తీసుకొని వచ్చి వుంటాను నేను. అది చచ్చిపోతుందేమోననే ఆలోచన వస్తేనే దుఃఖ మయ్యేది. అదృష్టవశాత్తు అది బతికింది. మొదటిలాగ అయింది. మాటలు నేర్చింది. నేను పలికినదంతా వెక్కిరింపు ధ్వనితో అనుకరించింది. చిలుకకు భాష వచ్చా? అర్థం కాకపోయినా అనుకరించే గుణం దానిది. దానికి నా మీద ప్రీతి లేదా? పంజరంలోనే దానిని బంధిస్తే అరుస్తుంది. వెలుపలికి తీస్తే ఎగురుతుంది; చేతిమీద బుజం మీద వచ్చి వాలుతుంది. తన వినోదం కోసం కూసి రెక్కలల్లారుస్తుంది. నేను కోపగించుకొని మాట్లాడకుండా కూర్చుంటే, దానికే తెలుస్తుంది ఆ సంగతి. అప్పుడది నా బుజం మీద వాలి, నా చెంపను ముక్కుతో గోకుతుంది. అప్పుడు దానిని ఎత్తి పంజరంలో పెడు తాను. మంచి గుణం, చెడ్డ గుణం – రెండూ ఆ చిలుకలో వున్నాయి. ఏమైనా, అదొక ప్రాణి. బతికినంత కాలం బతికుండనీ నా దగ్గర."

పై మాటలను ఆయన దాదా విషయంలోనే తమ దిన చర్యలో వ్రాసి వుంటారు. ఈ మాటలకు వేరే అర్థమే కనిపించదు. మంచీ చెడూ కలిసే మానవుడనిపించు కొంటాడు. మానవ సమాజంలో బతికినంత కాలం మానవుడు మానవునికి బంధువు. మన స్వార్థం కోసం, విసుగు పరిహరించు కొనడం కోసం ఇతరులు కావాలి. మనం ఒంటరి జీవితం నడపజాలం– అనే కారణంవల్ల నయినా, మానవుడు మానవునికి చుట్టం. తీరా, ఒంటరిగా వుండి, మానవ సంపర్కం లేకనే, దారిలో పడి చావడానికి ఎవరైనా యిష్ట పడుతారా?

యశ్వంతరావుగారి ఈ విధమయిన ఉదారం ఆయన గీచిన ఒక చిత్రం లోను కనిపిస్తున్నది. దాదా స్వభావ విశ్లేషణం ఆయన నా కన్నా చక్కగా చేసివుంటారు. ఆయన గీచిన కొన్ని చిత్రాలలో మనుష్యాకృతులున్నాయి. అవి ఆకారం, అంగాంగ ప్రమాణ దృష్టితో ఏమీ బాగులేవు. ఆ చిత్రాలకు

ఆయన వేసిందే రంగు అని అనిపిస్తుంది. రంగుల మధ్య మేళనం తీరా తక్కువ. వర్ణ అనువర్ణాల సంబంధమూ తక్కువ. వ్రాసిన అనేక మానవా కృతులలో దేహాన్ని రెండు భాగాలుగా వింగడించి ఎడమ వైపునకు ఒక రంగు వేస్తే, కుడి వైపునకు మరొక రంగు వేశారు. ఒకవైపు నలుపైతే, మరొకవైపు తెలుపు. ఒక తట్టు ఎరుపైతే, మరొక తట్టు నేరేడు రంగు. ఎర్ర రంగుకు పూరకమయిన రంగు ఆకుపచ్చ అనే విషయాన్ని ఆయన తెలుసుకున్నట్టులేదు. ఆ దృష్టితో నలుపు-తెలుపులు పొందిక కావచ్చు. ఒక యువకుని చిత్రాన్ని ఆయన తెలుపు నలుపులో గీచారు. అతడు పైజమా తొడుక్కున్నాడు. వట్టి వళ్ళితో, తలమీద ఏమీ లేకుండా నిలు చున్నాడు. చేతిలో కప్పు సాసర్లు పట్టుకున్నాడు. ఎడమ చేతిలో టీ జగ్గు పట్టుకొని టీ వంచుతున్నాడు. సమ భంగిలో అతడు నిలబడివున్నా, చిత్రపు రెండు సగాలను చూస్తే ఒకటి తెల్లటి భాగం, మరొకటి నల్లటి భాగం. రెంటినీ జతపరచినట్టుంది. ముఖంలోని ఒక అర్ధభాగానికి ఒక రంగు; మరొక అర్ధభాగానికి వేరే రంగు. మొండెం విషయంలోనూ అంతే. పైజామా తొడుక్కోడంవల్ల కాళ్లేమో అలా వికారంగా కనిపించవు. మానవాకృతిలో కుడి ఎడమలలో వ్యత్యాసం వుండనే వుంటుంది. అందు లోను మానవుని ముఖంలో మరీను. ముఖం ఫోటో తీసి రెండు వవ్వాలు చేస్తే, ఆ రెండు వవ్వాలూ కొంచెం హెచ్చుతగ్గులుగా వుంటాయి. ఒక చిత్రంలో సగం భాగంగా కనిపించిన మరొక ముఖం ముక్కను కలిపితే, అప్పుడా ముఖం వేరుగా కనిపిస్తుంది. అయితే, యశ్వంతరావుగారు గీచిన చిత్రంలో స్వాభావికంగా కనిపించే ఈ వ్యత్యాసం విపరీతమయింది. స్వాభావికమయిన ఒక ముఖంలోని రెండు భాగాలలో కొంచెం వ్యత్యాసం వున్నా, వాటిలో పొందికవుంటుంది. ఒక పెదవిలో సగం పొట్టిగానో, పలుచగానో వుండవచ్చు. మరొక సగం పొడుగ్గాను, కొంచెం దళసరి గాను వుండవచ్చు. కనుబొమ్మలు, కళ్లు, ముక్కుపుటాలు, కపోలాలు - వీటిలో ఒకింత వ్యత్యాసం కనబడనే కనబడుతుంది. యశ్వంతరావు గారు ఈ వ్యత్యాసాన్ని వ్యంగ్య చిత్రకారునిలాగ అతి చేసి గీచివుండవచ్చు- అనే ఊహిస్తే అలాగూ కనిపించలేదు. ఈ రూపం రెండు చిన్న శరీరాల నుంచి ఖండించి తీసుకొన్న ముక్కలను ఒకటిగా జోడించినట్టుంది. కప్పు సాసరు పట్టుకొన్న కుడిచేయి వాటిని పట్టుకొనడానికి కూడా త్రాణలేని

పలుచని, ఎముకలుగల దుర్బలహస్తం. ఇప్పుడు ఆ పింగాణి పాత్రలు చేయితప్పి పడేని అనే భావన కలుగుతుంది. ఎడమచేయి - టీ జగ్గు పట్టు కొన్న చేయి-మాంసంతో పుష్టిగా వుంది. గొడ్డలి పట్టుకొనే చేయి అది. అంత బలిష్ఠమయినది, అంత భద్రమయినది. అతని రొమ్ము, పొట్ట రెండూ చూడ దగ్గవే. కుడివైపు ఎద క్షయరోగి గుండెలాగా ముడుచుకొని గూడు కట్టుకొన్నట్టుంది. ఎడమ ఎద అలాలేదు. కసరత్తు చేసిన పహల్వాను ఎద. ఎంత వికారంగా కనిపిస్తున్నది ఆ మొండెం!

పైన ఉన్నది మొండానికి తగిన ముఖం. కుడిపెదవి కిందికి వంగింది. పలుచగా వుంది. కుడి చెంపమీది ఎముకలు ప్రతిబింబిస్తున్నాయి. కను బొమలు కిందికి జారాయి. వెంట్రుకలున్నాయో లేవో అన్నంత వట్టిగా, పలుచగా వున్నాయి. ఆ కనుబొమలోను, కళ్లలోను జీవకళే లేదు. బిగుసు కొనిపోయిన పీనుగు కళ్లలాగ వున్నాయి. ముఖం ఎడమభాగం అలా లేనే లేదు. పెదవులు వెక్కిరిస్తున్నట్టున్నాయి. పెదవుల కొస -సెలవి-పైకి లేచింది. ఎడమ ముక్కు పుటం వెడల్పయింది. నల్లరంగులో గీసిన ఆ భాగం కన్నా వెడల్పుగా వుంది. కనుగుడ్డు ఒక పక్కకు జరిగి కుయుక్తి, తుంటరితనాలను చాటుతున్నాయి. ఆ కంటిమీద వెడల్పయిన కనుబొమ చిత్రించారు. ఈ విచిత్రాలను చూచి "ఇదేమి వ్యంగ్యం? ఎడమ కన్ను చిన్నది; కుడికన్ను దానికి ఇబ్బడి పెద్దది," అంటూ నేను చిత్రాన్ని కింద పెట్టాను. యశ్వంతరావుగారు శరీర ప్రమాణాలను అభ్యసించిన వాడిని కానని తామే చెప్పుకున్నారు. ఆయన చిత్రాలు ఆలాటి కొరతను సూచిం చాయి. అలాంటప్పుడు "ఇది ఎవరి చిత్రం?" అని నేను యోచించ నవ సరమే లేదు. ఆయన తన దినచర్యలో చిలుకపిల్ల పోలిక చెప్పారుగదా! అందువల్ల నాకు దాదా జ్ఞాపకం వచ్చింది. టీ జార్ పట్టుకొన్న పిల్లవాడు ఆయన దాదా ఎందుకు కారాదు? అనిపించింది. దాదా ముఖాకారాన్నే ఆయన చిత్రించడానికి ప్రయత్నించి వుండరు. ఆ పిల్లవాడితో, ఇది నీ చిత్రం అంటే, నా ముఖంమీద టీ జెగ్గుని విసిరివేశేని! అతని ముఖానికి అద్దం పట్టడం ఆయన ఉద్దేశముయి వుండదు. "నీ ముఖం ఇంత వికా రంగా వుంది" అంటే లోకంలో ఎవ్వడూ సహించడు. అందువల్ల అలాటి ప్రయత్నానికి ఆయన పూనుకొని వుండరు. అయితే, ఆయన గీచిన చిత్రం మాత్రం తమ నౌకరు చిత్రమే. అతడు వంటవాడు అనడానికి టీ జెగ్గు,

కప్పుసాసర్లు సంకేతం. ఆ చిత్రం దాదాది అని నాకు అనిపించగానే ఆయన అతనిని పెంచిన సాకిన అన్ని విషయాలూ జ్ఞాపకం వచ్చాయి. అప్పుడు నవ్వూ వచ్చింది. చిత్రంలోని కుడివైపు అర్ధ భాగం ఆయనను అనాధుడుగా చేరిన దాదా సత్యశీలతను సూచిస్తున్నది. అందువల్లనే ఆ భాగాన్ని తెల్లగా గీచారు. తక్కిన అర్ధ భాగం నలుపు. దాదా స్వార్థం, దౌష్ట్యం అంతా చిత్రితమయింది. ఆ కన్ను, పెదవి, ముక్కు ఆ అర్థం చెప్పడానికే కావచ్చు. ఎడమవైపు ఎద వెడల్పయి మాంస ఖండాలతో గట్టిగా వుంది. కుడి భాగంది ఎదే కాదన్నంత దుర్బలంగా వుంది. నిజ మయిన మానవ హృదయం శరీరంలో ఎడమ భాగంలో వుంటుంది - సాధారణంగా. అలాగే దాదా నల్లటి ఎడమ భాగంలో ఎద అనే పదార్థం అడగివుండి, వెలుపలి సంస్కారపు మాంస ఖండాలతో మరుగయి, అతనికి గుండె వుండీ వుండనట్టయింది. ఈ వాదం, తర్కం నా మనస్సుకు తోచి, తొందరగా వెళ్లి ట్రంకు నుండి ఆ చిత్రం పైకితీసి చాలసేపు చూచాను. యశ్వంత రావుగారికి మానవ స్వభావం తెలియదు. అందులోను దాదా స్వభావం తెలియదు - అని నేను ఎలా చెప్పగలను ? తెలిసి తెలిసే ఆయన వాడిని పోషించారు ; పెంచారు ; బలిసేట్టు చేశారు. ఎందుకంటే, ఆయనే చెప్పిన సమాధాన మిది - మానవునికి మానవుడు కావాలి. ఎడమ కుడి, నలుపు తెలుపు, శుద్ధం అశుద్ధం అనేవి వాస్తవ సత్యాలు కావు. మాన వుని శీలం మంచి చెడుగులు కలగలపయిన ఒక విచిత్రమయిన ముద్ర. ఒకదానిని వదలి మరొకదానిని ఏరుకుంటే మానవుడనే పదారమే మిగు లదు. తన మంచి చెడుగులను తూచగల వ్యక్తికి అలా అనిపించవచ్చు. తన్ను వదలి, లోకాన్ని కొలవడానికి బయలుదేరిన వ్యక్తికి ప్రపంచమంతా నలుపు తెలుపని పరస్పరం భిన్నవర్ణాలుగా విరిచి వింగడించడం సాధ్యం కావచ్చు.

ఆయన చిత్రాల రాశిలో ఒక పశువు - ఆవు చిత్రముంది. ఆ ఆవు మేస్తు న్నది. దాని ఒంటిపై కూర్చున్న ఒక అడవి మైనా దాని ఒంటిని పొడిచి గాయపరచింది. ఆ చిత్రాన్ని గురించి నేను ఒకమారు ఆయననే ప్రశ్నించాను.

"ఇది సాధారణమయిన మైనాకదూ ? పశువుల ఒంటిమీది పిడుదులను తినడానికి వచ్చేటటువంటిది ?"

"అవును."

"ఎక్కడ చూచారు ఈ దృశ్యం?"

కాండాలాలో ఇది నిత్య దృశ్యం. ఒకొక్కప్పుడు విసుగు పుట్టినప్పుడు నేను కాండాలాకు పోయి నెలపాటు వుండి వస్తాను."

"పశువుల ఆకారం అంత బాగా రాలేదు."

"నేను చిత్రకారుణ్ణని మీతో అన్నానా?"

"అయినా చిత్రకళను హవ్యాసంగా పెట్టుకొన్నారు గదా?"

"నిజమే. చిత్రాలు గీయడం నాకొక వినోదం. వినోదాలకు అర్థ మెందు కుండదు? పొద్దుపోతుంది. ఈ పనిలో మనస్సును మరచిపోవడం సాధ్య మవుతుంది."

"ఆ ఆవులలో ఏమి ఆకర్షణ కనిపించింది? నా కేమీ అర్థం కాలేదు?"

"అంతటితో వదలిపెట్టండి. నాకు కనిపించిన ఆకర్షణ మీకు కనిపించక పోవచ్చు. అది కనిపించనప్పుడు, మీకు వివరించి ప్రయోజన మేమిటి?"

"అలాకాదు. కొంచమయినా సూచన యివ్వండి, భూమిక తెలియనిదే చాలా చిత్రాలను అర్థం చేసుకొనడం సాధ్యం కాదు."

"నా చిత్రాల కన్నిటికీ అర్థం వున్నదంటారా?"

"ఉండవచ్చు; లేకనే గీస్తారా?"

"అదీ సాధ్యమే. మన జీవితంలో ఎన్ని పనులకు అర్థం ఉంది? పని చేసిన తర్వాత కూడ ఎందుకు చేశాము అని తెలియని సందర్భా లెన్ని లేవు?"

"అది సరే; ఇప్పుడీ చిత్రానికి అర్థం సూచించండి."

ఆయన నా ముఖమే చూచారు; నవ్వారు. తర్వాత "ఇదొక ఉపమానం మాత్రం. నా జీవితానికి సంబంధించి నట్టిది; మీకు దీనిని తెలిపే కాలం ఇంకా ఇప్పుడు రాలేదు" అని అంటూ ఆ చిత్రాన్ని నాచేతినుంచి లాక్కొని లోపల పెట్టారు. మళ్ళీ నేను దానిని చూడడమనేది ఇంటికి అవి వచ్చిన తర్వాత; ఆయన చిత్రశాలకు యజమాని అయిన తర్వాత. ఆయన నా చేతి నుంచి ఆ చిత్రం లాక్కున్న నాడు మాత్రం, ఆక్షణం చాల అసమాధానంతో వున్నారు. అది నా అధిక ప్రసంగపు ప్రశ్నల వల్ల కలిగిందో లేక - తమ జీవితానికి సంబంధించింది అన్నారు కదా - అలాటి ఏ సన్నివేశం జ్ఞాపకం రావడం వల్ల కలిగిందో చెప్పలేను. ఆ రోజు ఆయన విసుగుపుట్టి చాలసేపు నాతో మాట్లాడలేదు. అప్పుడు నా మాటల వల్ల ఆయనకు వేసట కలిగిందో

ఏమోనని నా అభిప్రాయం. ఆయన ఆ విషయం ఏదో విధంగా మరచిపోనీ అని "మలబార్ హిల్స్‌కో, చౌపాటీకో వెళ్ళి కూర్చుందామా?" అన్నాను. ("దాదాను సినిమాకు పంపాను. నేనిక్కడ ఒంటిగా కూర్చుంటాను. మీరు వెళ్ళిరండి" అన్నారు.)

"నే నిప్పుడు వెళ్ళితే వచ్చే సంవత్సరమే రావడం" అన్నాను. "సరే"– అన్నవారు నన్ను వీడ్కోల్పడానికి లేవనుకూడ లేవలేదు. ఏదో పాత జ్ఞాపకం కెలకవేసి వేసట కలిగిందే నిజమని తోచింది. నేను మేడదిగి కిందికి వచ్చాను. మేడ మెట్లు దిగుతున్నప్పుడే తెల్లచీర కట్టుకొన్న ఒకామె పైకి వస్తున్నది. ఆమెకు దాదాపు నలభై సంవత్సరాలుండవచ్చు. మెట్ల ఒక పక్కకు జరిగి నేను దిగుతుండగా "Mr. Yashavanth there" అని నన్నే అడిగింది. నేను ఆయన ఇంటినుంచే కిందికి దిగుతున్నానని ఆమెకు తోచివుండవచ్చు. నిజానికి దిగిందీ అలాగే కదా! "ఉన్నారు" అన్నాను. నా కన్నడం మాట ఆమెకు అర్థమయిందో లేదో. మెట్లు దిగి తలవంచుకొని నెమ్మదిగా అడుగులువేస్తూ, చౌపాటికి వచ్చి అక్కడ ఇసుకదిబ్బ మీద కూర్చున్నాను. అప్పుడు సాయంకాలం. ఐదు గంటలయి వుండవచ్చు. బీచి ఒడ్డుమీది రహదారిమీద వాహనాల సంచారం హెచ్చుగా వుంది. నగర జనసందోహం విశ్రాంతి కోరి చౌపాటి ఇసుక దిబ్బలమీద ఇసుకే కనిపించనంతగా మూగుతున్నది. అప్పుడు సముద్రంలో ఆటువేళ కావచ్చు. బ్యాక్ చే అలలు కొలను అలలలాగ దుర్బలంగా విరుగుతు ముందుకు వస్తున్నాయి. అక్కడ మా వూరి సముద్రపు స్వచ్ఛత కాని, సౌందర్యంకాని, ఆటుపోట్లుగాని కనిపించవు. అది సముద్రమయినా నగరపు మురుగు కాలువల నీళ్ల మేళనంతో మురికి నీళ్లనే భావన కలుగుతుంది. ఉన్నంతలో చౌపాటి మట్టిదిబ్బ శుభ్రమయిందనే చెప్పాలి. మా సముద్ర తీరపు శుభ్రత దానికి లేదు. వెయ్యారుమంది వచ్చి వుమ్మి వేసే స్థలం, వేయిరకాల గడ్డిగాదం, కాయితాలు, ఉచ్ఛిష్టం పారవేసే స్థలం. అయినా రోజుకు రెండుసార్లు కడలి ఉప్పెన నీరువచ్చి తీసుకొనిపో తగినంత మురికిని సాగించుకొని పోతూవుంటుంది. పరిశుభ్రత అంటే ఏమిటి? మురికే కనిపించని లోకం లేదు. మురికిలేని శరీరం లేదు. వచ్చే మురికిని అప్పుడప్పుడు తొలగించుకొనడమే పరిశుభ్రత లక్షణం.

నేను వచ్చి కూర్చున్న ఒకే ఒక గంటలోగా ఆ జలసముద్రం ఎదుట జన సమూహం చేరింది. కడలి మోతను మీరిన వాహనాల గోల, నారియల్

వాలా, బేర్‌వాలాల బొబ్బలు, పిల్లలరంపు, రకరకాల బుడగల, బెలూనుల కర్కశనాదం. బొంబాయిని నా మిత్రులు జననిబిడారణ్యంతో పోల్చి నందుకు ఆశ్చర్యం కలుగలేదు. అలాటి జనారణ్యంలో వానప్రస్థులయి ఆయన రావడం మాత్రం ఆశ్చర్యం. ఒక దృష్టితో బొంబాయి కూడా అరణ్యమే. అక్కడ జనసమూహంతో వున్నా, వుండనట్టు మెలగడానికి అనుకూలం వుంది. ఎక్కడ వెళ్లితే అక్కడ జనం వుంటారు, తోపిళ్లు, తోపు లాటలు వుంటాయి. అయితే సామాన్యంగా "మీరు ఎవరు? మీరు ఎక్కడి వారు?" అని అడిగేవారుండరు. ఆ పక్కయింటివానికి ఈ పక్కయింటి వాడి పరిచయం వుండదు. మీరయి కోరి వెళ్లితే స్నేహం; లేకపోతే లేదు. అందువల్ల ఆ సముద్ర మధ్యంలో నేనూ ఒక బండలాగ సాయంకాలం అయ్యే వరకూ కూర్చున్నాను. దానినుంచిన్నీ విసుగు పుట్టింది. తర్వాత లేచి గ్రాంట్‌రోడ్ రైలు స్టేషనువైపు నడిచాను. నా మనస్సు విచారమగ్న మయింది. అలాంటప్పుడు పక్కదారి పట్టి నడిచిపోవడం మంచిదని యోచించి తక్కిన వారితోపాటు ముందుకు తోసుకొని అడుగులు వేయసాగాను. గామా దేవి ప్రాంతం దాటి, లాబర్‌సన్ రస్తా నడిచి గ్రాంట్ రోడ్ మూలకు రాగానే, వాహనాల సంచారం ఎక్కువయి అక్కడే నిలబడ్డాను. మోటార్ల వరుస తప్పించుకొని, మూడు మూడు రస్తాలు దాటి రైలుస్టేషనుకు పోవాలి. మోటారు వాహనాల ప్రవాహం ఎప్పుడు నిలుస్తుందోనని హెచ్చరికతో చూస్తున్నాను. ఆ సమయానికి నా ఎదుటినుంచి పక్క రస్తాను యశ్వంతరావుగారు దాటడం కనిపించింది. ఆయన జనంతో మెట్లు దిగేటప్పుడు నాకు ఎదురు పడిన ఆ మహిళ వున్నట్టు కనిపించింది. తెల్లటి దుస్తులలో వుంది. ఆయన నన్ను చూచి వుండరు. జనసమూహంలో క్షణంలో ఆయన మాయమైపోయారు. అయితే, వారిద్దరూ జతగా సంచారానికి బయలు దేరిన చిత్రం నాకు విచిత్రంగానే కనిపించింది. యశ్వంతరావుగారి నోటినుంచి రెండు మూడు సార్లు 'వానప్రస్థ" మనే మాట నేను విన్నాను. దానికీ, ఈ చిత్రానికీ పొత్తు కనిపించలేదు. తన సంసారంలో రోత పుట్టి బొంబాయికి వచ్చినవారు, మరొక సంసారం కట్టుకున్నారనే సంశయం నా మనస్సులో స్వాభావికంగానే పుట్టింది. ఈ చిత్రం నేను ఎన్నాళ్లు మరవాలని ప్రయత్నించినా, ఆయన విషయంలో అలా మరువడం కష్టంగానే కనిపించింది. అలా అని ఆయన చివరి దినం

వరకూ ఆయనతో ఆమె వుండడం నేను చూడలేదు. లేక, వాళ్ల స్నేహం గాఢమయినదయితే ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. మానవసహజమైన దౌర్బల్యం అని సమాధాన పడవచ్చు. అయితే అంతటి సన్నిహిత సంబంధం వున్నామెను ఆయన అంత్యకాలంలో నేను చూచివుండవలసింది. కె. ఇ. ఎం. ఆస్పత్రిలో జ్వరంతో ఆయన స్మృతిలేక పడుకొని వున్నప్పుడు ఆమె వచ్చి వుంటుందా? రానే రాలేదు అనడానికి నేను వెళ్లింది ఆయన ఇహ లోకయాత్ర ముగిసిన తర్వాత. కాని, ఎందుకో, ఏమో దాదా లాగ ఆ వ్యక్తి కూడ ఆయన జీవితాన్ని పట్టుకొని వేలాడిన ఒకానొక రోగ బాధ కావచ్చు- అనే సంశయం నాకు పెక్కుసార్లు వచ్చింది. తర్వాతి సంవత్సరాలలోను నేను బొంబాయికి వెళ్లాను, మలబార్ హిల్స్‌లోని ఆయన యింటికి పోయి గంట రెండు గంటలు గడపనూ గడిపాను. అప్పటి నుంచి మేడ మెట్లు దిగినప్పుడెల్లా తెల్లచీర కట్టుకున్న ఆవిడ నాకు ఎదు రయ్యాని అని భ్రాంతి. అయితే, ఆమె నాకు కనిపించింది ఆ ఒక్కరోజే; అదే చివరి దినం. ఆయన దినచర్య చదివేటప్పుడు ఈ ఘటనకు సంబం ధించిన ఏ మాటలైనా దొరకవచ్చుననే కుతూహలం నాకు.

ఈ వ్రాతలలో ఆయన వ్యక్తుల పేర్లను ఉద్దేశ్యపూర్వకంగా వ్రాసేవారు కారు. పెక్కుసార్లు ఎక్స్, వై, జడ్ అని వ్రాసేవారు. లేకపోతే అర్థమేలేని పేర్లను సృష్టించి వ్రాసేవారు. మొత్తం వ్రాతలలో 'దాదా' అనే ఒక శబ్దా నికి మాత్రం ఇలాంటి వ్యక్తే కారణం- అనే జ్ఞానం నాకు కలిగింది. పేరున్న మానవుడు మరణించిన తర్వాత, ఆ పేరు వట్టిపదం. దానికి కారణమయిన శీలం, కల్పన ఎవరికిగాని వట్టిపేరుతో రాదు. తామెందుకు తమ దినచర్యలో చేదుజ్ఞాపకాల గుంపునకు పేరు పెట్టాలి? దానిని చదివినవారు, ఆ మానవుడు అంత చెడ్డవాడా? అని ఎందుకు అనుకోవాలి? అని తోచి ఆయన అలా చేసివుండాలి. దినచర్య అంటే ఒక రికార్డు. అది కథ కాదు, నవలకాదు, ఒక రకం చరిత్ర. అక్కడ భీముడు భీముడుగానే వుంటాడు. గణపత్ అని వ్రాస్తే గణపతిగానే వుంటాడు. దాదా అని వ్రాయడంవల్ల నాకుగాని, పరిచయమున్న జమ్‌షెడ్జీ దంపతులకో, అతడు ఎలాటివాడు అని తెలియవచ్చు. మాకందరికీ దాదా మొదటే తెలిసినవాడు. దినచర్య పుటలు చదివేవారికి దాదా లేక వై, లేక జడ్ అవుతాడు.

ఒకనాడు నేను తీరిక ఉన్నప్పుడు ఆయన దినచర్య నుంచి ఒకటి రెండు

పుటలు చూస్తూ కూర్చున్నప్పుడు, ఈ ఎక్స్ వై జడ్‌కు మారు 'రీమా' 'రీమా' అనే పేరు పది పన్నెండుసార్లు కనబడింది. ఇది కూడా గుప్త నామధేయం. ఎవరయి ఉంటారు? 'కాండాలాలో వున్నప్పుడు' అని వ్రాశారు కదా? అక్కడి ఏ వ్యక్తి అయినా అయిఉంటారా? - అని ఆలోచించి చదివితే, 'రీమాళతల్లి' అనే ప్రయోగం ఎదురయింది. నవ్వు వచ్చింది. 'రీమాళ' అంటే నవ్వు రానేవస్తుంది. 'కమల' అనేది పేరయితే 'కమల! కమలెయ" (య షష్ఠీ విభక్తి-కన్నడంలో అను) అంటారు. 'కమలళ' అంటే వినడానికి అసహ్యంగా వుంటుంది. ఈయన నాదపు ఇంపు తెలియని వారిలాగా 'రీమా' పదానికి 'ళ' చేర్చారు. ఆయన చిత్రాలలాగే మాటలూను- అని అనుకున్నాను. జ్ఞాపకం ఎక్కడి నుంచి ఎక్కడికో పోయింది. ఆయన దాదా విషయంలో నాతో జరిపిన చర్య నా కప్పుడు జ్ఞాపకం వచ్చింది. గ్రహచారం చాలక ఆ చర్య ఆరంభించినవాడిని నేనే. అనాథుడయిన దాదా ఆయన ఇంటికి రావడం; డాక్టరు దారూవాలను పిలిపించడం; ఆయన ఆ పిల్లవాడి సేవ చేయుడము; ఈయన సహాయానికి ఎవతెనో ఒకదానిని ఆ డాక్టరు పంపడం; ఇవన్నీ నా స్మృతి పథంలో మెలగి దారి పేరూ జ్ఞాపకం వచ్చింది. ఆయన ఆమెను గురించి 'మేరి' అన్నట్టు గుర్తు. మేరీ అనేది క్రిష్టియన్ పేరు. ఆ రోజు నేను మేడమీది నుంచి దిగుతున్నపుడు నాకు ఎదురయిన ఆ స్త్రీ, తెల్ల దుస్తులు ధరించిన ఆ దాదే కావచ్చు-అని పించింది. ఆమె నొసట నేను కుంకుమబొట్టు చూడలేదు. ఆమె చేతులకు గాజులు తొడుక్కోలేదు. హా! మేరీ అదే, ఆయన, దాని గుర్తు అప్పటి నుంచి రావడం; అదొక ఆశ్చర్య విషయం కాదు. అని అనుకోగానే, దినచర్యలోని 'రీమా' అనేది ఈ మేరి లేక మారి తల క్రింద ప్రయోగ మయి వుండవచ్చు - అనే భావన కలిగింది. మళ్లీ దినచర్య చదివాను. "రీమా" స్థానంలో నా స్మృతి పటలంలో వున్న మేరీని స్థాపించాను. మేరీకి తల్లి వుండి వుంటుంది. మేరీ తల్లి ఆ కాండాలాలో నివసిస్తూ వుండ వచ్చు - అనే సిద్ధాంతంతోనే ఆ వ్రాతను చదువసాగాను.

"రీమా తల్లికి రీమా యిక్కడికి రావడం ఎలా తెలుసు? అదిన్నీ ఒంట రిగా వున్న నా యింటికి. దాదావే నాకు వద్దనిపించి వాడు లేకనే నేను బతుక గలను అని చూపడానికే నేను బొంబాయి వదలి ఇక్కడికి వచ్చాను. అలా రావడం కొత్త ఏమీ కాదు. సంవత్సరాని కొకసారయినా కాండాలాకు

వస్తుంటాను. రీమా నన్ను వెదుక్కొని ఇక్కడికి రాకుండా వుండ వలసింది. ఆమె వచ్చింది; దినమూ రాసాగింది. అందువల్లనే ఆమె నా కనికరపు లేక దౌర్బల్యపు లాభం పొందడానికి ప్రయత్నించింది. దాదా ఉపచారం చేయడానికీ ఆమె రాకవుండవలసింది. వచ్చింది, నాలాగే అతని సేవ చేసింది. "నేను జీతానికి పని చేస్తున్నాను. మీరు ఎవరూ లేని అనాథు డని ప్రీతి చూపుతున్నారు. మీ మనస్సు దొడ్డది" అని నన్ను పొగడింది. ఎంతటి గట్టివాడైనా పొగడ్తకు చెవి ఒగ్గాడంటే వలలో పడుతాడు. రీమా చేసిన పని యిదే! మరేమీ కాదు. నేను ఆమె పొగడ్తకు పొంగిపోయానా? 'లేదు' అనలేను. చిన్నతనంలో నేను పొగడేవారు తీసిన గోతిలో ఏనుగ లాగ పడ్డాను. ఆ మీదట పొగడే వారంతా దొంగలని భావిస్తూ వచ్చాను. ఇప్పుడు, మరొకమారు నా చిన్ననాటి మూర్ఖత్వం నాకు వచ్చివుండాలి. ఈ విషయంలో నేను నన్ను తూచడానికి యోగ్యుణ్ణి కాదు.

"రీమా నన్ను ఓడించింది దానితోనూ కాదు. నేను సంసారం వదలి పెట్టి రావడం దానికి తెలుసు. ఎవరికీ ఆ సంగతి చెప్పని నేను ఏ కారణంతో ఆమెకు చెప్పాను? మనస్సులోని ద్వేషంతోనా? ఆమె నాకు సహాయం చేయడాన్ని చూచా? అదేమీ కాదు. ఒకవిధమయిన జీవితం చూచి జుగుప్స పొంది ఇక్కడికి నేను వచ్చినా, ఆడది అనే వస్తువు మీదనే వైరాగ్యంతో బొంబాయికి రాలేదు కదా! నాలోని ఆ కొరతను రీమా చాల సులభంగా కనిపెట్టి వుండాలి. ఆమె ఆ విషయంలో వట్టి నర్సు-దాది-, పెండ్లి కానిది. పెండ్లి కాలేదు అన్నంత మాత్రాన ఒంటరి ఆడది ఒంటరిగా మనడం సాధ్యం కాదు. ఆమె పాలిటికి, ఆమె జీవిత మంతానైనా, నేను చాల సులభ వస్తు వుగా కనిపించి వుండవచ్చు. ఆమెకు ఎలా కనిపించినా, నా ఆశకు ఒదగిన సులభ వస్తువు ఆమె కావడం మాత్రం నిజం.

"కాండాలాలో నా యింటిముందు చక్కగా ఏపుగా పెరిగిన పచ్చిక బయలొకటుంది. అక్కడికి ఎన్నో పశువులు మేతకు వస్తాయి. వాటి పిడు దులు పొడిచి తినడానికి వాటి ముందు వెనుక ఊరిమైనాలు సర్వదా సిద్ధం. కొక్కెరలా ఎగిరి రావడం కద్దు. వాటికీ వీటికి ఎలా మైత్రి? అవి పక్షులు, ఇవి పశువులు. వీటికి గడ్డి ఆహారం. వాటికి కీటకాలు ఆహారం. ఆవులకు దూడలకు ఈ పిడుదులు ఒక పీడ. ఈ పీడను నివారించే అడవి మైనా సహజ మిత్రులు. అనాదినుంచి వచ్చిన నేస్తమిది.

"ఒకరోజు చూస్తాను గదా - పిడుదులు లేనందువల్లనో ఏమో, ఆకలి అయినందువల్లనో ఏమో, ఒక మైనా బక్కచిక్కిన ఒక ఆవు వీపు పొడిచి గాయం చేసింది ; దానినుంచి రక్తం కారింది. ఆ చిత్రమే గీచాను. నా భావం దానిలో ఎంతవరకు స్పష్టమయిందో చెప్పలేను. రీనా అడవి పక్షి, అడవి మైనా అలా అనడం అన్యాయం అయ్యేనా? యశః కశ్చన వ్యక్తి అయిన నామీద అంతటి అభిమానం చూపినట్టిది — కన్న తన ముసలి తల్లిని, ఆమె కష్టాన్ని మరచిపోగలిగి నట్టిదయితే, ఆమె ఆవేదన, ఆవేదనా ? నా విషయంలో చూపిన ఆదరం ఆదరమా ? నాకు కలిగిన గాయం గాయ కాదా ?"

ఆ చిత్రం, ఈ కథనం, నేను ఆయన నోటినుంచే విన్న యావత్తు కథ మానవ జీవనపు ఒక అగాధ సమస్యను నా ముందు తెచ్చి ఒడ్డినాయి. స్త్రీ పురుషుల ప్రేమ అనే నురుగు బుడగను పొడిస్తే, దాని ఆకారం ఎంత మిగులుతుంది ? సత్యం తూనిక ఎంత స్వల్పం ? - అనే విషయం యశ్వంత రావుగారు ఇక్కడ చర్చించారు. ఆడది, మగవాడు అడవి మైనా-ఊరి పశువులవంటి పొత్తుతో మనునట్టివారు. పిడుదులున్న కాలం ఆ స్నేహం వుంది. అది లేకపోతే వట్టిగాయం. మనం ప్రేమించడం దేనికోసం అంటే పరోపకారం కోసం కాదు. ఔదార్యంతో కాదు. చాలమట్టుకు మనకోసం, మన స్వార్థంకోసం — అన్నట్టున్నారు ఆయన. తక్కినవారు ఎలావున్నా తమ అంచనాను, మదింపును తాము ప్రామాణికంగా చేయడానికి ఆయన ప్రయత్నించారు.

"రీనాకు నేను కాండాలాలో వున్నది తెలిసి, నా ఒంటరి జీవితపు విసుగును తొలగిస్తాననే నెపంతో వచ్చింది ; ఇక్కడే ఉన్నది. అదంతా సరే. అయితే ఆమె తన తల్లి "సీలూ" విషయంలో చెప్పిందంతా అబద్ధమని తెలిసినప్పుడు నాకు చాల వేసట పుట్టింది. తల్లికి పక్షవాతం ; బొంబాయికి తీసుకొనిపోయి చికిత్స చేయించడానికి నూరు రూపాయలు అడిగింది ; ఇచ్చాను. అడిగేటప్పుడు అది అబద్ధమనే భావం నాలో కొంచెమైనా కలుగలేదు. నా దగ్గరవుంది ; వున్నందువల్ల ఇచ్చాను. సీలూ ముసలిది. బదుకనీ, బదుకక పోనీ ఉన్నన్ని రోజులు కుమార్తె ఉపచారం చేయక తప్పదు గదా ! రీనా గుణం నాకు తెలీదా ? ఒళ్లు వంచి పని చేస్తుంది ; డబ్బు గడిస్తుంది. విలువలేక వచ్చిన డబ్బులాగ ఖర్చుపెట్టడం వల్లనే ఆపదలో నేను

దానికి సహాయపడవలసి వచ్చింది. సహాయమేమిటి? దాని స్నేహం కోసం నేనిచ్చిన వెల అది. ఆ సంగతి వేరె.

"ఆమె వెళ్లిపోయిన మరుసటి దినమే ప్రాణాలతోవున్న సీలు నా యింటికి రావాలా? ఆమె యిల్లు కాండాలాకు నాలుగు మైళ్ల దూరంలో వున్న లోనావళిలో. అరవై యేళ్ల ఆ ముసలిది ఇప్పటికీ దృఢంగా కనిపిస్తున్నది. నిత్యం నా యింటికి ఫర్లాంగు దూరంలోవున్న పారసీ గృహస్థుని యింట్లో పని చేస్తున్నది. ఉదయం వచ్చి సాయంకాలం వెళ్లుతున్నదట. కుమార్తెకూ, తనకూ సంబంధ మేమీ లేదట. ఆమె నా యింట్లో వుండడం ఎలాగో కనిపెట్టి ఆ రోజు ఉద్దేశపూర్వకంగానే నేనున్న చోటికి వచ్చి "నా కుమార్తె ఎక్కడ?" అని అడిగింది.

"రీమా నీ కూతురా? నీకు జబ్బు అన్నది కదా ఆమె?"- అని అన్నాను.

"అప్పుడు ఆమె తన కూతురు మీద కోపమంతా తిరగతోడుకుంది. నిరాధార అయిన సీలూ ఇప్పుడు ఒంటరిది. ఆమె ఎంతో కష్టపడి తన కుమార్తెను పెంచి పెద్దచేసి, అందరినీ అడుక్కొని నర్సు విద్య నేర్పితే, తర్వాత తల్లి అనే సంగతే మరచిపోయిందట. మగపిల్లలు అలా చేస్తారు. ఈమె ఆడది. కన్నతల్లిని మరవడమా? ఇంతవరకు తల్లికి ఒక్క దమ్మిడీ అయినా ఇవ్వలేదది! లోనావళికి వచ్చి నీవు చచ్చావా బదికావా అని తల్లిని అడిగిందే లేదట. యౌవనమంటే అది! యౌవనంలో తనకు కనిపించేది తాను మాత్రమే. ఏపుగా పెరిగిన మానుకు దాని వేళ్లు కనిపిస్తాయా? సీలూ వచ్చింది నాకు ఆ హెచ్చరిక చేయడానికి. "అది నా కూతురు. తల్లే కాబట్టని కూతురుకు మీరు కానీ, లోకం కానీ కావలసి వుంటుందా?" అనే బుద్ధి చెప్పిపోయింది. ఏమాశ్చర్యం! యౌవనానికి బాల్యపు జ్ఞాపకం వుండదు. ముసలితనపు హంగు తెలియనే తెలియదు. ఆమె తన కూతురిని దూషించడం విని, "నీవు ఏమి చేస్తున్నావు? జీవనం ఎలాగా?" అని వాకబు చేశాను. "కాళ్లు చేతులు గట్టిగా వున్నన్నాళ్లు కాయ కష్టం చేస్తాను. బతికేను" అన్నది. వాస్తవంగా గట్టి ముసలిది. ముసలి తనంలోను పనిచేస్తున్నది. పనిచేసే శక్తి వుండనలేదు, అయితే ఒక పట్టుదల కనిపిస్తున్నది - ఆమె ముఖంలో. తన కూతురు తనకు సహాయం చేయకపోయినా, తను బతుకగలననే దిట్టతనం చూపడానికే ఆమె బతుకుతున్నదేమో! అలా బతుకక పోతేనూ తప్పదు. ఆమె

బీదతనం చూచి నేను ఐదు రూపాయలు ఇవ్వబోగా "నేను దానికోసం రాలేదు. నేను రావడం తల్లిని మరచిన రీమాను నమ్మకండి అనడానికే..." అని చెప్పి వెళ్ళిపోయింది.

"వాత్సల్యం అదను తప్పితే పులిసి విషమవుతుంది. రీమా పశువుల మీది పిడుదులను తీసే బాంధవ్యం నెరపినట్టిది. ఒంటెని పొడిచి గాయం చేసి ఒకటి రెండు బొట్లు రక్తం తాగివున్నా ఆశ్చర్యమా? అంతటి అనుభవం ఆమె విషయంలో నాకు కలిగింది. ఆ పక్షి స్నేహమే అటువంటిది. కాండాలా వదలి మరొకమారు బొంబాయికి చేరేలోపల నేను దాని కొక జాబు వ్రాశాను; నీ తల్లి నేనున్న చోటికి వచ్చింది. నీవు వెళ్ళిపోయిన మరుసటి దినమే ఆమె ఆరోగ్యంగా వుండడం చూచాను. ఆమె నా వద్దకు వచ్చి, "రీమా తల్లిని మరచింది. అలాంటిది మీకు కృతజ్ఞతతో వుండడం కద్దా" అని చెప్పి వెళ్లింది అని తెలియజేశాను. రీమా నా జీవిత నాటకం నుంచి తొలగిపోయినది ఆ వక్రబుద్ధితో. నేను అలా వ్రాయకుండా వుండవలసిందేమో! "నీ వంచన నాకు తెలిసింది. నా ప్రేమ అంత గుడ్డిది" అన్న భావం దానికి కలుగకుండా వుండనీ అనే ఉద్దేశంతోనే అలా నేను వ్రాశాను. ఆమెనుంచి నా కొక జాబు వచ్చింది– "మీ వంటి వంచకులు ఇక లేరు" అని. ప్రేమకు హెచ్చు విలువ యివ్వని రీమాకు అలా కనపడాలంటే, నాలోను ఏదైనా దోషం వుండీని. నేను ఆమెను వంచించి వుంటానా? వంచించి వుంటే ఎక్కడ? ఏ రీతిగా? నా వంచన నాకు తెలియడం కష్టం కదా!"

## నాలుగు

రీమా సంగతి ఇంతతోనే ముగియలేదు. యశ్వంతరావుగారి చిత్రరాశిలో దానిదని అనిపించే ఒక చిత్రం నాకు కనిపించింది. అలాగే, ఆయన కాండాలా ప్రకరణం గురించి వ్రాసిన మాటలు చివరి మాటలు కావన్నదీ ఆయన దినచర్య తర్వాత పుటలు చదివినప్పుడు తెలిసింది. దానిలో ఆయన దాని స్వభావాన్ని చిత్రించే మంచి ఉపమానమిచ్చారు; "రీమా ఒక ఆర్కిడ్

(అడవి అరటి) చెట్టులాంటిది! ఆర్కిడ్ బదనిక బలగంలోనిది కదూ? పరజాతి మానులలో వేరూని తన విలాసం చూపించే మొక్క కదా? వృక్ష సంగ్రాహకులు ఆర్కిడ్‌కు ఇచ్చే మన్నన ఏ పూవునకూ ఇవ్వరు. దాని పూత విచిత్రాకారం దాల్చుతుంది; చాలకాలం వుంటుంది, అత్యపూర్వ సౌందర్యం వ్యాపింపజేస్తుంది; అన్నందువల్ల కదా ఈ మన్నన. అయితే, అది తాను ఆశ్రయించిన మానును అలంకరించడం కోసం పూచదు. దానిని మోసుకొన్న చెట్టు ఆ బదనిక తన ప్రేయసి అని భావించే కారణమూ లేదు. మన కవులు మల్లె తీగకు, మామిడి చెట్టుకు పొత్తు కలిపి వర్ణించారు. మల్లె వేరె మామిడి వేరె. వాటి పాదు, వేళ్లు వేరే. దాంపత్య జీవితం గురించి అనుకున్నప్పుడల్లా, నాకు ఆడ, మగ వీని జీవిత మన్నది మల్లె – మామిడులవలె కనిపిస్తుంది. మల్లె మామిడిని చుట్టుకొని 'నీవే నా ఆశ్రయం' అనే నమ్మకం పుట్టించి ఆ చెట్టుకన్నా వెలుపలికి చొచ్చుకొనివచ్చే చిగుళ్ళను చిగిర్చి, పూవులు పూస్తుంది. వెలుపలి చూపునకు ఈ నేస్తం ఎంత సుందరం! ఎంత అన్యోన్యమయింది! జలజ నన్నాశ్రయించింది ఇలాగే, కదా! చాలకాలం వరకు ఆమె భారం నేనే వహించాను. ఆమె నా కోసమే బతికివున్నదని నమ్ముకొన్నాను. ఆమె తన జీవన ధర్మం కొనసాగించడానికి, నేనిచ్చిన ప్రీతిని వినియోగించుకొని తన సుఖం కోసం మనినది నిజం కాదా? దాంపత్యం కూడా ఒక రకం స్వార్థం కాదా? ఆ సంగతి తెలిసిన తర్వాత కూడా మామిడి చెట్టే మల్లె తీగను పోగొట్టుకోగలదా? దాంపత్య జీవితం అన్యోన్య సంబంధమంటారు. అలా వున్నదీ చూచాను. నా జీవితంలో మాత్రం అది ఎందుకు నిజం కాలేదో? – తెలుసుకోలేకపోయాను.

"రీమా అడిగి చెప్పిన బదనిక విత్తు! గాలిలో తేలి ఏదో చెట్టు రెమ్మ మీద పడి, పెరిగేటట్టే రీమా ఆగంతుకురాలుగా వచ్చింది. తన బెడగుతో నా జీవితానికి కొన్ని క్షణాలు సంతోష మివ్వడమూ కాదనను. నాకు దాని స్వభావం తెలిసిన మీదట, నన్ను అది వంచించగలదు అని తెలిసిన మీదట నేను దానికి నిష్ఠురమయిన జాబు వ్రాసి, దానిని తప్పించుకొనే ప్రయత్నం చేశాను. దాని జవాబు వల్ల అది సాధ్యమనీ అనిపించింది. కాని, పరపుష్టం పరపుష్టమే! బదనిక బదనికే! ఒక చెట్టు బదనికను తనకు తానై తొలగించుకోజాలనట్టు ఆమె నన్ను అంటుకొననే అంటుకొన్నది. అయితే,

పైకి ఆమెకు యశస్సు వచ్చి వుండవచ్చు. కాని, అది యశస్సు కాదు. దాదా చేసినట్లే దుర్బలమయిన ప్రయత్నం. అది కృతక నాటకం, నిజమయిన జీవితం కాదు.''

పై మాటలలో నా మిత్రులు తమ దాంపత్య జీవితానికీ, నేను ఆయన విషయంలో అనుకున్న మేరీ సంబంధానికీ మంచి ఉపమాన మిచ్చారు. అందువల్లనే ఆయన గీచిన మేరీ చిత్రం ఎలాటిదని పైపైన చూచాను. అదొక నెస్టల్ చిత్రం. ఒక పెద్ద కాయితం మీద ఒక స్త్రీ ఊర్ధ్వకాయం చిత్రించారు. దేహం, చేతులు, రొమ్ము మాంసం నిండిన ముద్దలుగా వున్నది. గుడ్డలు వుండడం వల్ల, పికాసో గీచిన ''ది వుమన్'' అనే చిత్రమంత జడ మాంస ఖండాలుగా కనిపించక పోయినా, ఆ గుడ్డల లోపల అలాటి దేహమే వుండి వుండాలి. అయితే, మేరీ నిజానికి అంత లావుపాటి ఆడదికాదు. ఆమె శరీరం చాలినంత కట్టుదిట్టంగా వుంది. మాంసకామనే ఆమె ప్రధాన శీలమనడం వల్ల యశ్వంతరావుగారు ఇలాటి చిత్రం గీచారేమో! ఆమె లావుపాటి శరీరం మీద కేవల షోడశ వర్షప్రాయ అయిన కన్య ముఖం చిత్రించారు. చిత్రం కుడి భాగం పసుపు రంగు, ఎడమ భాగం ఆకుపచ్చ. ఆ మేరకు రెండు రంగులకూ సంవాదం కనిపించ లేదు. అది మేరీ ముఖమని నేను గుర్తించింది కేవలం పరిశోధన వల్లనే. చిత్రం వెనుక ''Orchid'' అని ఆయన వ్రాశారు. చిత్రం మీద 'యశవంత్' అనే వ్రాత వుంది. ఆయన మరణించడానికి ఒకే ఒక సంవత్సరం ముందు గీచిన చిత్రమిది. ఆమె పెదవులకు పచ్చరంగు పూశారు. ఏమి కల్పనో ఆయనది! కుడి కంట నవ్వు బెడగులు. ఎడమ కంటిలో కనీనిక కూడ లేదు. ఒక కంటి ఆడది ఆమె! రెండు కళ్లుంటే ఇతరుల కోసం ఒకింత దయాదృష్టి కలిగేదేమో! - అన్నట్టుంది. ఆ ముఖరచన కేవలం ఒక సంవత్సరం క్రితమే ఈ చిత్రం గీచాలంటే ఆయన జీవితంలో ఆమె ఇంకేదైనా రభసలేపిందో ఏమో! అయితే, ఆమె విషయంలో మరే వ్రాతా ఆయన దినచర్యలో కనిపించలేదు. ఈ కారణం వల్ల ఆయన జీవితంలోని ఈ ఒక్క చెరగును ఇంకా ఎక్కువగా వెదికి చూచే అవకాశం లేదు. అయితే, ఆయన ఇచ్చిన రెండవ ఉపమానంలో దాంపత్య జీవితానికి సంబంధించిన ఆయన ఆలోచనా సరళి నన్ను కూడా ఆలోచనకు గురి చేసింది.

దానిలోనిది మల్లె-మామిడి చెట్టు కల్పనే కదా! కాదు, ఆ మల్లె "జలజ" అని వ్రాశారు కదా!

రీమా మేరీ అనే స్త్రీ. సీలా ఆమె తల్లి అయిన లూసీ - ఇంతమాత్రం తనంతటే తెలిసింది. దాదా ఆయన నౌకరు గణపతి. 'జలజ' అనే పదాన్ని తిరగమళ్ళ వేసినా ఆ శబ్దమే వుత్పన్న మవుతుంది. తమ భార్య పేరును ఆయన ఉన్నదున్నట్టుగా వ్రాశేరు - అని నాకు అనిపించలేదు. తమ భావనా జీవితాన్ని చిత్రించేటప్పుడు ఆయన సంకేతాలకు, సంజ్ఞలకు హెచ్చు స్థానమిచ్చారు. అలాంటప్పుడు, జలజ అనేది ఆయన భార్య నిజ మయిన పేరు కాక సాంకేతిక పదం కావచ్చు. 'కమల' అని వుంటుందా? "పంకజ" అని వుండీనా? "వనజ" అని వుండవచ్చా? - అని ఎన్నో అనుమానాలకు గురిఅయ్యాను. ఆయన నాకు అందించిన నాలుగైదు చిరునామాల నుంచి ఆ వ్యక్తులను కలుసుకొని, ఆయన పూర్వజీవితేతి హాసం తెలుసుకుందామనే కుతూహలం నాకు ఉండనే ఉంది.

నేను బొంబాయినుంచి వచ్చి రెండు నెలలే నడిచాయి. వేరే పనుల వల్ల, సహజమైన ఔదాసీన్యం వల్ల నేను నా మిత్రుల ఆదేశాలను మరచాను. నలుగురు వ్యక్తులకు ప్రతినెలా 25 రూపాయల ప్రకారం డబ్బు పంపమని తెలిపారు. నేను వాటినంతా మరచిపోయి కూర్చున్నందుకు నా మీదే వేసట పుట్టింది. జ్ఞాపకం వచ్చిననాడు నేను చేసిన మొదటి పని ఏమిటంటే, ఆ చిరునామాలు వెదికి, వారి వారికి 25 రూపాయల ప్రకారం మనియార్డరు చేయడం. ఇక తీరిక చూచుకొని ఆయన ఊరికి పోవాలి. ఆయన పుట్టిన స్వాది సమీపంలోని పల్లెలోనో, పెరిగిన కుమటిలోనో, ఆయన బంధువులు ఎవరెవరు బదికున్నారనేది వాకబుచేసి, వాళ్ళకూ తెలపాలి. కుమటిలో ఆయన భార్యా పిల్లలు వుండనే వుండాలి కదా! భార్య వుంటే మాత్రం నా పని చాల కష్టం! భార్య అయిన ఆమెకు భర్త మరణవార్త తెలిపే పని తీరా అప్రియమైన పని. అందువల్లనే యశ్వంతరావుగారి 'జలజ' మరణించి ఉంటే ఇంకా మంచిది-అని ఆమె చావు కోరాను. ఆ భార్యా భర్తలకు ఎలాటి సంబంధమూ ఇప్పుడు లేదు - అని ఊహించుకొన్నాను. అయితే, బ్రాహ్మణ సమాజంలో వైధవ్యం తెచ్చిపెట్టే కళ మాసిపోయే కళ కాదు. అందుకే కదా, ముత్తైదులయిన వారు తమ భర్తలకు ముందే మరణించాలని అపేక్షించడం!

ఈ విషయంలో నేను ఏ ప్రయత్నమూ చేయక పదిహేను నాళ్ళు గడిచాయి. నేను చేసిన మనిఆర్డరుల తిరుగు రసీదులూ వచ్చి చేరాయి. ఒక రసీదు సతారా జిల్లా మహాబలేశ్వరం నుంచి వచ్చింది. డబ్బు పుచ్చుకొన్న వ్యక్తి విష్ణుపంత్ ఘూటే అనేవారు; తక్కిన ముగ్గురు యశ్వంత రావుగారి రక్త బంధువులో, మరేవిధపు బంధువులో అయివుండాలి. నేను ఆయన దస్త్రం విప్పి, దానిలో చేరిన కొన్ని పాత రసీదులను వెదికి చూచాను. ఆ నలుగురికీ పెక్కు సార్లు డబ్బు పంపడం జరిగింది. వారిలో ముగ్గురు తమ పేరు తాము వ్రాసేవారు. ఇద్దరి సంతకం కన్నడంలో వుండేది. విష్ణుపంత్ ఘూటేగారి సంతకం మరాఠీలో స్వాదికి సమీపంలోని బెనకన హళ్ళి చొచ్చలమనే పార్వతమ్మ అనే ఆమె రసీదులో బొటనవేలి గుర్తు మాత్రం. దానికొక సాక్షి కూడా వున్నాడు. ఆమె నిరక్షర కుక్షి అయిన ఎవతో ముసలిది కావచ్చు. స్వాది యశ్వంతరావు గారి జన్మభూమికి చాల సమీప స్థలం. తమ బంధువులలోని ఒక ముసలామె మీది కృపతోనో ఆయన డబ్బు పంపిస్తూ వుండి వుండాలి. ఎన్నటికైనా నేను యశ్వంత రావుగారి జీవిత చరిత్ర తెలుసుకోవాలంటే, ఆమెనే మొదట చూడాలని నిశ్చయించుకొన్నాను.

ఆమె బొటన వ్రేలి గుర్తున్న నాల్గైదు తిరుగు రసీదులను పట్టుకొని నేను చూచినప్పుడు ప్రతిసారీ 'శంభు భట్ట' అని ఒక్క ఆసామీ సాక్షి గుర్తే వుంది. బొటనవ్రేలి గుర్తుకు సాక్షి కానేకావాలి. నేను పంపిన డబ్బుకూ అదే శంభుభట్టు సాక్షి పడింది. అతడు పార్వతమ్మ బంధువులలో ఒకరు కావచ్చు. అంతకే నా ఆలోచన ఆగినప్పుడు, నాకు చేరిన తిరిగి రసీదులో కనిపించిన బొటనవేలి గుర్తు చూస్తే అది వేరే! వ్రాత మాత్రం ఎప్పటిలాగే 'ఈ బొటనవ్రేలి గుర్తు పార్వతమ్మ రుజు' అని వున్నప్పటికీ, పాత గుర్తులన్నీ ఒక బొటనవ్రేలు చూపితే, ఇది వేరే వేలిముద్ర అనిపించింది. మొదటి ముద్రలలో చక్రాకారమయిన గీతలున్నాయి; ఈ బొటనవేలి గుర్తులో శంఖాకృతిలో గీతలున్నాయి. ఎడమ చేతికి మారు కుడిచేయి బొటనవేలిని వుపయోగించారా? – అంటే అలాగ అనిపించలేదు. ఇలా ఎందుకయిందనే అనుమానం నా మనస్సుకు తోచింది. మరొక నెల రోజులు కాచుకొన్నాను. మళ్లీ డబ్బు పంపాను. తిరుగురసీదు సకాలానికే వచ్చింది. దానికికూడ శంభుభట్ట సాక్ష్యముంది. శంఖరేఖల బొటనవేలు ముద్రే

తిరిగీ కనిపించింది. అలా అయితే యశ్వంతరావుగారి డబ్బు తీసుకొన్న వ్యక్తే వేరే, ఇప్పుడు పొందుతున్న వ్యక్తే వేరే – అన్నట్లయింది కదా! ఈ శంభుభట్టు ప్రామాణికుడయిన వ్యక్తి కాడనిపించింది. అలాంటి వ్యక్తి చేతిలో నా డబ్బు చిక్కకుంది. నేను కొత్తవాడిని; అదే వ్యక్తి పెక్కు సంవత్సరాలుగా పుట్టిన వూరి ముఖమే చూడని యశ్వంతరావుగారిని వంచించలేదు – అనడం ఎలాగు ? ఈ విషయం రుజువయ్యేవరకు డబ్బు పంపరాదు అని నిశ్చయించుకొన్నాను. తర్వాత నెల డబ్బు పంపనేలేదు. తక్కిన ముగ్గురికీ మాత్రం పంపాను. అంతలోపల స్వాది వరకు వెళ్లివద్దామనే మనస్సు కలిగింది కాని, వానకాలం వచ్చింది. వానకాలంలో మలెనాడు ప్రయాణం మంచిది కాదు. ఎన్నో చోట్ల బస్సులు నడువవు. కాలి బాట తొక్కవలసి వుంటుంది. నేను నాల్గైదు రోజులు తీరిక చేసుకొని ఈ పని సాధించవలసి వుంటుంది గనుక ఊరికే వుండిపోయాను. ఇలా రెండు నెలలే గడచిపోయాయి. అప్పుడు నాకు హెచ్చరిక చేసే ఒక కార్డు అక్కడి నుంచి వచ్చింది.

"రాజమాన్యులుగారూ,

మీరు జులై నెలలో యశ్వంతరావుగారి పరంగా పంపిన మన వృత్తి రూపాయలు ఇరవై అయిదు చేరాయి. యశ్వంతరావుగారు ఆరోగ్యంగానే వున్నారని భావిస్తున్నాము. ఆయన ఇప్పుడు ఎక్కడున్నారు? మాకు ఆగస్టు, సెప్టెంబరు నెలలలో డబ్బు పంపించవలసిందని చెప్పి వుండవచ్చునని, మీరు ఏదో కారణంగా మరచివుంటారని యోచించి ఈ జాబు వ్రాయడమయింది. మీరు కష్టపడరాదు. ఈ నెల డబ్బు, వెనుకటి రెండు నెలల డబ్బు కలిపి డెబ్బయయిదు రూపాయలు పంపినట్టయితే, మీ ఉపకారం మరిచేట్టు లేదు. లేకపోతే యశ్వంతరావుగారి ఇప్పటి చిరునామా తెలిపితే, ఆయనకు వ్రాస్తాము. ఆయన మీ దగ్గరే వున్నట్టయితే, మీ అవ్వ పార్వతమ్మ మరణించడానికి ముందు ఒకసారయినా మిమ్ములను చూడాలని కోరుకుంటున్నది – అని తెలుపండి," అని వ్రాయడమేకాక, కింద 'ఈ బొటనవ్రేలి గుర్తు పార్వతమ్మ రుజు'; 'ఈ జాబు పార్వతి చెప్పి వ్రాయించింది' అనే వక్కణమూ వుంది.

యశ్వంతరావుగారి అవ్వ పార్వతమ్మ – అనే సంబంధం నాకు కుతూహలం పుట్టించింది. ఆమె ఆయన తండ్రి తల్లి అయివుండదు. తల్లి తల్లి

లేక, మరేదయినా రక్త సంబంధం గలామె కావచ్చు. యశ్వంతరావుగారు మరణ కాలానికి అరవయ్యయిదేళ్లవారు కదా. అలాంటప్పుడు ఆ ముసలిది ఇరవై సంవత్సరాలయినా పెద్దది కావచ్చు. నేను ఆమెను చూచేటట్టయితే, అది త్వరగా చేయవలసిన పని - అని తోచింది. అప్పుడు అక్టోబరు నెల నడుస్తున్నది. వానజోరు చాలమటుకు తగ్గింది. అప్పుడప్పుడు ఎండ పడుతూంది. ఆకాశంలో వెలి మబ్బులు నవ్వి ఆనందిస్తున్నవి. నవరాత్రి గడిచిన మరుదినమే నేను శిర్సికిపోయి, అక్కడినుంచి స్వాదికి పోయి స్వాదికి సమీపంలోని బెనకనహళ్లి చొచ్చలు మనెనూ (మొదటి యిల్లు) వెదికి చూడాలి; పోతే, వృద్ధురాలి దర్శనం కానేఅవుతుంది. అప్పుడు యశ్వంతరావుగారి బాల్య విషయాలు చాలినంత తెలియవచ్చు - అని ఏమేమో ఆలోచించాను. సద్యా, ఆమెనుంచి వచ్చిన జాబుకు ఏదో జవాబయినా వ్రాయాలి కదా! ఆమెకు డబ్బు పంపాలి కదా. దీనికి మాత్రం నా మనస్సు ఒడబడలేదు. మరొక సందేహమూ వచ్చింది. పార్వతమ్మ చనిపోయి వుంటుందనే సందేహం. ఆమె డబ్బు తీసుకొంటున్న శంభుభట్టు ఆ డబ్బు ఆశకోసం, చచ్చినదాని బొటనవ్రేలి గుర్తు చిక్కనందున, మరే ముసలిదాని బొటనవ్రేలి గుర్తు ఒత్తించివుండాలి. అలా అయితే, డబ్బు పంపరాదు - అనిపించింది. అలా అయితే, చావడానికి ముందు యశ్వంతరావుగారిని చూడగోరడం నిజమా? ఊరిని వదలిపోయిన ఆయన ఎన్నో సంవత్సరాలుగా ఆమెను చూచినవారు కారు. కేవలం శుష్కోపచారం కోసం, చచ్చినది చావలేదని చూపడానికి అలా వ్రాసి వుండవచ్చు. డబ్బు పంపినవారు యశ్వంతరావుగారు కాదు; ఆయన పరంగా నేను; మరొక అజ్ఞాత వ్యక్తి - అనడంవల్ల శంభుభట్టు చాల ధైర్యంతో మరొక బొటనవేలి గుర్తు బత్తించి వంచన చేశాడు - అనే తీర్మానానికి వచ్చాను.

నేను నవరాత్రి కోసం నిరీక్షించాను. ఒక ఉపన్యాసం కోసం శిర్సికి రావలసినదని అక్కడి మిత్రుల నుంచి పిలుపు రావడం వల్ల తక్షణం ఒప్పుకొన్నాను. అక్కడినుంచి పది పదిహేను మైళ్లలోగా స్వాది ఉందని ఎరుగుదును. స్వాది పురాతన చారిత్రక స్థలం. బెనకనహళ్ళి అక్కడి నుంచి చాలదూరం ఉండదు. ఇది మలెనాడులో కొండల, అడవుల మధ్య విహరించే యోగం; అది నాకు సంతోషం కలిగించేదే.

నవరాత్రి గడచిన తర్వాత ప్రయాణం - అని ఆలోచించాను; కాని

నవరాత్రి ప్రారంభం కాగానే శిర్సికి పోయాను. ఎప్పటిలాగే అక్కడ ప్రతి సంవత్సరమూ నవరాత్రి ఉత్సవాలకు ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు. రెండు రోజుల పాటు నేనొక మిత్రుని యింట్లో బసచేసి, రెండు ఉపన్యాసాల పని ముగించి తర్వాతి ఆలోచన చేశాను. అదృష్టవశాత్తు వర్షాకాలం తన బిరుసుతనాన్ని కోల్పోయింది. ఒకటి రెండు రోజులకొకమారు గంట అరగంట చిటపట చినుకులు పడి మాయమైపోయేవి. ఆ ప్రదేశపు గుట్టలు, కొండలు పచ్చని పచ్చిక పచ్చడం కప్పుకొని చాల మనోహరంగా కానవచ్చాయి. ఎక్కడ చూచినా అడవులు, మెట్టలు, అవి లేనిచోట పచ్చని పచ్చిక మైదానాలు ; ఎక్కడినుంచి ఎక్కడికో పారేనీటి దొరువులు, వాగులు, వంకలు, కొలనులు, సరోవరాలు. అక్కడినుంచి పొంగి పారే ప్రవాహాలు. ఎక్కడికో వెళ్ళి ప్రవహించే నీటి కలకలారావ గానం వీనులను ముద్దు పెట్టు కొనేది. అలాటి దృశ్యం నాకు సదా ఆనందకరం ; మెప్పు పొందేటటు వంటిది. నా ప్రశంసకు పాత్రమయిన రూపం – నెమ్మదిగా నడిచి అటు ఇటు చూపు సారించి ఆస్వాదించ దగినట్టి అలస ప్రకృతి. ఆ మలెనాడు నాకన్నా అలస ప్రవృత్తిగల జనంతో నిండివుంది. జన జీవితం వదిలితే ఇతర జీవితం అలాకాదు. జనుల నడకకూ, ఇక్కడి ఆవుల, దూడల నడకకు పొందిక చాల. అందులోను మలెనాడు గేదెలు ! దున్నపోతులు ! వానకాలం వచ్చిందంటే, పచ్చిక మేతకు కరువులేదు. బక్క రైతుల బక్క దున్నపోతులు ఆ పచ్చిక మేసి ఒళ్లు నింపుకొని, నీటిగుంట ఎక్కడ దొరుకు తుందో, అక్కడ పొర్లాడుతూ, జలస్తంభన తపస్సు చేస్తాయి. చురుకుతనం లేని గేదెలు, దున్నపోతులు బాహ్యచర్యకు మనలాగ జడ జీవాలు. అయితే, వాటి మనస్సు కూడా జడమా ? జడంగా వుండకపోవచ్చునేమో! వాటికీ సుఖ శాంతులు కావాలి. నీటిని చూస్తే వాటికి ఎంత ఇష్టం ! నీటిలో దిగి తలమాత్రం పైకెత్తి తేలుతూ చాలసేపు గడపాలంటే, అవి కూడా రసిక జీవులుగా వుండాలి. అందులోను ఎండ పడినదంటే, అవి దిగిన కొలనో, గుంటో, వాటికి ఆహ్లాదంగా కనిపిస్తాయి. తిండి తిప్పలు ఏమీ వద్దను కొని అవి నీటిలో పొర్లాడుతాయి. చాలసేపు కళ్ళు మూసుకొని నిద్ర పోతాయి. 'ఇదే సుఖం ఇదే సుఖం' అని తలచుకొంటూ నిర్వికల్పసమాధికి తక్కువకాని ఆనందం అనుభవిస్తాయి. శిర్సికి వచ్చిన మీదట నాకు కూడా అదే జబ్బు పట్టుకొంది. తిందాము, తాగుదాము, పడుకొందాము – అనే

మంత్రం జపించాలనే యిచ్ఛ కలిగింది. శంభుభట్టు సాక్ష్యం అబద్ధమా? నిజమా? 'పార్వతమ్మ చావడం నిజమా కాదా?' అనే చింత అక్కరలేదని పించింది. యశ్వంతరావుగారు ఇచ్చిన డబ్బు, ఆయన పేరు ఇక్కడ తేవలసిన దండుగ తెచ్చింది. నాకేమిటి లేని పోని పత్తేదారీపని అని ఒక మారు తోచడమూ కద్దు. ఆయన ప్రీతికి పాత్రమయిన ఆ వృద్ధురాలు ఎలాటిది? ఆయన చెల్లించడానికి పూనుకున్న ఋణం ఎలాంటిది? అనే ఒకే ఒక కుతూహలం కాకపోతే శిర్సిలోనే నాల్గు నాళ్ళు నేను దున్నపోతులాగ ఉండేవాడిని. స్వాదినుంచి శిర్సికి వచ్చిన వారెవరైనా దొరుకుతారా అని దూరం నుంచే వాకబు చేసి తిరిగి వెళ్లిపోదాము అనే మనసూ కలిగింది. చివరికి మనస్సాక్షి వినలేదు; బయలుదేరాను.

స్వాదికి వెళ్ళాను – రెండెడ్ల బండి కట్టించుకొని, ఒక రాత్రల్లా వెన్నెముక విరుచుకొని, ఈ బండి ప్రయాణంకన్నా నడకే ఎంతో సుఖమనిపించింది. స్వాది చేరిన తర్వాతనూ నడిచే యోగం తప్పలేదు. అక్కడినుంచి రెండు పరువుల దూరం బెనకనహళ్లి. అడవులలో దూరిపోయే దారి, వర్షాకాలంలో బండ్లు నడవలేని రొంపిరొచ్చు–నిండిన దరిద్రమయిన దారి. పరువు దూరానికొక మనిషి ముఖమూ కనిపించదు. "అదిగో! ఇక్కడే, వచ్చింది బెనకనహళ్ళి" అంటారు. నడిచి నడిచి కాళ్లు కుంటివయి పోయినా, పల్లె లేదూ, పాడూలేదు. అటువంటి మలెనాడులో 'పల్లె' అనే పదం కనిపించేది కరణాల అడంగల్లులలో మాత్రం. ఈ గుట్ట సందులో ఒక యిల్లు; ఈ కనుమ గుంతలో ఒక యిల్లు. ఒక యింటికీ మరొక యింటికీ పావు మైలు దూరం, అర మైలు దూరం. నా దారిలో కనిపించిన, పశువులు మేపుతున్న ఒక ముసలివాడు "బెనకనహళ్ళి ఇదేనండీ" అనేటప్పటికి మధ్యాహ్నమయింది. పచ్చగడ్డి మీద ఆ దొర కాళ్లు దాచుకొని కూర్చుని ముద్ద తింటున్నాడు. "బెనకనహళ్ళి ఇదే" అన్నాడు. ఒక యిల్లయినా కనిపించని చోట కూర్చుని "ఇదే పల్లె" అనడం విని ఆశ్చర్యమయింది. వాడి యిల్లయినా ఒకటి అక్కడ వుండాలి కదా! ఆవులు, దూడలు వున్నాయి; వాడు వున్నాడు. పల్లెకూడ వచ్చి వుండవచ్చు. "నిజానికి ఇది బెనకనహళ్ళియేనా? బ్రాహ్మణుల యిళ్లున్నాయా?" అని అడిగాను. ఇంకా ముందుకు చేయి చూపాడు. ముందు కనిపించే వెదురు పొదల వద్ద పల్లెకు పేరు వచ్చిన బెనకయ్య (వినాయకుని) గుడి వుందట.

వినాయక చవితినాడు పిల్లలు "బెనక బెనక వజ్రదంత పాణిపీఠ" అని కొనియాడే గణపతి గుడే ఆ పల్లెకు అలాటి పేరు తెచ్చి పెట్టింది.

"శంభుభట్టు అనే వారి యిల్లుందా ఇక్కడ ?" అని అడిగాను.

"చొచ్చలు మనె (మొదటి యింటి) వారా ?" అని అడిగాడు ఆ ముసలి.

"ఔనౌను . . . అయనే."

"చొచ్చలుమనె రెండున్నాయే ; ఎగువ చొచ్చలు, దిగువ చొచ్చలు. మీకు కావలసింది ఎవరు ? శంభు హెగ్గడెగారా ? రామ హెగ్గడెగారా ?"

"హెగ్గడెగారు కాదు. శంభుభట్టుగారు."

"అలా అయితే ఎగువ చొచ్చలు మనె ; ఈ గుట్ట దిగగానే దొరుకుతుంది. దిగువ చొచ్చలు మనె ఇంకా దూరం. అయితేవాళ్లు హెగ్గడేగారే . . . భట్టుగారు అంటున్నారు ?"

"మహారాజా, నాకు నడిచి నడిచి చాలయింది. హెగ్గడెగారయితే హెగ్గడెగారు ; భట్టుగారయితే భట్టుగారు. మొదట దగ్గరిలోని బ్రాహ్మణుల యిల్లొకటి చూపు. నీకు పుణ్యముంటుంది."

"తంబాకు (పొగాకు) ఉందా, దొరా ?"

"నేను తంబాకు, పొగాకు ఏదీ నమిలేవాడిని కాను."

"నేను వచ్చి చూపాలా ? ఇవి తీరా తెలివిలేని పశువులు. ఎక్కడికైనా వెళ్లిపోతే ?"

జేబునుంచి రెండణాలు, పావలా రూకలు తీసి "పెద్దాయనా, ఒక ఉపకారం చేయి. నేను పరాయి వూరివాడిని. సద్యో ఒక బ్రాహ్మణుల యిల్లు చూపించు. అక్కడినుంచి, వారిని అడిగి చొచ్చలు మనో, బచ్చలు మనో (నీళ్లయిల్లు) నాకు కావలసిన వారిని వెదుక్కొని వెళ్లుతాను."

"నిజంగానే ఆ రూక ఇస్తారా ?" అన్నాడు ముసలాడు.

"ఇదో మొదటే ఇచ్చాను ; తీసుకో ; ఇల్లును చూపడానికి మారు బెబ్బులి గుహ మాత్రం చూపకు" అన్నాను.

"పట్టంవారని కనిపిస్తుంది. బెబ్బులి అంటే అంత భయమా ? మనుషులను పులి యేం చేస్తుందట !" అని అంటూ కర్ర పట్టుకొన్నాడు. "అలా అయితే రండి" అని నాకు మార్గదర్శకుడయ్యాడు. నేను అతనినే వెన్నంటి వెళ్లాను. వెడల్పయిన కాలిబాటవదలి, ఇంకా సన్న కాలిబాట

పట్టుకొని వెదురు పొదల వద్దకు నన్ను పిలుచుకొని వెళ్లేటప్పుడు, నాకు పులులదే బెదురు. దారిలో ఒక పడిపోయిన గుడి కనిపించింది. దాని కప్పు కదలిపోయి విరిగి లోపల వున్న బెనకయ్యకు నిత్యమూ వాన నీటి అభిషేకం జరిగేది. ముసలాడు బెనకయ్య గుడిముందు నిలబడి, నమస్కారం చేసి, ఆ గుట్ట దిగసాగినాడు. వాడి చేతిలో కఱ్ఱవుంది. బంక మట్టి బురదలో దానిని ఊనుకుంటూ 'రండి, రండి,' అంటూ దిగాడు. నా కాళ్లకు బురద చెప్పులలాగ అంటుకుంది! అటూ ఇటూ బురద గట్టు; తాకినదంతా మన్నే! ఇక్కడ కాలు ఊనితే అక్కడికిపోయి నిలబడుతుంది; దరిద్రపు దిగ జారుడు వేరే. ఒకటి రెండుసార్లు జారిపడి, బురద అభిషేకమూ అయింది. శంభుభట్టును శపించాను. పార్వతమ్మనూ తిట్టాను. కొంత సేపటికి భూమి దిగుడు ఆగింది; బురద నిండిన ఒక ముంగిలి చేరాను. ఆ ముసలాడు నన్ను పిలుచుకొని వెళ్ళింది, ఒక యింటి వెనుక భాగంలోని పశువుల శాలకు! – పశువుల కొట్టానికీ, వాడికీ సంబంధం. అక్కడే నిలబడి "దొరా, ఎవరో పరాయి వూరివారు వచ్చారు" అని కేకవేశాడు. ఆ బొబ్బ విని మధ్య వయస్సులోని ఒక గృహస్థు నేనున్న చోటికి వచ్చాడు. ఆమూలాగ్రం నన్ను చూచాడు. నేను అతనిని అలాగే చూడాలనే బుద్ధి కలుగలేదు. బక్కచిక్కిన ప్రాణి; క్షౌరం చేసుకోని ముఖం. కౌపీనం వినా మరే గుడ్డా లేదు. ఆ యింట్లో నాకు మధ్యాహ్నం కూడు చిక్కుతుందనే నమ్మకం పోయింది.

ఆయన "ఎవరు మీరు? ఎవరు కావాలి; ఏ వూరివారు?" అని నాలుగైదు ప్రశ్నలు ఒకే మారు అడిగాడు. "చొచ్చలు మనె అంటే ఇదేనా? ఈ గ్రామంలో పార్వతమ్మ అనే ఒక వృద్ధురాలు ఉండాలి కదా? ఏదో పనిమీద ఆమెను చూడాలని వచ్చాను" అన్నాను.

"అది ఎగువ చొచ్చలు మనె అది. ఇక్కడ పారోతి అనే వృదురాలెవరూ లేరే! ఎందుకోసం వచ్చారు? చాలదూరం వారా? వారి సంబంధీకులా?" అని అడిగాడు. పుణ్యాత్ముడు. నన్ను అక్కడే నిల బెట్టి మాట్లాడుతున్నాడు. సందు లేకుండా ప్రశ్నలు కుమ్మరిస్తున్నాడు. వళ్లంతా బురద చేసుకొన్న నా అసహ్య రూపాన్ని తన యింటికి పిలుచు కొనిపోయే యిష్టమున్నట్టు కనిపించలేదు. "అలా అయితే వెళ్లుతాను" అని నేను ముందువారి పట్టుకొని పోబోయాను. నా అదృష్టవశాత్తు ఒక

అంగుళం వెడల్పుంచు పంచ (బచ్చాఖానా) కప్పుకొన్న ఒక వృద్ధులు, ఆ యింటివారే కావచ్చు- అక్కడికి వచ్చి "అబ్బాయి, నీకు మతిలేదు. ఎవరో పరాయి వూరివారు దారి అడుగుకొని వస్తే, పశువుల కొట్టం వాకిట్లోనే నిలబెట్టి పంచాంగం విప్పావు?" అని గదమాయించారు. నన్ను చూచి "రండి; రండి; ఇంట్లోకి వెళ్లుదాం! పాపం ఈ తిమ్మడు మిమ్మల్ని పశువులు వచ్చే దారిలోనే పిలుచుకొని వచ్చి బురదలో జారిపడేట్టు చేశాడు కదూ! తిమ్మడికున్న బుద్ధి అంతే; పశువులకున్నంతే" అని సహానుభూతితో మాట్లాడించి ఇంటికి పిలుచుకొని పోయారు. ఇంటి చావడి శుభ్రంగా వుంది. ఆ ముసలాయన పేరు శంకర హెగ్గడెగారట. ఆ కౌపీన ధారియే ఆయన పుత్రరత్నం శంభు హెగ్గడె. తండ్రి గదమాయింపులు తిన్న కుమారుడు ఇంటికి వెళ్ళిన మీదట నాకోసం చాప పరిచాడు; నీళ్ల చెంబు తెచ్చి పెట్టాడు. "రండి. కాళ్ళు కడుక్కోండి" అని ఉపచారం చేశాడు. నేను ముంగిట్లోనే నిలబడి "పైకి రావడానికి ముందు ఈ బురద కడుక్కోవాలి కదా!" అని మాట వెళ్లగక్కాను. బట్టలు మార్చుకోవాలి; స్నానం చేయాలి; సంచికి కూడా చాలినంత బురద అంటుకొని వుంటుంది, అని అనుకోవడం వల్ల వెనుక ముందు చూస్తూ నిలబడ్డాను. ఆ ముసలాయన లోపలికి పోయి, చేతులలో రెండు పచ్చడాలు పట్టుకొని వచ్చారు. "బ్రాహ్మణులు కాదూ?" అని ప్రశ్నించారు. తల ఊపాను. స్నానం చేసే రండి. మీ మనస్సుకూ హితంగా వుంటుంది.... శంభూ, ఈ పచ్చడం (మోటుపంచ) తీసుకొని పోయి నీళ్లయింట్లో (స్నానాల గదిలో) పెట్టిరా" అన్నారు. ముంగిటినుంచి స్నానాలగది వరకు నా యాత్ర అసిధారా వ్రతంలాగ వుంది. ముంగిట్లో అంతా పాచి; దాటడానికి అక్కడక్కడ పెట్టిన కర్రపలకలకూ పాచి. బావిగట్టు ముందున్న బండ రాళ్లకూ పాచి. ఎలాగో స్నానాల యిల్లు చేరాను; ఒక రాతి మరిగలో చన్నీళ్ళున్నాయి. హండాలో వేన్నీళ్లు మర్లుతున్నాయి. లోపలా చీకటి వ్యాపించింది. అక్కడ అభిషేకం ప్రారంభించాను. మలెనాడు ఇళ్ల సుఖమున్నదంతా ఆ వేన్నీళ్ల స్నానంలోనే అని చాలకాలంముందే కనుక్కున్నాను. మొదట నా గుడ్డలు ఉతుక్కోని, ఆ మీదట చేసంచి తీసుకున్నాను. సంచిలోని గుడ్డలకూ బురదపూత తగిలింది. ఆ పంకలేపం కడుగవలసే వచ్చింది. ఇంటి యజమాని ఇచ్చిన కొత్త పచ్చడాలు కట్టుకొనే యిష్టం లేకపోయినా, స్నాన

మయిన తర్వాత అవే నాకు కావలసి వచ్చాయి. రెండు ఎర్రంచు పంచలు అవి. పెళ్ళి, ఉపనయనం వేళల్లో పూర్వం పురోహితులు అలాటి పంచలే కట్టేవారు. శిర్సి, యల్లాపురం ప్రాంతం జనం ఇప్పటికీ అలాటి పంచలే కడుతారు. ఒక పంచ కట్టుకొని, మరొకటి కప్పుకొని స్నానాల గదినుంచి వెలుపలికి వస్తున్నప్పుడు, నాకే నవ్వు వచ్చింది; నేనూ ఒక పురోహితుడిని అయ్యాను కదా! అని.

ఇంటి పెద్ద అయిన ముసలాయన నా వేషం చూచి పులకితులయ్యారో ఏమో? "మీరు ఉడుపి వైపువారని అన్నారు కదూ? బ్రాహ్మణులయిన మాకు అంచులేని పంచ, మీ పాడయిన చొక్కా, షరాయి ఏమీ పసందుగా కనబడదు. ఇప్పుడు చూడండి మీరు ఎలా కనిపిస్తున్నారో? కోప్పడకండి. మిమ్మల్ని చూచినప్పుడు ఏ మతస్థులో ఏమో అని ఆలోచించాను. ఈ గుడ్డలలో అయితే మీరు బ్రాహ్మణులని కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది" అన్నారు. నేనూ నవ్వాను. ఆ ముసలాయనే ఆనాటి సంభాషణలో ప్రధాన పాత్ర వహించారు. సుమారు నలభై యేళ్ళు దాటిన ఆయన ఏకైక పుత్ర పరంజ్యోతి తండ్రి ముందు మిన్నకున్నాడు. అతని స్వభావమే వేరె; ఆ ముసలాయన రీతే వేరె. ఆయనకు డెబ్బయి సంవత్సరాల వయస్సుండవచ్చు. నిండు ముఖం. తల నెరిసిపోయింది. చిన్న గడ్డం. పొంకమయిన మీసాలు. అన్నీ తెల్లబడ్డాయి. కులశీలాల కళ ముఖంలో కనిపించేది. ఆయన మాటలలో వినయమూ వుంది. అపూర్వంగా వచ్చిన అభ్యాగతుని ఎడల ఆదర ముంది. మొదట నాకు భోజనం పెట్టించారు. "బీదవారి యిల్లు. కూరగాయలేమీ ఎక్కువగా లేవు. ఆకలే మనుష్యునికి రుచి, చాల ఆకలయి ఉంటుంది. మొదట్లోనే దాహానికిచ్చి నోటి రుచి చెడుపరాదని భోజనానికే పిలిచాను" అని క్షమాపణ ధ్వనిలో పీఠిక వేశారు. భోజనమూ బాగుంది. ఆయన అన్నట్టు నా ఆకలే దానికి ముఖ్య కారణం కావచ్చు. ఉప్పులో ఊరబెట్టిన పనస తొనల కూర; ఉప్పు నీటిలోనే అజ్ఞాతవాసం చేసిన మామిడికాయ మజ్జిగ పులుసు. అప్పడాలు, వడియాలు - ఇవీ వున్నవి. మా భోజన మయింది. వెలుపలికి వచ్చాము. తాంబూలపు తాంబాళం నా ముందు పెట్టారు. నేనూ తాంబూలచర్వణం చేశాను. ఆయన అన్నారు గదా! "కింది యింటి పార్వతిని చూడాలికదా మీరు? వెళ్ళవచ్చు. ఇంకా పొద్దుంది. ఒక చిన్న నిద్ర ముగించండి. మొదట వచ్చిన అలసట తీరనీ. ఏ పనిమీద

వచ్చారో ఏమో!'' అని నన్ను పడుకోడానికి బలవంతపరిచారు. ఒకవైపు అలసట; ఇటు కడుపు నిండిన భోజనం. రెండూ చేరి 'అలాగే చేయి' అని నన్ను ఉద్బోధించాయి. పడుకొన్నాను. వెనుకటి రాత్రి బండి ప్రయాణం వల్ల నాకు నిద్రే లేదు. అందువల్ల ఘోరమైన నిద్రే నాకు పట్టి వుండాలి. లేచి చూతును గదా, సూర్యుడు పడమటి కొండ శిఖర మొకదానిపై పవ్వళించి వున్నాడు. "ఏమిటి ఇంత పొద్దు పడుకొన్నానా?'' అని ఆశ్చర్యపడ్డాను. అంతలో యింటి యజమాని వచ్చారు. ఒక వేడినీళ్ల చెంబు వచ్చింది. "ముఖం కడుక్కోండి'' అన్నారు. కడుక్కొన్నాను. నా ఎదుట ఉపాహారం తెచ్చిపెట్టారు. కంచు గిండీ నిండ కషాయం (ఒక విధ మయిన పానీయం) వచ్చింది. ఒక పళ్లెంలో చిన్న అరటిపండ్లు. దానికి తోడు వేయించిన పనసతొనలు. ఆయనకూ అలాగే ఉపాహారం వచ్చింది. "ఇలా అనడంతోనే నేను వచ్చిన పని అయింది కదా!'' అన్నాను. దానికి ఆయన నవ్వారు. "మరాఠీలో ఒక సామెత వుందట – మొదట పొటోబా (పొట్ట), ఆ మీదట విఠోబా అని. అందువల్ల మొదట ఫలహారం కానీండి'' అన్నారు. ఫలహారం అయింది.

తర్వాత నేను "నాకిక పార్వతమ్మ యింటి దారి చూపుతారా? మీరు రానక్కరలేదు. మీరు చాల వయస్సయినవారు. మీ కుమారుణ్ణి గాని, లేకపోతే ఏ నౌకరును పంపినా చాలు'' అని ప్రార్థించాను. ఇంతవరకు నేను వచ్చిన ఉద్దేశ్యాన్ని, ఆయన కుమారునిలాగ గుచ్చి అడిగే గోజుపనికి ఆయన పూనుకోలేదు. అంతేకాక, పై పైనే "ఏ వూరు'' అని మాత్రమే అడిగారు. నేనూ చెప్పాను. నా ఆకలి, అలసట తీరిన తర్వాత మాట్లాడించ వచ్చునని తమ ప్రశ్నలను ఆయన బాకీపెట్టి నట్టున్నారు. నేను వెంటనే లేచి ఎండకు ఆరవేసిన గుడ్డలను తీసుకువచ్చాను. వారిచ్చిన బట్టలు విప్పి స్వవేషాలంకృతుడయిన పిదప ఆయన "అధిక ప్రసంగమని అనుకోరాదు. మీ ఊరు చాల దూరంలో వున్న వూరు. ఉడుపి పక్క వారన్నందున చాల దూరమే అయింది కదా! ఈ వూరికీ, అక్కడికీ ఎలాటి సంబంధమూ కనిపించడం లేదు. మీ పూర్వులెవరైనా ఈ వైపునుంచి ఆ వైపునకు వెళ్ళి నట్టివారా? లేకపోతే. మీకు పార్వతి పరిచయం ఎలాగూ?'' అని ప్రశ్నించారు.

"నా కోసం నేను రాలేదు. యశ్వంతరావుగారనే ఒక స్నేహితుల కోసం

నేను వచ్చాను. ఆయన ఈ వైపు వారు. ఆయనకూ ఆ ముసలమ్మకూ ఏమో సంబంధం వుండి వుండాలి. ఆ ముసలమ్మ ఎలా వున్నారనే సంగతి తెలుసుకొని వ్రాయాలి అని తెలుపడంవల్ల శిర్సికి ఒక పని మీద వచ్చిన నేను "చూద్దాం ఈ పల్లె మూలను" అని వచ్చాను. అని నిజం కలిసిన అబద్ధం చెప్పాను. నా దృష్టిలో ఉన్నది ఉన్నట్టు చెబితే, ఆ రెండు బొటనవ్రేళ్ళ సంగతి తెలియడానికి చిక్కు రావచ్చునని భయమయింది. ఆ ముసలాయన ఆలోచిస్తూ, 'యశ్వంతరావుగారు' అని అంటూ నోరు కద లించారు. రెండు మూడు సార్లు 'రావుగారు, పాయగారు అనే వాడుక మా వూరిలోనే లేదు కదా! ఇక్కడ బ్రాహ్మణులలో భట్టు, శాస్త్రులు, హెగ్గడె గారు అని వుండడం వాడుక.'

"రావుగారు అనే మాట నేను చేర్చినట్టిది."

"అలా చెప్పండి ; యశ్వంత అని ఆయన పేరా ? ఎక్కడ వుండడం అని అన్నారు ?"

బొంబాయిలో వుండడం అని అననా ? లేక వుండిరి అననా ? ఈ సందిగ్ధావస్థలో నేను కొట్టుకొన్నాను.

"మా కుటుంబంలోనే యశ్వంతుడనే పిల్లవాడు వుండేవాడు. నా చిన్న నాటి మాట. మా కుటుంబం అంటే ఏమిటి ? మా యింట్లోనే. లేదు, ఒకే పేరుతో ఇద్దరుండగూడదని కాదు. ఆ యశ్వంతుడు చచ్చిపోయి వుండాలి. ఇంతవరకు బ్రదికి వుండడు. వాడూ, నేనూ అన్నదమ్ముల పిల్లలం. పూర్వమే మేము భాగాలయ్యాము. చూడండి. మా యింటి ఆ వైపు పొద పెరిగింది కదా, వెదురు పొద. అదే వాడి యింటి బునాది. ఆ యిల్లు పాడయి వెదురు పొద పెరగాలంటే ఎన్ని సంవత్సరాలు గడచివుండవు చెప్పండి. అయంది-ఎన్నో సంవత్సరాలు."

"ఈ ఊళ్లో వేరే వంశంవారిలో అలాంటి పేరు గలవారు లేరా ?"

"చొచ్చలు మనే కుటుంబంలో ఎవ్వరూ లేరు చొచ్చలు మనే అంటే, మాది. ఇంకా దిగువ చొచ్చలుమనే అనేదీ ఒకటుంది. అది కూడా మా పూర్వులున్న స్థలమే ; మాకు చేరిందే. మా కుటుంబపు యశ్వంతుడు ఇక్కడి నుంచి ఎక్కడికో పోయాడు."

"వెళ్లేటప్పుడు ఆయన వయస్సెంత ?"

ముసలాయన నొసటికి చేయి అదుముకొని యోచన చేశారు. తమ

బాల్య చిత్రాలను జ్ఞాపకం చేసుకొన్నారు. "అయ్యో! ఆ యశ్వంతుడా? నాకూ, వాడికీ నాలుగైదు సంవత్సరాల వ్యత్యాసమో, ఏమో! నాకన్నా అతడు చిన్నవాడు. పెద్దవాడు కాడు. అతనికి పెండ్లీ అయింది కూడా ఇక్కడే. అప్పుడు వాడికి ఇరవై సంవత్సరాలు వుండీనో ఏమో! హాఁ! అంత వుండవచ్చు. కుమటీ ప్రాంతం నుంచి పిల్లను తెచ్చారు అతనికి. మాది మొదట్లో పెద్ద కుటుంబం. పెద్దది అంటే జన సంఖ్యతో కాదు. మంచి అనుకూలత వుండేది. ఇప్పుడు చూడండి – మా ఆస్తిలో సగపాలు అడవి పెరిగి పాడుపడింది. ఆ యశ్వంతుడు అప్పుచేసి, అప్పుకు తన ఆస్తి అప్పగించి ఈ వూరే వదిలాడు. భార్య ఊరికి వెళ్లాడు ; అంటే, కుమటీకి పోయాడు."

"భార్య పేరు?"

"ఎవరికి జ్ఞాపకం? పెళ్లయిన తర్వాత అమ్మాయి పెద్దమనిషై నాల్గు నాళ్లు వచ్చివున్న జ్ఞాపకం కూడా సమంగా లేదు. మా తండ్రికీ, అతని తండ్రికీ చాల ద్వేషం వుండేది. పాడు దాయాదితనమే అలాటిది. ఆ యశ్వంతుడు బదికున్నాడు ఇంకా అంటారా? ఉండ జాలడండీ. ఎలా వుంటాడు? వాడు కుమటీకి పోయి పోకచెక్కల మండీ వ్యాపారం చేస్తు న్నాడని ఒకమారు విన్నాను. అదిన్నీ చాలకాలం క్రితం. నేను నా ఆయు స్సులో ఒకే ఒక మారు కుమటీకి వెళ్లాను ; అంతే. ఏమిటి పని? ఆ వైపు నాకు ఎలాటి సంబంధమూ లేదు. మేము యిచ్చి పుచ్చుకొనే వ్యవహార మేమైనా వుంటే శిర్సీగాని, యల్లాపురం గానీ మాకు దగ్గర. అయితే, నేను మునుపు విన్న సంగతితో చెప్పవలసి వస్తే, కుమటీలో వాడు సంసారం పెట్టాడు ; వ్యాపారం చేశాడు ; పిల్లలు కన్నాడు ; ఆ మీదట సంసారంలో విసుగెత్తి కాశీకో, హరిద్వారానికో పోయి ప్రాణాలు వదిలాడు – అని విన్నాను. మీరు చెప్పిన యశ్వంతుడు ఎవరయి యుండవచ్చునండీ? వేరే మా వాళ్ల యిల్లు ఏదుంది ఈ సమీపంలో? ఎంత వయస్సు మీ యశ్వంతునికి?"

"వయస్సు మీకన్నా ఎనిమిది పది సంవత్సరాలు తక్కువ కావచ్చు."

"మీకాయన బాగా తెలుసా?"

"తెలుసు, కొంచెం కొంచెం. బొంబాయిలో ఆయన పరిచయము అయింది."

"ఆ పార్వతికీ, వాడికీ ఏమిటి సంబంధం?"

"దూరంగానో, దగ్గరగానో, అవ్వో, మరేమో?"

"ఆమెను చూచి ఎలా వుందో తెలుపవలసిందని చెప్పాడా? మీరు దాని కోసం రావడమా? సరి. వాడు మీకు చెప్పి, మీరు ఒప్పుకొన్న మీదట వెళ్లడం న్యాయమే. అయితే ఇప్పుడు పొద్దు మునుగుతున్నది కదా! ఆ పార్వతి యిల్లు అంటే, ఒక గుడిసె. అక్కడే వేరే బ్రాహ్మణుల యిల్లుంది. సమంగా కళ్లు కనిపించని ముసలిదాని యింటికి మునిసంజె గడిచిన తర్వాత ఏమిటి పోవడం? ఏమిటి మాట్లాడించడం? ఈ ఒక్క రాత్రి మా వద్ద వుండవచ్చు గదా! ఉదయం వెళ్లితే చాలదా?"

(ఈ ప్రశ్నకు నేనేమి సమాధాన మిస్తాను? ఒకసారి నాకు నా మిత్రులు పుట్టిన స్థలం అక్కడే, నా కళ్లముందున్న వెదురు పొదల కింద రాశిగా పడినట్టు కనిపించింది. నా మిత్రులు మరొక యశ్వంతరావుగారు కారని పించింది. కుమటి నుంచి సంబంధం తెచ్చింది మా యశ్వంతరావుగారికే. సంసారం త్యాగం చేసింది ఆయనే. విరక్తులయి పోయి చేరిన కాశీ హరి ద్వారాలు మాత్రం వేరే. మరణమూ వేరే. ఆయనకు కానివారు ఆయన చావు సుద్ది పుట్టించి తమ ఆత్మకు మొదట్లోనే తృప్తి తెచ్చుకొని వుంటారు. పుట్టిన ఊరు వదలిపెట్టి పోయిన తమ్ముని విషయంలో శంకర హెగ్డెగారు ఆ వార్తను నమ్మడంలో ఆశ్చర్యం లేదు. నలభై సంవత్సరాల గడువు దాటిన సంగతి అది. పార్వతి అనే ముసలమ్మ యశ్వంతరావుగారి రక్త బంధు వయితే, హెగ్డెగారికీ బంధువే. ఇప్పుడు చూస్తే అలాంటి సంబంధానికి కారణం కనిపించదు - అని తోస్తుంది. ఆయన భార్య ఊరు మరీ దూరంది. ఇలాం టప్పుడు ఆ పార్వతి, శంకర హెగ్గడెగారి పాలిటి పారోతి కేవలం గురుతున్న స్త్రీ. ఆయన బాల్యజీవితంలో ఏదో ఒకరకం ప్రేమ ఋణానుబంధం కల్పించుకొని వుండాలి — అనే విచార సరణి నాలో పుట్టింది.) (అంతలోనే మునిసంజ అయింది. ఇంకొక మైలో, అరమైలో దారి తొక్కి మరొక గుర్తులేని ఇంటికిపోయి, నేను ఏలాటి తనిఖీ నడిపించేట్టులేదు. ఏమైనా, నేను వెదుక్కొని వచ్చిన ప్రాణి బ్రతికివుంది. అది చనిపోవడం వల్ల రెండవ బొటనవ్రేలి గుర్తును తిరుగు రసీదు మీద వేయడం జరుగలేదు. సాక్షి శంభుభట్టు, డబ్బు పంపిన నేనెవడో తెలియని వ్యక్తి కావడంవల్ల పూర్తిగా వంచన చేశాడు - అనే భావనా కలిగింది. అడిగిన ప్రశ్నలకు సమాధాన

మివ్వక నా మనస్సును ఎక్కడెక్కడో తేలుస్తూ, అన్యమనస్కుడయిన నన్ను చూచిన హెగ్గడెగారు "ఇప్పుడే అక్కడికి బయలుదేరి పోవాలని లేదు కదా! ఉదయం వెళ్ళితే చాలు గదా!" అని మరొకమారు అడిగారు. "అలాగే" అన్నాను నేను. నా మనస్సు అప్పుడు మలెనాడు అడవిలాగ, వెదురు పొదలు, తీగలు, జొంపాలు మొదలయిన వాటితో పచ్చగా వుంది; విచార మూఢమయింది.

శంకర హెగ్గడెగారు "పొద్దు మునిగింది. ఒక చిన్న అహ్నికం ముగించుకొని వస్తాను. ఇక్కడే కూర్చోండి" అని నన్ను వదలి వెళ్లి పోయారు. ఆయన వెళ్లిన తర్వాతే ఆయన పుత్రరాజయిన శంభు హెగ్గడె నా ముందు వచ్చి నిలబడ్డాడు. తాంబూలపు పళ్లెంలో చేయిపెట్టాడు. "కూర్చోండి" అని నేను ఉపచారం చేసినా, అతడు కూర్చోలేదు. నిలబడే తాంబూలం స్వీకరించాడు. నేను పరిహాసంగా "మీకు అహ్నికం పూజ లేవా?" అని అడిగాను.

"అప్పయ్య (నాన్నగారు) ఉన్నారు కదా!" అన్నాడు.

"అలా అయితే, దాని కంట్రాక్ట్ అంతా తండ్రిగారిదే అన్నట్టుంది."

"మీరు?"

నేను నవ్వుతూ, "నా సంధ్యావందన జపాల కాలం ముగిసి సంవత్స రాలు నలభై అయింది" అన్నాను. మరి రెండు గంటల కాలం ఇంటి యజమాని వెలుపలికి రాలేదు. ఇక్కడ శంభు హెగ్గడెగారు నిలబడే ఉన్నారు. నేను "కూర్చోండి" అని అన్నప్పటికీ కూర్చోలేదు. ఏదో మాట్లాడుదామనే కుతూహలం ఆయనకు వున్నట్టు కనిపించింది. మధ్యాహ్న సంఘటన నుంచీ, ఆయన తండ్రిగారు మాట్లాడినప్పటి నుంచి గొంతు బిగుసు కొని పోయినట్టు నన్ను వూరికే బిక్కు బిక్కుమని చూస్తున్నాడు. ఆ వేళకు ఇంటిలోపలినుంచి ఒక వయో వృద్ధురాలయిన విధవ దీపారాధన నీరాజనం వెలిగించుకొని వచ్చి నేను కూర్చున్న స్తంభం సమీపంలో పెట్టింది. శంభు హెగ్గడె "ఈమె మా అత్త. అత్త అంటే నాన్నగారి అక్క. చిన్ననాటినుంచీ ఇక్కడే ఉన్నారు. మా యింటికి ఆమే పెద్ద. ఆమే ఇంటిదీపం. మా నాన్న గారు ఏమి చేసినా ఈ అక్కను అడుగకుండా చేయరు. అంత భక్తి ఆమె విషయంలో" అని చెప్పాడు. ఆమె నాకు కొంచెం దూరంలో గోడకు ఒరిగి కూర్చుంది.

"చాల దూరంలోవున్న ఊరినుంచి వచ్చారట. మా పార్వతిని చూడ డానికి వచ్చారట" అన్నది. అప్పుడు నాకు ఆశ్చర్యమయింది. శంభు హెగ్గడెగారు మా సంభాషణంతా మరుగుననే నిలబడి విని ఆమెకు చెప్పక పోతే ఆమె ఆ ప్రశ్నలు అడిగేది కాదని తోచింది. ఆమె నోటినుంచి వచ్చిన 'మా పార్వతి' అనే మాట నన్ను చకితుని చేసింది. పార్వతి విషయంలో శంకర హెగ్గడెగారు విశేష పరిచయమున్నట్టు మాట్లాడలేదు. అయితే, వారిలో తిరస్కారమూ కనిపించలేదు. ఆదరమూ లేదు. ఎంత కావాలో అంతే మాట్లాడారు. ఈమె "మా" అనే ఆత్మీయభావం చూపవలసి వస్తే ఏదో విశేషం వుండాలి అనిపించింది.

"ఔనమ్మా. ఆమెను చూడడానికే వచ్చాను. నా మధ్యాహ్న నిద్ర దీర్ఘమై లేచేవేళకు సాయంకాల మయింది. రేపు పిలుచుకొని వెళ్లుతాను - అన్నారు మీ తమ్ముడు."

ఆమె నా ముఖం ఎగాదిగ చూచింది ; కళ్లు పెద్దవిచేసి. ఆమెకు ఎనభ య్యాయిదేళ్లుండ వచ్చు. కళ్లు అంత స్పష్టంగా కనిపించనట్టుంది. మసక మసక దృష్టితోనే నన్ను ప్రయత్నించి చూచేటట్టు కనిపించింది. అలాగే చూస్తూ చూస్తూ నాల్గు బొట్లు కన్నీరు జారడం చూచినప్పుడు నాకు కడుపులో పేగులు కలచివేసినట్టయింది. ఏ పూర్వ స్మృతితో ఆమె ఏడుస్తూ వుంటుంది ? ఆమె ఒక్కొక్క బొట్టు కన్నీరు ఏదో కటువైన వేదనను కాక సుఖవార్తను చెప్పజాలదు గదా? తన అల్లుడినుంచి యశ్వంతరావుగారి కథ విని ఆమెకు దుఃఖం కలిగివుంటుందా ? లేదు. మన పార్వతే ఆ దుఃఖానికి కారణభూతురాలయి వుంటుందా? ఆ వృద్ధురాలిని నేను దుఃఖ వేళలో ఏమీ ప్రశ్నించలేకపోయాను.. స్వభావం పూర్వాపరాలు తెలియక ప్రశ్నించబోతే వెర్రిబాగులపని అయ్యేది. అంతలోనే ఆమె "యశ్వంతుడు మీకు పరిచయమట. వాడు మరణించిన వార్త అబద్ధం అలా అయితే" అన్నది మనస్సు కుదుటపడినట్టు. ఇప్పుడు పుండుమీద పెట్టిన వాత నాకు. యశ్వంతరావుగారు ఆనాడు మరణించడం అబద్ధమయినా, మొన్న మర ణించడం నిజం కాదా ? ఏ ఒక్క మాటతో యశ్వంతరావుగారి విషయంలో ఆమెలో తృప్తి ఉదయించిందో, నేను దానిని ఉంచాలా, ఊడ్చివేయాలా ? నేను నా మిత్రుల మరణ వార్తను మూసిపెట్టాను. ఆ ముసలమ్మ ముందు ఏమి చెప్పాలి ? - నా నోటినుంచి మాటే వెలువడలేదు. ఆమె ముఖం

చూతును గదా – కన్నీటి బొట్లకు మారు కన్నీటిధారే వెలువడుతున్నది. అప్పుడు నేను ఆగలేక "అమ్మా, ఏదో పాత జ్ఞాపకంతో తమకు దుఃఖం కలుగుతున్నదేమో !" అని అడిగాను.

"అబ్బాయి! అబ్బాయి అంటున్నాను. మీరు పెద్దవారు! అయితే నేను వయస్సులో నన్నా పెద్దదానిని కదా! నా కడుపులో పిల్లలు చూచే ఋణం లేనప్పుడు లోకంలోని పిల్లలంతా నా పిల్లలే."

ఆ మధ్యన శంభు అందుకున్నాడు. "మా అత్త మాంగల్యం పోయింది పెళ్లయిన ఎనిమిది నాళ్లలో. ఆమే అంటూండేది- అప్పుడు నేను ఎనిమిది సంవత్సరాల దాన్ని అని. పూర్వకాలంలో 'అష్టవర్షా భవేత్కన్యా' అంటే, అష్టే (కన్నడంలో అన్నే) సంవత్సరాలకే పెళ్ళి చేసేవారు కదా!"

అతని శ్లోకం నాలో నవ్వు పుట్టించింది. సంస్కృతంలోని అష్ట కన్నడం లోని అష్టే అయి నవ్వు పుట్టించింది. ప్రస్తుత సంభాషణకు అది విరసపు మాట. నేను దానిని కడిగి వేయడానికి "మీరు చాల కష్ట జీవితం అనుభవించి వుంటారు. ఆ జ్ఞాపకంతో దుఃఖం కలిగివుండాలి. అప్పుడు మీకు ఎనిమిది సంవత్సరాలు; ఇప్పుడు ఎనభయ్యాయిదు" అన్నాను.

"అందుకు కాదు అబ్బాయి, అది బ్రహ్మ వ్రాసిన విధి. నాకు కుంకుమ యోగం లేకపోనీ అని, పూర్వజన్మలో చేసిన ఏ పాపానికో దేవుడు ఈ శిక్ష విధించాడు. నాకు దుఃఖం రావడం మరొక విషయానికి."

"ఏమిటా విషయం?"

"దాయాది మాత్సరమనే విషం సర్పవిషం కన్నా ఘోరమయింది."

"ఎందుకంటారా, అది ఏనాటికైనా చెడ్డదే; దానినుంచి మంచిది జరిగింది ఎవరికి?"

"నేను యశ్వంతు విషయంలో ఈ మాట అన్నాను. మా పారోతినీ ఈ విషం కరిచింది."

"అంటే?"

"పారోతి, నేను దిసమొల పసిపిల్లలుగా వున్నప్పటినుంచీ ఆడుకొన్న వాళ్లం. అది కూడా నాలాగ కుంకుమ అదృష్టం గతి పొందినట్టిది కాదు. అది నా కుటుంబంది కాదు; మరేమీ కాదు. లేనివాడికి ఆశ్రయమయి మా పినతండ్రి ఇంట్లోనే వుండి పెరిగినట్టిది. మాలో చీలికలు వచ్చాయి. అన్నదమ్ముల పోట్లాటతో యిల్లు ముక్కలు ముక్కలయింది. ఆ మాట చెప్ప

గూడదు ; నేను చెబితే నా తండ్రినే దూషించినట్లవుతుంది. యశ్వంతుని తండ్రీ, నా తండ్రీ అన్నదమ్ములు. ఒక తల్లి కడుపులో పుట్టిన వారు. అయితే కౌరవ పాండవుల దాయాది తనాన్నయినా చెప్పుకోవచ్చు గాని, వీరిది ఒప్పుకోరాదు. ఒక నాడు మా నాన్న వేడి రక్తపు పొగరులో తన తమ్ముణ్ణి ఒకమాట అన్నారు. అన్నది కోపంతో ధృతిచెడి, వాడి యింటి గేదె మా పెరడులో పడి నాలుగు బెండ మొక్కలు మేసిందేమో! నాటి పెంచిన వారికి నోటి కోపం రావడం సహజం. అయితే, అన్నట్టి మాట ఎలాంటిది? "ఆ దేవునికి కళ్లుంటే నీ యిల్లు అడుగంటి పాడయిపోయి అక్కడ వెదురు పొద పెరగనీ!"– అని శాపమిచ్చారు. ఆ శాపం నిజం కావాలా? అక్కడ వుందే– అదిగో అక్కడ అటు. అంత పెద్ద యిల్లూ కుసి పడిపోయి మంటలో కలిసి, ఆ తమ్ముని కొడుకూ పాడయిపోయాడు. యశ్వంతుడు ఈ వూరే వదలిపెట్టాడు. మునుపు అక్కడ ఒక యిల్లు వుండినదనే గురుతునే కప్పి వేసి పెరిగింది వెదురుపొద. క్షుద్రమయిన విషయం. ఇల్లు భాగమయింది. వాళ్ళ పాటికి వాళ్ళు వుండవచ్చు. రెండు ఇండ్ల మధ్య ఒక ప్రహరీగోడ వేసుకొన్నారు. అందువల్ల వీరు వారిని వారు వీరిని చూడనవసరం లేదు. అయితే, దాయాది మత్సరం కదా! మనుష్యుని నాలుక విషం పాము విషం కన్నా ఘోరమయింది. ఒకరొకరి గ్రహచారమే అలా. మా నాన్న అలాంటి మాట అన్నారు ; అప్పటినుంచి వారికీ వీరికీ తిట్ల జపం తప్పలేదు. మాటంటే శాపం! ఆ యింట్లో కాలు పెట్టినవాడు ఈ యింట్లో కాలు పెట్టరాదు. నేను కూడా యశ్వంతుని యింటికి పోలేదు. పెద్దల అనల భయం! మా పిన తండ్రి గతించారు. ఆయన కుమారుడు యశ్వంతునికి ప్రాయం వచ్చింది. అతని తల్లి గతించింది. వాడి వివాహానికి యిక్కడినుండి ఎవరూ వెళ్ళలేదు. అంతా ముగిసింది. తండ్రిని పోగొట్టుకొన్న పిల్లడిమీద మా నాన్న ద్వేషం పోనేలేదు. తల్లిలేని పిల్లడిని పెంచి 'ఒక పిల్లవాడిని' చేసినట్టిది ఆ నా పారోతి. పొట్టకు లేక చాకిరీ కోసం వచ్చి చేరిన అది యశ్వంతునికి నిజమయిన తల్లి. ఆ పాపడికి ఒక బొట్టు పాలు తక్కువయితే, వచ్చి నన్ను అడిగేది. నేను దొంగతనంగా ఇచ్చేవాన్ని. మా యింట్లో యేదైనా పిండి వంట చేస్తే నేను దొంగతనంగా దొడ్డివారిగుండా పోయి, దానిని పిలిచి, ఇచ్చి, యశ్వంతునికి అందజేసేవాన్ని. ఒకనాడు మా నాన్నకు ఇదంతా ఎలా తెలిసిందో దేవునికే తెలుసు. "ఇక నీవు ఆ పారోతి వున్న చోటికి పోయావా, నా ఒట్టు"

అన్నారు. ఎందుకీ కోపం? ఏమిటి ఫలం? అంతటి కసితో వున్నవారు కాలం రాగానే గతించారు. ఆ మీదట యశ్వంతునికి పెళ్ళయింది. మేమెవరమూ దానికి పోలేదు. అందమైన పిల్లనే తెచ్చారు. 'నా బిడ్డ సుఖంగా వుండనీ' అని నేను ఆకాంక్షిస్తే, పెద్దల శాపం వదలవద్దూ? వెదుళ్ల వేళ్లలాగే దాని వేళ్లూ బలమయినవి. వాడికి పెళ్లయింది; ఎవరెవరికో యిచ్చి, వట్టి చేతులు చేసుకొన్నాడు. అయోధ్య వదలిన రాముడిలాగ అరణ్యం చేరాడు; ఆ మీదట ఎక్కడికో పోయి చచ్చాడు - అని విన్నాను. చావే సుఖమనీ భావించాను. మా నాన్న మరణించారు. ఆయన ఒట్టుకు, ఆన భాషకు మేమంతా కట్టుపడిన వారం కదా! అయితే యేమి? యశ్వంతుడు నా పేగు తీగకాదా? ఈ శంకరుడున్నట్టే వాడూ నా తమ్ముడు కాదా? నా కెవరున్నారిక? చచ్చే మొద్దుకు ఎవరూ అక్కరలేదు. చచ్చిన తర్వాత, ఈ తమ్ముడు చేయవలసినదంతా చేసేని. నిజం. ఆ విషయం వేరే; అయితే, నా యశ్వంతుని గుణం, నేను దొంగిలించి పాలు ఇచ్చి పెంచిన పాపడి గుణం వీరెవరికీ రాజాలదు.''

ఈ కథ వింటున్నప్పుడు ''నేనెక్కడున్నాను? ఏ యుగంలో వున్నాను? ఏమి సమాచారం వింటున్నాను?'' అనేది నాకు అర్థం కాలేదు. దాయాది ద్వేషాన్ని గురించి వింటున్న నన్నూ అది ఉడికిస్తున్నట్టు కనిపించింది. నా ఆ మిత్రులు ఇదంతా వినడానికి లేకపోయినా, దీన్నంతా ఎలా మరువగలిగారు? ఈ విషానికి గురి అయినా, కౌమారం నుంచి యౌవనానికి, యౌవనం నుంచి ముదిమికి గమిస్తూ బ్రతికారా? అలాటి దావాను పోషించారే? ఆ ముసలమ్మ చెప్పినట్టు ఎవరికీ రాని గుణం ఆయనది—అని అనిపించింది. ఈ సమయంలో నేను పార్వతి సంగతి ఎత్తరా దనిపించింది. మరపు జీవితం చాల సుఖం. చేదును మరవడానికి తెలిస్తేనే జీవితం సహనీయం. ఆ శక్తి లేనందువల్లనే తిండీ బట్టా వున్నా, అభిమానించే తమ్ముడొకడున్నప్పటికీ, నా ముందు కూర్చున్న ఆ వయో వృద్ధకు నెమ్మది చిక్కలేదు. శాపానికి లోనయిన యశ్వంతుని జ్ఞాపకం సుఖం కలిగించి వుండదు. ఆ శాపానికే పాల్పడిన యశ్వంతుని పెంపుడు తల్లి – అలాగే కదా చెప్పాలి - పార్వతి కూడా శాపగ్రస్థురాలయి వుండాలి. ఆమె వున్న యింటికి ఈమె పోరాదు. ఆమె వున్న యిల్లే పోయింది కదా! యశ్వంతుడు వూరు వదిలాడు కదా! ఇల్లు వానకు, గాలికి కుసిపడి, మట్టి

ముద్దయింది. వెదురు పొద పెరిగింది. ఆ పొదనే శంకర హెగ్గడెగారు గంటకు ముందు చూపారు. శాపపు భూమిక ఆయనకు తెలియదేమో! అందువల్ల ఆయన అదొక సామాన్య విషయంలాగా చెప్పారు. నిర్లిప్తులయినట్టు యశ్వంతుని గురించి చెప్పారు. బాంధవ్యమున్నా లేనట్టే వర్ణించారు. ఈ వృద్ధురాలు అలా కాదు.– ఈమె కనడం తెలియని స్త్రీ అయినా, కనడం కోసం పుట్టిన స్త్రీ. తన కూన లేనప్పుడు, తమ బలగం వారి మరొక కూనను తనదే అనే మోహంతో, తానే సాకి పెంచేటంతటి మమత ఉన్నట్టిది; అనుకంప గలది. అటువంటి పని చేసే భాగ్యం పొందిన పార్వతి జీవితంలో, ఆమె తాదాత్మ్యం పొందినట్టు కనిపిస్తుంది. యశ్వంతుడు మరుగయినా, 'మా' పార్వతి బతికున్నది. పెద్దల శాపపు పెనుమంటలకు దూరపు గట్టున నిలుచుని వుంది.

## ఐదు

రాత్రి గడిచి తెల్లవారింది. ముఖ ప్రక్షాళనం ముగిసేలోపల "దాహం సిద్ధంగా వుంది" అని శంకర హెగ్గడెగారి కోడలు ఆయనకు వచ్చి తెలిపారు. అప్పుడాయన 'శంభు' అని కుమారుణ్ణి పిలిచి, ఈయనను దాహం పుచ్చుకోడానికి పిలుచుకొని వెళ్లు" అని అనతిచ్చారు.

"మీరు?" అన్నాను నేను.

"నా కింకా ప్రాతస్నానం కాలేదు. స్నానం, దేవుని పూజ కాకుండా నేను ఏమీ తాకను. మీరు మొదట ఫలహారం చేయండి. తర్వాత స్నానం పని ఒకటి ముగించుకొని పొండి. మధ్యాహ్నం లోపల యిక్కడికే వచ్చి వేయండి. పార్వతిని చూచి వచ్చేపని ఒక్కటే కదా! వయస్సయిన ముసలిది. మా అక్కలాగే ఆమే ఒక బదికిన మొద్దు; అటు చావనూ చావదు, ఇటు బతకనూ బతకదు."

"నేను తిరిగి వచ్చిన తర్వాత స్నానం చేస్తాను. దారిలో మరొక బురద స్నానం కాదని ఎలా? అయితే మీరు నా జతకు రారు కదూ? రానక్కర లేదు; ఒక మనిషిని పంపితే చాలు."

అప్పుడు ఆయన కుమారుడు శంభు "నాన్నా నేను ఆయనకు తోడుగా వెళ్లుతాను" అన్నాడు.

"ఊరికే వుండు; నీవూ వద్దు, నేనూ వద్దు. సుబ్బడు పోనీ. అంటే, చూడండీ, మొదటినుంచి మేము అక్కడికి వెళ్లి వచ్చే రివాజు పెట్టుకోలేదు. ఏదో పెద్దల ఆన వుంది. నిజానికి ఆమె మీద పగేమీ లేదు."

"ఔను, విన్నాను. మీ అక్కగారు ఆ సంగతి చెప్పారు."

"ఓహో! అంతలోగా మా అక్క ఈ అక్కరలేని పురాణం చెప్పడ మయిందా? మా అక్కకు, పార్వతికీ పంచప్రాణాలు. అక్కడికి వెళ్లక పోయినా, పార్వతిని జ్ఞాపకం చేసుకోని దినమంటూ లేదు."

అంతలోగా వాళ్ల తోట పనివాడు సుబ్బడు వచ్చి నిలబడ్డాడు. శంకర హెగ్గడెగారు వాడికి నన్ను పిలుచుకొని పోవలసిందిగా తాఖీదు చేశారు. ఆ సందర్భంలో శంభు ముఖం చప్పగ కావడం చూచాను. అతడు నాకు తోడుగా రావడంలో నాకు ఇష్టానిష్టాలు రెండూ లేవు. తండ్రీ వచ్చివుంటే ఎక్కువ సంతోషం కలిగేది. రాకపోయే సందర్భమేమిటో తెలిసింది. (ఆయన కుమారునితో పాటు లోపలి యింట్లోకి వెళ్లి ఉపాహారం ముగించి వచ్చాను. నా కోసం కాచుకొన్న సుబ్బడి జతలో పార్వతమ్మ యింటికి బయలుదేరాను. శంకర హెగ్గడెగారు సుబ్బడితో "సుబ్బా, ఈ రావుగారిని వెలుపలి దారిలోనే దిగువ యింటికి పిలుచుకొనిపో – ఆ పారోతవ్వ వద్దకు. తోట యిల్లు దాటేటప్పుడు అక్కడే పురాణం విప్పుతూ నిలబడవద్దు. ఈయన వెళ్ళి అవ్వను పలుకరించి వస్తారు. అంతవరకు నీవు కాచుకొని వుండు" అని వుత్తరువు చేశారు. మేమిద్దరమూ బయలుదేరాము)

హెగ్గడెగారి తోటలో ప్రవేశించి ఇవతలికి వచ్చి ఒక బయలు చివర మేము నడిచివెళ్లాము. నేను సుబ్బడిని పలుకరించలేదు. వంకర టింకర మడీ చెరువుల దారిలో హెచ్చరికతో నడుస్తూ అరమైలు దూరం సాగి పోయాము. తర్వాత ఒక పోక తోట వచ్చింది. అంతలోపల అక్కడ శంభు హెగ్గడె కాచుకొని వుండాలా? అతడు చుట్టు దారిగుండా పరుగుతో నన్ను కలుసుకొనడానికే వచ్చినట్టుంది. మేము ఎదురు కాగానే, "సుబ్బా, ఒక నాలుగు మొగిలి చెండ్లు తీసుకొనిరా; పూజకు కావాలి. నీవు ఇక్కడే కాచుకొని వుండు. నేను ఈయనకు అవ్వ యిల్లు చూపివస్తాను" అని అన్నప్పుడు నాకు కలిగిన ఆశ్చర్యం చెప్పలేను. నేనేమీ చేయలేదు.

ఇద్దరమూ పోకతోట ప్రవేశించాము. అక్కడ శంభు నన్ను నిలబెట్టాడు. నెమ్మదిగా రకరకాల ప్రశ్నలు వేయసాగినాడు. "మీది ఉడుపి వైపు అన్నారు కదూ! మీ పేరు అడగనే లేదు. యశ్వంత పిన్నయ్య పరిచితులు మీరు అన్నమీదట పేరు అడుగకుండా వుండడమా?" అన్నాడు.

నేను నా పేరు చెప్పాను. నా పేరు చెప్పగానే శంభు ముఖం తీరా చప్పగయి పోయింది. నాలుగు క్షణాలు నన్నే బరిగుడ్లతో చూచినప్పుడు నాకు సంగతి సందర్భాలు అర్థమయ్యాయి. నేను కావాలనే, "హెగ్గడెగారూ, శంభుభట్టు అనే వాడొకడు ఈ వూరిలో వున్నాడా?" అని ప్రశ్నించాను.

"మీరు దాని తనిఖీకి వచ్చారా?"

"దేని తనిఖీ? సంగతి తెలియలేదే?"

అతడు కదలలేదు, నేనూ కదలలేదు; మా ప్రయాణం అక్కడే ఆగింది. అతడు నా రెండు చేతులూ పట్టుకొన్నాడు. "స్వామీ, నా మర్యాద కాపాడడం, కాపాడక పోవడం మీ భారం. మీరు నన్ను ప్రాణాలతో చంపదలచినా చంపండి. ఆ అవ్వ ఎదుట, మా నాన్న ఎదుట నా యోగ్యతను మూడు దమ్మిడీలకు దింపకండి" అన్నాడు. "నేను ఏమి చేశాననే నాకు తెలీదే. మీరు ఎందుకు ఈ మాటలు మాట్లాడుతున్నారు? నాకేమీ అర్థం కాలేదు" అన్నాను. నా అంతరంగానికి అప్పుడే సందేహం కలిగింది. దానిని కప్పిపుచ్చే ప్రయత్నం చేస్తున్నాను. సాక్షి శంభుభట్టు వీడే; పార్వతమ్మకు వెళ్లుతున్న డబ్బుపై మధ్యన చేయి వేసిన మహానుభావుడు ఇతడే ఆ పశువులు కాచే ముసలయ్య 'శంభుభట్టు. అనేవారెవరూ ఇక్కడ లేరే?' అని ముందుగానే నాకు సూచన యిచ్చాడు. ధన లోభంతో ఇతడు మొదటి నుంచి ఆ ముసలమ్మ యింటికి తండ్రికి తెలియకుండా వెళ్ళివస్తోవుండాలి. యశ్వంత రావుగారు స్వయంగా మనిఆర్డరు పంపడం నిలిపివేసిన మీదట ఇతడు నాకు తెలియదనుకొని డబ్బంతా తినిఉండాలి. పల్లెలో బట్వాడా కదా! ఉపా బంట్రోతూ, ఇతడూ కలిసి ముసలమ్మను వంచిస్తూ వుండాలి– అని యోచిస్తూ వుండగా, ఎదుట నిలబడిన బెదురుకళ్ళ శంభు హెగ్గడె ఏడ్వడం ప్రారంభించాడు. నిలబడిన చోటే కుసిపడి పోయి నా పాదాల మీద చేతులు పెట్టి "నన్ను కాపాడాలి" అని ప్రార్థించాడు. తర్వాత సంగతంతా అతని నోటినుంచే వచ్చింది. మొదటినుంచి అతడు ముసలమ్మకు

ఐదు రూపాయలు మాత్రమిచ్చి, అంతే వచ్చిందని చెప్పి సగం తానూ, సగం టపా బంట్రోతూ పంచుకొనే వారట. నేను డబ్బు పంపడం ప్రారంభించిన తర్వాత అది పూర్తిగా ఈ ఇద్దరికే పోసాగింది. 'అయ్యో' అనిపించింది నాకు. పెద్దవారు ప్రారంభించిన దాయాది మత్సరం ఈ విధంగా పార్వతమ్మ మీద పడుతుందని నేననుకోలేదు. డబ్బు! దరిద్రమయిన డబ్బు! బహుశా శంకర హెగ్గడెగారు తమ యాజమాన్యంలో కొడుకు చేతికి దమ్మిడీ కూడా ఇవ్వక పోవచ్చు. ప్రాయం వచ్చినవాడు ఇతడు; యౌవనంలో వున్నాడు; పిల్లాజెల్లా వున్నవాడు. చిల్లర డబ్బుల సంపాదనకు అడ్డదారి తొక్కాడు. నేనిప్పుడు వచ్చి తిన్నది వారి యింటి అన్నం. ఇప్పుడు అతడు నాతో ఏ మరుగూ లేక జరిగింది చెప్పి కాళ్ళు పట్టుకొని శరణు పొందినప్పుడు ఏమి చేయడానికీ లేదు. "అస్తు" అన్నాను. "వెళ్ళండి, ఇంటికి వెళ్ళండి. తండ్రి చెప్పిన మాట ప్రకారం చేయండి" అన్నాను.

"నన్ను కాపాడుతారు గదా?" అని అడుక్కున్నాడు తిరిగి.

"మాట యిచ్చాను గదా!" అన్నాను.

"అవ్వకూ చెప్పరాదు."

"చెప్పను; వెళ్లండి" అని ఓపిక పోయి అన్నాను.

"మీరు కోపం చేసుకొంటున్నారు."

"మీపైన కాదు" అన్నాను.

పుణ్యానికి తోడు వచ్చిన సుబ్బడు నూరు అడుగుల దూరంలోని మొగిలి తోటలో దూరి నాలుగు చెండ్లు తీసుకొని వస్తుండడం కనిపించింది. "మొగిలి చెండ్లు తీసుకొని వెళ్లండి; మీ యిల్లు చేరండి; ఏమో యోచన చేయకండి. మధ్యాహ్నం భోజనానికి నేను ఎలాగూ వస్తున్నాను గదా!" అన్నాను.

"అక్కడే వుండి పోకండి."

"ఆ విషయం ఇప్పుడు చెప్పలేను."

ఇలాటి వంచనకు గురి అయిన ఒక నిరాధార అయిన ముసలిదానిని చూచి, మాట్లాడించి రావడానికి ఎంతసేపు పడుతుందో! నా ఆకలి, పొట్ట దానికన్నా ఎక్కువయిన విషయాలు కావు — అని అనుకుంటూ, సుబ్బడిని వెంటబెట్టుకొని తోట దాటాను. ముందొక యిల్లు — చాలినంత పెద్దది కని పించింది. దాని ముంగిట్లో వెళ్లేటప్పుడు సుబ్బడు "దిగువ చొచ్చలు మనె

అంటే యిదే; చాల వున్న వారు. ఇంకేమీ అంత దూరం కాదు"
అన్నాడు. ఆ యింటి యజమాని చావడిలో కూర్చున్నారు.

"ఔరా సుబ్బా, ఎవరిని పిలుచుకొని బయలుదేరావు? ఎక్కడికి?"
అని ఆయన పలుకరించినా, నేను విననివాడిలాగ నాల్గు అడుగులు
ముందుకు వెళ్లనే వెళ్లాను. సుబ్బడు ఆయనకు ఏమి చెప్పాడో వినలేదు.
అతడు పరుగుతో నన్ను కలుసుకొన్నాడు. ఇక నూరు అడుగులు వేసే
లోగానే, ఒక గడ్డి కప్పిన చిన్న గుడిసె కనిపించింది. దాని ముంగిట్లో
ఒక తులసికోట వుంది. తడిగుడ్డ కట్టుకొన్న ఒక ముసలమ్మ ఆ తులసి
కోటను ప్రదక్షిణం చేస్తున్నది. "ఆమే కదూ?" అన్నాను. నేను హర్ష
చిత్తుడినయి, "ఔను" అన్నాడు సుబ్బడు. అతడు అక్కడినుంచే "అజ్జమ్మా
(అవ్వా), ఎగువ యింటివారు ఈ దొరగారిని పంపారు" అని గట్టిగా
చెప్పాడు. నేను చేతి సైగతో "బొబ్బలు పెట్టవద్దు" అన్నాను. ముసలమ్మ
గొణగొణమని ఏదో జపం చేస్తూ తులసికోట ముందు నమస్కారం చేసింది;
నొసటికి తులసి మృత్తిక పెట్టుకొన్నది; నిలబడింది. తర్వాత నావైపు
చూచింది. "ఎవరో నిలబడినట్టుందే?" అన్నది. సుబ్బడు నెమ్మదిగా,
మొదట అన్నమాటే అన్నాడు. అది ఆమెకు వినబడదని "అమ్మా, నేను
ఒక పరాయి వూరివాడిని. మిమ్ముల్ని చూడడం కోసం వచ్చాను. మీకు
కావలసిన వారొకరు పంపారు; పార్వతమ్మ ఎలా వున్నారో చూచి రండి
అని," అన్నాను. నాకు తెలియకనే ఆమె ముందు చేతులు జోడించుకొని
నిలబడి వుండడం ఆమె దృష్టిలోపడి "అయ్యో, బిడ్డా, నా కెందుకు నమ
స్కారం చేస్తావు? ఆ దేవుడికి చేయి" అని తులసికోట చూపింది.

"మీరు పెద్దవారు. నేను వయస్సులో మీకన్నా చాల చిన్నవాడిని,"
అన్నాను.

ఆ ముసలమ్మ తలపంకిస్తూ, "ఊహూఁ! అది కానే కాదు; నాకు నమ
స్కారం చేయడం వద్దు. దేవునికే చేయడం" అన్నది.

"దేవునికీ చేద్దాము; పెద్దవారికి చేయడంవల్ల దోషం లేదు కదా"
అన్నాను నేను.

"పెద్దవాడు వాడొక్కడే అబ్బాయి."

ఆ ముసలమ్మ ఇంకా దగ్గిరికి వచ్చింది. నా ముఖం ఎగాదిగ చూచింది.
ఆ మీదట "తీర్థం తీసుకో!" అని నాకు తీర్థ మిచ్చింది; నేను తీసు

కొన్నాను. ఆమె అప్పుడు కూడా నా ముఖమే చూచింది. "అబ్బాయి, నాకు వయస్సు అయింది, డెభ్భయ్యో, ఎనభయ్యో, సమంగా కళ్లు కని పించవు. ఎవరయివుండవచ్చునని చూచాను. గుర్తు రావడం లేదు. చాల దగ్గరగా చూస్తే, తెలిసిన ఆకారమైతే అవును, కాదు అనే అందాజు అవుతుంది. నా యశ్వంతుడో అనుకున్నాను. వాడు ఎక్కడి నుంచి వస్తాడు ? కుమటి వదలిన తర్వాత రానేలేదు. అయితే, ఆ బిడ్డకు నా జ్ఞాపకం పోదు. నెల నెలా ఐదారు రూపాయలు మనిహోండలు పంపుతూనే వున్నాడు. ఒక మూడు నెల లయిందప్పా, ఎందుకో రానేలేదు. పంపేడు." అన్నప్పుడు మరొకమారు నా వళ్లు జలదరించింది.

"అజ్జమ్మా, మీరు నిలబడే మాట్లాడుతున్నారు గదా! ఇంటికి పోదాము. మీ కుమారుడు యశ్వంతుడే నన్ను పంపించాడు. అందుకోసమే వచ్చాను. మీరు ఎలా వున్నారో చూచిపోవడానికి."

"నిజమేనా, అబ్బాయి! పుణ్యాత్ముడివి నీవు. రా" అని యింటి చావడికి పిలుచుకొని వెళ్లి, అటు ఇటు నేల సవరి, "ఒక్క పీటయినా నా చేతికి దొరకదు," అన్నది. నేను అంతలోగా వట్టి నేలమీద కూర్చున్నాను.

"నా అబ్బాయి నెమ్మదిగా వున్నాడా ? చనిపోవడానికి ముందు చూచి చావవలె - అని అనిపిస్తుంది. వాడు రావాలికదా ? వాడు ఏ రాజ్యమో, నేను ఏ రాజ్యమో. వాణ్ణి తలచుకుంటే నా గుండె కొట్టుకొంటుంది. ఈ ముసలి మొద్దు జ్ఞాపకం వాడింకా పెట్టుకున్నాడు. చాలు నాకు - అదే స్వర్గం. స్వర్గం స్వర్గం అంటే ఏమిటంటావు ? అయ్యో నాలుకా ? మీ గుర్తు పరిచయం లేకపోయినా నీవు నీవు అంటున్నాను."

"అలాగే అనాలి మీరు; మీరు పెద్దలు. నా అవ్వ వయస్సు వారు. అలా అంటేనే చిన్నవాడయిన నాకు సంతోషం."

"ఎక్కడినుండి వచ్చారు ఇప్పుడు ? నీ ఊరు ఏది ? యశ్వంతుడు నీకేమైనా కావాలా ?"

"ఆయన నా పెద్దన్నయ్య ఉన్నట్టు - సంబంధ మేమీ లేదు; స్నేహం."

"ఒక గడియ కూర్చుంటావు కదా ?"

"అందుకోసమే కదా వచ్చాను; చూచిపోవడానికి."

పార్వతమ్మ నన్ను అక్కడ వదలి, ఇంట్లోకి వెళ్లింది. నేను లేచివచ్చి,

సుబ్బడితో "నీవు వెళ్లు. నేను రావడానికి తడవవుతుందో. ఏమో! – అని చెప్పారు, అను" అని చెప్పి పంపివేశాను. వాడు వెళ్లిపోయాడు. నేను మళ్లీ అరుగుమీదికి వచ్చి కూర్చున్నాను. ఇంట్లో ఆ ముసలమ్మ ఏదో కట కట మని సద్దు చేయడం వినబడింది. రుబ్బురోలుకు చేయి వేసి ఆడించడమూ వినిపించింది. అక్కడి నుంచి గట్టిగా కేక వేశాను: "అవ్వగారూ, నా కోసం ఏమీ చేయకండి" అని గట్టిగా అన్నాను. ఆ బీదరాలి యింట్లో ఏమి వుండేని? బంధువు కాదు; బలగం కాదు. ఒకింత ఆశ్రయ మేమేనా కావాలంటే పక్కింటివారు ఇవ్వాలి. యశ్వంతరావు పంపిస్తూ వుండిన ఇరవైయయిదు రూపాయలలో, చేతికి అందిన ఐదే రూపాయలతో ఆమె జీవనం జరుగాలి. మూడు నెలల నుంచి అదిన్నీ మాయమయింది. అవన్నీ తలచుకొన్నప్పుడు నాకు దుఃఖం వచ్చింది. దుఃఖానికి తోడు మరొక భయమూ చేరింది. యశ్వంతరావుగారు బ్రతికున్నారనే నాటకం ఈమె ముందు ఆడడం సాధ్యమా? న్యాయమా?- అని. ఆ ప్రశ్న రానే వస్తుంది. నేను చెప్పకనూ వుండడం సాధ్యం కాదు. చెప్పి? 'అదే స్వర్గం' అన్నది. తాను సాకి పెంచిన బిడ్డడి ప్రీతి స్థితిని స్మరించి, అదే అమృతమయింది ఆమెకు. అది తెలిసి కూడ ఆమె ప్రీతి పాత్రమయిన వ్యక్తి మూడు నెల క్రితం కను మరుగయిందనాలా?

అరగడియలో పార్వతమ్మ నా కోసం ఉపాహారం సిద్ధ పరచుకొని వచ్చింది. దానిని చూచి దిగులుపడ్డాను. ఒక పళ్లెంలో కాల్చిన నాలుగప్పడాలు, కంచు గిండీలో ఏదో పానీయం ఇంతమాత్రం నా ముందు పెట్టి, "దూరం నుంచి అలిసి వచ్చావు. మరేమీ చేసే త్రాణ నాకు లేదు. ఒకింత పచ్చి పెసలు రుబ్బి దాహానికి సిద్ధపరచాను. తీసుకో. దాక్షిణ్యం వద్దు. పచ్చిపెసలు దేహానికి చలవ."

ఆమెనే చూస్తూ, "అప్పడాలు కాల్చారు గదా!" అన్నాను.

"అప్పడాలు ఏదో నెపం. మినప అప్పడాలు కావు; చిలగడదుంప (గెనుసు) అప్పడాలూ కావు; చేమగడ్డలు ఎండబెట్టి కాల్చిన అప్పడాలు. వయస్సయినా, నోటి రుచి అనేది వుందికదా? ఉప్పు కారం రుచి దానికింకా తెలుస్తున్నది. ఒక్కొక్క సారి నా మూకాంబు నాల్గు అప్పడాలు తన యింటి నుంచి దొంగిలించి పంపినదీ కద్దు. ఇవి నేను చేసినవో, అది చేసినవో నాకు జ్ఞాపకం లేదు."

నేను అప్పడాలు తినడం మొదలుపెట్టాను. ఇంతవరకు నేను చేమ దుంపల అప్పడాలు తినలేదు. బిరుసుగా వున్నా ఉప్పు కారంతో రుచిగానే వున్నవి. వాటిని నములుతూ ఆ కారానికి పరిహారంగా పెసర పానకం తాగుతూ అన్నాను. "అవ్వగారూ, నేను చిన్నవాడయి వున్నప్పుడు పల్లెలో ఇలాగే పెసలు రుబ్బి బెల్లం వేసి తాగే వాడిని. అది పొట్టకూ గట్టి; దేహానికీ చలవ. మీరిప్పుడు మూకాంబు అన్నారు కదా – ఎవరామె?"

"నాలాగే ఒక ముసలిది; నా తోడికోడలు. మేము రెండు దేహాలు; ఒక ప్రాణం. నీవు శంకర హెగ్గడె యింటినుంచి వచ్చావు కదూ! ఆయన అక్కను చూడలేదని అనిపిస్తుంది. మూకాంబు అంటే ఆమె" ఇలా అంటూ నాలుగు చుక్కల కన్నీరు తన కళ్ల నుంచి కురిపించింది. "చూడు అబ్బాయి, ఒక్కొక్క ఋణానుబంధం అంటే ఇలాగే. యశ్వంతునిది, నాదీ ఋణానుబంధం. తల్లీ బిడ్డలున్నట్టు. మూకాంబుదీ, నాదీ అక్క చెల్లెళ్ల ఋణానుబంధం లాగ. అయితే – యశ్వంతుని చూడక పదిహేనేళ్లయిందో, ఇరవైయేళ్లయిందో! నేను మరుస్తానా? వాడు మరుస్తాడా? మూకాంబు ఉన్నది ఇంత దగ్గర కదా? అయితే, నేను ఇక్కడే; అది అక్కడే; మధ్య దాట రాని నది."

"నది అంటే?"

"నది కాదు; సముద్రం. చూడు అబ్బాయి, నా బిడ్డ తండ్రికీ మూకాంబు తండ్రికీ దాయాదుల అన. పైకి చూపడానికైనా వారి పిల్లలు దానిని నడిపించాలి కదా! నేనున్న చోటికి ఆమె రారాదు, అని ఆమె పెద్దలు అనపెట్టారు."

"ఔనమ్మా! దాన్నంతా విన్నాను. ఆమె, అంతా నాకు చెప్పింది. మీరు యశ్వంతులను పెంచిందీ, ఆమె తమ యింటి నుంచి పాలు దొంగిలించి తెచ్చి యిచ్చిందీ, అది నాన్నగారికి తెలిసిందీ, – అంతా చెప్పారు. ఇంటి ముందున్న వెదురు పొదను చూపుతూ, ఆమె ఏడ్చింది. ఏమి చేయగలమమ్మా, వెళ్ళిపోయిన వారి లెక్కాచారానికి?"

"నీకూ తెలుసు అలా అయితే కథంతా; అయినా, నేనూ, మూకాంబు సంవత్సరాని కొకసారయినా గుడ్డెబెనకయ్య గుడిలో పూజకు వెళ్ళినప్పుడు ఒకరినొకరు చూచుకుంటాము. మా మా సుఖ దుఃఖాలు చెప్పుకొంటాము. నాల్గు చుక్కలు కన్నీళ్లూ కురిపిస్తాము – కలిసే. నాలాగే అదీ కష్టం చూసి

నట్టిది. ఇప్పుడు నానించి మొదట్లోలాగ పనిచేయడం సాధ్యమా? సాధ్య మయినంత కాలం ఇక్కడే, పై యిల్లుంది కదా, అక్కడ నా చేతనయినంత చాకిరీ చేస్తూ వుండినాను. ఇప్పుడు అది సహా కావడం లేదు. ఇక్కడికి వచ్చాను. నా మూకాంబు నా మీది మోహం మరవని దానికి, తన యింట్లో ఏదైనా కుడుములు, కజ్జాయాలు చేస్తే శంభువుతో పంపుతుంది. శంభు అది నాన్నకు తెలియకుండా తెస్తున్నాడు. చెప్పివస్తే, ఏమీ తల పోదు. ఎందుకు ఊరికే చీకాకు కలిగించాలని, సంగతి చెప్పక వస్తున్నాడు. యశ్వంతుడు పంపే మనిహాండలు తెచ్చిచ్చి, నా బొట్నవ్రేలికి సిరా తాకించి, కాయితానికి ఒత్తించుకొని తీసుకొని వెళ్ళేది వాడే. వాడూ రాలేదు – ఈ మూడు నెలలనుంచి. డబ్బు రాలేదో ఏమో!''

''అవ్వగారూ, మీకు నెలకు ఐదు రూపాయలు వస్తే ఖర్చుకు చాలు తుందా?''

''నా అబ్బాయి పంపే డబ్బు ఐదంటే ఐదు నూర్లు.''

''బియ్యానికి, బట్టలకు ఐదు రూపాయలు చాలా నెలకు?''

''ఒకపూట కదా నా భోజనం? ఒక పొద్దుకు ఎంత కావాలి? ఏడాదికి రెండు గుడ్డ ముక్కలు. ఇదీ చినుగుతూ వచ్చింది. ఇప్పుడు తడిబట్టే కట్టు కున్నాను కదా. వాడి డబ్బు వస్తే, ఒక చీర ముక్క హెగ్గడె రాముడికో, శంభునికో చెప్పి తెప్పించుకొంటే సరి.''

''అవ్వగారూ, యశ్వంతులకు మీమీద చాల ప్రేమ కదా?''

''ప్రేమా? నా గుండె గదా, నా పేగు కదా వాడు!''

''మీరే ఆయనను సాకారట?''

''నేను ఏమి సాకుతాను, బిడ్డా? ఆ దేవుడు నా చేతి మీద అంత పని చేయించాడు. నాకు తాళిభాగ్యం పోయిన మీదట, ఏ ఆశ్రయమూ వుండ లేదు. అన్న, తల్లి, ఒక్కొక్కరుగా కొండ జ్వరంతో గతించారు. కూటికి లేకుండా నేను భగవంత హెగ్గడెగారి యిల్లు చేరాను. భగవంత హెగ్గడె అంటే మన యశ్వంతుని తండ్రి. ఆయనయితే చాల మంచివాడు. నోటి దుడుకుతనం హెచ్చు. అది ఒకరొకరి పుట్టు గుణం కదూ? ఈ యశ్వంతుని తల్లి సావిత్రి కాయిలా మనిషి అంటే కాయిలా మనిషి. ఇద్దరు ముగ్గురు పిల్లలు కన్నది. చనిపోయారు వారంతా. నాల్గో బిడ్డ వీడు. తల్లికి పాలు లేవు. ఈ పిల్లడు పుట్టేటప్పుడే ఎముకల గూడు. పగలూ

రాత్రీ ఏడ్వడమే వాడి స్వభావం. వాడిని చూచుకోడానికి నే నొకదానినే. బిడ్డడికి రెండు సంవత్సరాలయ్యేవరకు వాడు బతుకుతాడని నేను అనుకోనే లేదు. ఏమైనా, బిడ్డ బ్రతికాడు. తల్లి గతించింది. హెగ్గడెగారు మరొక పెళ్లి చేసుకొన్నారనుకో. ఆ భార్యకు పిల్లలు కలుగలేదు. కలిగివుంటే మాత్రం యశ్వంతునికి ఇంకా ఎన్ని కష్టాలు వచ్చేవో.

"యశ్వంతుని నేను పెంచాననడం పెద్దమాట; దేవుడు అంతా నడిపించాడు, కాపాడాడు. యశ్వంతుడు పెద్దవాడయాడు. ఆ మధ్యనే శంకర హెగ్గడెగారి తండ్రికీ, నేను చెప్పరాని పేరిటవారు – ఆయన తమ్ముడు భగవంతయ్య గారికీ అనలు, శాప వాక్యాలూ జరిగాయి. యాదవుల కలహమే ఆరంభమయింది. భాగాలయి వేరే అయినా, దాయాది పగ నశించ లేదు. మూకాంబు పాలు దొంగిలించి ఇస్తున్నది ఆ రోజులలో, ఆ కథ పాడు కానీ."

"తర్వాత, నా బిడ్డ పెద్దదయింది. భగవంతయ్యకు తన కుమారుడు చదవాలి, చేయాలి అని అపేక్ష. ఇంటికి అయ్యవారిని పిలిపించి, పెట్టుకొని మొదటినుంచి పాఠం చెప్పించారు. చివరకు ఒకటి రెండు సంవత్సరాలు కుమటికి పంపి ఇంగ్లీష్ చేయించారు. రతిదేవివంటి పెళ్లాం ఇంటికి వచ్చింది. ఆమె ఇల్లు ప్రవేశించిన ముహూర్తం మంచిది కాదో, ఏమో! నాకు అనిపించేది అలాగు, బిడ్డడీ తండ్రీ కాలం చేశారు. మా కళ్ల ముందంతా చీకటే కమ్మింది. యశ్వంతుడు, వాడి భార్య..."

"ఆమె పేరు?"

"ఏమిటో ఉందయ్యా – నా మరుపా? కమల – అని అనుకుంటాను. ఔను! కమల. అది చూడు, నాయనా, చూడడానికి ఎంత అందంగా వున్నా, నా బిడ్డకు చెప్పుకోదగిన పిల్లకాదు. కడుపుమంట అంటే కడుపు మంట. ఉంటుంది అలాగూ ఒక్కొక్కరి పుటక! దానిది కడుపు మంట జననావస్థ! దానికి కంగాలు (ఇష్టంలేని వ్యక్తి) ఎవరు తెలుసా? అన్నం ఋణానికి ఆ యింటికి పోయిన ఈ పారోతి. నన్ను చూస్తే కమలకు నూనె సీకాయయింది. "నేను వెళ్ళిపోతాను" అంటే, "నేను ప్రాణం తీసుకుంటాను" అనే వాడు యశ్వంతుడు. ఇంట్లో ఈ సంకటమయిందా? అటు ప్రహరీ దాటితే శంకరుని తండ్రి సర్పద్వేషం! అంతా సమకూడింది. సముద్ర మథనంలో మొదట విషమే పుట్టిందట కదా. ఏమైనా ఎలాగో

యశ్వంతునికి ప్రాయం వచ్చింది. ఆ మీదట పెండ్లయింది. తండ్రి గతించారు.

"మీకు వాడి గుణం తెలీదు ; వాడు చిన్నవాడయినప్పుడూ అలాగే. వాడి చేతికి బొబ్బట్టే యివ్వు ; లడ్డే యివ్వు-వాడి ఎదుట నిలబడి 'నా బిడ్డ చిన్నం ; నా బిడ్డ రన్న ; ఒక చూరు ఇవ్వమ్మా', అంటే, ఉన్నదంతా ఇచ్చేసేవాడు. వాడి దోస్తులకు, ఊరి వారికి వాడి ఈ గుణం తెలుసు. వాడిని పొగడి, పొంగేట్టు చేసి లేని కష్టాన్ని సృష్టించుకొని, అడుక్కున్నారు. వీడు ఇచ్చాడు ; ఇచ్చాడు ; ఇచ్చాడు అంటే, ఇల్లు మునిగి పోయేవరకూ ఇవ్వడమే. ఇక, ఇంటికి వచ్చినావిడో ! ఆమే అలాంటిదే. మిగులూ బొగులంతా పుట్టింటికి సాగించింది. ఈ ఊళ్ళో అప్పు పెరిగింది. అంత పంట పండినా, అదంతా పోయి అప్పుల వాళ్లందరు వచ్చి కుత్తుకపై కూర్చున్నారు. అప్పుడు ఊరు విడిచి వెళ్ళిపోవలసి వచ్చింది – ఉన్నదంతా అడమానంపెట్టి. నేను ఇంటిస్థలం మాత్రం అమ్మివేయ వద్దు అన్నందుకు, అమ్మలేదు. మిగిలినదంతా పక్కింటి రామహెగ్గడెగారి తండ్రి కొన్నారు. కొన్నారో, అప్పు డబ్బుకు వజా అయిందో ! ఇచ్చేటప్పుడు నా కొడుకు "ఈ పార్వతికి ఆమె బతికున్నంత కాలం ఒక యింటి స్థలం విడిచిపెట్టాలి" అనే షరతుతో యిచ్చాడు. నా యశ్వంతునికి నన్ను వదలిపెట్టి వెళ్లడానికి ఇంతైనా మనస్సు లేదు. నేను వెళ్లితే వాడి రతి ఏమి చేస్తుందని నాకు తెలీదూ ?

"ముఖ్యమయిన విషయం – నాకు ఋణం లేదు ; బిడ్డడు నా భాగ్యంలో లేదు. వాడు కుమటికి పోయాడు. ఇక్కడంతా పోగొట్టుకొన్నా, అక్కడి వ్యాపార సాహరాలు చేసి చెడలేదు. ఏలాగో సంసారం చేస్తూ వున్నాడు. ఉన్నాడంటే ఏమిటి ? బతికున్నాడు. సంవత్సరం రెండు సంవత్సరాల కొకసారి ఇక్కడికి వచ్చి నాకు బియ్యం, బట్టలు ఇచ్చి, "అమ్మా, నాకు దేవుడు, సంసారం అనేదంతా నీవే. నా భార్య స్వభావం నీకు ఎప్పుడూ తెలుసు కదా ! అది నా పూర్వజన్మపు పగ. ఆ పగ తీర్చుకొనడానికే జన్మ ఎత్తింది నా భార్యగా" అని చెప్పి ఏడ్చాడు. అదీ ఒక పుటక. వాడికి నలుగురు పిల్లలు పుట్టారు. వారినుంచైనా వాడికి సుఖం కలుగుతుందని అనుకున్నాను. బ్రహ్మ వాడికి వ్రాయలేదు – ఆ యోగం. తల్లీ పిల్లలూ ఒకటయ్యారు. ఒక ఇరవయ్యయిదు సంవత్సరాలు యిక్కడున్నాడు ; అక్కడా

అన్ని సంవత్సరాలే గడిపాడు. ఆ మీద ఉన్న పళంగా వెళ్లిపోయాడు. పాండవులు వనవాసానికి పోయినట్టు పోయాడు. అలా వెళ్లిపోవడానికి ముందు ఇక్కడికే వచ్చాడు. చెప్పాడు తన కథంతా. కథ ఏమిటయ్యా అంటే, మొదటి కథే; కొత్త దేమీ కాదు. "సంసారం నాకు చాలు. ఆ సుఖం ఇక వద్దు. ఎక్కడికైనా వెళ్ళి నిశ్చింతగా బదుకుతాను" అన్నాడు. "నాతోపాటు ఉండవచ్చు గదా, బిడ్డా" అన్నాను. "అమ్మా నేనే నిన్ను పిలుచుకొని వెళ్ళి కాపాడవలసింది. దానికి మారు నీవు నన్ను కాపాడ డమా? నేను దూరంగా వుంటాను. నేను ఉండనీ, ఉండకపోనీ ఇంత వరకు నేను మనుష్యుణ్ణని అనిపించుకొన్నానంటే అది నీతోనే" అని చెప్పి వెళ్లిపోయాడు బిడ్డ. ఆ మీదట రాలేదు పుణ్యాత్ముడు."

ఒత్తుకొని వస్తున్న దుఃఖాన్ని ఆపుకొనేట్టు ఆమె కొంచెంసేపు ఊరికే వుండి, తర్వాత మళ్లీ చెప్పసాగింది. "ఆ బిడ్డ ఎక్కడైనా వుండనీ. వాడు నన్ను మరుస్తాడా? నేను వాడిని మరుస్తానా? మా దేహం వుండనీ వుండక పోనీ; జ్ఞాపకం మిగులుతుంది. నా కళ్ల ముందు ఆ బిడ్డ కనిపించని దినమే లేదు."

కొంతసేపటి తర్వాత ఆమె నాకు యశ్వంతుని పెక్కు బాల్య చేష్టల కథలను వర్ణించింది. ఆ తల్లి వాటిని చెబుతుండగా, ఆమె ఆ బిడ్డడు మూడు నెలల ముందే కనుమరుగయ్యాడు – అని చెప్పే భారం నన్ను పీడించింది. దానికి మారుగా నేను "అమ్మా, నాకు మీ పెంపుడు కొడుకు పరిచయం కేవలం ఐదారు సంవత్సరాలది. ప్రతి సంవత్సరం నేను రెండు సార్లు బొంబాయికి వెళ్లినప్పుడు, ఆయనను చూచేవాడిని. చివరిసారి ఆయన నాతో ఒక కోరిక చెప్పారు. నాకు కొంత డబ్బు పంపించారు. పార్వతమ్మకు ప్రతి నెలా ఇరవయ్యయిదు అందజేయాలి – అన్నారు" అన్నాను.

"వాడికి డబ్బు పొగరుందిలే."

"అలా కాదమ్మా, ఆయన ఇచ్చిన డబ్బు, మీకు యివ్వాలని చెప్పి యిచ్చింది; నేను దానిని మీకు అందజేయవద్దా?"

"వాడికి అలా అనే వ్రాయి; నేనే అలా చెప్పానని వ్రాయి."

"ఆయన యిప్పుడు లేరమ్మా."

"ఇప్పుడు లేరు అంటే?"

"అందరూ నూరు నూరు సంవత్సరాలు బతుకుతారా?"

"నా బిడ్డడు?"

"మరణించి మూడు నెలలయింది."

అక్కడికి స్తబ్ధ మయింది నా సంభాషణ. నేనూ మాట్లాడ లేకపోయాను; ఆమే మాట్లాడలేదు. మా యిద్దరి గొంతుకలను ఒక గడియ మౌనం కట్టి వేసింది. ఆమె ఏమి చెప్పేదో, నేను ఇంకా ఏమి వినాలో - అనే వ్యధ నాకు. నా మిత్రులను స్మరించి నా కళ్లు ధారాపాతంగా నీళ్లు కురిశాయి. ఆమె అది చూచింది; నన్నే చూచింది. ఏమో చెప్ప గోరింది. కొంచెంసేపు ఆగి, చివరకు అన్నది:

"నాయనా, నీకు ప్రాయమెంత చెప్పు."

"యాభై దాటిందమ్మా."

"నీకన్నా నేను ముప్పై సంవత్సరాలు పెద్దదాన్ని. నేను పెద్ద దాన్నని నీవే అన్నావు కదా. వయస్సులో నన్నా నేను నీ కంటే పెద్దదాన్ని కదా?"

"వయస్సులోను, అనుభవంలోను, అన్నిటిలోను."

"అలా అయితే విను. నీటి మీది బుడగ అనేది ఈ బదుకు. అది స్థిరమా? ఎందుకు ఏడ్వడం నీవు? నీ స్నేహితుడు యశ్వంతుడు చచ్చిపోయాడనా? ఎవరు చావలేదు? పాండవులు చచ్చారు. కౌరవులూ చచ్చారు. ఎవరు చావలేదు. చెప్పు? ఈ దేహం చినిగిన మాసిన చొక్కా. చొక్కా చినగదా? చినిగిన చొక్కా తొడిగి జీవుడు వుంటాడా? యశ్వంతుని చొక్కా చిరిగింది. రేపు ఈ నా చర్మాస్థుల పంజరమూ నశించిపోతుంది. రేపు గడిస్తే, నీకూ అలాగే."

"నిజం కాదూ!"

"నిజం అన్నది మనస్సుకు పట్టించుకొంటే పట్టించుకోవాలి. అలా పట్టించుకోని వాడు మనుష్యుడు కాడు. యశ్వంతుడు చావలేదు; చావడు; ఇప్పుడూ నా కళ్లముందున్నాడు. చచ్చినది వాడి చినిగిన చొక్కా. నా బిడ్డను దేవుడు తన వద్దకు పిలిపించుకొన్నాడు. అతనికి వీడు కావాలనిపించింది. ముసలిదానినైన నేను "నేను వస్తాను" అని వాడిని వేడుకున్నా, "తాళు, నిలు, నేను పిలిచినప్పుడు రా", అంటాడు - ఆ నా దేవుడు. వాడు పిలవాలి కదా! వాడు పిలవలేదంటే మనం దుఃఖపడాలి; పిలిచినందుకు ఏడ్వకూడదు."

"ఔను తల్లీ. అలాటి దృష్టి అందరికీ రావడం కష్టం."

"తెచ్చుకోవాలి. అలా అయితే ఇప్పుడు నా బిడ్డ లేదు."

"మూడు నెలల కిందటే బొంబాయిలో మరణించారు. నేను ఆ సమయానికి వెళ్లాను. నాకు తంతి వచ్చింది. నా స్నేహితులు కావడం వల్ల వెళ్లాను. వట్టి శవాన్నే చూచాను. ప్రాణాలతో చూడడం కాలేదు."

"దానికీ ఋణం కావాలి."

"ఔనమ్మా, నిజం. అంతా ఋణానుబంధమే. అలా అయితే నేనిప్పుడు కొంచెం డబ్బు తెచ్చాను గదా - మీకు ఇవ్వడానికి. ఆయన ఇచ్చిన డబ్బు; ఇవ్వాలి కదా. ఆయన ఋణం నేను పెట్టుకోరాదు కదా!"

"నేను డబ్బు తీసుకొని ఏమి చేయను, నాయనా? ఐదు పది ఇస్తే తీసుకొనేను."

"నేను నా దగ్గర పెట్టుకొని ఏమి చేయను? నాకు సంపాదన వుంది; నాకు ఆయన డబ్బు వద్దు. మీకు చెప్పనా తల్లీ - నేను ఆయన కులం కాదు; మరొకటి కాదు. మరణించేటప్పుడు, నావద్ద కొన్ని వేల రూపాయల ముడుపు అప్పగించి, నీకు తెలిసిన మంచి పనులకు ఖర్చుచేయి - అని జాబు వ్రాశారు. ఇలాంటిదే చేయి - అని చెప్పి వుంటే నాకు చింత వుండేది కాదు. అదిప్పుడు నాకు కష్టమయింది; ఏమి చేయను?"

"నిజం చెబుతున్నావా?"

"అమ్మా, ఇక్కడికి వచ్చి మీముందు అబద్ధం చెప్పాలా నేను?"

"నాకొక ఆలోచన?"

"ఏమిటి చెప్పండి?"

"వాడు ఇరవయ్యయిదు ఇమ్మన్నా నాకు ఐదే చాలు. అప్పుడు నెలకు ఇరవై మిగులుతాయి కదా!"

"మిగులుతాయి."

"దానినుంచి ఆ బిడ్డ పేరుతో ఒక పని చేయించవచ్చునో ఏమో!"

"ఏమిటో చెప్పండి."

"మా గుడ్డె బెనకయ్య దేవాలయానికి దిక్కులేకుండా వుంది. ఈ ప్రాంతానికంతా ఉండేది అదొక దేవాలయం. మొదట్లో నూరారు బ్రాహ్మణుల ఇళ్లుండేవి యిక్కడ. ఇప్పుడు పది ఇళ్లూ మిగలలేదు. అందరూ స్థితి చెడి వెళ్ళిపోయారు. ఎందుకు తెలుసా? వారు బెనకయ్య

చేయి వదిలారు. దేవుడు వాళ్ల చేయి వదిలాడు. లేకపోతే బెనకయ్య గుడి అలా వుండేదా? నాలుగు వైపులా పెరిగిన తుప్పలను తీసివేసేవారు లేరు. పక్కలు విరిగిపోయి, కప్పు కుసిపడిపోయి, గోడ పడిపోయినా బెనకయ్య అక్కరలేదు మా వూరివారికి. పేరుకు మనం బ్రాహ్మణులం అని అను కుంటాము. ఏ బ్రాహ్మణ్యమో? దేవుడు లేని బ్రాహ్మణ్యం ఉంటే నేమి? లేకపోతే నేమి?"

"అమ్మా, కోపగించుకోరాదు; దేవుడున్నాడా? – అనే సంశయం నాకూ వేయిసార్లు వస్తుంది."

"నీవూ నా యశ్వంతుని జాతివాడివి – అలా అయితే."

"అంటే?"

"యశ్వంతుడు నూరు సార్లు అదేమాట అన్నాడు – నావద్ద. వాడు పడిన కష్టం అటువంటిది. దేవుని మీద విశ్వాసం వానికి పోనేపోయింది. పోయింది అంటే పోలేదు."

"ఏమి చెబుతున్నారు? - నాకు అర్థం కావడం లేదు కదా."

"అది ఇలా నాయనా, దేవుడున్నాడని నమ్మినవాడికి వాడున్నాడు. వాడిని నమ్మడమంటే, వాడినుంచి మన చాకిరీ చేయించుకొనడం – అని అర్థంకాదు. 'నాకు అది ఇవ్వు; ఇది యివ్వు; ఇస్తే నీవు మంచివాడివి; లేక పోతే లేదు.' అనడం దేవుడున్నాడనే వారి లెక్కాచారం కాదు. బెనకయ్య గుడిలోనే దేవుడున్నాడు; మరెక్కడా లేడు – అని చెప్పడమూ కాదు. తెలిసినవారు చెప్పారు – వాడు అన్నిచోట్లా వున్నాడు - అని. ఆ లెక్కలో అంతా దేవుడే; అన్ని జీవులూ దేవుడే. ఆ జీవి, ఈ జీవి అనే వ్యత్యాసం ఉండనేకూడదు. మనలోను, మరొక జీవిలోనూ దేవుడున్నాడు – అని నమ్మి, అలా నడచుకుంటే, దేవుడున్నాడు అనడాని కొక సార్థకం. వూరికే ఉన్నాడు అంటే కాదు."

"నిజం. ఇప్పుడు నేను తెచ్చిన రూపాయలు మీకు ఇచ్చి, శంకర హెగ్గడె గారి ఇంటికి భోజనానికి వస్తానన్నాను – వెళ్లనా?"

"ఒక పిడికెడు అన్నం తిని ఆమీద పోదూవంట! ఇక గడియలో అన్నం, చారు ఉడికించి వేస్తాను. ఇంటికి వచ్చిన వారికి ఒక ముద్ద అన్నం వడ్డించాలి, నీవు తినాలి."

"వద్దు తల్లీ." అని, రూపాయలు ఎంచబోయాను.

"నీ రూపాయలు నేను ముట్టుకోను."

"నావి కాదమ్మా.... మీ కుమారుడే ఇచ్చింది. మీరు తీసుకోకపోతే, మీ కుమారుని సంతోషానికి ఏమి చేయాలో - మీరే చెప్పండి."

"నీదీ ఒక హఠం."

"మీ హఠంలాగే."

"మొదట భోజనం చేయి. తర్వాత చెబుతాను."

రెండు గడియలు గడిచింది. ఆమె వంట చేసింది, నేను ప్రీతితో మృష్టాన్న భోజనం చేయడానికి, ఆమెకు సంతోషం కలుగడమేమో నిజం. అయితే, ఆమె భోజనం చేయలేదని తెలియని నేను "ఇక చెబుతారా?" అని అడిగాను.

"నేనూ, నీవూ, అందరూ ఒక గడియకోసం వచ్చి వెళ్లేవాళ్లం. అయితే ఈ మనుష్య మనేది అలా కాదు చూడు. నీవు నీ తండ్రి ఉండేవారు; అలాగే వెనక్కు వెనక్కు వెళ్లుతుంది. అలాగే రేపూ నీ సంతానం ముందుకు పోతూ వుంటుంది. నీవూ, నేనూ లేకపోయినా, మనం నమ్మింది మాత్రం మిగులుతుంది. బెనకయ్య చూచావా, మేము నమ్మినట్టి దేవుడు. యశ వంతుని తండ్రి తాతలు వాడిని నమ్మినవారు. వాని యిల్లు నష్టమైపోయినా, కులం మిగిలింది కదా! వాళ్లకు కులదైవం వాడే. వాడిని మనం మరువ రాదు - అని అనిపిస్తుంది."

ఆమె డొంక తిరుగుడు మాటలలో సుప్తమయిన అపేక్ష తనంతట తానే సూచితమవుతున్నప్పుడు నేను ముందు వెనుకలు చూడలేదు. నా మిత్రుల జ్ఞాపకం భద్రపరచడానికి ఆయన పెంపుడు తల్లి అత్యంత ప్రీతికరమయిన కోరికను తీర్చడంకన్న పెద్ద కర్తవ్యం లేదని నిర్ధరించి "అమ్మా, మీరు ఇక ఏమీ చెప్పనక్కర లేదు. మీ అపేక్ష ఏమిటని నాకు తెలిసింది. మీ యశ్వంతుని డబ్బు మీకు కాని డబ్బు కాదు. ఆ ఇరవై మాత్రమే కాదు; అదెంతయినా కాని, రూపాయల ప్రశ్నే వద్దు. మీ పెంపుడు కుమారుని పేరుతో బెనకయ్యగుడి జీర్ణోద్ధారమయితే చాలా?" అని అడిగాను.

ఆ మాటలకు ఆమె ఆశ్చర్యపడింది. ఆమెకు నమ్మడానికి కష్టమని పించిందో ఏమో! నేను ఆమెకు భరోసా కలిగిస్తూ, "అమ్మా, నేను దీని వ్యవస్థ ఏదైనా చేసేవరకు ఈ వూరు వదలను. మిమ్మల్ని ప్రతి దినమూ

చూచి పోతూ వుంటాను. ఏమీ యోచన చేయకండి. మీరు పెంచిన బిడ్డ పుణ్యంతో బెనకయ్య గుడి మొదటిలాగే కావచ్చు. వెళ్ళండి. మీరు భోజనం చేయలేదు. చేయండి'' అన్నాను. ''ఈ దినం ఎలా భోజనం చేయడం? దానికి మారు నా బిడ్డ పేరుతో నాలుగుసార్లు దేవుని నామ జపం చేస్తాను.'' అని ఆమె లేచి నిలబడి, నన్ను వీడ్కొల్పింది. ఆమెను చూస్తూ చూస్తూ శంకర హెగ్గడెగారి యింటి దారి పట్టాను. నా మనస్సులో - రెండు రెండు శిథిల దేవాలయాలు కనిపించాయి. బెనకయ్య రాతి మట్టి గుడి ఒకటి; ఎముకలు మాంసాల గుడి మరొకటి. ఆ మరొక గుడి దేవతే పార్వతమ్మ. ఈ విషయమే నా మనస్సంతా నిండి, సంతుష్టి కలిగిస్తూ పోతున్న కొద్దీ, ఒకదాని కొకటిగా, నా మిత్రులు గీచిన ఆ ఒక చిత్రం జ్ఞాపకం వచ్చింది. దానిని చూచినప్పుడు నా మనస్సులో విశేషమయిన ఏ భావమూ పుట్టలేదు. ఆయన కాండాలాలో వున్నప్పుడు చూచిన దృశ్యం గీచివుంటారని తర్కించు కొన్నాను. ఆ చిత్రంలోని వస్తువు మరేమీ కాదు - తెల్లని బక్క ఆవొకటి పచ్చిక బీడులో నిలబడివుంది. దాని వద్ద దానికేమీ సంబంధం లేని ఒక దూడ నిలబడి వుంది. దాని దూడ కాదు; ఆవు దూడ కాదు; గేదె దూడ. అది ఆ ఆవు పొదుగు లాగుతున్నది. ఆవు దాని ఒళ్లు నాకుతున్నది. దూడను నల్ల రంగులో వేసినందున అది గేదె దూడవలె నాకు కనిపించి వుండాలి - అనుకొన్నాను. కొంచెం ముందు చూచిన పార్వతమ్మ జ్ఞాపకంతో నా కల్పనే వేరే అయింది. అది యశ్వంతుల ఆత్మ కథనం. పార్వతమ్మే ఆ ఆవు; దాని పక్కని గేదె దూడ యశ్వంత బాలకుడు. తనది కాని దూడలు, తనదానికన్న హెచ్చు మమతతో చూచిన పార్వతమ్మ వాత్సల్య భావానికి ఋణపడి నా మిత్రులు ఆ చిత్రం రచించారు - అని అని పించింది. అది నిజమో, కాదో, నాకు మాత్రం నిజమే ననిపిస్తున్నది. మృగాలయాలలో తల్లిపాలు లేని పులికూనలను కుక్క చన్ను గుడిపి సాకుతాయి. స్త్రీలో నిండిన మాతృభావం అద్భుత వస్తువు. ఆ భావ ప్రకటనకు అవకాశం లేకపోతే, ఆమె జీవితమే వట్టిపోతుంది. పిల్లలు లేని నిర్భాగ్యురాలు ఆ పార్వతమ్మ. యశ్వంతులకు తల్లి వున్నప్పుడే, ఆమె అస్వాస్థ్యంవల్ల ఈమె ఆయన సాకుడు తల్లి అయింది. తల్లి కన్నా ఎక్కువ యింది. తల్లి మరణించిన తర్వాత ఈమే నిజమయిన తలి అయింది. అలాటి జ్ఞాపకం ఆయన మరువలేదు. ఆయన తక్కిన పలువురిలాగ

ఆమెను మరచి వుండవచ్చునో ఏమో! అయినా మరువలేదు. అది ఆయన లోని దొడ్డతనం.

ఊరికి వెళ్లిన తర్వాత నేను ఆ చిత్రాన్ని ఎన్నో సార్లు తీసి చూచినా, యశ్వంతుల ఆ దొడ్డతనపు గుణం మరపునకు రాదు. అలాటి వాని జీవితంలో ఎంతో చేదు నింపిన భార్యా పిల్లల విషయంలో నాకు ఆదరం కలుగలేదు. నేను యశ్వంతుల పక్షం వహించాను. ఆయన వైపు కథ మరొకటి వుండవచ్చు. నాకు, ఎలా తెలుస్తుంది? తెలుసుకొనే ప్రయత్నం చేయాలి. తెలుసుకొనడానికి వీలుగా పార్వతమ్మ ఎన్నో సమస్యలను విడిపించి యిచ్చింది. కుమటిలోని ఆయన బంధువుల సంగతి శంకర హెగ్గడెగారి కన్నా ఆమెకే ఎక్కువగా తెలుసు. నేను 'జలజ' ఎవరా అని తల గోక్కున్నాను. జలజ అంటే కమల; కమల అంటే యశ్వంతుల పత్ని – అని పార్వతమ్మ చెప్పింది.

## ఆరు

ఊరికే పార్వతమ్మను చూచి ఒకటి రెండు గడియలలో మళ్ళిపోదామని వచ్చిన నేను మూణ్ణాళ్ళకాలం బెనకనహళ్ళిలో గడప వలసి వచ్చింది. దానినుంచి లాభమే కాని, ఎలాటి నష్టమూ కలుగలేదు; మానవ స్వభావం తెలుసుకొనే సుందరమయిన అవకాశం ఒదిగించింది. అవకాశమేమో సుందరమయిందే; కాని, దానివల్ల తెలిసిన మానవ స్వభావాలన్నీ సుందర మయినవని కాదు. శంకర హెగ్గడెగారి యింటికి తిరిగి వచ్చాను. ఆయన సంతృప్తికోసం ఆయనతో మాట్లాడుతూ కూర్చున్నాను. "అంతసేపు ఆ ముసలిదానితో మాట్లాడవలసిందేమిటి?" అని అడిగారు. ఆయనకు నేను సమాధాన మివ్వాలి కదా! పొద్దూ పోయింది ఒక తప్పు; ఆయన యింటికి భోజనానికి తిరిగి రాకపోవడం మరొక తప్పు. ఆ మీద, యశ్వంతరావు గారు మరణించిన వార్తను ఒకచోట చెప్పి మరొకచోట చెప్పకపోవడం కూడదు కదా. అందువల్ల ఆయన సంతృప్తికి సమాధానమిస్తూ, "మరేమీ లేదు. ఆ అవ్వగారిని చూస్తే మీ అక్కగారిని చూచినట్లే ఆదరం కలిగింది.

మాట్లాడించాను. యశ్వంతరావుగారి బాల్యం గురించి ఆమెను అడుగుదామని, ప్రశ్నలు అడుగుతూ కూర్చున్నందున పొద్దుపోయింది. పాతకాలం మనిషి కదా! ఆమె మాటలూ పొడువు. మనసు వస్తే నాకూ కొంచెంగా, పొట్టిగా మాట్లాడే అభ్యాసం లేదు'' అన్నాను.

దానికి ఆయన ''నిజమే. ఆమెకు ఆ సంగతంతా తెలుసు. తెలుసును అంటే ఏమిటి? యశ్వంతుని పెంచి పెద్దచేసిందే ఆమె. మేము అన్నదమ్ములయినా, నా తండ్రిగారికీ, అతని తండ్రిగారికీ విహితం లేదు. మాలో మాకు నూనె సీకాయ.''

''మీ అక్కగారు ఆ సంగతి చెప్పారు కదా!''

''ఇప్పుడు ఎక్కడున్నాడట యశ్వంతుడు? ఎలా వున్నాడు? ఆరోగ్యం బాగుందా? ఇల్లు వదలిన తర్వాత వేరే ఏ వృత్తి అయినా చేసుకొని నాలుగు రాళ్లు మిగుల్చుకొన్నాడా?'' అని అడిగారు ఆయన.

''ఆయనకు డబ్బు మీద ఎక్కువ మోహం లేదు.''

''అందువల్లనే కదూ ఇక్కడ అంతా పోగొట్టుకొన్నది అతడు. పోగొట్టుకోకుండా వుంటే, ఇక్కడినుంచి వెళ్లిపోవలసి వచ్చేదా? అదలా వుండనీ. అతని ఆరోగ్యమయినా బాగుందా?''

''ఇక ఆరోగ్యానికి ఎలాటి బాధా కలుగేట్టు లేదు.''

''అంటే?''

''చచ్చిన వారికి జబ్బు వస్తుందా?''

''ఏమిటి? యశ్వంతుడు చచ్చిపోయాడా? నిన్న ఆ సంగతి చెప్పనే లేదే-అడిగినా.''

''అదొక సంతోష వార్తా చెప్పడానికి?''

''మాకు సూతకం (మృతాశౌచం) వుంది కదా. వాడు చనిపోయాడా? ఎలాగు? ఎక్కడ?'' అంటున్నప్పుడు, ఆయన మనస్సులో పూర్వుల విద్వేషపు కసురు మిగిలినట్టు కనిపించలేదు. లేచారు. లోపలికి పరుగున పోయి, ''అక్కా, అక్కా'' అని ఆమెను పిలిచారు. గట్టిగా ''మన యశ్వంతుడు చనిపోయాడట కదా!'' అని అనుకున్న మాటా నాకు వినిపించింది. (చాల సేపు ఆయన వెలుపలికి రాలేదు. వచ్చినప్పుడు, అక్కతో పాటు వచ్చి కూర్చున్నారు. అక్క మూకాంబిక తల వంచుకొని కూర్చుని, ''మీకు కష్టమయి, నిన్న ఈ సమాచారం తెలుపకుండా కూర్చున్నారు – అని అనిపిస్తుంది.

నేను అంతగా కథంతా చెప్పిన మీదట, విని మీకు ఇంకా ఎంత సంకట మయిందో ఏమో! మేము దాయాదులం. మీరు స్నేహితులు. అంతే మనలో వ్యత్యాసం. పార్వతికి చెప్పి వచ్చారా ఈ సంగతిని? చెప్పకుండా ఉంటేనే బాగుండేది. అది పెంచిన బిడ్డ కదా!'' అది ఉద్గారు వెళ్ల గక్కారు.

''చెప్పక పోవడం ఎలాగమ్మా? చెప్పవలసిన వారికంతా చెప్పాలి గదా!''

''చెప్పారా? ఎలాటి పని చేశారు? ఇక నాలుగు నాళ్లయినా అది బతుకదు. నాకు తెలుసు'' అని తటాలున అక్కడినుంచి వెళ్ళిపోయారు. ముఖం తీరా చప్పబడిపోయింది.

''ఎక్కడికి? ఎక్కడికి? అని తమ్ముడు అడుగుతుండగా, ఆమె, ''నీకు బుద్ధి ఇంతయినా లేదే? ఈ వేళకు దానికి ఎవరున్నారు? ఇంకెవరు మిగి లారు? నాకు ఏమి పాపం వచ్చినా రానీ. ఇన్నాళ్లూ నాన్న అనలు – ఒట్లు నడిపించింది చాలు'' అంటూ వెళ్లనే వెళ్ళింది. ఇక గత్యంతరం లేక ఆమె తమ్ముడు ఆమె వెంటే వెళ్ళి, ఆమెను అక్కడచేర్చి వచ్చారు. ఆ రాత్రి ఆమె ఇంటికి తిరిగి రాలేదు. అక్కడ – ఎవరు ఎవరిని సమాధిశ్వాస పరచి వుంటారని నేను కూర్చున్న చోటే ఊహించగలను?

ఇంతసేపూ మానించి తల మరుగు చేసుకొన్న శంభు తన అత్తయ్య, నాన్న ఇద్దరూ వెళ్ళిపోయిన తర్వాతనూ వెలుపలికి ముఖం చూపలేదు. నేనే అతన్ని పేరు పెట్టి పిలిచాను; దగ్గరికి రమ్మన్నాను. అతని భార్య భర్తను వెలుపలికి తోసిన తర్వాతే అతడు నా వద్దకు వచ్చినట్టు కని పించింది. ''రండి, రండి. విసుగుగా వుంది. బెనకయ్య గుడివరకు వెళ్ళి వద్దాము'' అన్నాను.

''సూతకం వార్త చెప్పారు గదా?''

''సూతకం నాకు కాదు; మీకు. మీరు దూరంగానే నిలబడండి'' అని పిలుచుకొని వెళ్ళాను. వచ్చిన దారినే వెళ్ళాము. శంభు ముఖం ఎత్తకుండానే, నా వెనుకే పులి ఆజ్ఞకు భయపడి వచ్చే ఆవు లాగ అనుసరించాడు. పగ లంతా ఎండ పడడం వల్ల ఆ సాయంకాలం, నేను వెనుకటి దినం నడిచి వచ్చిన నరకపు దారి అంతేమీ యిబ్బంది కలిగించలేదు. ఇద్దరం ముందుకు వెళ్ళాము. గుడి రాగానే అతడు దూరంగా నిలబడ్డాడు. నేను ఆ గుడికి

ప్రదక్షిణంగా వచ్చాను. తర్వాత ఎదుట వచ్చి నిలబడ్డాను. లోపల ప్రవేశించి చూచాను. గుడి నవరం మంటపంలో పడ్డ ఆవుల పేడ కళ్ల రాశిని ఎవ్వరూ తీసివేసిన వారు లేరు. ఆ బెనకయ్య పాటు చూచి ఎవరికైనా దుఃఖం కలుగు తుంది. వాడి నీడలో బతికిన పార్వతమ్మ జీవం దుఃఖ పడి సొరిగి పోవడం చక్కగా ఊహించగలను. ఆ గుడిని పడగొట్టి కొత్తది కట్టదలచినా రెండు మూడు వేల రూపాయల కన్నా హెచ్చు అవసరం వుండదు. చేయవలసిన పనే; నా కోసం కాదు; నా మిత్రుల కోసమూ కాదు; పార్వతమ్మ భక్తి కానుక కోసం. ఆ గుడి జీర్ణోద్ధారమయింది చూచి ఆమె శాంతితో మరణిస్తే, యశ్వంతరావుగారే ఆమె శ్రాద్ధం చేసినంత సత్కార్య మయ్యాని!

అక్కడి నుంచి ఇద్దరమూ ఇవతలికి వచ్చాము; వచ్చిన తర్వాత, "ఏమి స్వామీ! మీ వూరిలో వున్నది ఇదొక గుడేనట. పది పన్నెండు బ్రాహ్మణులయిళ్లయినా యిక్కడ లేవూ? సంవత్సరానికి ఒక్క మారయినా, ఇక్కడికి మీరంతా వస్తారా?" అనడిగాను.

"అలా అంటే ఏమిటి? బెనకయ్య గుడికి రాకుండా వుంటామా? మా కులదేవత ఈ బెనకయ్య" అన్నాడు శంభు.

"అయితే, మీ కులం పశువులది."

"అంటే?"

"చూడండి, అక్కడ పడివున్న పేడ కుప్పను? ఆ గుడి కప్పు చూడండి."

"ఏమి చేయను? దానికి సర్కారునుంచి తస్దీకు లేదు. ఊరి వారు మనస్సు చేయడం లేదు; మే మొక్కరమే దానిని కట్టించడానికి అవుతుందా?"

నేను కొంచెంసేపు అతని ముఖమే చూచాను. చూడగానే, అతని కలవరమూ ఎక్కువయింది. "మా నాన్నగారి దగ్గర ఏమీ చెప్పరాదు," అని అడుక్కున్నాడు.

"ఆ మాట మీకు ఇచ్చాను కదా! చూడండి. మీరు తిన్నది పార్వతమ్మ డబ్బు. అందువల్ల మీకు మంచిది కాజాలదు. ఆమెకు ఈ గుడి జీర్ణోద్ధారం కావాలనే ఆశ వుంది. ఆ టప్పా బంట్రోతు తిన్నది పోనీండి. తిన్నది పోయింది. మీరూ, మీ పిల్లలూ బాగుండాలంటే అదెంత డబ్బో లెక్క కట్టి ఇక్కడికి చెల్లించండి" అని ఆజ్ఞాపించాను.

"సరే. చెల్లిస్తాను."

"అంతే కాదు. మీకూ మంచిదయ్యాని; ఇది అంతేమీ పెద్ద గుడి కాదు. మీ వూరి వారు డబ్బు ఇవ్వనీ, ఇవ్వకపోనీ. మీ పినతండ్రి యశ్వంత రావుగారి డబ్బు కొంత నా వద్ద వుంది. దాని నుంచి నేను, తక్కువ పడే డబ్బు యిస్తాను. మీరూ మీ నాన్నగారూ ఒకే ఒక సంవత్సరంలో దీనిని జీర్ణోద్ధారం చేయించాలి. డబ్బు జవాబ్దారీ నాది. వచ్చే వినాయకచవితి ఇక పది నెలలుంది. అంతలోగా ఇది జరగాలి. ఆ దినం పార్వతమ్మ చెప్పే విధంగా ఇక్కడ పూజ, సంతర్పణ జరుగాలి – అని శాసించి, అన్ని వివరాలూ అతనితో చర్చించాను. అతని మనస్సూ చులకనయింది. తన పాప పరిహారానికి ఇదే తగిన సందర్భమనీ గ్రహించినట్టు కనిపించింది. అక్కడినుంచీ ఇద్దరమూ ఇంటికి తిరిగి వెళ్ళాము. శంకర హెగ్గడెగారితో ఇదే ప్రస్తావించాను. స్వంత డబ్బు విషయంలో ఆయన కొంచెం బిగువుగా కనిపించినా, నా సలహాను గౌరవించారు. "రేపు మీరు ఇక్కడే వుంటారు కదా! ఊరి వారిని పిలిపిద్దాము; దిగువ ఇంటి వారినీ పిలిపిద్దాము. మీ ముందే ఒక ఇత్యర్థం (నిర్ణయం) జరుగనీ" అన్నారు.

"ఎవరు చేరనీ, మానుకోని; ఇంత పనీ చేయించే బాధ్యత మీది. తక్కువ పడే డబ్బు యిచ్చే బాధ్యత నాది" అని చెప్పిన మీదట "కానీండి" అన్నారు ఆయన. "ఈ దూరపు వ్యక్తి వచ్చి రేపు గుడి పని ముగిసిన మీద డబ్బుకు నామం పెడితే ఏమిటి గతి?" అనే సంశయం ఆయన మనస్సులో; అపరిచితుడయిన నా విషయంలో అంకురించవచ్చు. అందుకోసం నేను ఊరికి వెళ్ళగానే ఇన్నూరు మున్నూరు రూపాయలు తక్షణం పంపిస్తున్నాను" అని చెప్పాను.

"ఆ రాత్రి మేము అప్తులయిన మిత్రులులాగ, పెక్కు పాత విషయాలను గురించి మాట్లాడాము. శంకర హెగ్గడెగారి మనస్సులో, తమ అక్క పెద్దల వచనం మీరింది. అంటే పార్వతమ్మ యింటికి పోవడం, మంచిదా కాదా అనే కొరత చాలా పీడించింది. నేను వారిని సమాధాన పెడుతూ ఇలా అన్నాను "మన పెద్దలు చేసిన మంచి సంప్రదాయాలను మనం పెట్టుకోవాలి. నిజమే. కాని, తప్పులు కాపాడుకోడం కాదు. కుమారుల తప్పును మూగగా అనుభవించిన ధృతరాష్ట్రుని పాట్లేమయాయి చెప్పండి? అంతకూ వాడు పెద్దవాడు. ఇలాటి అనలను మోసిన ఇళ్లను, జనాన్ని

నేను చాలగా చూచాను. దేవుని పేరుతో అలాటి ఆనలు పెట్టిన వారూ వున్నారు. అన్యాయంగా మనం చేసే అలాటి ప్రార్థనలతో దేవునికి తృప్తి కలుగుతుందా? కలిగితే, అలాటి దేవుడు ఉండీ ఫలమేమి?''

ఆ రాత్రి నా మనస్సు నెమ్మదితో గడిపింది. నేను స్వప్న రాజ్యంలో తేలుతూ, పార్వతమ్మ, మూకాంబికల సంభాషణ వింటూ సంతోషం వహించినట్టు కనిపించింది.

మరుసటిదినం నేను స్నానోపహారాలు రెండూ ముగించి, శంకర హెగ్గడెగారిని లాక్కుని దిగువ చొచ్చలు మనె రామహెగ్గడెగారి యింటికి వెళ్ళాను. ఆయనకు శంకర హెగ్గడెగారు నా పరిచయం చేశారు. యశ్వంతరావుగారి సంగతీ వచ్చింది. పార్వతమ్మ కత రానే వచ్చింది. రామహెగ్గడెగారు తమ సంభాషణలో నా మిత్రుల అనేక గుణ దుర్గుణాలను వర్ణించారు; ''యశ్వంత హెగ్గడెను చూచింది నేను తీరా చిన్నవాడయినప్పుడు. నాదీ, వాడిదీ సమ వయస్సు కదూ! నా తండ్రిగారే వాడికి అప్పు పెట్టినవారు; ఈ ఇల్లు వచ్చింది ఆ అప్పు డబ్బులకే కదూ! మేము మొదట వున్న యిల్లు దిగువ పెద్ద బయలులో ఉండేది కదా! మా తండ్రిగారు, వాడు అడిగి నట్లెల్లా డబ్బు ఇస్తూ వచ్చారట; వాడు కుఱ్ఱవాడు; అయితే ప్రాయానికి వచ్చినవాడు. చిక్కినవారికి డబ్బిచ్చి దర్బారు చేశాడు. మా వూరిలోని పలువురు వాడిచ్చిన డబ్బు తినే పెద్దవారయూరు. మా తండ్రిగారు వాడికి బుద్ధి చెప్పవలసింది, ''ఇలా పిచ్చి పిచ్చిగా డబ్బు ఖర్చు పెట్టవద్దు'' అని. తమ పిడికిలి బిగించి వుండవచ్చు. మీరంతా దాయాదులు, డబ్బు అప్పు ఇచ్చేవారు కాదు. ఊళ్లో నాలుగు డబ్బులు గట్టిగా వున్నది మా తండ్రిగారి చేతిలోనే. ఆయనకు మొదటినుంచీ ఈ భూమి మీద కన్ను వుండివుంటుంది. ఆయన ఇచ్చారు; వీడూ అప్పు తీసుకొన్నాడు. డబ్బు చేతిలో ఎగురుతూంటే, బుద్ధి రావాలీ అంటే, ఎలాగ? ఈ యశ్వంతుడు వడ్డీకి తీసుకొన్న డబ్బును వడ్డీ లేకుండా మరొకరికి ఇచ్చిందీ కద్దు. వాడిని నలుగురూ ''నీవంటి కర్ణుడు లేదు; దధీచి లేదు'' అంటే, పొంగిపోయి ఎగిరే స్వభావం గలవాడు. మొత్తంమీద వాడు మంచివాడే కాని, చెడ్డవాడు కాదు. ఏమంటారు శంకర హెగ్గడెగారూ?''

''అది నిజం. ఇప్పుడు ఆ సంగతులు వదలిపెట్టండి. చూడండి. మన యశ్వంతుని కొంత డబ్బు ఈయన వద్ద వుందట. దానినుంచి కొంచెం డబ్బు

యిస్తారట. వాడి పేరుతో ఈ బెనకయ్య గుడి జీర్ణోద్ధారం చేయించాలని ఈయనకు ఇచ్ఛ కలిగింది.''

రామ హెగ్గడెగారి కళ్లు పెద్దవయాయి; పెద్దరికపు జంభం ముఖంలో కనిపించింది. మెడ ఉబ్బించి, ''ఔను. అదొక పని ఇంతవరకు బాకీ వుండడం తీరా తప్పు. చేయవలసిందే. చేసే పని చక్కగా చేయాలి. ఐదు వేలు పడనీ, పదివేలు పడనీ - చేసిన పని దరిద్రంగా వుండరాదు,'' అన్నారు ఠీవిగా.

నేను నవ్వుతూ, ''అంత చిన్న దేవుని గుడికి ఐదు, పదివేలు కావాలా ?'' అన్నాను.

''కాక ! ఇప్పటి ధారణ (ధరలు) ఏమిటి? చేసేది చక్కగా చేయవద్దా? చాలినంత డబ్బు ఒదగితే తామ్రపు రేకుల కప్పే వేయించాలి. ముందు ముందు మూడు రోజుల కొకసారి రిపేరి తాపత్రయం కలుగకూడదు.''

అప్పుడు నేను, ''మీరు, ఊరివారు దొడ్డ మనస్సు చేసి, ధారాళంగా వంతులు చెల్లించి, అలాటి పని చేయిస్తే, అందరికీ శ్రేయస్సు కలిగీని. యశ్వంతరావుగారి వంతు నేను ఇస్తాను,'' అన్నప్పుడు, రామ హెగ్గడె గారి దమ్ము సగానికి సగం కుసి పడిపోయింది. విషయమే మార్చివేశారు. ''శంకర హెగ్గడెగారూ, శిర్సి మున్సిఫ్ కోర్టులో ఆ తిమ్మ హెగ్గడె వ్యాజ్యం ఏమయింది?'' అన్నారు. నాకు ఇక బయలుదేరే సమయం వచ్చిందని నేను అరుగు దిగి పార్వతమ్మ ఇంటికి వచ్చాను. అక్కడ ఆ ఇద్దరు ముసలమ్మలు గోడకు ఒరిగి ఏమిటేమిటో మాట్లాడుకొంటున్నారు. నేను వాళ్ల ముందు బెనకయ్య గుడి ప్రస్తావన ఎత్తినప్పుడు, వారిలో చాల ఉత్సాహం కలిగింది. పార్వతమ్మ ''నాయనా, అదొకటి నీ చేతుల మీదుగా నడిస్తే బెనకయ్యకు ఒక 'మూడు గణపతి పూజ' జరిగితే, నేను సుఖంగా కళ్లు మూసుకుంటాను'' అన్నది.

''నీవూ అంతే; నేనూ అంతే;'' అన్నది ఆమె నెచ్చెలి.

''మీ బెనకయ్యే నడిపిస్తాడు పార్వతమ్మ గారూ; ఎందుకు చింత పడుతారు ?'' అని సమాధానం చెప్పాను నేను.

''నాయనా, నీవు ఇక్కడికి రావడం ఎందుకు చెప్పు? వాడు నడిపించాడనే నీవు రావడం, నా బిడ్డ సంగతి నిన్ను ఇక్కడికి తెచ్చింది. ఆ నెపంతో నైనా, నా ఈ మూకాంబు, అన్ని కట్టుబాట్లనూ తెంచుకొని నిన్ను

ఇక్కడికి రావడం నాకు ఎంత సంతోషం కలిగించిందంటావూ ?– ఈ మూకాంబ ఇక్కడికి రావడమన్నది. యశ్వంతుడు చావవలసి వచ్చింది. మేము ఇలాటి గడియ చూడడానికి.'' అని, కొంచెంసేపు ఊరుకుండి, ''తలచుకుంటే ఒకొకప్పుడు దుఃఖమూ వస్తుంది'' నాయనా, అయితే, చచ్చినవారి కోసం దుఃఖ పడరాదు. నీకు నిన్న అలా చెప్పి, ఈ దినం నేనే దుఃఖపడితే ఎలా ? యశ్వంతుడు నా జ్ఞాపకం నుంచి మరణిస్తాడా ? ఇప్పుడు, నేనూ మూకాంబా ఉన్నాము. ఒకరి నొకరు చూచుకోకుండా ఎన్ని రోజులయాయి ? అది ఇక్కడికి ఎప్పుడైనా వచ్చిందా ? ఇప్పుడు వచ్చింది. నాకు అది చిన్నప్పుడు ఎలా కనిపించిందో, దానికి నేనూ అలాగే కనిపించి వుండాలి. ఆ జ్ఞాపకం పోతుందా నాయనా, న్యాయమయిన జ్ఞాపక మయితే ?'' తర్వాత యిద్దరు ముసలమ్మలూ తల్లిని పోగొట్టుకొన్న యశ్వంతుని అనేక కథలను వర్ణించారు. దానిలో తండ్రి భగవంతయ్యగారు రెండవ పెళ్ళి చేసుకోడం, మారు తల్లి కాపురానికి వచ్చి పెద్దమనిషి కావడం, వయస్సయినా పిల్లలు లేకపోవడం, అది, సవతి కుమారునిపై ప్రీతికి మారు ద్వేషంగా పరిణమించడం, అందువల్ల ఆయన కష్టాలు అనుభవించడం, తను కొత్త యజమానురాలి నుంచి తిట్లుతిని ఆ ఒక్క బిడ్డకోసం తన కష్టం మింగుకొని యశ్వంతుల సుఖం సాధించడానికి ప్రయత్నించిందీ – మొదలయిన ఎన్నో ఘటనలు పార్వతమ్మ వివరించింది.

యశ్వంతరావుగారి బాల్య విషయాలు జ్ఞాపకపరచుకొని చెబుతూ పార్వతమ్మ ఈ ఒక్క కతను నవ్వుతూ చెప్పింది : ''పిల్లల ఆట అనేది చాల అందం ; ఏ పిల్లలయినా సరే. వారికి మోసం, కపటం అనేది తెలియదు. అతని తల్లి సదా అస్వస్థురాలయి నందున, వాడిని నిత్యమూ ముద్దు చేసేదాన్ని. నేనే తిండి తినిపించడం, నిద్రపుచ్చడం, కథలు చెప్పడం, ఆడించడం – దీనికితోడు ఇల్లు – అన్నమీదట యింటి చాకిరి తక్కువా ? చిమ్మడం, అలకడం మొదలుకొని, రుబ్బడం, వంట చేయడం – అన్నీ నా పాలిటి పనులు. అప్పుడు నేనూ గట్టిగా వున్నాను. ఇంట్లో ఎక్కువమంది లేరు. నేనెప్పుడో తాళి భాగ్యం పోగొట్టుకొన్నదాన్ని. ఈ పిల్లడు తన మూడో ఏటో ఏమో నన్ను అడుగుతాడు. 'పారమ్మ, అదేమిటి ? నీకు మా నాన్న మంచి చీర యివ్వడం లేదు. నీవు ఎప్పుడూ తెల్ల చీరే కడుతావే ? దానికి అంచూ లేదు ; చెరుగూ లేదు ... ఒక్క చూరు (ముక్క) అయినా

బంగారు లేదు. నీకు, నా ఆ అమ్మకు ఎంత బంగారముంది? చీరలున్నాయి?'' అని. నేను నవ్వి "ఆమెను మీ నాన్న పెళ్లి చేసుకొన్నారు. ఆమె చాల బంగారం వేసుకొనే ఈ ఇంటికి వచ్చింది. నిన్ను కని జబ్బు పడడంవల్ల ఇప్పుడు చాలసేపు పడుకొని వుంటారు. అంతే కాని..'' అన్నాను.

"కనడం అంటే, ఏమిటి పారమ్మా'' అని అడిగాడు. నేను ఊరికే నవ్వవలసి వచ్చింది.

"నాకు తెలుసు – మొన్న కాళి ఆవు దూడ వేసింది కదూ – అలాగే కదూ?''

"ఔను, నా బంగారు తండ్రీ!''

"నీవే కదూ నన్ను కన్నది?''

"కాదు, నాన్నా. ఆమె! నిన్ను కన్నప్పటినుంచి ఆమెకు కాయిలా పాపం! నీవు ఆమెకు ఉపద్రవం కలిగించకు. ఆమె దగ్గర హఠం చేయవద్దు.''

"సరే. అలాగే అయితే నాన్న నీకు మంచి చీరలు, గాజులు, బంగారు నగలు ఎందుకివ్వరు? నీవు ఇంతగా పని చేస్తున్నావే?''

"నాకు బంగారం ఎందుకు నాన్నా? నాకు చాల బంగారం వుంది.''

"ఎక్కడ?''

"ఉంది. నీకు తెలియదది; నాకు తెలుసు.''

"వట్టి అబద్ధాలు.''

"లేదు యశూ.'' అని నేను వాడిని ఎత్తి చెక్కిలి ముద్దు పెట్టుకున్నాను "నా బంగారు ఇది'' అన్నాను. ఎంత సంతోష మయింది – ఆ బిడ్డకు అనుకున్నావు? ఎన్నోసార్లు వాడిని ఇలాటి ఉపాయాలతో ఊరుకో నివ్వవలసి వచ్చేది.

"తర్వాత పెద్ద వాడయాడు. వాడి తల్లి తర్వాత చాలకాలం ఉండ లేదు. హెగ్గడెగారు తొందరగానే మళ్లీ పెళ్లి చేసుకొన్నారు. ఆ భార్య వచ్చిన కొన్ని రోజులు ఊరికే వుంది. ఈ యశు నన్నే అంటుకొని వుండడం చూచి దానికి ఏమి అనిపించిందో, నన్ను కనుగొనలతో చూచేది. వాడినీ అలాగే, ఒకనాడు ఆమె ఏదో నెపంతో రేగి, 'ఈ ముండ వచ్చి నా యిల్లు పాడయింది' అన్నది. ఆ మాట నేను వినలేకపోయాను. అప్పుడు

నా వాళ్లెవళ్లూ లేరు.... అన్నం పెట్టేవాళ్లు గాని, పిలిచి మాట్లాడేవాళ్లు గాని. అయినా, నాకు కోపం వచ్చింది; వెలుపలికి నడిచాను; వెళ్లి పోనే పోయాను. పోయినది ఆ బెనకయ్య గుడికి. ఈ బిడ్డ ఎక్కడ వుందో ఏమో! నేను లేకపోవడం చూచి, నన్ను పిలుస్తూ వచ్చేసింది. ఈవిశయినా ఆ బిడ్డను అడ్డగించవద్దూ? దాని మీదా కోపమేనా? ఆ గుడి దగ్గరే 'పారమ్మా! పారమ్మా!' అనే ఆ బిడ్డ పెడబొబ్బలు విని నేను పరుగుతో వెళ్లాను. బిడ్డడిని ఎత్తుకొని దేవుని గుడికి వచ్చాను. "నీ సవతి తల్లి ఇలా అన్నది, నేను తన యిల్లు గుల్ల చేశానట. నాకు దుఃఖం పట్టలేక వచ్చాను. ఇక నేను ఎక్కడికైనా వెళ్ళిపోతాను. కాడయితే కాడు! మెట్టయితే మెట్ట - వెళ్లి చచ్చిపోతాను" – అన్నాను. నా దుఃఖం చూచి ఆ బిడ్డకు ఏమి అని పిస్తుందని నేను ఆలోచించనే లేదు. వాడు నన్ను పట్టుకొని కొట్టి, తన్ని బెనకయ్య ముందు పొర్లాడింది. నాకు వాడి సంకటం చూడడానికి కాలేదు. ఇక వాళ్ల యింట్లో అడుగు పెట్టరాదు - అని యోచించి నేను వస్తే, ఈ ఒక్క మోహం నన్ను ఏమి చేయడానికీ వదలలేదు. దానిని సమాధాన పెట్టడమే నా పని అయింది.

"మా కేకలు, పెడబొబ్బలు గట్టిగా వినిపించాయో ఎమో!.... పశువు లను తోలుకొని రావడానికి వెళ్లిన మూకాంబికకు వినపించాయి. అదీ వచ్చింది అక్కడికి. దానిముందు నా దుఃఖం తిరగదోడుకున్నాను. సాయంకాలం అయ్యేవరకూ మేమంతా అక్కడే వున్నాము. అప్పుడు, స్వాదికి వెళ్లిన భగవంతయ్య చెప్పులతో విస విస నడచి వస్తున్నారు. అల వాటు ప్రకారం దేవాలయం వద్దకు వచ్చారు; చెప్పులు వదలి నిలబడ్డారు. ఇంకా, ఆయన మమ్మల్ను చూచి వుండరు. అయితే, ఈ యశు వున్నాడే, "నాన్నా, పారమ్మ చచ్చిపోతుందట. పరుగెత్తి పోతుందట. నీవు ఆ పిన్నమ్మను చంపివేయాలి" అన్నాడు. నేను వాడి నోరు మూసి అదిమి పట్టుకున్నాను. మూకాంబిక అంటే ఆయనకూ ప్రేమే. ఆయనకు అది జరిగిన కథంతా చెప్పింది. అప్పుడు ఆయన "పారూ, అది నా భార్య అన్న విషయం నిజం! అయితే, ఇంటికి నేనింకా యజమానుణ్ణే. రా. రా." అని పిలుచుకొని వెళ్ళారు. వెళ్ళి తమ భార్యను పిలిచి "చూడు. ఈ పార్వతి పనిచేయడానికి వచ్చిందనడం నిజం. అయితే, ఆమె ఆ చచ్చినదాని స్థానంలో నా బిడ్డను కాపాడినట్టిది. మరొకరు దీనిలాగ ఈ ఇంట్లో

అంతా తమ మనస్సుకు పట్టించుకొని చేసినవారు లేరు. మరొకసారి ఇలా జరిగితే.... ఈ యింటి నుంచి ఎవరు వెళ్ళిపోవలసి వస్తుందో నీకు తెలుస్తుంది'' అని బెదిరించారు.

''ఆ నాటినుంచి, సావిత్రి కోపతాప ద్వేషాలు ఏమి వున్నా పరిమితిలోనే వుండేవి. ఎదుట కాకపోయినా, ఎవరైనా వస్తే వాళ్ళతో, వెళ్లే వాళ్ళతో సంజు మాటలతో అవి పూర్తయ్యేవి. యశు పెరిగి పెద్దవాడయిన తర్వాత, ఆమెను లెక్క పెట్టేవాడు కాడు. నేను వాడి దుడుకుతనాన్ని అప్పుడప్పుడు తగ్గించి వాడిని పట్టుకోవలసి వచ్చేది. 'ఏమైనా, నీ తండ్రిని చేపట్టినట్టిది ఆమె; నీ పినతల్లి, తండ్రి మనస్సుకు నొప్పి అయ్యాని!' అంటూ వుండే దాన్ని. యశువుకు ఆ 'నాన్న' అంటే చాల ప్రీతి. నిజానికి, ఆయనకూ ఈ కుమారుడంటే అంతే ముద్దు.''

''ఉన్న ఒక్క రత్నాన్ని ముద్దు చేయకుండా వుంటారా? ఆ బిడ్డా అలాగే వుండేది కాదా!''

ఒక్కొక్క సంఘటనను జ్ఞాపకపరచుకొన్నప్పుడూ, పక్కింటి మూకాంబ ఆమె ఉపదేశానికి, సలహాకు పశువుల కొట్టం వెనుకతట్టో, బెనకయ్య గుడి వెనకో, పోక తోట చెట్ల మరుగుననో నిలబడి ఉపాయాలు చెప్పడం కద్దు; సమాధాన పరచడం కద్దు. ఇలాటి పెక్కు సందర్భాల చిత్రాలను నేను వింటూ సంతోషించాను. బాల్యం నుంచి యశ్వంతరావుగారి బ్రతుకు ముళ్ల పంజర మయిందనే నాకు అనిపించింది. తను కష్టపడినదంతా స్మరించగల వ్యక్తికి ఇతరుల సుఖ దుఃఖాలు తెలియడం సులభం. అలా తెలియడం వల్లనే ఆయన వయస్సు వచ్చినమీదట ఇతరుల విషయంలో ఉదారభావం వహించారు. ఇంటి పెత్తనం చేతికి వచ్చిన తర్వాత ఆయన చేయి మరింత పొడువయింది. కాళ్లు పక్కకన్నా ముందుకు చాచు కొన్నాయి. ఇచ్చేవాళ్లుంటే, అలాటి వారిని వంచించడానికి లోకం సదా సిద్ధంగా వుంటుంది. దొంగలు, అబద్ధాల కోర్లు ఆయన దయాంతఃకరణను తమ లాభం కోసం తిప్పుకొంటే ఆశ్చర్యమేమీ లేదు. రామ హెగ్గడె గారే అన్నారు కదా!– సగం సందిగ్ధతతో – తమ తండ్రి చేసిన వ్యవహారం, అలాంటి జనం అన్ని కాలాలలోను వుంటారు. పాత్రా పాత్రల తూకాన్ని ఇచ్చేవాడు కనుక్కోవాలి.

ముందే చెప్పాను – యశ్వంతులకు వచ్చిన కొన్ని జాబుల మీద ఆయన

పాత్రా పాత్ర విషయమై వ్రాసిన టీకా వాక్యాలను, అయన స్మరణలో అలాటి ఒక తన్నులాట విశేషంగా కనిపిస్తుంది. ఒకడు అపాత్ర మని తెలిసిన తర్వాత కూడ, తానే సరా, మరొకరే సరా అనే మనస్సులోని పోరాటం ఆయనకు తప్పలేదు. సూక్ష్మజీవులయిన వారికి బ్రదుకు చివరి వరకు కంటకశయ్య అవుతుందేమో!

బెనకనహళ్లిలో నేను ఊరు చూస్తూ, శంకర హెగ్గడె గారితో నా పని చేయించుకొనడానికి అంచనాలు వేస్తూ, బెనకయ్య గుడికి వెళ్ళి వస్తూ, పార్వతమ్మ మూకాంబికల గతపురాణం వింటూ మొత్తం మూడు నాళ్లు గడిపాను. ఆ వూరు వదలి వెళ్ళేముందు ఆ నిర్భాగ్యురాలి వద్దకు మరొక మారు వెళ్ళి, "అమ్మా వచ్చే నెల నుంచి పది రూపాయల ప్రకారమైనా పంపనా? ఈ మూడు నెలలది ఇక్కడుంది, తీసుకోండి" అని ఇచ్చాను.

"ఇన్ని రూపాయలు నే నెక్కడ దాచుకోనూ? రాముని చేతికి యివ్వాలి" అన్నది.

"ఆయన చేతికా?" అని నేను మాటలు వెళ్లగక్కాను.

"ఏమవుతుంది? వాడు నా పొరుగింటి వాడు. నాకు ఏమి కావాలన్నా వాడే తెచ్చి పెడుతుంటాడు."

"అది సరే. అయినా..?"

నా అర్థం ఊహించుకొన్న దానిలా ఆమె "రాము తింటాడనేనా? తిననీ. వాడూ నా కొక కొడుకున్నట్లే. ఈ లోగతిలో వేరే భూతమేముంది? ఇంతకూ డబ్బున్నది తినడానికే కదా; నేనేమి? వాడేమి?"

అప్పుడు నేను పొట్ట నిండా నవ్వాను. "అలా అయితే, అమ్మా, నేనే తింటాను కదా! డబ్బు విషయంలో నాకు మంచి జీర్ణశక్తి వుంది. వేయి రూపాయలిస్తే ఒకే రోజు పొడి పొడి చేసేను!" అన్నాను. ఆమె నవ్వింది. "ఆ బుద్ధి నీకు వుంటే, ఇంతవరకు వచ్చేవాడివా? నా యశ్వంతుడు నీ తల మీద చేయి పెట్టినట్టే కనిపిస్తుంది. చూడు, నాయనా, డబ్బు పట్టుకొని మనం అలాటి మాటలు అనరాదు. డబ్బు అంటే లక్ష్మి, లక్ష్మీదేవి విషయంలో నా బిడ్డలు చులకనగా నడచుకోడం వల్ల తర్వాత ఎన్ని కష్టాలు పడ్డాడో చూడు."

నేను మరొకసారి నవ్వుతూ, "అమ్మా, చివరకు మీ వేదాంతం ఇంతకు

వచ్చింది! మీలాంటివారూ 'డబ్బే దేవుడు' అంటే, జనంలోను ఆ పాడు బుద్ధి పుట్టక వుంటుందా?''

''అలా కాదు, బిడ్డా, డబ్బు లక్ష్మే! లక్ష్మీదేవే! డబ్బు నుంచి మంచీ వుంది, చెడూ వుంది. ఒక్క ఋషి అన్నాడట కదా భర్తృహరో, ఎవరో - దానం, భోగం ఈ రెండింటికీ వుపయోగపడని డబ్బు నాశానికి అని. లక్ష్మి బాగుంటే దేవత. పరిమితిలో వుంటే దేవత. లేకపోతే పిశాచి.''

ఆ ముసలమ్మ లోకానుభవం మెచ్చుకొని వచ్చే సంవత్సరం వస్తానని భరోసా యిచ్చి శంకర హెగ్గడెగారి యింటిదారి పట్టాను. మరుసటిదినం శంభు నాతోపాటు స్వాది వరకూ వచ్చాడు. ఆ రోజే నేను శిర్సిలో ఒక మిత్రుని ఇల్లు చేరాను. అక్కడి నుంచి సరాసరి ఊరికి వెళ్లుదామా, లేక నా మిత్రుల కుటుంబ విషయాలు తెలిసిన కుమటికి వెళ్లుదామా అనే యోచనకు గురి అయ్యాను. అంతా ఒకే గుక్కలో నింపుకుంటే స్వారస్యం ఉండదని ఊరి దారి పట్టే నిర్ధారణ చేసి, సరాసరి ఊరు చేరాను.

## ఏడు

నేను ఘజినీ మహమ్మదూ కాను; పార్వతమ్మ భక్తి బలగం వాడినీ కాను. బెనకయ్య గుడి జీర్ణోద్ధార కార్యం చేయించి పెడతానని ఒప్పుకొని ఊరికి తిరిగి వచ్చినమీదట, శంకర హెగ్గడెగారికి ఆ పనిని కొనసాగించ డానికి అప్పుడప్పుడు డబ్బు పంపుతున్నప్పటికీ, వారి విషయంలో అంత నమ్మకం పెట్టుకోవచ్చా, కూడదా, అనే విషయంలో సంశయం వచ్చేది. ఆయనేమో డబ్బుకోసం అప్పుడప్పుడు ఉత్తరం వ్రాసేవారు. ఆయన కుమారుడు శంభు 'శంభుభట్టు' అనే నామధేయం వదలి శంభు హెగ్గడె అనే పేరుతోనే ''ఇంత వరకు గుడి పని ఇంత కొనసాగింది'' అనే సంగతులు తెలుపుతుండేవాడు. కొత్తగా పేకాట ప్రారంభించిన వాడిలాగ నా చేతిలో వున్న ముక్కలన్నిటినీ హెగ్గడెగారికి చూపించడం ఉచితమా, అనుచితమా అన్న విషయంలోను సంశయం నాకు కలిగింది. యశ్వంతరావుగారి

డబ్బుకు, ఆయన నా మీద పెట్టిన విశ్వాసానికి నేను అనుసరిస్తున్న ఈ ధోరణి మంచిదా, కాదా – అనే విషయంలోను నాకు సంశయమే.

బెనకనహళ్ళి వారు చేయవలసిన పనికి నేను నా మిత్రుల పరంగా తల ఒగ్గడానికి కారణం ఆయన సాకు తల్లి సంతోషపడనీ అని. బెనకయ్య విషయంలో యశ్వంతరావుగారికి ఎంత విశ్వాసం వుండవచ్చో, నాకూ అంతే విశ్వాసం. అంటే, ఆ విధమయిన పూజా విధానంలో మా యిద్దరికీ విశ్వాసం తక్కువ. అలా వున్నప్పుడు, ఆయన అయితే ఈ పాడు పడిన గుడిని ఉద్ధరించడానికి పూనుకొనే వారో కాదో! మంచి శిల్పం, మంచి వాస్తుకళ అయినా వుంటే, దానిని ఉద్ధరించడంలో నాకూ కొంచెం ఉత్సాహం వుండేవి. ఆ దృష్టితో ఈ గణపయ్య బోడి గణపయ్య. నాకూ ఒకే సంతృప్తి – యశ్వంతరావుగారి ముందు పార్వతమ్మ ఈ కోరిక తెలిపి వుంటే అక్షరశః ఆయన దీనిని పాలించేవారు – అనే విశ్వాసమది. ఆమె మనస్సుకు నెమ్మది కలిగించడం కన్నా దొడ్డపని లేదు. నేను కొంచెం ఉపాయశాలి అయివుంటే, నా వద్దవున్న ముక్కలు దాచుకొని, నాలుగు రోజులు అక్కడేవుండి, శంకర హెగ్గడెగారినే ముందుకు తోసి "ఊరి పెద్ద లయిన మీరు ఈ గుడిని పాడు పెట్టడం న్యాయమా," అని ఉబ్బించి, కవ్వించి, ఆ మీద పొగడి, ఉత్సాహం నింపి, "మీ పేరు అజరామరమవు తుంది" అని చెప్పి ధన వ్యయ భారం తప్పించుకోవచ్చు నయివుండేది. అందువల్ల గుడి పని ముగిసేవరకూ నేను ఆ వూరికి వెళ్ళిరావలసి వచ్చింది. అంతపని చేసినా, భక్తికన్నా, డబ్బుమీది మోహం హెచ్చుగా వున్న జనం ఆ వూరులో లేరా? అలాంటి వాళ్ళున్నందుననే ఆ గుడి పాడు పడడం! రామహెగ్గడె వంటివారు, ఇంకా అలాటివారు నలుగురు అక్కడ వుండరా? నేను చాల వుత్సాహం చూపితే, నా వెనుకే, "ఈయన ఆ వూరినుంచి వచ్చి బెనకయ్య గుడి కట్టాలని మాకు ఉపదేశం చేయవలసి వస్తే, ఏదో వుద్దేశం వుంది దీనిలో" అని అనుకోవచ్చు. ఆ 'ఏదో' అంటే, పది మంది చందా డబ్బు మింగివేయడం. అంతే దాని అర్థం. పోనీ, నా మిత్రుని పేరున నా మాట తప్పినా చింత లేదు; గుర్తు తెలియని ఊరికి పోయి, ఇలాటి సంశయానికి లోనుకావడం వద్దు. అందువల్ల నా చేతిలో వున్న పేక ముక్కలను చూపి వేయడం మేలయింది – అనుకొన్నాను.

నేను ఊరికి తిరిగివచ్చిన తర్వాత చలికాలం అడుగుపెట్టింది. తర్వాత

యథాప్రకారం వేసవీ వచ్చింది. నెల నెలకూ శంకర హెగ్గడెగారి నుంచి బిల్లు వచ్చేది. శంభు హెగ్గడె చేయించిన పనుల వివరాలు తెలిపేవాడు. "మేము వాన వెలిసిన మరుసటి దినమే పాత గుడిని పడగొట్టాము ; దాని దూలాలు దంతెలు దేనికీ పనికిరావు. గోడలు పగుళ్లువారి పాడయిపోయి నందున పంచాంగం (బునాది) వరకూ పడగొట్టవలసి వచ్చింది. పంచాంగ శిల (బునాది రాయి) రాతిది కావద్దా ?" అని ఒకసారి వ్రాశాడు. మరొక సారి "మా నాన్నగారు గుడికి కావలసిన కలపకోసం అప్పుడే మా స్థలంలో వున్న మానులను నరికించారు. అయితే, మా వూళ్లో మానులు చెక్కేవారు దుర్లభం. ఇక్కడ వడ్రంగులూ దుర్లభం. శిక్సినుంచో, కుమటినుంచో వారిని పిలిపించుకోవాలి. ఒకటి రెండు కూలి అడగవచ్చు", అని వ్రాశాడు. "అలాగే చేయండి ; నమ్మకస్థులను పిలిపించండి ; ముందుగా డబ్బిచ్చి ఆ మీద గంతులు వేసే ప్రసంగం తెచ్చుకోవద్దు" నేనూ ఉపదేశం చేశాను. "రాతి పని మొదలయింది. కట్టడం పని ప్రారంభ మయింది. వడ్రంగులూ వచ్చారు. ఈ వేసవి ముగిసేలోపల దేవాలయం కప్పు కావచ్చు." అనే ఆశాదాయకమయిన జాబు తర్వాత వచ్చింది. మరొక జాబులో "రామ హెగ్గడెగారు, మీరు చేసేది చేస్తున్నారు. గర్భగుడి ముందు ఒక అంక ణానికి మారు రెండంకణాల చావడి, నలుగురు హెచ్చుగా కూర్చోడానికి వీలుగా కట్టించరాదా ?" అంటున్నారు. 'గర్భగుడిమీద ఎత్తయిన గోడలు వేసి తామ్రపు కప్పు కప్పించాలి. చేసిన పని శాశ్వతంగా వుండనీ' అంటు న్నారు" అనే విషయమూ తెలిపాడు. అక్కడినుంచి నేను దేవాలయం కొలతలు తెప్పించుకొన్నాను. ప్లాను వ్రాసి యిచ్చాను. ఇప్పుడు గర్భగుడికి ప్రత్యేకమయిన, ఎత్తయిన గోడలు చౌకపు కప్పు వేయడానికి మళ్లీ ప్లాను గీచి యిచ్చాను. "మీ బెనకయ్య ఇన్ని సంవత్సరాలుగా పూరి గడ్డి గుడిసెలో నానుతున్నారు గదా. గుడి కప్పునకు కుమ్మరి పాత పెంకులూ వుండలేదు. వాడికి మంగుళూరు పెంకుల కప్పు ధారాళంగా చాలు. మీ రామ హెగ్గడె గారికి దొడ్డ బుద్ధి పుట్టి, తామ్రపు రేకులు తెప్పించి యిచ్చేటట్టయితే, ముందూ వెనకా యోచన చేయక తప్పక కప్పించండి" అని వ్రాశాను. దానికి శంభు "అయ్యో స్వామీ, రామ హెగ్గడెగారు ఇస్తానన్న యాభై రూపాయలూ ఇంకా యివ్వలేదు. ఇస్తారనే నమ్మకం నాకు లేదు. దానికి మారు పార్వతమ్మకు గాలి వూది, ఆమెతో నన్ను ఏమేమో అనిపిస్తున్నారు" అని జవాబు వచ్చింది.

ఈ సంగతి చాల స్వారస్యమయింది. యశ్వంతరావుగారి నిధి నా చేతికి వచ్చిందని శంకర హెగ్గడెగారి నుంచో, పార్వతమ్మ నుంచో, ఆయన చెవిలో పడినమీదట పెత్తనానికి వెనుదీస్తారా? ఒక దినం పార్వతమ్మతో అన్నారట – "నీవు వట్టి వెర్రిదానివి. నెలకు యాభై రూపాయలయినా ఖర్చుకు అడగవలసింది. అది వదిలావు; నేను నిన్ను యిన్నాళ్లు ఆదరించినందుకు గదా, ఈ పెద్దరికం. ఆ వచ్చిన దూత (అంటే నేను) యశ్వంతుని కుటుంబం వాడు కాడు. నీవలె కాదు. నేనయి వుంటే ఆ డబ్బంతా యశ్వంతరావును పెంచిన నీ పాదాలవద్ద పోసేవాడిని. నీవు అలాగూ చేయలేదు. నీవు గుడి కట్టించాలనడం మంచి పనే; చేయవలసిందే. నాకూ దానిలో ఉత్సాహం వుంది. అది దేవుని గుడి కదా! ఔనకయ్య అంటే అలాటి ఇలాటి దేవుడా? వాడి గుడికి రాగి రేకు కప్పు వేయవద్దా? ఒక రెండు వేలు ఎక్కువ పట్టీని? వాడిచ్చేది యశ్వంతుని డబ్బు కదా; తన అబ్బ సొమ్ము యిస్తున్నాడా? ఇవ్వనీ. ఈ వూరిలో పుట్టి పెరిగిన పిల్లవాడు యశ్వంతుడు. వాడయితే యిచ్చేవాడు.

"చూడు; ఈ యశ్వంతుడు కుమటి వదలి వెళ్లేటప్పుడు లక్ష రూపాయలు తీసుకొని బొంబాయి వెళ్ళాడు – అని విన్నాను. భార్యా పిల్లలమీది కోపంతో, వారందరికీ టోపీ వేసి, రెండు లక్షల రూపాయలను పట్టుకొని వెళ్ళాడు. ఆ బొంబాయిలో దొర కొడుకులాగ కూర్చుని దర్బారు చేసి చచ్చాడు. నీకు వాడు పంపుతూ వుండిన డబ్బెంత? నెలకు ఐదైదు రూపాయలు చాలా? మొన్న నీ యింటికి వచ్చినవాడున్నాడే, – నేనంటాను – వాడి చేతికి వచ్చిన డబ్బు పదిహేను వేలు వుండదు; కనిష్ఠ పక్షం యాభై వేలు వుండవచ్చు. ఒక లక్ష కూడా వచ్చి వుండవచ్చు. ఆ గుట్టంతా ఎవరయినా చెబుతారా?" అని ఆమెను దెప్పే వాడని, శంభు నాకు వ్రాసిన జాబులనుంచి తెలిసింది. శంభు తనంతట తానే అన్ని అబద్ధాలు పోహళించి నాకు వ్రాయజాలడనే అనిపించింది.

ఈ మధ్య చలికాలానికి పార్వతమ్మ బాధ తెలుపుతూ, శంభు తనకొక దీర్ఘ లేఖ వ్రాసే పరిస్థితి ఏర్పడింది. "మీరు తెలిపిన విషయం అవ్వకు చెప్పాను. ఆమె మీ మాటకు ఒప్పుకుంది. అయితే పక్కింటి రామ హెగ్గడె గారి పీడ ఆమెకు బలంగా వుంది – అని తోస్తుంది. అప్పుడప్పుడు ఆయన వచ్చి 'ఇన్ని రోజులు నీకు పొట్టకు లేనప్పుడు బియ్యం బట్ట మేమే

యిచ్చాము. ఇక ముందు నీ ఐదు రూపాయలతో నీవు స్వతంత్రంగా వుండు. నీకు మా హంగేమిటి ? వాడికి జాబు వ్రాసి నెలకు యాభై రూపాయలయినా తెప్పించుకో - అంటే నీవు వినడం లేదు. నీవు కాయిలా పడితే చూచేవారెవరు ? నీకు ఏమిటి ఆస్తా, పాస్తా ? ఇంతకు ముందు మా యింట్లో చాకిరీ చేస్తూ ఇరవై యేళ్ళు కూడు తిన్నావు. అటు తర్వాత ముసలిదాని వయ్యావు. మేము కనికరంతో నీకు తిండి పెట్టాము. ఇంకా ఇంకా సాకుతామని అనుకున్నావా ?' అని పీడిస్తున్నాడు'' అని జాబు వ్రాశాడు.

నాకు దిగులు పట్టుకొంది. 'డబ్బు లక్ష్మీదేవి' అన్నారు పార్వతమ్మ. 'డబ్బు దుష్ట రాక్షసి' అని తెలుసుకొని దుఃఖపడే కాలం వచ్చిందో - అని పించింది. రామ హెగ్గడె పార్వతమ్మను ఒక యంత్రంగా వినియోగించి నా నుంచి నాది కాని డబ్బును వలుచుకొనడానికి కొత్త పథకం వేశారు. బెనకయ్య గుడి దాని కొక నెపం. పార్వతమ్మను ముసలితనంలో రెచ్చ గొడితే కొంచెమయినా లాభం కలుగకుండా వుండీనా - అనే దురాశ ఆయనకు పుట్టి వుంటుంది. దీనివల్ల రోజు రోజుకూ ఆయన ఒత్తిడి ఎక్కువయి పార్వతమ్మ సంకటమూ ఎక్కువయిందట. ఆమెకు నేను ఇరవయ్యయిదు రూపాయల వంతున యిచ్చినా, అది శంభువుకూ, టపా బంట్రోతుకూ పోవడానికి మారు ఇకముందు రామ హెగ్గడెగారికి వెళ్లుతుంది. డబ్బు అంటే వట్టి ఉప్పు. దానిని చిటికెంత నాలుక మీద వేసుకొంటే రుచి, ఎక్కువగా తింటే, దాహం, దప్పి. రామ హెగ్గడెగారికి వట్టి వార్త వినే దాహం ఏర్పడింది. నేను నెలకు పది రూపాయల లెక్కన పార్వతమ్మకు డబ్బు యిచ్చి రావడమే అతని ఈ దాహానికి కారణం. ఆమె సాకుడు కుమారుని డబ్బు ఉన్నది అనడం దయ్యాపు ఆకలికి కారణమయింది. పార్వతమ్మ ముసలి ముప్పు కాలంలోని శాంతి నా అవివేకం వల్ల చెడి పోయినట్లయింది కదా - అని చింతకు లోనయ్యాను. ఇక మిగిలిన సంవత్సరం రెండు సంవత్సరాల జీవితాన్ని ఆమె గడపాలి గదా? ఆమె ఆ చోటు వదలిపోవడం సాధ్యమా ? నాకు ఏమీ తోచలేదు. ఒక తాత్కా లిక వ్యవస్థ కోసం శంకర హెగ్గడెగారికి జాబు వ్రాయడమే మార్గమని పించింది. ''మీ అక్కగారికి రెండవ ప్రాణం వలె వున్న పార్వతమ్మను మీ వద్దే వుంచుకొని పోషించేటట్టయితే, ఎంత వెచ్చమయినా నేను పంపు

తాను'' అని జాబు వ్రాశాను. అయనా తమ అక్కగారితో ఆలోచన జరిపి నట్టు తోస్తుంది. తాను తన అత్తకు చెప్పానని శంభు తన జాబులో తెలియ జేశాడు. ఆ పనులన్నిటి మధ్యవర్తి పరుగులు శంభువే జరిపేవాడు. నా సూచనకు శంకర హెగ్గడెగారూ అంగీకరించారు. ఈ విషయంలో ఆయన అక్కగారికి విశేషమయిన ఉత్సాహం కలిగింది. ఆమె ఈ రాయబారం మోసుకొని తన చెలి యింటికి వెళ్ళి ఆహ్వాన మిచ్చిందట. కాని, ఆమెకూ సంశయమే. రామ హెగ్గడెగారు ఎంత లోభి అయినా, ఎంత వంచకు లయినా, తనకు ఇంతకాలం ఆశ్రయ మిచ్చిన ఆయన మరుగునుంచి పార్వతమ్మ బయలుదేరి వస్తుందా? అనే సంశయముంది. అంతేకాక పూర్వ చరిత్ర తలచుకుంటే, పాత ద్వేషంలో ఆమే శాపానికి గురిఅయింది. శంకర హెగ్గడెగారి తండ్రి మనస్సులో తమ పిల్లలు ఆమెతో సంభాషణ జరుపడమే కోపకారణ మయినప్పుడు వారి యింటికే వచ్చి స్థిరపడితే మర ణించిన వారి ప్రేత ఏమనీని?- అనే భావన పార్వతమ్మకు రాదా? ఈ ఒక్క ఉలుకు మూకాంబికమ్మకు కనిపించేది. తను ఆమె యింటికి పోతే ఆమె కూడా ఒకొకసారి రావడానికి జంకరు. అది తన మీది ప్రీతితో. ''మా యింటికి వచ్చి వుండు'' అంటే వింటారా?

ఏమైనా, మూకాంబిక అలాంటి రాయబారం మోసుకొని వెళ్లి విఫలురాలై తిరిగి వచ్చిందని శంభు వ్రాసిన జాబు నుంచి తెలిసింది. మూకాంబిక రెండు సంశయాలతోను ఆ ముది ప్రాణి మనస్సు ఉడికింది. పార్వతమ్మ అన్నదట: ''మూకాంబా, నేను ఇంతవరకు ఎవరితోనూ అనిపించు కోకుండా బతికానా? ఎగువ ఇంట్లో వున్నప్పుడు నన్ను అన్నవారు లేరా? యశ్వంతుని సవతి తల్లి అనరానిదంతా అనింది. ఏమీ అననిది, వాడిని కన్న తల్లి. ఆ మీదట ఈ రామ హెగ్గడె కాని, వాడి తండ్రిగాని, వారింట్లో నేను పని చేసినన్నాళ్లూ ఒకదానికి కాదు, మరొక దానికి అంటూనే వున్నారు. నేను పొట్టకు లేక వచ్చిన దానినని వాళ్లకు తెలియదా? తెల్లవారు జామునుండి రాత్రి జాము పొద్దువరకు వళ్లు విరిగేట్టు పనిచేసి అలసి పోయినా, తిట్లు తినడం తప్పలేదు. నా జన్మ వున్నదే దానికోసం అని అనుకున్నాను. ఇక ఇప్పుడేమో కళ్లు కనిపించని దాన్ని, కష్టపడ లేని దాన్ని అంటారు. అననీ. నాకు పరిచయమున్న పిల్లలే గదా తిట్టడం! నేను చచ్చిపోయిన తర్వాత నయినా, వాళ్ల నోటినుంచి, ''అయ్యో పార్వతి

చచ్చిపోయింది. మేము ఇంతగా తిట్టినా, అది ఒక్క మాటయినా ప్రతి (బదులు) చెప్పినది కాదు'' అనేరు - అననే అంటారు. అలా తిట్టడమూ ఒక జననావస్థ- పుట్టుక,'' అని మూకాంబికకు జవాబు చెప్పి, నిరాశ కలిగించిందట.

అక్కడ, శంభువు జాబుల వల్ల, రామ హెగ్గడెగారి పొడుపులాట ఎక్కువయినట్టు తెలియవచ్చింది. చాలని దానికి మూకాంబిక తమ యింటికి పార్వతమ్మను పిలవడానికి వచ్చిన సమాచారమూ ఆయనకు తెలిసింది. ఆ దినమే హెగ్గడెగారు ''ఓ...హో...హో... పార్వతికి నేను చెప్పడం ఎక్కువయిపోయిందే! నీ మంచికోసం చెబితే, దానిని నీవు ఊరూరుకూ చాటావే? చాటు. నీవు శంకర హెగ్గడెగారి యింటికి ఈ ముసలితనంలో వైభవంతో మెరవణిగా (ఊరేగింపుగా) వెళ్లు. మహా వైభవం! మాకొక నష్టమా?'' అనే బ్రహ్మాస్త్రమే వదలారట. ఆ రాత్రంతా పార్వతమ్మ చాల బాధపడిందట. నేను ఆమె స్థితిని ఊహించగలను. మరుసటి దినం తెల్లవారగానే రామ హెగ్గడెగారు తమ పత్ని మూలంగా మరొక శుభ సందేశం ఆమెకు పంపారట: ''వెళ్లు... మహారాణి వెళ్లు. ఆన వచనాలు జరిగిన యింటికి పోయి, అక్కడే ప్రాణాలు వదలు. రేపు నీ హత్య, శ్రాద్ధం చేసేవారికి ఠికాణా లేకుండా పోయి, గ్రామంవారి నంద రినీ పీడించనీ. ఇక నీవు మా యింటి మెట్లు ఎక్కవద్దు'' అని చెప్పించి, తమ స్నేహసంబంధాలకు ముగింపు చెప్పారట. ఆ పార్వతమ్మ శివునిలాగ ఆ విషమంతా గట గటమని మింగిందే కాని, మారు ఉత్తరం చెప్ప లేదట. ''ఇలాగే వుంటే, నాకు ఏమనిపిస్తుందంటే, ఈ అవ్వ ఆలోచనతో, చింతతో దుఃఖపడి, కడుపుకు ఏమీ తినకుండా బక్కచిక్కి వచ్చే వానకాల మన్నా చూస్తుందో లేదో'' అని శంభువు వ్రాసిన దానిని చదవినప్పుడు నాకు దిగులు పట్టుకుంది. బెనకయ్య గుడి జీర్ణోద్ధారం ఎవరికోసం? నేను యశ్వంతరావుగారి కోసం మోసుకొన్న రాయబారం ఎవరి శాంతి కోసం? - అని వేసట పుట్టసాగింది.

చదువుకున్న మనబోటివారు గ్రామ జీవితపు శాంతి స్వరూపం గురించి పొడువు పొడువు మాట్లాడుతాము. వికృత మానవులు మన గ్రామాలలో ఎంత మంది లేరు? వారు వ్యాపింపజేసే శాంతి స్వరూపం ఎంత విరాట్ స్వరూపంగా లేదు-అనిపించింది నాకు. దూరంగా ఊరికే కూర్చున్న

నేను, నా పాటికి ఎవరి గొడవకూ పోక, ఆమెకు మనియార్డరు చేస్తూవుంటే బాగుండేదేమో ! శంభువు విషయంలోను నాకు అనుమానం వచ్చేది కాదు. పార్వతమ్మ కష్టాలూ పెరిగేవికావు. అప్పుడు నేనే అంతా కెలికాను. ఇన్నూరు మైళ్ల దూరంలో కూర్చుని బుద్ధిమంతుడిలాగ ఇతరులకు ఉపదేశం చేస్తూ, ఆ ఉపదేశం దక్కించుకొనేవారి పాలికి కష్టం తెచ్చి పెట్టి నట్టయింది. ఒకటి రెండు నాళ్ళు నా మనస్సు చాల ఉద్విగ్నతతో ఉడికింది. శంభువుకు దేవాలయం పనులకు సంబంధించిన నాలుగు మాటలు వ్రాశాను; మరేమీ వ్రాయలేదు. ఇకమీద ఉపదేశాలు వ్రాయడానికి ముందు, బాగా యోచించి, తీరికచేసుకొని అక్కడికి వెళ్ళే అవకాశం వుంటే పోయి, పార్వతమ్మ నివాసానికి వేరే వ్యవస్థ చేసే యోగ్యత వుంటే చేసి రావాలి. లేకపోతే ఇంతవరకు, నా వల్ల కలిగిన ఉపద్యాపమే (ఉప ద్రవమే) చాలు – అనుకున్నాను.

ఈలోగా, మరికొన్ని చిక్కులను ఒంటి మీద ఒలికించుకున్నాను. యశ్వంతుల మరి ముగ్గురు మనవృత్తి వారున్నారు గదా. వారికి రావు గారు మరణించిన సమాచారం వ్రాయడమే కాక, 'ఆయన విషయంలో మీకు తెలిసిన సంగతులు తెలియజేస్తే చాల ఉపకారమవుతుంది' అని వ్రాశాను. దానికి త్వరలోనే విష్ణుపంత్ ఘాటేగారి నుంచి జవాబు వచ్చింది. యశ్వంతరావుగారి ఎడల విశేషాదరం కల వ్యక్తి ఆయన అని అనిపించింది. సంవత్సరాని కొకమారు మహాబలేశ్వరానికి నా మిత్రులు వెళ్ళి విశ్రాంతిగా గడిపే సమయంలో అయనకూ, వీరికీ స్నేహమైనదట. ఘాటేగారు ఇప్పుడక్కడ లేరు. అక్కడినుంచి, తమ వ్రాతకూ, అధ్యయనానికీ అనుకూలమని పూనాలో తమ కుమార్తె ఇంటికి వచ్చి ఉంటున్నారు. "నాకు దేహారోగ్యం తక్కువ. ఉబ్బసం పీడ సదా తప్పింది కాదు. అధ్యయనం లోను, వ్రాత లోను కాలం గడిపేవాడిని నేను. వయస్సూ అయింది; ఏదో వెఱ్రి పని ప్రారంభించాను. అదిప్పుడు ముగియవచ్చింది. ఇక ఆరు నెలలకు అది ముగుస్తుంది. యశ్వంతుల సహాయ ప్రోత్సాహాలే నన్ను ఇలాటి పనికి దూకేట్టు చేసిన శక్తి. మీ రెవరో ? నే నెవరో ? ఆయన మీది అభిమానంతో ఆయన ఇస్తూ వస్తున్న సహాయం కొనసాగించినారు. మీకూ నేను ఋణిని. మీరు పూనా మీదుగా వెళ్ళే సందర్భం వస్తే, మా యింటికి వస్తే, ఆయన సంగతులు తెలిసినంత వరకు చెబుతాను"

అని వ్రాశారు. మొట్టమొదట ఆయన మనస్సులో నా మిత్రుల కోసం నా స్వంత డబ్బు పంపిస్తున్నాననే అపోహ పుట్టిందని అనిపించింది. "అలా కాదు. ఇది ఆయన డబ్బే; ఆయన చెప్పిన ప్రకారం నేను పంపడం" అని ఉత్తరం వ్రాశాను. దానితోపాటే "చూద్దాం. సమయ మున్నప్పుడు, పూనా మీదుగా వెళ్ళే సందర్భం వచ్చినప్పుడు, వచ్చి చూస్తాను" అనీ చేర్చాను. ఆ మీద కుతూహలం కలిగి, "తమ వ్రాత అన్నారు గదా, ఏమిటది ? నాకు తెలుపవచ్చునా ?" అని అడిగాను. నెల తర్వాత ఆయన నుంచి వచ్చిన జాబులో ఆలస్యానికి కారణం తెలిపారు. కాయిలాయే దానికి కారణమట. తమ వ్రాతల విషయంలో "ధర్మ శాస్త్ర విషయం-ఏదో కండూతి తీర్చుకొంటున్నాను"- అని తెలిపారు. అటు తర్వాత ఆ పత్ర వ్యవహారం పెంచలేదు.

మరిద్దరు మన వృత్తిదారులున్నారు కదా – కుమటి సమీపంలోని హొన్ని గద్దె మంజయ్య అనేవారు వారిద్దరిలో ఒకరు. ఒకా నొకప్పుడు హొన్ని గద్దెకు నేనూ వెళ్ళాను. కుమటి నుంచి మూడు నాలుగు మైళ్ళ దూరంలో వుంది. అక్కడ నేను ఒక అర్ధరాత్రి చాలమంది శ్రోతలను సమావేశపరచిన ఒక సభలో మాట్లాడాను. ఎలాగూ ఒకమారు కుమటికి వెళ్లవలసి వస్తుంది. అప్పుడు ఆ మంజయ్యగారిని కలుసుకుందాము – అని అనుకున్నాను. నేను ఆయనకు వ్రాసిన ఉత్తరాలకు నాలుగైదు నెలల వరకు జవాబే రాలేదు. మనియార్డరు కూపనులో ఆయన సంతకమే వుంది. ఆయన సంతకంలో వణుకుతున్న అక్షరాలు కనిపించడం వల్ల, ఆయనొక వృద్ధుడు, నేను వెళ్ళి మాట్లాడించాలే గాని, 'మీ జాబు రాలేదు' అని దూషించరాదని నిర్ధరించుకున్నాను. మరొక మన వృత్తిదారూ కుమటి ఇరుగు పొరుగు వాడే. చాలకాలం తర్వాత అతని నుంచి కూడా నా కొక కార్డు అందింది. ఆయనా కృతజ్ఞత తెలిపాడు. "యశ్వంతరావుగారి మరణ వార్త విని నా తల్లి మూన్నాళ్లు తిండి తీర్థం ముట్టలేదు" అని తెలిపారు. ఆ మీదట "నీవు ఎవరు ? నీ తల్లి ఎవరు ?" అని నేను వ్రాసిన ఏ ప్రశ్నకూ సమాధాన మీలేదు. నేను వాటినంతా కెలికి అడుగవలసిన ప్రసక్తి ఎందుకని ఊరికే వున్నాను. ఆ వ్యక్తి పేరు ధారేశ్వరం సీనడు అని. ధారేశ్వర మనేది నేను విన్న పేరు ; కన్న ఊరు. అయితే, అతడు కోడకణి

అనే ఏదో గ్రామంలో నివసిస్తున్నాడు. కుమటికి వెళ్లితే, సందర్భం కలిగితే తీరికవుంటే వాడిని చూడవచ్చు.

ఇటు శంభు హెగ్గడె రెండు మూడు జాబులలోను "మీరు అవ్వగారి విషయంలో ఏమీ వ్రాయలేదు. ఆమె ఇంకా అక్కడే వున్నారు. రామ హెగ్గడెగారు పట్టిన పగవల్ల ఆమె చాల దుఃఖపడుతున్నారు. మేము ఇంటికి రండి అంటే రావడం లేదు. ఈ రెండు నెలలలో ఆమె చాల చాల చిక్కిపోయారు. నా కొక భయం పట్టుకుంది – వచ్చే చవితి వరకు, బెనకయ్య విగ్రహ ప్రతిష్ఠ అయ్యేవరకు ఆమె జీవించి వుంటారా – అనే సంశయం కలుగుతున్నది. దేవాలయం పడగొట్టాము. కొత్తగా ప్రతిష్ఠ జరిగే వరకు పూజ జరుపడానికి అవుతుందా? మీరు ఇదంతా బోధించింది ఆ అవ్వ ఆ ఒక్క ఆశను పూరించడానికి. ఆ లోగానే ఆమె మరణిస్తే, 'నా వల్ల దేవునికే అతంత్రమయింది' అని అనుకోవచ్చు. మొత్తంమీద ఆ బెనకయ్యే కాపాడాలి." అని జాబు ముగిస్తూ, "దేవాలయం గోడల పని ఇక వారంలో ముగుస్తుంది. కలప పని జరుగుతున్నది. వెంటనే వాసాలు ఎక్కిస్తాము. ఇంకా పెంకులు రాలేదు. త్వరలో రావచ్చు" అని జాబు ముగించాడు.

ఇదంతా తలుచుకుంటే నాకు ఒకొకప్పుడు నవ్వు వస్తుంది. నేనే వ్రాసి యిచ్చిన ప్లాను ప్రకారం కొత్త బెనకయ్య గుడి, నా స్వప్నాలలో, నా పగటి కలలలో లేచి కనిపించేది. మొదటి గుడి స్థానంలో పుట్టిన ఈ క్రొత్త గుడిని నేను మహాశ్చర్యంగా చూస్తున్నాను. దానిలో – కప్పు పని పూర్తయి, గోడలకు గచ్చు పని పూర్తయి, ప్రతిష్ఠా దినమూ సన్నిహితమై, అదీ జరిగి పార్వతమ్మ ప్రార్థన ప్రకారం 'మూడు పూజకు' వేయి టెంకాయల రాశి పడడమూ చూస్తున్నాను. ఒకొక సమయం ఈ స్వప్న చిత్రానికి మారుగా, గుడి పైకి లేవకనే దాని పని అర్ధంలోనే ఆగిపోయి, బెనకయ్య ఎండలో మాడడమూ చూచేవాడిని. రామ హెగ్గడెగారి శాపం నిజమై పార్వతమ్మ గతించి ప్రేతమై శంకర హెగ్గడెగారి యింటి పడమట వున్న వెదురు పొదనుంచి బెనకయ్య గుడి వరకు నక్కలాగ అరవడం విని బెదరి పోయాను. ఇవన్నీ – వట్టి స్వప్నాలే. ఇంతే వ్యత్యాసం! స్వప్నం సంభవించి నంతసేపు దానికి గురిఅయిన ప్రాణికి సుఖం, దుఃఖం, భయం భీతి అన్నీ నిజమవుతాయి. బ్రతుకనేది మాయ – అని అంటారు కదా! అని

తీరా మాయ ఎవరికి అంటే, మనకు మరణించిన మీదట అది మాయ, బ్రతికివున్నప్పుడు ఆ అన్ని సుఖదుఃఖ భయభీతులూ పూర్తిగా నిజం. మరొకరి సుఖదుఃఖాలు మనకు మాయలాగ కనిపించేటప్పుడు, మనది మనకు మాయో, కాదో తెలుసుకొనడానికి మన ప్రవర్తనను పరిశీలించాలి.

ఉగాది గడిచింది; చైత్రశుద్ధ పాడ్యమీ వెళ్ళిపోయింది. బెనకయ్య దేవాలయం గోడలమీద కప్పు పడింది; దానిమీద సూర్యుని ఎండ పడేటప్పుడు, ఎర్రటి పతాకాలలాగ, పచ్చని వెదురు పొదల మధ్యన చాల అందంగా కనిపిస్తున్నదని శంభు తెలిపాడు. దానికితోడు, "స్వామీ, వ్రాసి వ్రాసి నాకు విసుగు పుట్టింది. మీరొకసారి యిక్కడికి వచ్చేతీరాలి. ముగిసిన పనులను చూడడానికైనా సరే; పార్వతమ్మవ్వకు ఒక మాట చెప్పడానికైనా సరే," అని రెండే పంక్తులలో తన ఉత్కటాపేక్షను అతడు తిరగతోడాడు. నన్నూ నా మనస్సాక్షి తొలుస్తున్నది. గుడి పైకి వచ్చింది. గోడల గచ్చుపని కాకపోతే ఏమీ చింత లేదు. ప్రతిష్ఠ కావచ్చు. ఆ విషయం ఇక ఎక్కువ ఆలోచనకు గురి కానక్కరలేదు. పార్వతమ్మను చూచిరావడం దానికన్నా ఆవశ్యకమయిన పని. అక్కడికి పోవామా, వద్దా అని ఊగిసలాడాను.

ఊగిసలాడుతున్న రెండు రోజులలో నేను కోరని స్థలం నుంచి, ఒక జాబు వచ్చింది. యశ్వంతరావుగారి మరణ వార్త బెనకనహళ్ళి నుంచి, నెమ్మదిగా సంచరిస్తూ, కుమటికి పోయివుంటుంది. అదే ఆ జాబుకు కారణం. "స్వామీ, మీరెవరు? ఏమి అనే సమాచారం నాకు తెలియదు. అందువల్ల నా వక్కణంలో హెచ్చు తగ్గులుంటే క్షమించండి. మీకు మాత్రం నేను ఎవరు ఏమి అనే సంగతి తెలిసే వుంటుంది. తెలుసుకొనే ప్రయత్నం మీరు చేయనందుకోసమే చాల వేసట పుట్టింది. మా తండ్రి మరణించిన సంగతి తెలిసినప్పుడు, మీరు ఆయన కుటుంబం వారమైన మాకు, పిండం వేయవలసిన వారికి ఒక మాటయినా తెలియజేయవలసి వుండలేదా? మా తల్లి యింకా బ్రతికి వున్నారు గదా!....

"ఇదంతా చూచినప్పుడు, మీరు బెనకనహళ్ళిలోని ఒక ముసలి వంటలక్కయింటికి వెళ్ళి, మా తండ్రి పేర డంబాలు కొట్టడం విన్నప్పుడు నాకే కాదు, ఎవరికైనా ఆశ్చర్య మవుతుంది. మా తండ్రి ఆస్తిపాస్తి డబ్బు దస్కానికి మీరు కాదు హక్కుదార్లు, నేను. మీ చేతికి ఆయన డబ్బు చాల

వచ్చినదట. ఆయన మరణ సమాచారం మాకు తెలుపక కూర్చున్నందుకు మంచి కారణం వుండదు. ఇకనైనా, ఆయనది ఏముందో దాని వివరాలు మాకు తెలిపి, వాటిని మాకు అప్పగించి, క్రమమయిన రశీదు పొందాలి. లేకపోతే మేము వకీళ్లను నియమించి, తగిన చర్యలు తీసుకోవలసి వస్తుందని తెలుపవలసి వస్తున్నది.

ఇట్లు చొచ్చలుమనె సీతారామ హెగ్గడె."

బలే! - అనిపించింది మనస్సుకు! పోనీ! తండ్రి మరణించినప్పుడు నాలుగు దమ్మిడీలయినా ఆయన చేతిలో మిగిలివుంటాయనే నమ్మకంతో, అతనికి తను తండ్రికి పిండం వేయాలనే సద్బుద్ధి కలిగింది కదా! సుమారు పదిహేను సంవత్సరాల వ్యవధి తర్వాత తండ్రి జ్ఞాపకం వచ్చింది కుమారునికి. దానితోపాటు, అతని తల్లి, కమలమ్మ అని కదూ పేరు - బ్రతికున్నారు – అని విన్న తర్వాత నాకు కొంచెం వ్యథ కలిగింది. ఏ సందర్భంలోనన్నా సరే, ముత్తైదు అనిపించుకొన్న దానికి వైధవ్యం అప్రియం అనిపించేని. ఏమైనా నా ఈ కొత్తమిత్రుడు నామీద అయోగ్యత అనే ఆరోపణచేసి, తగు చర్యలు తీసుకోక ముందే నేను ఆయనను కలుసుకోవాలి, ఖండితంగా కలుసుకొననే కలుసుకొనేవాణ్ణి. అయితే, ఇంత తొందరపడే వాణ్ణి కాను. నా మిత్రులు సంప్రదాయం పాటించే వ్యక్తి అయితే బొంబాయినుంచి నేను తిరిగి వచ్చిన దినమే, ఆయన కుమారునికి తండ్రి మరణవార్త తెలిపేవాడిని. దానికి నా మిత్రుల డైరీలో, ఆయనకున్న విశ్వాసాలు అడ్డు వచ్చాయి.

"నేను ఉండేది ఇప్పుడు, చచ్చిన తర్వాత కాదు. పుట్టడానికి ముందు లేను; చచ్చిన మీదట మిగిలేది నా ప్రవర్తన జ్ఞాపకం; నేను కాదు. లేని నా కోసం నడిపే శ్రాద్ధాది కర్మలు నాకు సమ్మతం కాదు. నా పట్ల చూపే శ్రద్ధ, నాలో కనిపించిన మంచి గుణం ఏదైనా వుంటే, దానిని జీవితంలో ఆచరణలో పెట్టడం. అటువంటి శ్రాద్ధం ఎవరు ఎవరికైనా చేయవచ్చు. అది మానవీతకు చేసే శ్రాద్ధం; వ్యక్తికి కాదు. మానవుడు చిరంతనుడు. మనం నాల్గు రోజుల దృశ్యం" అని యశ్వంతులు తమ జ్ఞాపకాల పుస్తకం (స్మరణ గ్రంథం) మొదటి పుటలోనే వ్రాశారు.

యశ్వంతరావుగారి మనోధర్మం ఇలా వుండగా, ఆయన బతికి వున్నప్పుడు అశ్రద్ధతో చెనకి, పీడించి, చచ్చినమీదట బాంధవ్యం స్మరించి,

ఆయనకు పిండం వేస్తే ఏమి వస్తుంది? అది వట్టి కాక పిండమవుతుంది; పితృభక్తిలోని ఏ లక్షణమూ దానికి రాదు.

ఇలాంటప్పుడు, నేను కుమటిలో వున్న ఆయన కుమారుని చిరునామా వెదకడానికి తొందర పడలేదు. నా మిత్రుని జీవిత చిత్రం ఇవ్వడానికి తీరికగా అతని పరిచయం చేసుకొనేవాడిని. లేకపోయినా, ఆయన బ్యాంకి ప్యాస్ బుక్కులో పదిహేను వందలంత నగదు డబ్బు కాచుకొని వుంది. అది బ్యాంకు వారికి ఉంబళి (దఖలయ్యే సొమ్ము) కానక్కరలేదు. చట్టం ప్రకారం అది వారసులకే పోవాలి. ఈ డబ్బు ఉండడం నేను ఆయన యింటి వారికి మొదటే తెలియజేసి వుంటే బాగుండేదేమో! ఇప్పుడు నేను యశ్వంతుల కుమారుని జాబు ప్రత్యుత్తరంగా నాలుగు మాటలు వ్రాశాను.

"నాకు అత్యంత ప్రీతి పాత్రులయిన యశ్వంతరావుగారి సంతానం మీరని విని చాల సంతోషమయింది. కేవలం వినికిడి మాటలతోనే, నా మీద లేనిపోని ఆరోపణలను చేశారు. తమకు విరామమయితే, తాము ఇక్కడి వరకు వచ్చి వెళ్ళాలి. మీ తండ్రిగారి డబ్బు నా వద్ద వుండడం నిజం. ఆయనే తమ అవసాన కాలంలో తగిన ఏర్పాట్లు సూచించి, ఇటు వంటి పద్ధతిలోనే దానిని వినియోగించండి - అని తెలిసి, నాకు డ్రాఫ్ట్ మూలంగా డబ్బు పంపారు. ఆయన ఆదేశం వున్న జాబు మీరు చూడ వచ్చు. ఇంకా, ఆయనవనే కొన్ని చిత్రాలున్నాయి; పుస్తకాలున్నాయి; వాటి నన్నిటినీ మీరు వచ్చి తీసుకొని వెళ్లవచ్చు. బొంబాయిలోని ఇండియన్ ఓవర్సీస్ బ్యాంకులోని నంబరు 2516 వ అకౌంటులో రూ 1613-7-0 లు మిగిలాయి. మీరు సరాసరిగా బ్యాంకుకు వ్రాసి, ఆ డబ్బును చాలినంత త్వరలో పొందవచ్చు. మీకు మీ వకీలుగారు వేరే ఏమయినా తగుచర్య, లేక నిబంధనలు తెలిపితే, అలాగూ చేయవచ్చు" అని తెలిపాను.

ఈ పితలాటకు చేయిచేసుకొన్న మహానుభావులు ఎవరని తెలుసుకో వాలని కుతూహలం పుట్టడం స్వాభావికం. నా కళ్లకు, దానికి తగిన వాడుగా కనిపించిన ఒకే వ్యక్తి రాజశ్రీ రామ హెగ్గడెగారు. ఆయన జ్ఞాపకంతో ఆయన తండ్రి జ్ఞాపకమూ రాక పోలేదు. యశ్వంతులపై వల విసిరి, అప్పిచ్చి, చేపలు పట్టడానికి వెళ్ళి, పెద్ద చేప పట్టిన మహాను భావుడు. ఈవిధమయిన మత్స్య వ్యవసాయం తమ జీవితానికి భూషణ

మని బ్రాహ్మణులు భావిస్తారు. అటువంటి కాలంలో పార్వతమ్మ నిస్వార్థ జీవితానికి, నిరపేక్ష బుద్ధికి ఆయన మన్నన యిస్తారా?

సీతారామ హెగ్గడెగారికి జాబు వ్రాసిన నాడే శంభు హెగ్గడెకు, "ఈ జాబు చేరే లోపల నేను మీ వూరికి వస్తేనూ రావచ్చు" అని తెలిపాను. జాబు వేగం అతిక్రమించి కుమటకీ, ముందు శిర్సీ మార్గంగా స్వాదికీ వెళ్ళి అక్కడినుంచి బెనకన హళ్లీకి వెళ్లాను. వెళ్లుతూ నేను కుమటలో ఆగలేదు. అంతలోగా నా జాబు సీతారామ హెగ్గడెగారికి చేరుతుందో లేదో అనే సంశయమూ కలిగింది. తిరిగి వచ్చేటప్పుడు ఆ దారి మీదుగా వద్దామనే అపేక్ష కూడా నాకు లేదు. కుమటకి పోతే, అక్కడ ఎనిమిది నాళ్లయినా గడపవలసి రావచ్చు. యశ్వంతరావుగారి యిద్దరు మన వృత్తిదార్లు అక్కడున్నారు. కుటుంబం వారి వెలుపలి లోపలి విషయాలు తెలుసుకోవా లంటే, ఇతర మిత్రులను ఆశ్రయించాలి. అవన్నీ బెనకయ్య అనుగ్రహం అయిన మీదట – అని అనుకొని ముందుకు సాగాను.

ఈసారి స్వాదికి వెళ్లినప్పుడు ఎడ్ల బండి యోగం తప్పింది. అక్కడ బస్ సంచారం ఆరంభమయింది; గంటన్నరలో నా ప్రయాణం ముగి సింది. అక్కడి నుంచి నేను ఇంతకు ముందు నడిచిపోయిన అడవి దారి పట్టి బెనకన హళ్లీకి వెళ్లాను. ముందు వెళ్లినప్పుడు వర్షాకాలం. ఇప్పుడు మండు వేసవి. ఎండకు వనశ్రీ కూడా వాడిపోయినట్లు కనిపించింది. అక్కడక్కడ నూరారు పక్షుల కలకలారావం విన్నాను. ఆకులు రాలిన బూరుగు మానుల కొమ్మలు రెమ్మలలో ఎర్రటి పూవులు విచ్చి రాలు తూండడం చూచాను. ఎండకు చెమటోడుస్తూ, దప్పితో నోరు ఎండిపోతూ, విసవిస అడుగులు వేస్తూ బెనకయ్య గుట్టకు వచ్చాను. బెనకయ్య గుడి నాలుగు పక్కలా చెట్ల పొదలను, వెదురు పొదలను నరికి శుభ్రం చేశారు. నూతన దేవాలయం గర్భగుడి కప్పును పెంకులు కప్పారు. ఎదుటి చావడికీ పెంకులు కప్పారు. 'మన శంభు తన పాపానికి తగిన ప్రాయ శ్చిత్తం చేసుకొన్నాడు' అనే మనస్సు సమాధానం కలిగింది. గుడి కెంపుల కప్పు చూచి సంతోషమయింది. 'పార్వతమ్మ ఇంతయినా చూచి వుంటుందా? చూచివుంటే ఆమె జీవం చౌతివరకు కాచుకొని వుంటుంది' అని ఆలోచన కలిగింది. దూరం నుంచే ఆ గుడిని చూచాను. ఆ కల

నిక్కల అయిన ఆనందం అనుభవిస్తున్నప్పుడు వీచిన మంద మారుత మొకటి శంభు ధ్వనిని నా చెవిలో తెచ్చి పడవేసింది.

"వచ్చారు కదా! వచ్చారు కదా! నాకు అదే భయం! మీరు రాక పోతే పార్వతమ్మవ్వ ఏమి చేస్తారో ఏమోనని" అని శంభు నాకు స్వాగత మిచ్చాడు. ఆ గుడికి నాలుగు నాలుగు సార్లు నన్ను ప్రదక్షిణం చేయిం చాడు. నేను కన్నుల నిండా దానిని సంతోషంతో చూచాను. కర్ర పని చాల బాగ చేశారు. పాత పద్ధతిలో పెద్ద స్థంభాలు, బోదెలు, దంతెలు చెక్కడపు పనితో అలంకరించారు. గుడి లోపల గచ్చు పని ప్రారంభ మయింది. నేను శంభువు వెన్ను తట్టి "భేష్ ! బలే!" అని పొగిడాను. అంతవరకు నా ముందు పురుగు వలె కనిపించిన అతడు, తా నొక మనుష్యున్నయ్యా ననే సంతోషంతో నిలబడడమూ కనిపించింది. నేను మాటల ఉపచారంతో అతనిని ఉబ్బించాను. "శంభయ్యగారూ, మీ నాన్న గారు ఇంట్లో వున్నారు కదా?" అని అడిగాను.

"ఇప్పుడెక్కడికి పోతారు? పూజ చేస్తూ వుండవచ్చు" అన్నాడతడు.

"మీకు అవన్నీ లేవా?"

"అవన్నీ మా నాన్న ఉన్నన్ని రోజులు ఆయనే చేస్తారు?"

"అలా అయితే, దేవుడు ఒకరికే...?

"అది ఎలాగో, మీరు నాలాగ కాదూ? మీరు రోజు భోజనానికి ముందు సంధ్యావందనం, జపం చేసిందీ చూడలేదు."

"అదేమి కొత్తా? నేనే వాటిని చూడలేదు."

"గణపతి మీద ఇంత భక్తి పెట్టి..."

"గణపతి మీద భక్తితో కాదు; భక్తితో వున్న వారి మీది భక్తితో."

ఆ మాట అతని తలలో ఎక్కలేదు. నాకు కావలసిన పని వేరే. అందువల్ల "రండి, మొదట అవ్వగారిని చూచుకొని వద్దాము. ఆ మీదట మీ యింటికి వెళ్లితే సరి" అన్నాను.

"దాహం తీసుకోకుండానా?" అని అంటూ, అతడు నా చేయి పట్టుకొని లాక్కొని కిందికి దిగాడు. మొదటి దిగుడు దారి వచ్చింది. "ప్రథమ చుంబనే దంత భంగః" అయిన స్థలం! కనుక ఆ స్థలం రావడానికి ముందే, "ఇప్పుడూ బురద వుండదు కదా!" అని అడిగాను. "రండి, చూడండి" అని అతడన్నాడు. ఆ దారి కూడా చక్కబడింది. దానిని మరి కొంత

వెడల్పు చేసి, అక్కడక్కడ కొట్ల రాళ్లతో మెట్లు కట్టి చక్కబరిచారు. వాళ్ల ఇంటికి వెళ్లాను; శంకర హెగ్గడెగారికి కేకతోనే వచ్చినట్లు తెలిపాను. ఆయన అక్కగారికి "త్వరలో వస్తాను" అని గట్టిగా చెప్పి శంభువును వెంటబెట్టుకొని, బయలుదేరాను. నా పాడు కళ్లు ఇంటి పడమటి వైపు మళ్లాయి. దాయాది ద్వేషపు వెదురు పొద కనిపించింది. వారి యింటి పెరడు దాటగానే, "శంభయ్యా, నేను మీ మీద పెట్టిన విశ్వాసాన్ని మీరు చక్కగా నడిపించారు. మీకు దీని నుంచి శ్రేయస్సు కలుగుతుంది. నాకు మరొక ఆశ వుంది. దానిని జరిపిస్తారా? చెప్పండి" అని అడిగాను.

"ఏమి కావాలండీ? నన్ను మీరు జెయిలు పంపవలసింది. దొడ్డ మనసు చేసి, నన్ను క్షమించారు. అలా వున్నప్పుడు. ."

"మీరూ అంత దొడ్డ మనసు చేస్తే సరి."

"ఏమిటి చెప్పండి? నా శక్తిలో వుంటే లేదు అనను."

"శక్తికి మించినది నేను కోరనూ కోరను. ఇప్పుడు యశ్వంతరావుగారి యింటి స్థలం ఎవరిది? అది మీ కుటుంబందా? లేక రామ హెగ్గడెగారికి చేరిందా?"

"రామ హెగ్గడెగారికి చేరి వుండదు. అనుభోగం వల్ల అది మాది. మరొకరు ఈ స్థలానికి రాలేదు; రాలేరు. మరి మా కుటుంబం వారి హక్కు ఎంత, ఏమి - అనేది నాకు తెలియదు. నలభై ఏళ్లయింది. ఏమున్నా, ఆ హక్కు మూలకు పడినట్లే కదా?"

"అది అంతే. అలా అయితే, మీరు, అక్కడి వెదురు పొదలు నరికించి, కాల్చి, శుభ్రం చేయించి, ఒక చిన్న గుడిసె వేయించాలి. మరి దేనికీ కాదు; పార్వతమ్మకు అక్కడ వుండడం కష్టమయితే, మీ దగ్గర వుండడానికి ఉలుకయితే ఇక్కడ ఆమెను పిలుచుకొనివచ్చి పెట్టవచ్చు గదా! పది హేను రోజులలో ఇంత పని చేయించడం సాధ్యమవుతుందా? మీ అత్తకూ సంతోషం కలుగుతుంది" అన్నాను.

"ఆ ఉపాయం సరైందే. చేయడం కష్టమేమీ కాదు; పార్వతమ్మ రావడానికి ఒప్పుకుంటే అవుతుంది."

"ఒప్పించే ప్రయత్నం నాది."

ఇలా మాట్లాడుతూ, మేము మైదానం దాటి రామ హెగ్గడెగారి తోట, ముంగిలి దాటి, పార్వతమ్మ యింటిముందు నిలబడ్డాము. శంభువు అక్కడే

బావిలోని నీళ్లు చేది నా కాళ్ల మీద పోసి, తానూ కాళ్లు కడుక్కొని, ఇంట్లో దూరాడు. "అవ్వా, నీ పెంపుడు కుమారుని దోస్తు వచ్చారు" అని గట్టిగా చెప్పాడు. అతని వెంటనే నేనూ ఇంట్లో ప్రవేశించాను. లోపలికి వెళ్లాను. అక్కడ చీకటి నిండింది. అక్కడే కదా, నేను ఒకపూట భోజనం చేయడం! నాకు భోజనం పెట్టి తను భోజనం చేయక, తన పెంపుడు కొడుకు పేరున భగవన్నామ స్మరణ చేసింది! ఇప్పుడు, అక్కడే ఒక చింకి చాపమీద ఆ ముసలమ్మ పడుకొని వున్నారు. నేను ఇంతకుముందు చూచినప్పటి కన్నా శరీరం సగానికి సగం చిక్కిపోయింది. ఆ పెద్దావిడకు వంగి నమస్కారం చేశాను. ఆమె "నాయనా, ఈ బీదరాలిని చూడడానికి నీవు అంతదూరం నుంచి ఎందుకు వచ్చావు, చెప్పు? దానికోసమే కదా వచ్చావు?" అని అడిగారు. "అమ్మా! మిమ్మల్ని చూడడానికే వచ్చాను. నన్ను పిలిపించు కొన్నవారు మీరు; మీ పెంపుడు కుమారుడు; మీరు ఆజ్ఞాపించిన బెనకయ్య గుడి" అన్నాను.

కొంచెంసేపు ఆమె నన్నే చూచారు. కొంచెం నవ్వారు. "ఆ బెనకయ్య ఆశీర్వాదం నీమీద వుండనీ. నాకు వాడి దేవాలయం జీర్ణోద్ధారం కావడం చూపితీరాలనే బయలుదేరావు. నా కుమారుడు నీ నుంచి అంతా చేయి స్తున్నాడు. అయితే నా నుదుట . . ." అని ఉద్గారంతో ఊరికే వుండి పోయారు.

"అమ్మా, ఇంతేనా మీ వేదాంతం? మీకు ఏమైంది ఇప్పుడు? మీరు బెనకయ్యకు అంత సేవ చెల్లించిన మీదట వాడు మీ నుంచి ఆ సేవ తీసుకోకుండా మిమ్మల్ని పిలిపించుకుంటాడా?"

"అంత చేస్తే బాగుండీని."

"చేస్తాడు లెండి. మీ బెనకయ్య నిజంగా దేవుడైతే, మీ అపేక్ష నడిపించకుండా వుంటాడా?" అని చాల భక్తి వున్నవాడిలాగ నేను ఆ మాటలు అన్నా, ఆమెను చూచేటప్పుడు, నా అంతరంగంలో అలాంటి ధైర్యం ఇంతయినా మిగులలేదు. శంభు నెమ్మదిగా, రామ హెగ్గడెగారి నుంచి కలిగిన వ్యర్థ ప్రలాపాలన్నీ నోరు విప్పి ఆమె ఎదుట వర్ణించాడు.

"అదీ ఒక పుటక" అన్నది పార్వతమ్మ.

"అమ్మా, నేను మీ పెంపుడు కుమారుని డబ్బు సంగతి చెప్పి ఇంత

తాపత్రయానికి కారణమయ్యాను. మీ అపేక్షను తీరుస్తాను –'' అన్నాను. నేను ఏ వూరి వాడినో ? ఏ కులం వాడినో !

"నీవూ నా కడుపున పుట్టిన బిడ్డవే. ఏ జన్మలోనో నేను నీకు తల్లి అయి వుండాలి. లేకపోతే, నేను నీ బిడ్డనయి వుండాలి'' అన్నారు ఆమె.

"చాల గొప్ప ప్రీతి పెట్టుకున్నారు. ఆ ప్రీతితోనే మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను'' అని చెప్పి, నా అపేక్షను ఆమెకు సూచించాను. నా మాటలు విని శంభు "మీరు వద్దు అనకూడదు. చా, చూ అనరాదు. అస్తు అనాలి. మీరిలా ఇక్కడ పడి తిండి తీర్థం లేకుండా కుళ్లిపోయే స్థితి రాగూడదు'' అన్నాడు.

ఆమె మౌన సమ్మతిని పొంది ఇద్దరమూ ఇంటికి బయలుదేరాము. మేము తిరిగి వెళ్ళేటప్పుడు, రామ హెగ్గడెగారు తమ యింటి చావడిలో తాంబూలం సేవిస్తూ, మమ్మల్ని చూచీ చూడనట్టు కూర్చున్నారు. మేము ఆయనను చూచీ చూడనట్లు వెళ్లిపోయాము.

ఇంటికి తిరిగి వచ్చేవేళకు శంకర హెగ్గడెగారు జప తప పూజలను ముగించి, విభూతి పట్టె వర్ధనాలతో అడవినుంచి తప్పి వచ్చిన బక్కచారల పులిలాగ ఇంటి అరుగుమీద కాచుకొని వున్నారు. ఐదారు 'హో. . హో. . హో. .' లతో సంభ్రమంతో స్వాగతమిచ్చారు. ఈసారి నేను వాళ్ల ఇంట్లో మూడు నాళ్ళు కాదు, ఆరు దినాలు గడిపాను. శంకర హెగ్గడె, శంభు హెగ్గడెగార్ల సాహసంతో రెండే రెండు రోజులలో పది పన్నెండు మంది కూలీల కత్తులతో భగవంతయ్య యింటి స్థలం శుభ్రమయింది. వెదురు పొదలనూ, తీగల తుప్పలను నరికి దూరంగా తోసి రాశి వేశారు. పాత యింటి బునాది సరిచేసి, శుభ్రపరచి అక్కడ కంబాలు నాటి, వెదురు తడకలు బిగించి, రెండే రెండు నాళ్లలో ఒక గుడిసె కూడ వేశారు. వానలు వచ్చేలోపుగా, ఒక అంకణం స్థలానికి మంటిగోడ పెట్టిస్తానని శంకర హెగ్గడెగారు వాగ్దానం చేశారు. ఇంతపనికి యాభై రూపాయల ఖర్చు కూడ పట్టివుండదు. ఇది జరుగవలసింది యశ్వంతరావుగారి లెక్కకు – అని ఒత్తిడి చేసి నేను శంకర హెగ్గడెగారి చేతిలో డబ్బు బలవంతంగా తురికాను. చాల సందిగ్ధావస్థతోనే ఆయన దానిని స్వీకరించారు. ఈసారి ఆయన మనస్సులో దాయాది విషయంలో చాల పరివర్తనం కలిగింది. ఐదవనాడు పార్వతమ్మ ఇంటికి నేను, శంభువు, మూకాంబిక కలిసే

వెళ్ళాము. ఆ మరుసటి రోజు మంచి రోజని చెప్పి, ఆమెను మోసుకొని పోయి, ఆమె పెంపుడు కొడుకు ఇంటికి తీసుకొనివచ్చే సంబరం జరిపాము. అక్కడికి తెచ్చి, ఒరిగించినప్పుడు మూకాంబిక "పార్వతీ, ఇది, నీవు నీ యశ్వంతుని కాళ్లు దాచుకొని పడుకోబెట్టుకొని నూరు సార్లు నిద్రపోయిన స్థలం" అని పూర్వస్మరణ కలిగించనప్పుడు ఆమెకు ఆనందబాష్పాలే కురిశాయి. ఆ కలను ఆమె నిజానికి కన్నదో ఏమో!

"నా బెనకయ్య ఇంతయినా, జరిపించాడు కదా?" అన్నారు పార్వతమ్మ. తమ చిన్నతనంలో అన్నం పెట్టిన యిల్లు తిరిగి ఒక గుడిసె అయినా, తమ చివరి కాలంలో నీడ యివ్వడం తలచుకొన్నప్పుడు, ఆమెకు అదెంత సంతోషమయిందో, ఏమో!

అది ఆరోదినం. ఆ మధ్యాహ్నం మరొకసారి మోసుకొని బలవంతంగా బెనకయ్య గుడి వరకు తీసుకువెళ్లాము. ఒక గడియ సేపు రెండు రెండు స్తంబాలకూ ఒరిగి మూకాంబిక, ఆమె స్వప్న సుఖం అనుభవించడం చూచి నప్పుడు నా సంశయం యావత్తు నివారణమయింది. ఇది నా మిత్రులు యశ్వంతరావుగారి ఆశయానికి తగిన పని అనే సంతృప్తి కలిగింది. ఆయన ప్రవర్తనకు నేను అపచారం చేయలేదనే ధైర్యం కలిగింది.

మూడోసారి నేను బెనకనహళ్ళికి వెళ్లి వచ్చునని మీరూ ఊహించ వచ్చు. నేనూ అలాగే నిర్ధరించాను. వెళ్లాను. అది బెనకయ్య పునః ప్రతిష్ఠాపనోత్సవం కోసం; ఆ పార్వతమ్మ కళ్లముందే, వాడికి 'మూడో పూజ' జరుపడం చూడడానికి. అది జరగడం చూచి, ఆమె ఆశీర్వాదం పొంది, నా ఊరికి మరలిపోయిన దినమే "ఆ పార్వతమ్మను బెనకయ్య పిలిపించుకొన్నాడు" అన్న దుఃఖ వార్త నాకోసం ఎదురుచూస్తూ వుంది.

## ఎనిమిది

చైత్ర మాసంలో నేను బెనకన హళ్ళికి పోయి, పార్వతమ్మను ఎగువ యింటికి పిలుచుకొని వచ్చిన తర్వాత మరెక్కడికీ పోకుండా, మా వూరికే తిరిగి వచ్చాను. ఆ పదిహేను నాళ్లలో చొచ్చలు మనె సీతారామ హెగ్గడె

గారి మరొక జాబు నాకు అందింది. దొరగారు ఆ జాబు కొంతమట్టుకు సావధాన చిత్తంతోనే వ్రాశారు.

"మహనీయులుగారూ,

మీరు నా తండ్రిగారి మరణం విషయంలో నేను వ్రాసిన అక్షేపణ దేనినీ గమనించక, జవాబు వ్రాశారు. ప్రాయశః మాకూ, మా తండ్రిగారికీ మనః క్లేశం వుందని తమకు తెలిసినందున తాము సకాలంలో వార్తలు తెలుప లేదో ఏమో! మీరు తెలుపకపోయినా, దూరపు బంధువులనుంచి అది మాకు తెలిసింది. అప్పుడే, పెద్దలకు చేయవలసిన ఉత్తరక్రియలను చేసి ముగించాము. బేంకులో వున్న డబ్బు సంగతి తెలిపినందుకు మీకు వందనాలు. మా తండ్రిగారి నుంచి మీకు నగదుగా వచ్చిన డబ్బెంత, ఏమి అనే విషయంలో మీరు మౌనంగా వున్నారు. అది అంత సరైన నడత కాదు. మాకు మా తండ్రిగారి ఆస్తిపాస్తులలో సంపూర్ణమయిన హక్కున్నది-అన్న దాన్ని చట్టం తెలిసిన ఎవరైనా మీకు తెలుపగలరు. ఇంతకన్నా హెచ్చుగా, సద్య, సరైన సంగతి తెలియక మేమేమీ వ్రాయలేము. సాధ్యమయినంత త్వరలో మేమే మీరున్న చోటికి వస్తాము. అప్పుడు మీ వద్ద వున్న కాయిత పత్రాలను మీరు చూపుతారని నమ్మినాను. అంతేకాక, మా తండ్రిగారి సొత్తు సామగ్రులు బొంబాయిలో ఎక్కడున్నాయి? ఏమిటి మిగిలాయి?- అనే విషయం ముందుగా తెలిపితే, అక్కడికి వెళ్ళి వాటి విషయంలో ఒక ముగింపునకు రావడానికి అనుకూల మవుతుంది. మా తండ్రిగారి అప్తులు మాకూ ఆప్తులనే విశ్వాసంతో, ఈ జాబు వ్రాశానే కాని, అన్యథా భావించరాదు.

ఇంతే నమస్కారాలు.

సీతారామ హెగ్గడె."

నాకు తెలిసిన మట్టుకు యశ్వంత హెగ్గడెగారికి ఒక్కడే కుమారుడు; ముగ్గురు కుమార్తెలు కాబోలు - ఉండాలి. ఆడ పిల్లలందరికీ పెళ్ళయింది; అత్తవారిండ్లకు వెళ్లిపోయారు. ఈ సీతారాముడు తన జాబులలో "మేము, మేము" అని వ్రాసేటప్పుడు, దానిలో ఆడ పిల్లలూ చేరారని నేను అనుకో లేదు. ఈ 'మేము' దొరతనము మేము అనే భావన నాకు కలిగింది. 'మా తల్లి', 'మా తండ్రి,' 'మేము' అనేటప్పుడు దానిలో విశాల బుద్ధీ కనిపించ లేదు. వచ్చిన జాబు కొక జవాబు వ్రాయాలి - అనుకోడంవల్ల నేను కొంచెం

వ్యంగ్యంగానే, ఒక కార్డు వ్రాశాను. "మీ ప్రీతి పూరిత లేఖ వచ్చి అభి ప్రాయం తెలిసింది. మీకు సంబంధించిన విషయాలను దీని వెనుకనే వ్రాశాను. ఆయన నివసించిన బొంబాయి యింటి చిరునామా ఈ కింద యిచ్చాను. అక్కడ వారి పాత్రలు, పళ్లాలు, కుర్చీలు, బల్లలు ఉన్నాయి. నేను మోసుకొని రాలేదు. వాటిని కట్టడం యజమాని అధీనంలో వదలి వచ్చాను. తమరు ఇక్కడికి ఉచితమని తోచినప్పుడు రావచ్చు. నాకు తెలిసిన విషయాలు తెలుపడానికి సర్వదా సిద్ధంగా వున్నాను. ఇక్కడున్న ఆయన వనే అన్ని వస్తువులూ మీరు చూడవచ్చు.

ఇతి, మీ – – –"

అని జాబు ముగించి మరు టపాకే వేసి, కర్తవ్యం ముగించుకొన్నాను. ఆ జాబు చేరిన వెంటనే అతడు రావచ్చు – అనే నిరీక్షణా చేశాను. దానికి మారు, ఆయన, చాల సొత్తు దొరకవచ్చుననో, నాపై వున్న సహజ మయిన అపనమ్మకం వల్లనో ఏమో బొంబాయికి పోయి వచ్చినది నా పరిచితులు జెమ్‌షెడ్జీ కంట్రాక్టరుగారి నుంచి తెలియవచ్చింది. అక్కడికి వెళ్లి అతడు తన స్వభావానికి అనుగుణమయిన రంగు చూపించి వచ్చినట్టు కనిపించింది.

ఆయన వ్రాసిన జాబులో ఈ అభిప్రాయా లున్నాయి.

"మీ నుంచి నేను మీ చిరునామా తీసుకొన్నప్పటికీ, ఒక సంవత్సరం గడిచినా, జాబు వ్రాయలేదు; మిమ్మల్ని మరచి కూడా పోయాము. ఇప్పుడు ఒక సంఘటన వల్ల జాబు వ్రాయవలసి వచ్చింది. నాలుగు నాళ్ల క్రితం మీ వూరి వైపు నుంచి, సీతా రామ అనే వారొకరు ఇక్కడికి వచ్చారు. వచ్చి, తాను యశ్వంతరావుగారి కుమారుణ్ణని చెప్పుకున్నారట. అప్పుడు నేను యింట్లో లేను. నా భార్య ఆయనను కూర్చోమని చెప్పి సమాచారమేమని అడిగిందట. ఆయన మాట, పద్ధతి దానికీ నచ్చలేదు. నేను వచ్చిన తర్వాత నన్ను కలుసుకోండి అని ఆమె అన్నందున వచ్చిన అతను వెళ్లిపోయారట. నేను తర్వాత యింటికి వచ్చాను. మీరు యశ్వంత రావుగారి బంధువులని నేను ఊహించుకొన్నాను. తమ తండ్రికీ, మీకూ ఎలాటి సంబంధమూ లేదని, ఆయన రెండవ మారు వచ్చినప్పుడు నాకు చెప్పారు. మీరు ఆయన బంధువులని చెప్పకపోయినా, నేను అలా అను కున్నాను. యశ్వంతరావుగారు కూడ తమ స్వంత కుటుంబం వారి

విషయమేమీ మాతో మాట్లాడలేదు. అయినా, ఆయనకు తమ సంతానం నుంచి డబ్బు వస్తూ వుండవచ్చు—అని వూహించాను. నా ఆ అభిప్రాయం తప్పయినట్టు కనిపిస్తుంది.

"ఆయన మాట్లాడినప్పుడెల్లా మిమ్మల్ని నిందించడంలోనే గడిపినందున, నాకూ విని కష్టమయింది. నేనన్నాను - "చివరి గడియలో ఆయన అస్వస్థులయి పడుకొని వున్నప్పుడు మీ చిరునామా యిచ్చి పిలిపించండి" అన్నందున నేను మిమ్మల్ని పిలిపించాను. మీరు వచ్చారు. అటు తర్వాత మీరు వచ్చి ఇంటి సామాను స్వాధీనం చేసుకొన్నారు. ఆయన ఇంటిని ఇంటి యజమానికి అప్పగించారు. ఇప్పుడక్కడ మరొకరు అద్దెకు వుంటున్నారు. "'మీ తండ్రిగారి వస్తువులుంటే, వాటిని యింటి యజమాని ద్వారా పొందండి" అన్నాను. ఆయన "నేను, మీరు కలిసి తమ తండ్రి వేయారు రూపాయల సంపద అపహరించి వుంటాము" అనే రీతిగా మాట్లాడారు. నాకు కోపం వచ్చింది. "వెళ్లిపొండి" అని గద్దించి పంపించివేశాను. మరునటి దినం ఇక్కడికి యింటి యజమానితో పాటు వచ్చారట. ఆయన, మీరు వదలిపెట్టి పోయిన యశ్వంతరావుగారి కుర్చీ, సోఫా మొదలయిన వస్తువులు చూపి, "ఇవన్నీ సాగించి వేయండి" అన్నారట. బహుశా ఆయన యింటి యజమానితోను మాట్లాడి వచ్చి వుంటారు. ఇంటి యజమాని బాగా కోపంతో మాట్లాడి వుంటారు. అందువల్లనే మూడవ సారి నేనున్నప్పుడు వచ్చి, "ఈ సామానుకు ఎంత ఖరీదిస్తారో, యివ్వండి, మీరే తీసుకోండి" అన్నారు. నేను 'ఇక్కడ వున్న వస్తువులే కదా!' అని నూరు రూపాయలకు వాటిని మీద వేసుకొన్నాను. డబ్బిచ్చి రసీదు తీసుకొన్నాను. ఆయనకు తృప్తి అయి వుండదు. నాకు ఈ సామాను అవసరం లేదు. మన మిత్రుల వస్తువులు అని నేను వాటిని ఉంచుకొన్నాను.

"ఆ మీదట రెండు గంటలు అతడు తన తండ్రిగారి కథ చెప్పాడు. ఆయనది లక్షల ఆస్తట. ఆయన తన పెళ్లాము, బిడ్డలను దారిలో వదలి బొంబాయికి వచ్చి కూర్చున్నారట. ఇక్కడ డబ్బు విపరీతంగా దండుగ చేశారట. తనకూ, తన తల్లికీ, తన చెల్లెండ్రకూ వేయి విధాలుగా హింస పెట్టిన మహానుభావులు ఆయన అన్నారు. కొడుకయిన వాడు చెప్పరాని విషయాలన్నీ చెప్పారు; నేను ఊరికే చెవులు మూసుకొని విన్నాను. అతడు చెప్పింది నిజమయితే, కుటుంబం విషయంలో యశ్వంతరావుగారు

దాల్చిన మౌనానికి ఈ ఒక రకం పగే కారణమని తెలుస్తుంది. అయితే, ఆ కుమారుని ఆరోపణలు ఎంత నిజమో దేవుడికే తెలుసు.

"ఆయన దాదాను చూచుకొన్న విధం, ఆ మీదట తన వలలో తగుల్చుకొన్న ఒక నర్సు విషయంలో నడచుకొన్న రీతులను నేను కళ్ళార చూచాను గదా. యశ్వంతరావుగారి స్వభావం ఇతరులు అన్యాయం చేసినా, తిరిగి చేసేటట్టిది కాదని — నాకు ఎప్పుడో తెలిసింది. ఈ సీతారామ్ నాకు మరొక సంగతి చెప్పాడు. తమ తండ్రి చాల విషయలోలురట. అలాటి స్వభావం ఆయనలో నేనెప్పుడూ చూడలేదు. అతడు ఎక్కువ ఆరోపణలు చేసింది మీమీద. యశ్వంతరావుగారు మీకు యాభై అరవై వేల రూపాయలిచ్చారట. దగ్గర పెట్టుకోమని చెప్పి యిచ్చిన డబ్బును, తమ కుటుంబం వారికి చేర్చాలని ఇచ్చిన డబ్బును మీరు తినివేశారనీ, యశ్వంతరావుగారు మరణించిన వార్తను కూడ తనకు తెలుపలేదని — అన్నాడు.

"ఏమైనా, అతడు వచ్చి మన ఒక ఉత్తమ మిత్రుని విషయంలో లేనిపోని సందేహాలను కెలికి పోయాడు."

అదట ఇదటల బొంతలమీద సవారి చేసే స్వార్థపరుల మనో ధర్మం ఇలాగే వుంటుందనడంలో ఆశ్చర్యం లేదు. అందులోను డబ్బుకు సంబంధించిన విషయాలు చేరితే, ఎవరైనా అపవాదానికి గురి అవుతారు. నేనొకణ్ణే దానికి వెలిపలి వాడినవుతానా? ఈ సీతారాముడు ఇంత అల్లరి చేయడానికి ముందు, నా వద్దకు వచ్చి వుంటే, వచ్చిన తర్వాత తెలుసుకోవలసిన విషయాలు తెలుసుకొని అని వున్నా, ఒక రీతిగా వుండేది. అలా లోకానికి పద్ధతులు నేర్పడానికి నే నెవడిని? యశ్వంతరావుగారు నాకు అప్పగించిన ముల్లెను ఒక్కసారి వదలించుకొన్నానంటే, సుఖంగా నిద్రపోవచ్చు - అని నాకు అనిపించింది.

ఈ జాబు నాకు వచ్చిన పదిహేను నాళ్ళలో సీతారామ హెగ్గడెగారు మా యింటికి దయచేశారు. ముఖం చూడగానే అతడు యశ్వంతరావుగారి కుమారుడనే భావం తక్షణం కలుగుతుంది. మధ్య వయస్సు; పలుచని దేహం; తెలివిగల ప్రాణి. ఉత్తర కన్నడ జిల్లా గ్రామీణ షోకీలా సంస్కారమని అతని ముఖంలో తీరా స్పష్టంగా కనిపించింది. తీర్చి దిద్దిన క్రాపు; క్రాపుమీద నల్ల టోపి; చెవులలో పోగులూ; పచ్చ, కెంపు రాళ్ళపై చెవిపోగు; తెల్ల పంచె; తెల్ల షర్టు, గుండీలు లేని నల్ల కోటు; దానిమీద

ఒక జరీశెల్లా. ఫర్లాంగు దూరంనుంచే తమ ఆగమనం సూచించే కుమటి సీమ పాదరక్షలు. ముఖంమీద పురి యెక్కించిన సిపాయి మీసాలు. అతడు వచ్చిన తీవికూడ అంత అందమైందే. "ఎవరీయన?" అని యోచిస్తూ, దూరంనుంచి వస్తున్న తీవి చూచినప్పుడు "మదయానె బారెలై" (గున్నేనుగ రావే) అని పాట నా నోటినుంచి అప్రయత్నంగా వెలువడింది. వెంటనే, నేను నిరీక్షించిన వ్యక్తే ఇతడు, అని స్ఫురించగనే, ఆయన నమస్కరించడానికి ముందే నేను నమస్కరించాను. "కుమటి వైపు వారా?" అని అడిగాను.

"హూఁ!"

"చొచ్చలు మనె సీతారామ హెగ్గడెగారు కదూ?"

"హూఁ!"

"రండి, కూర్చోండి. ఇలా మీరు రావచ్చునని అనుకున్నాను. మొదట కాళ్లు చేతులు కడుక్కొంటారా! టీ చేయించనా? కాఫీ ఇష్టమేనా?"

"దేనికీ మాకు పురసత్తు లేదు. మీ దగ్గరి పనులు ముగించుకొని ఈ దినమే మంగళూరికి పోతాను. కుమటి అంటే, దగ్గరకాదు రావడం పోవడం సులభం కాదు."

"ఔనండీ. బస్సుదారి; మధ్యన ఆరేడు ఏర్లున్నాయి. నేనూ, ఆ వైపు వెళ్లిన వాడినే. రండి. కాళ్లు కడుక్కొని, దాహం తీర్చుకొని విరామంగా మాట్లాడుదాము" అన్నాను నేను.

"అలాంటి విరామం నాకు లేదన్నాను కదా!"

అతని మాటలలో అడుగడుగుకూ దుడుకుతనం, దురహంకారం, కని పించడంవల్ల "అలా అయితే, నాకూ చాలినంత పని వుంది" అని, తటా లున మాటలు ఆపి, ఒక మూలకు పోయి, కూర్చున్నాను. మరుక్షణమే, అది మంచిది కాదని తోచి, నా గదికి పోయి, ఒక పుస్తకం తీసుకొన్నాను. పుణ్యవశాత్తు, నా మిత్రులయిన ఉపాధ్యాయులొకరు నన్ను చూడడానికి అదేవేళకు వచ్చారు. నాకు అప్పుడు చాల సంతోషమయింది. అరగంట సేపు ఆయనతో కావలసినా, కాబట్టని కబుర్లు చెబుతూ పొద్దు గడిపాను. నా మిత్రులు "వెలుపల ఎవరు వారు? సుందర రావణునిలాగ కని పిస్తున్నారే? ... ఆయన రావడం మీకు తెలీనే తెలీదా? తాంబూలపు సంచి విప్పి, తాంబూలం వేసుకుంటూ, పెదవుల మీద వేళ్లు పెట్టి,

తాంబూలపు పిచికారీ వదలుతున్నారే'' అన్నారు. నాకు ఆ మాటలు విని ఉత్సాహం కలిగింది. రాగంగా ''నమారో పిచకారీ'' అని పాడాను. ఆ ఉపాయ మిత్రులు ''ఛా! ఆయనకు వినిపించీని మహారాజా'' అన్నారు.

''సంగీతం నలుగురూ వినవలసింది గదటండీ!'' అన్నాను.

అప్పుడు, వెలుపలి నుంచే సీతారామ హెగ్గడెగారు ''స్వామీ, ఏమిటో జాబు చూపుతాను అన్నారు కదా. చూపుతారా?'' అని అరిచారు. నేను లోపలినుంచే, ''తమ కోపం, అబ్బరం తగ్గివుంటే, ఇక్కడికి దయచేయడం జరిగితే చూపిస్తాను'' అన్నాను. నాకు ఆ కొత్త దృశ్యం చూడడానికి ఒక సాక్షి కూడా అవసరం. ఆయన చేతికి కాయితమిస్తే, దానిని ఆయన గుప్పిట్లో పట్టుకొని నలిపివేస్తే, చింపి వేస్తే రేపు నాకు ఇబ్బంది రావచ్చు అనే భయం కలిగింది. హెగ్గడెగారు ఆవేళకు గదిలోకి దయచేశారు. ఒక కుర్చీ చూపించాను; కూర్చున్నారు. వంటబ్బాయి ఆ వేళకు మా ముగ్గురికీ కాఫీ, ఫలహారాలు తెచ్చియిచ్చాడు. ''పుచ్చుకోడం జరగనీ!'' అన్నాను నేను.

''నోరు పుక్కలించడానికి కొంచెం నీళ్లుకావాలి'' అన్నాడు అతడు. ఇంటి కుర్రాడు నీళ్లు తెచ్చియిచ్చాడు. నా యింట్లో ముట్టను అని బహుశా ప్రతిజ్ఞ చేసి వచ్చిన ఆ చొచ్చలుమనె బిడ్డడు. ముఖం కడుక్కొన్నాడు. నెమ్మదిగా ఫలహారం ముగించాడు. నేను ఇతర విషయాలు మాట్లాడక, మొదట్లోనే ''ఇదిగో చూడండి. నాకు బొంబాయి నుంచి వచ్చిన కాయితం'' అని జెమ్‌షెడ్జీ కంట్రాక్టర్ నాకు వ్రాసిన జాబు చూపాను. చదివి తిప్పి ఇచ్చివేశారు.

ఆ మీదట ''దీనిని చూడండి. మీ తండ్రికి కాయిలా పడినప్పుడు ఆయన నాకు ఇచ్చిన తంతి.''

దానినీ చదివి చూచాడు.

''ఇది చూడండి. మరణించడానికి వారం ముందు మీ తండ్రిగారు నాకు వ్రాసిన జాబు.''

దానిని చదివి, చూచి, నేను వెనక్కు పుచ్చుకొన్న పిదప, ''దీనిని చూడండి – మీ తండ్రిగారు పదిహేను వేల రూపాయలకు డ్రాఫ్టుతో పాటు పంపిన జాబు'' అని చెప్పి చూపించాను.

దానినీ ఆయన చదివి చూచాడు. మనస్సులో ఆయనకు ఏమని అనిపించిందో, "దీనిలో, నేను వస్తాను; వస్తే నేనే ఉన్నాను గదా" అని వ్రాశారు గదా. ఈ డబ్బు ఆయనకు వెనక్కు చేరాలి - అనేవి దాని అర్థం. ఇప్పుడు, ఆయనకు అంటే, ఆయన కాలధర్మం చెందిన తర్వాత ఆయన హక్కుదారులయిన మాకు ..."

"ఆ సంగతి వ్రాయలేదు గదా. జాబులోని ముందు మాటలలో తాను లేకపోతే, దానిని ఇలా ఇలా వినియోగించండి... అని వివరంగా తెలిపారు గదా. నేను ఆయన ఆజ్ఞను నెరవేర్చాలా వద్దా?" అంటూ నెమ్మదిగా వెళ్ళి, ఆ జాబును ఆయన నుంచి లాక్కున్నాను. నాకూ సంశయమే.

"ఆయన లేకపోతే, మేములేమూ?"

"మీరున్నారని ఆయన అనుకోలేదు. అందువల్లనే ఈ చిక్కు వచ్చింది."

ఉత్తరం లాక్కోడం, నేను మాటలు అనడం ఆయనను రెచ్చగొట్టడం సహజం. "మా తండ్రికి కడుపులో పుట్టిన పిల్లలకన్నా మీరు హెచ్చు హక్కుదారులా? అంతా వదలి, పల్లెలో కుళ్ళిపడిన ఆ విధవకూ సర్వ దుంబాల మాన్యమా?" అని వెళ్ళగక్కారు.

నాకూ కొంచెం కోపం వచ్చింది. "ఇదంతా మీరు మీ తండ్రిగారు ఉన్నప్పుడే వగదెంచుకోవలసిన సమస్య. నాతో అని ప్రయోజనం లేదు. యశ్వంతరావుగారి యిష్టాన్ని జరిపేవాడిని. దానికి ఎవరి నిర్బంధమూ రాజాలదు."

"అందుకోసమేనా ఆ పార్వతమ్మ పేరుతో దేవాలయం కట్టించాననే నాటకం ఆడి, మిగిలిన డబ్బు మింగివేయాలి, కుటుంబంవారికి ఇవ్వరాదు – అని యోచించినట్టు కనిపిస్తుంది. మా రామ హెగ్గడె చెప్పింది అబద్ధం కాదు" అన్నాడు, అతడు.

"తమ గురువులు వారా ఏమిటి? సరే, ఇక చూడండి. ఈ రెండు ట్రంకులలోను ఆయన పుస్తకాలున్నాయి; ఒక దానిలో ఆయన గీసిన కొన్ని చిత్రాలున్నాయి. వాటిని చూస్తారా? అంత అవకాశం వుందా? వీటిని ఆయన నాకు ఇవ్వలేదు. నేనే తెచ్చాను. కావాలంటే మీరు తీసుకొని వెళ్లవచ్చు."

"వాటిని పీట్లో వేయండి. మాకు మా తండ్రిగారు వ్రాసిన ఆ ఒక జాబు మాత్రం యివ్వండి."

"ఏట్లో నా. . . ! ఇక్కడినుంచి ఎనిమిది మైళ్ల దూరంలో కుమారధార వుంది. దగ్గరలో ఏ ఏరూ లేదు. ఆయన నాకు వ్రాసిన జాబు మీకు యివ్వడం కాదు."

పది నిమిషాలపాటు ఆయన ముఖం ఎర్రబడింది; నల్లగయింది. చిటపట లాడాడు; అటూ ఇటూ చూచాడు; నా పక్కనవున్న ఉపాధ్యాయులను చూచి, "చూడండి స్వామీ, బిడ్డలమీద ఇలాటి బద్ధ ద్వేషం కట్టుకొన్న తండ్రిని నేను పురాణ కథలలోను వినలేదు," అని తండ్రిని నిందించడానికి ప్రారంభించినప్పుడు నాకూ ఓపిక పోయింది.

"పురాణాలలో తండ్రిని ద్వేషించే ఇలాటి పిల్లల కథా ఎక్కువగా లేదు. అలాటి పురాణాలు విచ్చడానికి ఇది యోగ్యమయిన స్థలమూ కాదు" అన్నాను. దీని తలా తోకా తెలియక దిఙ్మూఢులయివున్న నా ఉపాధ్యాయ మిత్రులకు చిటికలో జరిగిన కథా సారాంశం స్పష్టపరచి చెప్పాను.

"అలా అయితే నేనిప్పుడు వెళ్లిపోవాలంటారా?" అని అడిగాడు ఆయన. "ఇంటికి వచ్చినవారికి నేను అలా చెప్పేనా? అదిన్నీ నా మిత్రుల కుమారుల విషయంలో. ఒక రోజు వుండి, మనస్సు సమాధానపరచుకొని, వెళ్లితే వచ్చినందుకు ఒక అందం చందం" అన్నాను.

ఆ దినం సీతారామ హెగ్గడెగారు నా అతిథిగా వున్నారని మీరు వింటే, మీకు చోద్యమనిపించీని. నేను మాత్రం జాగరూకతతో ఆయన తండ్రిని గురించి మాట్లాడనే లేదు. ఆయనే దానిని వినాలని హఠం చూపారు. అడిగినప్పుడు యశ్వంతరావుగారి మీద వున్న అభిమానమంతా తిరగదోడు కున్నాను. సీతారామ హెగ్గడెగారు చాల ఆలోచించి మరొక ఉపాయం ప్రారంభించారు. నన్ను చాల పొగడారు. నా శాంత స్వభావాన్ని, తాలిమిని చాల ప్రశంసించారు. తమ కష్ట సుఖాలు చెప్పుకొన్నారు. తల్లి దుఃఖం తెలిపారు. తమకు చాల అప్పయిందని గోడు పోసుకొన్నారు. మొత్తంమీద విధ విధంగా నా కరుణ కోసం నాటకమాడారు. యక్ష గానాలతో భాగవతులు రాక్షస వేషాల ముందు కూర్చుని "అయ్యో, అలాగా, ఆహా!" అనేట్టు నేను ఆయనకు ఒక్కొక్క ధ్వనితోనే సమాధాన మిస్తూ వచ్చాను. మరుసటిదినం ఆయనను మోసం చేయరాదనుకొని, ఆయన తండ్రిగారు వ్రాసిన జాబు నకలు తీసి, దీని తాజాప్రతి నావద్ద వుంది – అని సంతకం చేసి, ఆయనకు ఇచ్చాను. నా కెందుకు అది ?

ఆయన అన్న ఒక్క మాటా నాకు ఆయనపై విశ్వాసం కలిగించలేదు. ఆయన వేషం, తీవి, మాటలు, ఆర్భాటం – ఏదీ ఆయన నిజమైన అప్పుసొప్పులను గురించి నా మనస్సుకు అభిప్రాయం కలిగించలేదు. అయితే ఆయన కాకపోతే, ఆయన చెల్లెండ్లలో ఒక్కరైనా కష్టానికి పాల్పడనివారు వుండరని కాదు. అందువల్లనే ఆయన వెళ్లిపోయేటప్పుడు, "స్వామీ, మీరు రావడం చాల మంచిదయింది. నేనేమీ మీ తండ్రిగారిచ్చిన డబ్బును తక్షణమే కరిగించను. బెనకయ్య గుడికి ఒకింత ఖర్చు చేశాను. ఆయన చెప్పిన నలుగురికి ప్రతి నెలా కొంత డబ్బు వెళ్లుతుంది. ఒక రోజు మీ వూరికీ నేను వస్తాను. ఆయన పిల్లలలో ఎవరికి కష్టమున్నా, అది ఏమిటో తెలుసుకొని, ఏమైనా యిస్తాను. నానుంచి ఏమి చేయడం సాధ్యమో, అది చేస్తాను" అనడంవల్ల హెగ్గడెగారు నా ఎదుటనయినా శాంత చిత్తంతో వెళ్ళిపోయారు.

ఊరికి వెళ్ళిన తర్వాత ఒక తీవ్రమయిన జాబు, ఒక నమ్రమయిన జాబు, ఒక పొగడ్త జాబు, ఒక తెగడ్త జాబు, ఇలా క్రమంగానా అన్నట్టు ఉత్తరాలు వ్రాయసాగినారు. నేను వాటికి సమాధానం వ్రాయడమనే గోజు పనికి పోలేదు. ఆయన త్వర, తృష నాకు తెలిసినవే. నేను తొందరపడేట్టు లేదు. ఊరికే ఉన్నాను. బెనకయ్య గుడి ఉత్తరం చూచుకొని వస్తున్నప్పుడు, తిరిగి కుమటికి వచ్చిపోదాము అని యోచించినా, నా కప్పుడు అవకాశం దొరకలేదు. నేను ఆ పల్లెకు వచ్చిన వార్తను రామ హెగ్గడెగారు సీతారామ హెగ్గడెగారికి తెలియనే తెలిపారు. మా పల్లె జనం సీతారాముడు అనే పేరును 'శీతారాముడు' అని అనడం కద్దు. అయితే ఈ వ్యక్తి శీతమూ కాదు; ఆ రామమూ కాదు.

నవరాత్రి వేళకు నాకు కుమటిలోని ఒక వకీలునుంచి "ఈ మూలకంగా తెలియపరచే దేమిటంటే," అనే ఒక నోటీసును ఆయన నాకు ఇప్పించారు. ఆ నోటీసు ప్రకారం "నేను నా స్వంత చేతులతోనే ఒక యాభైవేల రూపాయలంత డబ్బును, దానిమీద నూటికి ఎనిమిది రూపాయల వంతున అయ్యే వడ్డీని ఇవ్వడమేకాక, ఆ రిజిష్టర్డ్ నోటీసు నాల్గుఅణాలు, వకీలు చార్జి ఒక రూపాయి కలిపి చెల్లించాలి" అని తెలిపారు. చెల్లించకపోతే తెలిసె వుంది కదా! "ముందు పరిణామం సరిగా వుండదు."

ఆ జాబు నాకు చాల వినోదం కలిగించింది. యశ్వంతరావుగారి

జాబు ఒక వీలునామా రూపం దాల్చింది. అలా వున్నప్పుడు నేనూ, వకీలు భేటీ చేయవలసి వచ్చింది. నా మిత్రులయిన ఒక వకీలు కడుపుబ్బ నవ్వి, "దీనికంతా సమాధాన మివ్వడమేమిటి ? ఆయన తమ జాబులో అన్ని అధికారాలూ మీకు ఇచ్చివేశారు. దీని cause of action ఇదే వూర వుతుంది. ఆయన వచ్చి ఈ వూరు కోర్టులోనే దావా దాఖలు చేయనీ. ఓహో !.. ఇక్కడ కాదు. పదిహేను వేల రూపాయల వ్యవహారం మంగళూరుకు రానీ ; వాడికి ప్రయోజనం కాకపోయినా, మన వూరు వకీలుకు కలిగే సంపాదనను తప్పించకండి" అని ఉపదేశం చేశారు.

"మీరు వకీళ్లు హప్పు కళ (రాబందు) లున్నట్టు" అన్నాను.

"అంటే ?"

తుళునాడు వారయిన ఆ మిత్రునికి 'హప్పుకళ' అనే కన్నడ పదం అర్థం కాలేదు. "హప్పుకళ అంటే, శవం పీక్కుతినే గద్ద ! మనుష్యుడు బ్రతికున్నా మీరు వాడి మాంసం పీక్కుని తింటారు ; చస్తే, శవాన్ని పీక్కుని తింటారు" అన్నాను. ఆయనా నవ్వారు ; నేనూ నవ్వి ఇంటికి మళ్లి వచ్చాను.

ఆ మీదట మూడు నెలలు గడచినా, "ఈ మూలకంగా తెలియపరచిన" సీతారామ హెగ్గడెగారు ఆ మూలకంగానే ఊరకున్నట్టు కనిపించింది. పోతే ఒక రాయి పడితే నాలుగు పండ్లు - అని ఆయన వకీలు ఉపదేశం చేసి వుండాలి. రాయి పోయింది నిజమే ; లేని పండ్లు రాలకపోయినా, రాయి పోయిందే నిజమయింది.

నేను కుమటి యాత్ర ఆ వేసవిలో చేద్దామని నిర్ణయించుకొన్నాను. అక్కడికి వెళ్లనే వెళ్ళాలి. అప్పుడు మన హెగ్గడెగారిని చూడాలి. సాధ్య మయితే ఆయన తల్లిని, తోబుట్టువులను చూచి రావాలి. నా మిత్రుల ప్రీతికి పాత్రమయిన ధారేశ్వరం శీనయ్య, హొన్నెగద్దె మంజయ్యా - అనే ఇద్దరినీ చూడాలి. యశ్వంతరావుగారి స్వజనంనుంచి ఆయన విషయంలో ఎలాంటి మంచి మాటా వింటాననే ఆశ నేను పెట్టుకోలేదు. సీతారామ హెగ్గడెగారి అర్ధ దినం పరిచయమూ, ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలూ నాకు వెరగు పుట్టించాయి. మా మిత్రులు తమ స్మరణ గ్రంథంలో 'మల్లె తీగ, మామిడి చెట్టు' ఉపమానాన్ని తమ సంసార జీవితాన్ని గురించి వ్రాశారు. మల్లె అనే మాట చాల గౌరవయుత మయింది. మల్లికాలత అసహాయతను అది

సూచిస్తుంది. పిల్లల విషయంలో ఆయన ఏమి వ్రాసేవారో! కుమారుని విషయంలో ఆయన ఒక్క మాటనూ తన డైరీలో వ్రాయలేదు. సీతారామ్ వెళ్ళిపోయిన తర్వాత ఆ డైరీని ఆ ఉద్దేశంతో వెదికాను. ఆ విషయమైన మాటే లేదు. తమ ఆడపిల్లల విషయంలోనూ ఆయనకు విస్మృతి ఎందుకు కలిగింది? తండ్రి అయినవాడు ఆడపిల్లల విషయంలో ఎలాటి కష్టమూ పెట్టుకోడు. ఇది ఖరాఖండిగా చెప్పవచ్చు. ఆ పిల్లలయినా, తమ తండ్రికి జాబు వ్రాసినట్టు కనిపించదు. నా మిత్రులకు తమ భార్యయందు కలిగిన జుగుప్సా పరమావధి ఫలాన్ని ఆడపిల్లలు అనుభవించవలసి వచ్చిందని నాకు తోచింది. నా మిత్రులు తమ పిల్లల విషయంలో అంత తీవ్రమయిన కోపం వహించి వుండరాదనే భావన నాకూ కలిగింది. నిజంగా అంత కోపమే కలిగిఉంటే, దానికి తగిన బలమయిన కారణాలూ వుండవచ్చు. అలాంటి ఒక కారణమేమిటంటే – తమ పూర్వ సంబంధాని మరచిపోదామనే హఠసాధన మనే ఒక గుణం ఆయనలో బలంగా లేకపోతే, అది సాధ్యం కాదు; ఆయన చిత్రాలు గీచేవారు కదా!... అక్కడా హఠసాధన లక్షణం – మొండితనం – కనిపిస్తుంది. ఒకే ఒక వస్తువును పదిహేనుసార్లు చిత్రించే ప్రయత్నం దానిలో చూడవచ్చు. ఆయన మనస్సు చెప్పినట్టు చేతిలోని కుంచె పరుగెత్తేది కాదు; పెన్సిలు గీతలు పడేవి కావు. అలా అయినప్పుడు, కేవలం పట్టుదలతోనే, మొండితనంతోనే, హఠంతోనే చిత్రాలు గీచి ముగించవలసి వచ్చేది.

(ఒక రోజు నేను ఆయన డైరీ తెరచినప్పుడు, ఈ ఒక్క ఉపమానం నా మనస్సును లాగింది.

"పాలు పాలుతో కలిసిపోయినట్టు నీటితోను కలిసిపోతుంది. పాలు పాలుతో కలిస్తే మంచిది. నీళ్లు దానితో కలిస్తే పాలు నీరసమవుతుంది; దాని రుచే తక్కువవుతుంది. చాల హెచ్చు నీళ్లే చేరితే, అప్పుడు పాలరంగు మాత్రమే మిగులుతుంది. అదయినా కావాలి. . . .)

"మజ్జిగ, నీళ్లు – వీటి మధ్య ఇలాటి సంబంధం లేదు. మజ్జిగ పులిసే పదార్థం. పుల్లమజ్జిగతో పుల్లమజ్జిగ చేరితే, అదీ ఒక చందమే. ఆ మజ్జిగతో నీళ్లు కలిపితే, అది చేరినట్టు కనిపిస్తుంది, కనిపించడం మాత్రమే. కలుస్తుందా? చివరకు అది చిలికిన పాలులాగ అవుతుంది. మజ్జిగ కణాలు వేరే, నీళ్లు వేరె.

"పాలుగాని, నీళ్లుగాని మట్టికుండలో పెట్టవచ్చు. పాలకు బదులు మజ్జిగ పెడితే? పుల్లనీరు మజ్జిగనే పోస్తే? తామ్రపాత్రలో పోస్తే, అలాగే వుంటుందా? దానినుంచి చిలుము పుడుతుంది. బీదతనపు మట్టి పాత్రలో నిలిచిన పుల్లమజ్జిగ స్వభావం లోకానికి తెలియదు. శ్రీమంతపు కంచులోను అదేమిటని జనానికి తెలియదు. దానికిమారు తామ్రపాత్ర మజ్జిగకు తన గుణం కలిగిస్తే దాని గుణంతో తాను చెడి, సంసారంలో విషం వ్యాపింప జేస్తుంది."

సంసారపు ఏ స్వరూపం చూచి నా మిత్రులు ఈ ఉద్గారం వెడల గక్కారు? తమ చుట్టూ పది పదిహేను సంసారాలనయినా ఆయన చూచి వుండవచ్చు. అలాటి వాటితో ఆయన తమ సంసారాన్ని పోల్చుకొని వుంటారు. బీదవాని సంసారాన్ని మట్టి కుండకు, శ్రీమంతుల సంసారం కంచు పాత్రకూ పోల్చి వుండాలి. వివిధ దాంపత్యాలను స్మరించి నీళ్లు–మజ్జిగ, మజ్జిగ - మజ్జిగ, పాలు - పాలు, పాలు - నీరు అనే తీరుగా దాంపత్యాల సంబంధాలు ఊహించి ఒక పాత్రలో కలిగే కల్మషాన్ని చిత్రించారు. ఆయన మనస్సులో తమ దాంపత్యం పాలూ - పాలూ లాగా లేదు. పాలూ - నీళ్లూ కాలేదు. తామ్ర పాత్రలో నింపిన మజ్జిగ, నీటి కలవడమూ అని అనిపించివుంటుంది. అది కిల్బిషం పుట్టించక మరేమి పుట్టించీని- అని ఆయన ఉద్గారం. రెండు సమాన వస్తువులయితే, వాటిలో సంబంధం, కలయిక కలుగుతుంది. అయితే, వాటిని వుంచే పాత్ర తామ్రం దయితే సంసారానికి లేక సమాజానికి విషమవుతుంది. అందువల్ల వాటిని నింపే పాత్ర కుండయినా సరే, కంచుపాత్రయినా సరే, అని ఆయన అపేక్షించినట్టుంది. నీళ్లు పాలతో కలిసినప్పుడు అది పాల గుణం తక్కువ చేసినా, తాను, తనతనాన్ని లీనం చేసుకోడంవల్ల చెడుపు కలుగదు. ఎంత మంది భార్యా భర్తలు పాలు - పాలు కాగలరు? దానిలో ఒకటి నీళ్లయినా, దాంపత్యం మిగులగలదు. నా మిత్రుల జీవితంలో కనిపించిన, చేరలేని, చేరినట్టు కనిపించిన నీళ్ళు, మజ్జిగ; అవి వున్నవి తామ్ర పాత్రలో. అందువల్లనే అలాటి బ్రతుకు, సంసారానికి అంటే సమాజానికి విషమనే భావన ఆయనకు కలిగివుంటుంది. అలాటి దానిని సహించినందు వల్లనే ఆయన బొంబాయి అరణ్యం చేరారు. ఆయన విషమ దాంపత్యంలో విష సృష్టి అయినదని సీతారామ హెగ్గడె ప్రవర్తనను చూచినప్పుడు నాకు

అనిపించింది. అయితే, పిల్లలందరూ, ముఖ్యంగా ఆడపిల్లలు అలా వుండి వుంటారని నాకు అనిపించలేదు. వారినైనా చూడాలి. చూచి తెలుసుకోవాలి - అనే పట్టుదల కలుగడంవల్లనే నేనూ ఎవరికీ చెప్పక కుమటికి బయలుదేరాను.

కుమటి అంటేనో! చీనా నాటకాలలో చెప్పేలాగ, మా వూరినుంచి, "దూరమంటే ... చాల చాల... దూరం. దగ్గర అంటే ఇక్కడే వుంది." ఉత్తర కన్నడ, దక్షిణ కన్నడ జిల్లాలు పక్కన పక్కనవున్న ప్రాంతాలే. నేనున్న వూరినుంచి కుమటికి నూటయాభై మైళ్ల దూరం కూడ లేదు. పయనం చేశామా? రెండు రోజులు కావాలి. 'ఒస్' అనిపించేంత బస్సుల ప్రయాణం. ఎక్కడం, దిగడమే పని. నది ఒడ్డుకు రావడం, దోనెతో దాటడం, తర్వాత బస్సు ఎప్పుడు వస్తుందా అని తపస్సు చేయడం, ఇలాటి పయనం వల్ల నేను అలసి ఎండి బెండయి పోయాను. సీతారామ హెగ్గడెగారు మా యింటికి వచ్చినప్పుడు, ఎలా ముఖం మట మట మాడుస్తూ వచ్చారో నేను హొన్నావరలో ఏరుదాటి చివరి బస్సు ఎక్కినప్పుడు, సెగకు అలాగ మండిపోయాను. ఇక ఎంత? పన్నెండు మైళ్ల దూరం - అని సమాధాన పడి రథారోహణం చేశాను. మా ఆతేరు అనాది కాలంది. గత ప్రపంచ మహా సంగ్రామంలో అనేక రణరంగాలు వీక్షించి వచ్చిన వ్రణకిణాంకితుడయిన యోధునిలాగ వుంది. దానిలో క్రిక్కిరిసినంత జనం; దానిలోనే కూర్చుని సాగిపోయాము. కర్కి వచ్చింది; హళెదిపుర దాటాము. వచ్చేది ధారేశ్వరం. తర్వాతిదే కుమటి. ధారేశ్వరలో బస్సు టమ్మని ఆగింది. ఎందుకు అనేది తెలియలేదు. ధారేశ్వర పూర్వకాలపు ఒక పుణ్యక్షేత్రం. అక్కడినుంచి ముందుకు బస్సు కదలనేలేదు. ఏదో భాగం స్లిప్ అయినదట. ఏదో దాని ఇనుప ముక్కట. ఒకే వేళకు మూడు మూడు జబ్బులకు గురి అయి, మా వాహనం నిలిచింది, మేము కిందికి దిగాము. మరి రెండు గంటల వరకు వేరే బస్సు లేదు. వచ్చినా, అంత మంది జనానికి చోటు దొరికే అవకాశం లేదు. "డ్రైవర్ సాహబ్, ఎంత పొద్దుకు రిపేరు కావచ్చు?" అని అడిగితే, కుమటికో సిర్సీకో వార్తపోయి, అక్కడినుంచి ఏదో spare వచ్చి రిపేరు కావాలి - అన్నాడు. అంటే, ఆ దినానికి నేను ప్రయాణపు ఆశ వదలుకోవాలి. (మధ్యాహ్నం రెండు గంటల పొద్దు! ఎండ అంటే రాక్షసపు ఎండ? నా ఒకరిద్దరు సంగడికాండ్రు

బయలుదేరి ముందుకు వెళ్లినప్పుడు, నేనూ నడవడం మంచిదనిపించింది. 'ఇది ధారేశ్వర' అని నాకు తెలుసు. నా రికార్డులలో నమోదయిన శీనయ్య ఇక్కడి వాడు. అలా అనుకొని అక్కడే ఆగాను. ఒక దుకాణం వద్దకు పోయి కూర్చున్నాను. టీ, అటుకులు తెప్పించుకొని తిన్నాను. ఊరికే కుతూహలంతో దుకాణదారుతో, అతడు ముసలివాడుగా కనిపించడం వల్ల "స్వామీ, ఇక్కడ, ఇప్పుడు కాదు, పూర్వం - ధారేశ్వరం శీనయ్య అనే వ్యక్తివుండేవాడా?" అని ప్రశ్నించాను.

ఆయన "పూర్వం ఎందుకు; ఇప్పుడూ ఉన్నారు. ధారేశ్వరంలో పది మంది శీనయ్య అనే పేరుగల వారున్నారు. బెట్టిన మనెయ (గుట్ట ఇంటి) శీనయ్య, బైలిన మనె (బయలింట) శీనయ్య, కెసరు గద్దె శీనయ్యా..." అని శీనయ్యల జపమే ప్రారంభించారు.

ఇప్పుడే అంతమంది శీనయ్య లున్నప్పుడు, పూర్వం ఎంత మంది శీనయ్యలు వుండకుండా వుంటారు - అని ఆశ్చర్యపడి, ఊరికే వుండి పోయాను. నా మూటలు చంకలో పెట్టుకొని, ఆ ఎండలోనే, ఎర్రటి ధూళి తొక్కుతూ, కుమటికి బయలుదేరాను.

## తొమ్మిది

రెండు నాళ్ల పయనం; అందులోను ధూళి, ఎండల స్నానం అనుభవించిన నాకు కుమటి చేరే వేళకు ఇక చాలు చాలు అనిపించింది. కుమటికి వచ్చేవరకు, నా ప్రథమ సందర్శనం ఎవరి యింటికి అన్న దానిని ఆలోచించనే లేదు. ఊరు సమీపించినప్పుడు కుమటలో వున్న నా మిత్రులను ఒకరొకరినే స్మరించాను. అన్నీ పాతకాలపు జ్ఞాపకాలు ... వాళ్లున్నారా, వీళ్లున్నారా అని జ్ఞాపకాన్ని వెదుక్కున్నాను. ఏమైనా, నేను మొదటి అడుగులోనే హంసపాదు వేయరాదు. సీతారామ హెగ్గడెగారి యింటికి వెళ్లరాదు - అని నిర్ధరించుకొన్నాను. "సీతారామ్" అనే అదే పేరుతో వున్న మరొక గృహస్థును జ్ఞాపకపరచింది. ఈయన హెగ్గడె కాదు; సభావంతులనే శాఖవారు. ఊరు చేరగానే మొదట్లోనే కనిపించే యిల్లు ఆయనది; పాతకాలపు తియ్యని తలపులతో వున్నట్టిది అయినందున ఆయన

యింటికే వెళ్ళాను. పాత మిత్రుల ముఖం చూచే హుమ్మసుతోనే అక్కడికి వెళ్లి కూర్చున్నాను. 'ఇంటి యజమానులు ఉన్నారా?' అని గట్టిగా కేక వేసి అడిగే వేళకు ఆయనే వచ్చి, ఎదురుపడ్డారు. "కారంత్ గారా, రండి, రండి" అని నన్ను ఆదరంతో ఆహ్వానించారు. దాహానికి పానీయం వచ్చింది. ఆయన "ఏమిటి ఇలా దయచేశారు ఈ వూరికి?" అని అడగ లేదు. దానికి బదులు "రెండు రోజులుంటారు గదా?" అని అడిగారు. "రెండు కాదు, నాలుగు నాళ్లు ఉండనూ వచ్చు" అన్నాను. "ఓహ్! చాల వైభవంగా వుంటుంది" అన్నారు. నేను సంచారి జీవి అని ఆయనకు తెలుసు. "ఏదో పని వుంటుంది. ఉండకుండా వస్తారా?" అని తమలో తామే అనుకొన్నారు గాని, "ఎందుకు? ఏమి?" అనే గొడవకు పోలేదు. దానికి బదులుగా నేను "సీతారామ" పురాణం విషయంలో అడిగే అధిక ప్రసంగానికి పోలేను. నాది పోలీసు తనిఖీ కాదు; ఇంకా నలుగు రైదుగురు మిత్రులు ఈ ఊరిలో వున్నారు నాకు. ఒక్కొక్కరి యింటికే వెళ్లివస్తూ, యుక్తితో ప్రశ్నలు వేసి, కుతూహలం ఉండీ లేనట్టు నటించి, వాటంతట తెలిసే మాటలతో నా కల్పనను నింపుకోవలసివుంది.

వచ్చిన రోజు రాత్రి సభావంతుల యింట్లోనే గడిపాను. స్నానం, నిద్ర రెండే నాకు కావలసినవి. వాటికి తోడు భోజనం ఉపచారం కలిస్తే భూపతి రంగనిలాగ (దొరలాగ) రాత్రి పూరా నిద్రపోయాను. ఉదయం ఉపాహారం ముగించుకొని మరొక మిత్రుని యింటికి వెళ్ళాను. వెళ్లే దారిలోనే చొచ్చలు మనె వారి 'వఖారు' (పోకల మండి) వుంది. అది యింటి వెనుక భాగం. ఎదుట ప్రాకారం, తలుపు, ముందు ముంగిలి, తర్వాత వఖారు. బహుశా దాని వెనుక వారి నివాసమూ వుండాలి. వెలుపల బోర్డు వున్నందున డేగ కండ్లతో చూచి, నెమ్మదిగా నడిచి నా మిత్రులు మూర్డేశ్వర వకీలు ఇంటికి వెళ్లాను. ఆయన సగం ప్రవృత్తిలోను, వకాలత్తు తక్కువ కావడం వల్ల సగం నివృత్తి లోను వున్నారు. నేను రావడం ఆయనకు తెలుపడం వరకే నా పని. ఆయన నాకు బాగా తెలిసిన వారు; స్థానికులు. స్వజాతి వారినుంచి వికృత రూపంలో రాగల టీకా వ్యాఖ్యల కన్నా, సంబంధం లేని జనం నుంచి నా మిత్రులు యశ్వంతరావుగారి విషయంలో నిష్పక్ష పాతమయిన సమాచారం తెలియ వచ్చుననే కారణంతో, ఆయనకు నా ఆగమన సమాచారం తెలియజేసి,

"సాయంకాలం వస్తాను; ఇప్పుడు మీకు కోర్టు హాజరీ వుంది కదా" అని తిరిగి వచ్చాను.

నా తర్వాతి అడుగు మూడు మైళ్ల దూరంలో వున్న హొన్నెగద్దె గ్రామానికి. ఆ పల్లెను నే నొక రాత్రి చూచాను! చూచీ చూడనట్టె దారి పట్టుకొని ఇటు వైపు బోడి మళ్లను, అటూ యిటూ వున్న ఇళ్లను చూస్తూ నడిచాను. రెండు మైళ్లు కాగానే, ఒక బడి పిల్లవాడు, సుమారు పధ్నాలుగు ఏళ్లవాడు నాకు ఎదురయ్యాడు. ఊరికే తిరగడం కన్నా వాడిని ఆపి "హొన్నెగద్దె మంజయ్యగారి యింటికి ఎలా వెళ్ళాలి?" అని అడిగాను.

"హొన్నె గద్దె వచ్చిందే; ఇక్కడినుంచి ముందు అదే. మంజయ్య గారి యిల్లు అంటే మా యిల్లే? ఇంకొకరున్నారు మంజయ్య అనేవారు" అన్నాడు.

ఆ పిల్లవాడు ఆ యింటి దారి తెలిపాడు. మఱ్ఱి చెట్లు, దేవాలయం, ఎడమ వైపు, కుడి వైపు తాటి చెట్టు, మేడి చెట్టు - అనేమో గుర్తు చెప్పాడు. నాకు అంత వృక్షశాస్త్రం తెలియదు. అంతేకాక, "ఊళ్ళో ఎన్ని మఱ్ఱిచెట్లు, తాటి చెట్లు వుండవు - అనుకొని, "అది ఎక్కడ అని కొంచెం చూపిస్తావా? నీకు బడికి పొద్దవుతుందో ఏమో? ఆలస్యమయితే వద్దు" అన్నాను.

ఆ పిల్లవాడు 'నేను చూపుతాను' అని చెప్పి విసవిస అడుగులు వేశాడు. నేను అతన్ని వెంబడించాను. (శుష్క ప్రయాణం కాగూడదని "మీ యిల్లు ఎంత దూరం?" అని అడిగాను.)

"ఒకటి రెండు ఫర్లాంగులు."

"ఎవరెవ రున్నారు మీ యింట్లో."

"నాన్న, అమ్మ, ఇద్దరు తమ్ముళ్లు. అంతే."

"తమ్ముళ్లు బడికి పోరా?"

"వెళ్లుతారు, చిన్న బడికి."

"నీవు?"

"గిబ్ హైస్కూలుకు."

"మధ్యాహ్న భోజనానికి రావాలంటే చాల దూరం కదూ?"

"దూరమే, రాను."

"బడిలోనే వుండిపోతావా ? అలా అయితే భోజనం ?"

"లేదు" అని అన్నప్పుడు ఆ పిల్లవాని దుర్బల శరీరం చూచి నాకు కష్టమనిపించింది.

"బంధువులు, అభిమానులు మీకు ఎవరూ లేరా పేటలో (పట్నంలో) ఒక పూట భోజనం పెట్టేవారు ?"

"ఉన్నారు. కాని, నేను వెళ్లను."

"వాళ్లు బీదవారా ?"

"వాళ్లకు తిని త్రేన్చేటంత వుంది. నా మేనమామ యిల్లే వుంది; వఖారు, ఇల్లు రెండూ పేటలో వున్నాయి. అయితే, మాకూ, వారికీ అంతంతే.

"పేరేమిటో ?"

"చొచ్చలుమనె వారు అని"

"నీవు ఆయనకు ఏమవుతావు ?"

"నేనా ? ఆయన చెల్లెలి కుమారుణ్ణి."

"మీ తండ్రి గారి పేరు మంజయ్యగారు అని కదూ ?"

"ఔను. మీది ఏ వూరు ? మిమ్ముల్ని చూస్తే పరస్థలం వారని అనిపిస్తుంది."

"నేను దూరం వాడినే ; మంగళూరు వాడిని."

"అక్కడి నుంచి ఇక్కడికి వచ్చారా ... ?"

అంటున్నప్పుడే, అతడు "అదుగో చూడండి. అదే తాటి చెట్టు. దాని ముందుండే ఇల్లే కేతరికి మంజయ్యగారిది" అని చూపించాడు. నా మనస్సు కకావికలయింది. నేను అతనిని వెనక్కు పిలిచి, "నిలు ... నీ పేరేమిటో చెప్పు" అన్నాను.

"యశ్వంతా !" నా గుండె జల్లుమంది. అతడు ఆ మాట అని త్వరగా వెనక్కు తిరిగాడు.

"యశ్వంతా ! ఆగవయ్యా ఆగు ... మరొక సంగతి."

పిల్లవాడు తిరిగివచ్చి, "ఏమి కావాలి ? నాకు బడి తొందర."

"నిజమే. గంట కొట్టేలోపల వెళ్లాలి ; నా నుంచి నీకు చాల ఉపద్రవమయింది ; చూడు, మీ తాతయ్య నామిత్రులు. అందుకోసమే ఆగమన్నాను."

"ఎవరు? చొచ్చలుమనే పెద్ద హెగ్గడెగారా? అలా అయితే మీరు ఎవరు?"

"శివరామ కారంత్ – అని నా పేరు."

"మా యింటికి మీరు రారా? మా తండ్రిగారికి మీరు నెల నెలా మని ఆర్డరు చేస్తున్నారు గదా?" అని ఆ పిల్లవాడు నా చేతులు పట్టుకొని ఆపి, "కేతరి వారి ఇంటికి తర్వాత వెళ్లితేసరి; మా తండ్రికి, అమ్మకు మిమ్మల్ను చూస్తే చాల సంతోషమవుతుంది" అని లాగసాగినాడు. నాకు కావలసిన నంజయ్యగారు వృద్ధులు అని నా మనస్సులో అభిప్రాయం నాటడంవల్ల అంత గోల పుట్టింది. మంజయ్య, మంజయ్య అంటే, నా మిత్రుల అల్లుడే అయివుండాలి. నేను, ఆయన వణికే చేవ్రాలు వల్ల, ఆయన వృద్ధుడనుకొని, ఆ పిల్లవాడు 'వృద్ధులు' అనగానే 'అక్కడికే' అన్నాను. ఈ పిల్లవాడి తండ్రి అంత వృద్ధులయి వుండరని అనిపించింది. అందువల్ల కొంచెం యోచనచేస్తూ నిలబడ్డాను.

"ఏమిటి అనుమానం చెప్పండి ...." అన్నాడు, ఆ పిల్లవాడు.

"నీ తండ్రిగారి వణికే సంతకం చూచి, ఆయన వృద్ధులని అనుకొన్నాను. మీ యింటికి వెళ్లడానికి మారు మరొకరి యింటికి వెళ్లేవాడిని."

"నేను మొదట్లోనే మీ పేరు అడిగితే సరిపోయేది. రండి; రండి. మా నాన్నగారు పడుకున్న చోటే... ఆయనకు ఒక విధమయిన వాతం; ఆయన పడుకొని చాల సంవత్సరాలయింది..." అన్నాడు ఆ బాలుడు దీనంగా. తర్వాత, ఆ చిన్న యశ్వంతుడు నా చేయి వదలలేదు. అరమైలు దూరంలో వున్న తమ యింటికి పిలుచుకొని వెళ్ళాడు. ఇంటికి రాగానే తన బడి సంచిని అరుగుమీదికి విసిరివేశాడు. లోపలికి పరుగెత్తి పోయి, తండ్రికి వార్త తెలిపి, తల్లికి చెప్పి, కాళ్లు కడుగుకొనడానికి బిందెలో నీళ్లు తెచ్చాడు; చావట్లో చాప పరిచాడు. అంతలో చిక్కిపోయిన ఒక ఆడ జీవం ఒకటి నా ఎదుట కనిపించింది. మంచి సుమంగలి; దారిద్ర్యముద్ర దేహంలో వున్నా, నిజమయిన గృహలక్ష్మి అన్నట్టు వుంది. ఎలాటి ఉలుకూ లేకుండా ఆమె నా ఎదుట వచ్చి నిలబడి, నమస్కరించి, "మా నాన్నగారి పుణ్యా వశాత్తు మీరు మా యింటికి వచ్చారు. మీరంతా క్షేమమేనా? .. మా వారు పడుకొన్నచోటే ..." అన్నది. యశ్వంతుని పిలిచి, "యశు, నీ తమ్ముళ్లు బడికి వెళ్ళారు. నీవు వెళ్లకపోతే ఎలా?" అని అడిగింది.

"లేదమ్మా, వీరు మన యింటికి వచ్చినప్పుడు .... నేను వెళ్లితే ఎలా ? నీవు లోపలికి వెళ్లు. నేను వీరిని చూచుకుంటాను. వీరికి దాహానికి ఏమైనా చేయి. మీరు ··· నాన్నగారిని ఇప్పుడు చూస్తారా? దాహం పుచ్చుకొన్న తర్వాత చూస్తారా?" అని నన్ను ప్రశ్నించాడు.

"దాహం పుచ్చుకోనీ" అనడం అతని తల్లి నోటి నుంచి వినబడింది.

నేను అతనిని దగ్గర కూర్చోబెట్టుకొని, అతని తమ్ముల సంగతి, తల్లి సంగతి, వ్యవసాయం ఏమైనా వుందా, అన్న సంగతీ అడిగాను. నేను ఇంతకాలం వాళ్లయింటికి రావడంలో విలంబన చేసినందుకు నా మనస్సులో వ్యధ కలిగింది.

పిల్లవాడు "మా తాతయ్య మీకు బాగా తెలుసా ? ఆయన బొంబాయిలో మరణించారట కదా! ఆయన మరణించేటప్పుడు దగ్గర ఎవరైనా వున్నారా? సీతారామ హెగ్గడెగారు వెళ్లివుంటారు" అన్నప్పుడు, "అంతా నిదానంగా చెబుతాను. మీ యింటి వ్యవసాయం వట్టి మూడు సంచుల మడి మాత్రమేనా? అంత కొంచెం సరిపోతుందా ?" అని అడిగాను.

"సరిపోకపోతే ? సరిచేసుకోవాలి ... వేరే గత్యంతరం లేదు. మా అమ్మ అంటుంది ... మాకు మొదట్లో చాలవుండేదట. భాగాలయాయి, మా పెద్దల అప్పులకు అంతా పోయిందట. తర్వాత ఆమె నాన్నగారే ఇంతయినా బ్రతుకు మిగిలించారట."

అంతలో, ఒకింత పాలు నీళ్లు, బియ్యపు నూకతో చేసిన ఉప్పుపిండి యశ్వంతుని తల్లి నా ముందు తెచ్చి పెట్టింది. "ఇది బీదల యిల్లు. టీ పొడి తేలేదు. తెచ్చే రివాజూలేదు. ఇది రవ ఉప్మా కాదు – బియ్యపు నూక ఉప్పిండి. సుధాముని ఆతిథ్యం!" అని ఉపచార వాక్యాలు పలికింది.

"తల్లీ, అలాటి మాటలు మీరు చెప్పనక్కరలేదు ; ఉపచారమనేది బియ్యం, రవ, టీ, కాఫీ అనేవాటిలో లేదు. అది వుండేది మన మన హృదయాలలో."

"అలా చెప్పండి."

నేను ఉపాహారం చేస్తున్నప్పుడు ఆ పిల్లవాడు ఊరికే వుండడం చూచాను. "నీవూ దీనిలో కొంచెం తీసుకో" అన్నాను. "నాకు గంజి భోజనం అయింది" అన్నాడు అతడు. నేను బలవంతంతో నా దానిలో కొంత అతనికి యిచ్చి, ఉపాహారం చేయించాను.

తల్లి, కుమారుడు యిద్దరూ తర్వాత నన్నొక గదికి పిలుచుకొని వెళ్ళారు. నా కోసం ఒక పీటవేసి, సెమ్మె వెలిగించి, మంజయ్యగారి దగ్గరి కిటికీ తెరిచారు. ఆయన పడుకున్న చోటినుంచి లేవడం చూచి, ఎంత వద్దన్నా వినకుండా, నెమ్మదిగా లేచి, వెనుక గోడకు జేరగిలబడ్డాడు. నేను ఆయన ముందుకు వెళ్లి కూర్చున్నాను. ఆయనే మాట్లాడడం ప్రారంభించారు.

"ఇలా నేను దినానికి రెండు సార్లు లేచి, స్నానానికి, మరొకదానికి వెళ్లి వస్తాను. పట్టుకొనడానికి ఆధారం అవసరమవుతుంది. ఇదొక పేరులేని కాయిలా చూడండి. పేరుకు వాత వ్యాధి అంటారు. వాతానికి చేసే వైద్య మంతా చేశాము; స్వారస్యం లేదు. బాధ పడే ఋణం వున్నప్పుడు బాధ పడాలి కదా... మరేమీ చింతలేదు. నా ఈ యశు కొంచెం పెద్దవాడయితే, నాకు ఒక్క ముక్కా భయం లేదు" అన్నారు.

"తాత పేరే అతనికి పెట్టారు."

"మీరూ మా మామ సంగతి వ్రాశారు.. నేను ఇలాటి స్థితిలో వుండడం వల్ల, మీకు జవాబు వ్రాయలేదు. వ్రాయించ వలసిందో ఏమో!... మా మామ మీకు చాల కాలంగా తెలుసా?"

అప్పుడు నేను, ఆయన మామకు నాకూ గల పరిచయపు యావత్తు సమాచారం వర్ణించాను. తర్వాత ఆ మామ పెంపుడు తల్లి కతనూ చెప్పాను. ముగ్గురూ భాగవతం విన్నంత శ్రద్ధతో విన్నారు. పార్వతమ్మ అంత్యకాల చిత్రం నేను వర్ణించినప్పుడు వారు వలవల ఏడ్చారు.

"ఆ పుణ్యాత్మురాలిని మీరు చూచి వచ్చారు; మేమెప్పుడూ చూడలేదు. మీరు చాల మంచి పనే చేశారు. మా మామ పేరు శాశ్వతంగా వుండేట్టు చేశారు. చూడండి. అటువంటి మా మామ తన భార్యా పిల్లలకు... ముఖ్యంగా కుమారునికీ, భార్యకూ పగ వారయ్యారు కదా! ఇప్పుడు ప్రతి వాడూ మామను దూషించేవాడే. అయితే ఒక్క సంగతి.. ఆయనకు ఈ కుమార్తె మీద కొంచెం ప్రీతి హెచ్చు. ఆమెను నేను పెండ్లాడినప్పుడు, మా యింటతనపు డౌలు హెచ్చుగా వుండేది. అయితే, పెద్ద కుటుంబం; అలా టిది అందరూ వేరయినప్పుడు అప్పుతో తీరా దిగజారిపోయింది. మాకు పిత్రా రితం అప్పుల వల్ల ఏమీ మిగలలేదు. అప్పుడు చేయిచ్చి, మమ్ముల్ని నిలపడానికి ప్రయత్నించిన వారు మామయే. కోర్టులకు చాల దండుగ పెట్టాగు. దానివల్ల హెచ్చు ప్రయోజనం కలుగలేదు... ఆయన చేయ

వలసిందంతా చేసినా ప్రయోజనం లేకపోయింది. ఆ మీదట ఒక ముక్క ఆస్తి ఆయనే ఇప్పించారన్నా తప్పు లేదు. అది మా బావమరది సీతారాము నికి నచ్చలేదు. మామ వున్నప్పుడే, నాకూ, ఈ సీతారామునికి అంతంతే! కొన్ని సంవత్సరాల తర్వాత మామ ఊరే వదలిపెట్టి పోయారు గదా! ఆ మీదట ఏ సంబంధమూ లేదు. ఆయన ఎక్కడున్నారన్నదే మాకు తెలియక పోయింది. ఆయనకు ఎంత కష్టం కలిగిందో! ఎందుకలా చేశారో, ఒకటీ తెలియదు."

మంజయ్యగారు మాట్లాడుతూ అలసిపోవడం చూచి, ఆయన భార్యతో "ఇక తక్కిన ఆడపిల్లలు మీకంటే, చిన్నవారా? పెద్దవారా? ఇప్పు డెక్కడున్నారు?" అని వాకబు చేశాను. అప్పుడామె, "మేము నలుగురం సంతానం. పెద్దవాడు సీతారాముడు; కుమటిలో వఖాయ పెట్టుకున్నాడు. మా తల్లి అతని వద్దే వుంది" అన్నది.

"మీరు పుట్టింటికి వెళ్లడం గాని, వాళ్లు ఇక్కడికి రావడం గాని ఉన్నది కదూ? ఇంత దగ్గర వుంటూ.."

"ఆ సంగతులు ఎందుకు అడుగుతారు? మా వారు బాగున్నంత కాలం, మా తండ్రి ఊళ్లో ఉన్నన్నాళ్లు అప్పుడప్పుడు రావడం, పోవడం అన్నీ వుండేవి; నేను ఆడపిల్లలలో పెద్దదాన్ని. మా తల్లి, అన్నల తీరే వేరు. వారికి మా కంటే, మా కంటే ఎందుకు దేవుడి కన్నా డబ్బు దొడ్డది...."

నేను అది విని నవ్వాను.

నేను ఆ మాట అనకుండా వుండవలసింది కదూ! మా కష్టానికి వాళ్లు ఒదిగి రాలేదు అని దూషించరాదు కదూ? చెప్పనే చెప్పాను. ఒక తప్పు. మా వారూ అలాగే అంటుంటారు. ఏమో కడుపులో సంకటమయి అన్నాను."

"అంతలో మంజయ్యగారు జలజా, నీవు లోపలికి వెళ్లు. త్వరగా వంట చేయి" అన్నారు.

"లేదు. నేను భోజనానికి కుమటికి పోతాను. సభావంతుల ఇంటికి మధ్యాహ్నం భోజనానికి వస్తాన"న్నాను. "కొంచెం పొద్దు పోయినా ఫరవా లేదు. మా యింట్లో భోజనం దినమూ ఆలస్యం - అన్నారు."

"ఆయన శ్రీమంతుడు! మన సీతారామ సభావంతునికీ, నాకూ బాగా పరిచయముంది. ఆయన అన్నగారి పరిచయమూ నాకు బాగా వుంది. ఆయన

మరణించారు; పుణ్యాత్ములు. ఇప్పటి స్థితిలో పోయినవారే పుణ్యాత్ములు – అనిపిస్తుంది.''

''సంసారం కష్టం తలచుకొని అలా అంటున్నారు మీరు! ఎవరికి కష్టాలు తప్పాయి? కష్టం లేకుండా, సుఖాల పాన్పుపై దొర్లేవారు నూటికొక్కరుండవచ్చు. అందువల్ల మనం మన మనస్సులను కష్టపెట్టుకుంటే ఎలా?''

''నిజమే. అలాటి మాటలు అనగూడదు; పిల్లల ముందు అననేరాదు. పెరుగుతున్న వాళ్ల మనస్సులో – మేమెందుకు పుట్టాము – అని అనుకొనేట్టు చేయరాదు.''

యశ్వంతుడు అప్పుడు ''నాన్నా, చివరివరకూ ఇలా కష్టాలు వుంటాయని ఎందుకనుకుంటారు? అదంతా ఒక్కొక కాలం – అని మీరే అనేవారే.''

''ఔను; అబ్బాయి. ఇప్పుడు దేవుడు ఇంతయినా జరుపుతున్నాడు గదా! ఇక నీవు సంపాదించే స్థితికి వస్తే...''

''అంతా సరిపోతుంది. మీ కుమారుని అదృష్టం మీ దాని కన్నా మంచిది కావచ్చు... ఏమిటి? యశ్వంతా, నీవు చదివి పెద్దవాడివయితే, నీ తలిదండ్రులను పోషించడానికి ముందు వెనుకలు చూస్తావా?'' అని అడిగాను నేను.

''పిల్లలు ఎందుకు వుండేది?'' అన్నాడు పిల్లవాడు.

''అలా అయితే, నేనింక బయలుదేరనా? ఇక రెండు రోజులపాటు కుమటిలో వుంటాను. మరొక మారు వచ్చిచూస్తాను'' అన్నారు.

''అదంతా వద్దు'' అని కుమారుణ్ణి చూచి, ''యశు'' అన్నారు మంజయ్య.

''సరే, నాన్నా. నేను పరుగెత్తిపోయి సభావంతుల యింట్లో చెప్పి వస్తాను'' అని లేవనే లేచాడు ఆ పిల్లవాడు.

''వద్దు, అబ్బాయి'' అని చెప్పేలోపల ఆ పిల్లవాడు లేడిపిల్లలా పరుగిడడమూ జరిగింది. యశ్వంతులు కూడ చిన్నతనంలో ఇంత చురుకుగా వుండీ వుంటారని నా మనస్సుకు అనిపించింది. నేను సంభాషణను విషయాంతరానికి మరలించడానికి ''మీ భార్య పేరు జలజ అన్నారు కదా?'' అని అడిగాను.

నవ్వారు ఆయన. "మా మామ కళ్లు పరమశివుని కళ్ల వంటివి – జలజాక్షి, వనజాక్షి, మీనాక్షి . ." అని తమ ముగ్గురు కుమార్తెలకూ పేరు పెట్టారు."

"ఇంకా పిల్లలయివుంటే, కామాక్షి, హరిణాక్షి అని పెట్టేవారేమో!" అన్నాను నేను. ఆ మీదట కొంచెం నవ్వి "మరి యిద్దరు, మీ మరదండ్లు ఎక్కడున్నారు?" అని అడిగాను.

"వనజ అనే మరదల ఇల్లు తెంకణంలో కెక్కారు దగ్గర. ఆమె మంచి శ్రీమంతుల ఇంటికే వెళ్లింది. సంసారం చక్కగా చేసుకొని, సుఖంగా వుంది. మరొకామెను "యాణ" అనే చాల పల్లెటూరికి యిచ్చారు. నాకు తెలిసినంత మట్టుకు ఆమెకూ ఇబ్బంది లేదు. వారిద్దరి సంబంధాలు మా అత్తగారి పెత్తనమే. నేను మాత్రం మామ అల్లుణ్ణి. నా పెళ్లిలోనే మా అత్త, భర్త ఏర్పాటు చేసిన సంబంధం వెక్కిరించి కొక్కిరించి నందున తర్వాతి యిద్దరు అల్లుళ్లనూ, ఆమే వెదికింది. మొత్తం మీద మా అత్తే గెలిచారనండి. నేను మెట్రిక్యులేషన్ ప్యాసయి తాలూకా కచేరీలో గుమాస్తాగా చేరాను. "చదువుకొన్న కుర్రవాడు, పెద్ద కుటుంబం, ఎలాగైనా జీవనం చేస్తాడు" అని మా మామ ఆలోచించారు. ఆడ పిల్లలు వెళ్లి చేరే యిల్లు భద్రంగా వుండాలి. ఎక్కువ భాగాలయ్యే యిల్లు. డబ్బు దస్కం తక్కువైన యిల్లు కూడనే కూడదని మా అత్త అభిప్రాయం. స్వతః ఆమె శ్రీమంతుల కుటుంబం నుంచి వచ్చినట్టిది కదా! అయితే, ఆమె పుట్టి నింటి నుంచి ఆమెకు దక్కిందేమీ లేదు; తమ కడుపున పుట్టిన పిల్లలకు ఇచ్చిందేమయినా వుందో లేదో! మాకయితే ఏమీ తెలియదు. . . . ."

"ఇచ్చారండి" అనడానికే జలజాక్షి వచ్చింది. "ఇవ్వడం ఎప్పుడూ ఉన్నవారికే; లేనివారికి ఎవరైనా ఇస్తారా?"

"తల్లిగాని, తండ్రిగాని, వయస్సు వచ్చిన తర్వాత మనం పెద్దవారి వస్తువులను అపేక్షించరాదు. మన కాళ్ల మీద మనం నిలబడాలి. నన్ను ఈ కాయిలా ఒక చాప పట్టించకుండా వుంటే, ఇలా గొణుక్కోవలసి వుండేది కాదు" అన్నారు మంజయ్య.

ఆ మీదట వారు విషయ పునరావృత్తిలాగ మామ సంగతి మళ్లీ అడిగారు. నేను చెప్పాను. ఆ మాటల నడుమ మామ వీలునామా రూపమయిన సందేశాన్ని డబ్బు సంగతిని మరుగు లేకుండా చెప్పాను.

ఆయన అంతా విన్నారు. ఆ మీదట "మా సీతారాముడికి ఇదంతా తెలీదా ?" అని అడిగారు.

"తెలుసు. ఆయన ఆ మీదట బొంబాయికే వెళ్లారు. మీ మామ డబ్బు పదిహేను వందల చిల్లర, బ్యాంకులో వున్నది ఆయనకే దొరకవచ్చు. ఇంతలో దొరికివుంటుందేమో."

"మీరు ఆయన యింటికి వెళ్లలేదా ?"

"వెళ్లలేదింకా. ఒకసారి వెళ్ళి రావాలని వున్నాను. వూరు వదలి వెళ్లే ముందు వెళ్ళితే సరి."

"మా బావమరదిని ముఖతః కలుసుకొన్నారా ?"

"మా యింటికే ఆయన ఒకమారు వచ్చారు ; నాకు జాబులు వ్రాశారు. జాబులంటూ వ్రాయనివారు మీరొక్కరే."

"నాది తప్పే. మీకు కోపం వచ్చిందేమో !"

"ఛా ! అదేమీ లేదు. కాని, మీ సంతకం అస్వస్థులదా, వృద్ధులదా – అన్నట్టు వుండినది ; అందువల్లనే మీరు జాబు వ్రాయలేదే అని యోచించాను."

నేను మామ నా వద్ద వుంచిన డబ్బు సంగతి తెలిపినా మంజయ్యగారు మాత్రమే దాని విషయంలో ఆసక్తి చూపినట్టు కనిపించలేదు.

"మా మామ, పూర్వం అలాగే అంతా పోగొట్టుకొన్నారు – అంటారు. దానిని పోగొట్టుకొన్నది అని నేనననను. మా అత్తకు అదే కనిపించేది. కాని, మామ అలా కాదు. ఎవరు ఏడ్చినా చేతుల్లో వున్నది తీసి యిచ్చేవారు. ఆయన స్వభావానికి అనుగుణంగానే తమ డబ్బును మంచి పనులకు ఖర్చు చేయండి – అని మీకు తెలిపారు. ఎంత మందికి అలాటి బుద్ధి పుడుతుంది ?"

మనమంతా, ఏమైనా మిగిలితే మన పిల్లలకు వుండనీ అంటాము. ఆయనకు తన పిల్లలూ, ఇతరులూ ఒకటిగానే కనిపించారేగాని ఆ డబ్బు మీద సీతారామునిలాగ ఆశ చూపలేదు. "పదిహేను వేలా ?" అని మంజయ్యగారు ఆశ్చర్యం కూడా ప్రకటించలేదు. అది నాకు చాల ఆనందం కలిగించిన సంగతి.

ఆ మధ్యాహ్నం నేను ఎంత వద్దని చెప్పినా, ఆయన నా పక్కనే కూర్చుని భోజనం చేశారు ; ఆయన పక్కన యశ్వంతుడు కూర్చున్నాడు. ఆకులు వేసేటప్పుడు, వారి మరి యిద్దరు చిన్న పిల్లలు బడినుంచి వచ్చారు. వచ్చి

కాళ్లు కడుక్కొని అన్నలాగ తమ తమ కంచు గిన్నెలను వరుసగా పెట్టు కొని భోజనానికి కూర్చున్నారు. ఆ ముగ్గురు పిల్లలు తల్లి పోలికే; అందరూ దారిద్ర్యముద్ర ధరించినట్టే కనిపించింది. కడుపునిండ తినడానికి లేనప్పుడు మరే చిత్రం కనిపిస్తుంది? దేశంలో నూటికి తొంభయి యిలాటి యిండ్లు కదా? భోజనం చేస్తూ నేను "యశ్వంతా, నీ తమ్ముల పేరేమి టయ్యా?" అని అడిగాను.

"వీడు జయంతుడు, వీడు భగవంతుడు" అన్నాడు.

"ఓయ్ భగూ, మీ ముత్తాత పేరేమిటో తెలుసా నీకు?" అడిగాను. నేను కొత్తవాడైనందున వాడు నా ముఖమే దిట్టించి చూచాడు.

"ఎవరన్నారు?" అన్నారు మంజయ్య.

"మీ మామగారి నాన్నగారు! ఆయనా భగవంతయ్యే."

"ఓహో! అలాగా? భగూ, మీ ముత్తాత పేరు నీ పేరే" అన్నారు.

"ఈయన ఎవరు నాన్నా? ఆయన జతలో నీవే భోజనానికి వచ్చి కూర్చున్నావు?"

"అబ్బాయి, ఆయన చాలదూరం నుంచి వచ్చినవారు. మన పుణ్యాన వచ్చారు. ప్రతి దినం వచ్చేవారు కారు. అందువల్ల లేచి నిలబడి ఇంతవరకు వచ్చాను."

"భగూ, నేను రావడం ఎందుకో తెలుసా?" అని అడిగాను, ఆ పిల్ల వాడిని.

"నాకు తెలీదు."

"ఎందుకో చెప్పనా?"

"చెప్పండి."

"చెప్పనా? హొన్నగద్దెలో మంజయ్యగారు అని ఒకరున్నారు."

"వారిని చూడడానికి."

"కాదు."

"ఆయన కుమారుడు..."

"యశ్వంతుడిని..."

"కాదు.."

"జయంతుని..."

"కాదు..."

"మరి ?"

"హనుమంతుని. . అయితే, నేను ఇక్కడికి వచ్చేలోగా హనుమంతుడు భగవంతుడయి పోయాడు."

అప్పుడు పిల్లలు ఇద్దరూ నవ్వారు. చిన్నవాడు మాత్రం "మీ తమాషా చాలు. మీరు నాన్నగారిని చూడడానికి వచ్చారు" అన్నాడు.

"లేదు. భగవంతుడిని మా వూరికి పిలుచుకొని పోడానికి."

"నేను రాను. . . ."

"నేను నిన్ను విడిచిపోను. మీ నాన్నగారిని అడిగాను. ఆయన యిస్తానని చెప్పారు. ఆయనకు యశు కావాలట. మీ అమ్మగారికి జయంతుడు కావాలట. అలా అయితే, చిన్న భగవంతుణ్ణయినా నాకు ఇవ్వండి - అన్నాను ; ఇస్తాను అన్నారు."

భగవంతునికి పది సంవత్సరాలు. నా మాటలు విని ముఖం ఉబ్బి కన్నీళ్లు వచ్చేట్టయింది. వడ్డించడానికి వచ్చిన తల్లి ఈ మాటలు విని కొడుకు దుఃఖం చూచి, "నీకు ఇంత కూడా తెలియదా భగూ ? ఆయన తమాషా చేశారు సుమా? నాకు నా భగు ఎక్కువవుతాడా ?" అని సమాధానం చెప్పింది.

నేను కడుపుబ్బ నవ్విన తర్వాతనే భగవంతునికి సమాధానం కలిగింది. భోజనమయిన తర్వాత ఆ ముగ్గురూ, బడికి సెలవు పెట్టి నన్ను మూగారు. "పిల్లలూ, ఆయన కొంచెంసేపు నిద్రపోనీ" అని వాళ్ల అమ్మ చెబితే, "అమ్మా, నీవు వూరుకో ; అన్నకు ఆయన గుట్టంతా తెలుసు. ఆయన కతలు వ్రాస్తారట. మాకు ఒక కథ చెప్పనే చెప్పాలి" అని భగవంతుడు అంగలార్చాడు. దానికి నేను "ఒక ఊరిలో ఒక హనుమంతున్నాడు. . ." అన్నాను.

"ఉండనీ, దానికి నేనేమీ భయపడను" అన్నాడు భగవంతుడు.

నేను కథకు మారు పది పన్నెండు కోతుల నిజ జీవిత కథలను చెప్పాను. కోతి పిల్లలాగ భగవంతుడు వాటిని ఉత్సాహంతో ఆలకించి, "ఇక కావలిస్తే మీరు పడుకోండి" అని నాకు నిద్రించడానికి అనుమతి యిచ్చాడు. నేను ఆ పనే చేశాను.

ఒక సుఖ నిద్ర అయిన తర్వాత, ముఖం కడుక్కొని రాగానే, టీ సిద్ధంగా రావడం చూచి, "టీ లేదు అన్నారే, నా కోసం తెప్పించింది

కదూ? నాకు అది కావాలనే నిర్బంధం లేదు. ఒక పూట టీయో, కాఫీయో తప్పితే ఏమిటిది?'' అన్నాను ఇంటి యజమానురాలితో.

''అలవాటయిన వారికి అది తప్పితే తలనొప్పి వస్తుందట కదా?''

''నాకు సభావంతుల యింట్లో టీ అయింది.''

''సరే. చేశాము గదా!''

''పుచ్చుకోడానికి తకరారు లేదు'' అని వచ్చిన టీ తాగి, పడుకొని వున్న మంజయ్యతో మాట్లాడడానికి వెళ్ళాను. ఆయన మరొకమారు పక్క మీద లేచి కూర్చున్నారు.

''ఒకే సమంగా అంతసేపు కూర్చుంటే వీపు నొప్పి రాదూ?'' అన్నాను నేను.

''రాదు.''

''అలాగే ప్రతి దినమూ మీకు నొప్పిరాదు. ఈ జబ్బు నయమవుతుంది- అని అనుకోవాలి. మనస్సుకు దానినే చెప్పాలి. చాలసార్లు మనస్సు జబ్బే శరీరానికి బాధ కలిగిస్తుందని అంటారు - డాక్టర్లు.''

''ప్రారంభంలో అయింది, నాకూ అలాగే. భాగాలై అంతా పోగొట్టు కొన్న తర్వాత ఋణభారం పడడం చూచి నా చేతులు కాళ్లు పడిపోయి నట్లయింది. అలా పడిపోయింది పడిపోవడమే అయింది, చూచారా?''

''అయ్యో! పాపం!'' అని అనిపించింది నాకు. ఆనాడే ఆయనకు ఆయన బంధువులో, భార్యో ధైర్యపు మాటలు చెప్పివుంటే, తెప్పరిల్లే వారేమో! దానికిమారు, మామగారు చూపిన కనికరం, చేసిన సహాయం ఒక రీతిగా ఆయన నిస్సహాయతను పొడిచి చూపినట్లయిందో ఏమో!

ఏదో ఒక ముక్క విని నేను రోగ నిదానానికి బయలుదేరితే ఎలా? అందువల్ల యుక్తిగా, ''చూడండి, నేను వూరికి వెళ్లిన తర్వాత ఒక మందు పంపిస్తాను. ఎలాటి వాతం వారో దానినుంచి గుణం పొందారు. దినమూ దానిని కాళ్లు చేతులకు రాచుకొని, నెమ్మదిగా కాళ్లు చేతులు, ఒళ్లు ఒత్తించు కోండి. మీకు ఇష్టమైన దైవాన్ని స్మరిస్తూ ''ఇది ఇక నేమి? వాసి అవు తుంది. కానే అవుతుంది'' అని అనుకుంటూరండి. మీరు భీమసేనుని లాగ మోటాగా కాకపోయినా, తెప్పరిల్లుకుంటారు'' అన్నాను.

''నిజమా?''

"చాలమందికి అలా వాసి అయిందనడం వల్ల మీకు చెప్పాను! నేను పండితుణ్ణి కాను, వైద్యుణ్ణీ కాను."

"నాకు మీ మాటలు చాలు."

"నా మీద అంత విశ్వాసముంటే తప్పక గుణమవుతుంది."

"కానీండి."

తర్వాత నేను ఎదేదోవూరి కబుర్లు చెప్పి మాటలు ముగించాను. భార్య, పిల్లలు అక్కడ లేకపోవడం చూచి "చూచారూ, కొడకణి - అంటే ఎక్కడ ? మీకు నెలకు ఇరవయ్యయిదు పంపేట్లే అక్కడా ఒకరికి డబ్బు పంపాలని మీ మామ తెలిపారు" అని అడిగాను.

"కొడకణి... రెండు మూడున్నాయి — కొడకణిలో ఎవరు ?"

"ధారేశ్వర శీనయ్య...."

ఆ మాటకు ఆయన మెల్లగా నవ్వారు... తర్వాత అటు ఇటు చూచి, "పిల్లలు, అదీ లేరు కదా ?" అన్నారు.

"లేదు" అన్నాను.

"మా మామ మనస్సు విచిత్రమయింది... తప్పేమీ లేదు; శీనయ్య అంటే ఆయన కుమారుడు."

"కుమారుడు అంటే ?..."

"నాకు ఎక్కువగా తెలియదు. మా మామ ఉంచుకొన్నదాని సంతానం. అంటే, చూడండి - మా మామకు చేపట్టిన భార్య ఒకామె వుండడం నిజమే అయినా, ఆయన ఆమెనుంచి పొందిన సుఖం అంతలోనే వుంది. అందువల్ల ధారేశ్వరం సరసి అనేదానిని - కళావంతురాలిని - ఉంచుకొన్నారట. దానికి ఒకరో ఇద్దరో పిల్లలున్నారు - అని విన్నాను. నాకు పెండ్లి అయినప్పుడే ఊరిలో ఈ పుకారు వుండినది. ఈ పుకారు నుంచి మా అత్తమామల దాంపత్యం విరసమయిందో, అది విరస మయినందున ఇలా అయిందో - ఎవరికి తెలుసు ? అయినా, మన పాతవారిలో అదొక ఘనతకు సంబంధించిన పని అనే భావన వుండేదే గాని..."

"అంటే ?..."

"మీరు ఏమనుకుంటారో ఏమో ! వెనుకటి వారంతా అలా చేస్తున్నా, పోకిరీ వెధవల్లాగ రోజుకొక దాని యింటికి పోయి వచ్చేవారు కాదు. దానిలోను ఒక రీతి, రివాజు ఉండేది. అంతేకాక, వారిలో కొందరు వారిని తమ

భార్యలతో సమానంగానే చూచిన వారున్నారు. వాళ్లయినా చేపట్టిన భార్యలకన్నా హెచ్చుగా మర్యాదతో వీరికి నడచుకోవడమూ కద్దు. నేను విన్నదానిని బట్టి - ఈ ధారేశ్వర సరిసి అనేది ఆ రీతిగా నడిచినట్టిదట. ఆ సంబంధంతోనే మా మామ తల చెడగొట్టుకున్నారని విన్నాను! తల చెడుపుకున్నారు - అంటే పిచ్చి పట్టింది అని అర్థం కాదు. కొడుకు ముందు, ఆడపిల్లల ముందు, వచ్చిన బంధువుల ముందు - దాని విషయం లోనే మా అత్త ఆయనను ఎత్తి పొడవసాగిందట. అప్పటికి మా బావ మరది సీతారాముడూ వ్యాపార వ్యవహారాలు తెలుసుకొన్నాడు. తన కొడుకు ధైర్యంతో అత్త ఎగర్లాడసాగింది. మా మామ ఈ అత్తకు ఏవైనా బంగారం, నగలు ఇచ్చారా అంటారా?''

''ఎవరికి ధారేశ్వర...''

''కాదండీ... దానికి ఏమిచ్చారో తెలియదు. ఇచ్చినా, తాము సంపాదించిందే ఇచ్చారు. నేను చెప్పింది అత్తగారి సంగతి. మా అత్తకు ఆయన ఏ విషయంలోను తక్కువ చేయలేదు. ఆయన చేతులారా ఇచ్చిన రెట్టింపు డబ్బు ఈమె తీసుకొన్నదీ వుంది. పట్టుదల చూపి వుంటే, మా మామ వీళ్లె వళ్లకూ ఏమీ లేకుండా చేయకూడదనే దేమీలేదు. అంతా ఆయన సంపాదించిందే కదా! ఈమె పుట్టింటి వారు, ప్రారంభంలో, అంటే చొచ్చలు మనె నుంచి వచ్చినప్పుడు ఏమైనా అప్పు సప్పు మామగారు ఇచ్చి వుంటే, వడ్డీతో సహా చెల్లించారు.

''మొదట ఆయనకు ఏ రీతి పరాజయం కలిగిందో, నష్టం కలిగిందో, అంతే మంచిదయింది, తర్వాత; వక్కల వ్యాపారంలో. దానిని చూచి సట్టా వ్యాపారంలో ఓడిపోయిందీ అలాగే. అయితే, ఈయన ధరలో, కొనడంలో, అమ్మడంలో - ఎంతో నిగాతో వున్నవారు. ఆ ఒక్క వ్యాపారంలో ఆయన లక్షలు సంపాదించలేదూ?''

''ఆయన వూరు వదలి వెళ్లిపోయేటప్పుడు వీళ్లకు వదలిపోయింది ఏమిటి తక్కువ? అంటే ఆయన తన స్వంతానికి ఎక్కువ డబ్బు తీసుకు వెళ్లలేదు - అంటారు.''

అంతలో ఆయన చిన్న కుమారుడు భగవంతుడు అక్కడికి వచ్చాడు; మా సంభాషణ ఆగింది. కొడకణి ఎక్కడుంది అనే విషయం కుమటిలోనే తెలుసుకోడం మంచిదని, మరి ప్రశ్నించకుండా ఊరుకున్నాను. ఆయన

నుంచి సెలవు తీసుకొని, వెలుపలికి వచ్చాను. ఇల్లాలితోను రెండు మాటలు చెప్పి బయలుదేరాను. వారికి పంపుతానన్న మందు విషయం తెలిపాను. తర్వాత "అమ్మా, ఈ పిల్లల చదువు చెడకుండా చూచుకోండి; వారి నుంచి మీకు నిజంగానే శ్రేయస్సు కలిగీని. వారి చదువుకు ఏమి కావాలో మీ తండ్రిగారు నా వద్ద పెట్టిన డబ్బు నుంచి నేను ఇవ్వగలను ... వాళ్లకు ఆరోగ్యం ఇంతయినా లేదు. నిత్యా కొంచెం పాలు, పెరుగు హెచ్చుగా ఇవ్వాలి. ఏమీ యోచన చేయకండి. మీ యశ్వంతునితో నాకు అప్పుడప్పుడు జాబు వ్రాయించండి. నేను మీ ఒక అన్నయ్య - అని భావించండి" అని చెప్పి బయలుదేరాను. ఇంటి ముందు మడివరకు ఆమె, పిల్లలు నన్ను సాగనంపడానికి వచ్చారు. యశ్వంతుడేమో పట్నం వరకు నా వెంట వచ్చాడు.

తర్వాత నేను కుమటి వదలి వెళ్ళే ముందు యశ్వంతుడు నేనున్న యింటికే వచ్చి, మళ్లీ నన్ను తమ యింటికి పిలుచుకొని వెళ్ళి, మంజయ్య గారి దర్శనం చేయించడమూ జరిగింది.

## పది

"ఓహో! మీరు రావడం దానికోసమా? మంచి పనిచేశారు; హొన్నె గద్దె మంజయ్య జీవితంలో బాగా పరాస్తుడై, బీదవాడైపోయాడు. మామ గారి మిగిలిన డబ్బులో రెండు డబ్బులు ఎవరికైనా వెళ్లవలసి వస్తే ఆయనకే వెళ్ళాలి. అలా అని - ఆయన డబ్బు మొహం చూచేవాడని కాదు; డబ్బు వ్యామోహం ఆయనకు ఎంత మాత్రమూ లేదు. అయితే, గ్రహచారం చూడండి; ముగ్గురు మగపిల్లాళ్లు. ఆయనే శరపంజరం ఎక్కాడు."

"యశ్వంతరావుగారి తక్కిన ఇద్దరు ఆడపిల్లలలో ఒకతెను యాణకు యిచ్చారు. రెండో ఆమె కెక్కారుకు వెళ్ళింది. వాళ్ల స్థితి ఎలాగుంది?"

"వాళ్ళా? వాళ్లు మన ఈ వైపు హవ్యక (ఒక బ్రాహ్మణ శాఖ) ఇళ్ల లోనే గట్టి కులస్థులు. వాళ్లను మీరు చూడనక్కరేలేదు .. ఇంకా మీరు మన సీతారామున్ణి చూడలేదు - కదూ? ఇక్కడే దగ్గర వాడి యిల్లు; నూరు గజాల దూరమూ లేదు."

"మీకూ వారికీ ఎలాగు ?"

"పైకి బాగుంది. లోపల ప్రవేశించి, పరిచయం తక్కువ. వాడి ఢౌలు, ధోరణి నాకు పసందుగా కనిపించవు. అంతేకాక, వాడి వ్యవహార మేదీ సరళం కాదు. వాడికి లోకంలో మంచివారు వున్నారని అనిపించదు."

ఆ మాటలు విని నేను నవ్వాను.

"ఏమి నవ్వారే ?" అని అడిగారు సభావంతులు.

"లోకంలో ఎవరూ మంచివాళ్ళు కారు – అన్నారు కదా. దానికి నవ్వాను. నాకు దాని అనుభవం ఒక్కటయింది."

"అయితే, వాడిని మీరు చూచారు."

"ఆయన మా యిల్లు వెదుక్కొని వచ్చారు" అని ఆ ప్రకరణం గురించి ఆయనకు సూక్ష్మంగా చెప్పి, "ఇప్పుడు, ఈ వూరికి వచ్చిన తర్వాత, ఆయనను మరొకసారి చూడవలసి వుంది. చూస్తాను - అన్నందువల్ల చూడాలి కదా ? అయితే, ఆయన నన్ను చూచిన తర్వాతే వకీలు నోటీసు యిప్పించారు."

"అంతయిందా ఇంతలోపల ? అలా అయితే ఎందుకు వెళ్లుతారు ? వేరే పనీ పాటు లేదనా ?"

"వెళ్లితే, నాకేమిటి ? ఎంతన్నా, నా స్నేహితుల బలగంవాడే కదా ! ఆయన తల్లిని చూచుకొని రావచ్చు."

"మీకు పనీ పాటూ లేదు ; ఆమెకు యశ్వంత హెగ్గడెగారు పోయిన దొక దుఃఖమా ? ఆయనను వెళ్లగొట్టినవారు ఆమే, ఆ సీతారాముడూను."

"అదేమి మనఃక్లేశం కలిగిందో, ఏమో ! సంసారమన్న మీద ఏదో చిక్కు వుండనే వుంటుంది."

"ఎవరిలో ; ఆలు, మగడు ; తండ్రి, కొడుకు – వీరిలోనా ?"

"ఎందుకు ఉండరాదు ? పిల్లలు పెద్దవారయిన తర్వాత నూరారు యిళ్లలో అలా అవుతుంది కదా ?"

"ఇక్కడ అలా కావడానికి పిత్రార్జితమయిన ఆస్తి ఏమీ మిగలలేదు. అంతా, ఆయన కుమటికి వచ్చిన మీదట, కనుమలనుంచి చేతులు కడుక్కొని వచ్చిన తర్వాత కష్టపడి సంపాదించింది."

"ఆయన చాల గట్టివాడు ; నా కన్నా పది సంవత్సరాలు పెద్ద.

ఆయన వచ్చేటప్పుడు తమ భార్య యింటికి వట్టి చేతులతో వచ్చారు. ఆ మీదట ఒక షావుకారు దగ్గర గుమస్తాగా కుదిరారు; నాలుగు సంవత్సరాలు కళ్లు మూసుకొని, పని మనిషిగా కష్టపడి పనిచేశారు. తమకు వ్యాపారపు లోతులు తెలిశాయి అనగానే, మామనుంచి నాలుగైదు వేలు అప్పు తీసుకొని వుండాలి. స్వంత వ్యాపారం ప్రారంభించారు. ఆ అప్పు మూడు సంవత్సరాలలోనే తీర్చి వేసినట్టు విన్నాను. ముఖ్యమయిన సంగతి. ఆయన అదృష్టం బాగున్నందున, వఖారు ఆరంభించినప్పటి నుంచి ఆయన నసీబు ఖులాయించింది. ఏలాటి పాడుగప్పాలకు పోక, తన వ్యాపారమూ, తానూ – అని వున్నారు. లక్ష్మి వలచివచ్చింది. వచ్చినా, ఒక దమ్మిడీనైనా పాడుచేసినవారు కాదు. ఆయన ముందు ఎలా వుండనీ; కుమటికి వచ్చి, ఒక స్థితికి వచ్చిన తర్వాత, తన భార్య పిల్లలకు ఏమీ కొరత చేయలేదు. సీతారాముడిని బడికి పంపారు. ముగ్గురు ఆడపిల్లలకు పెళ్లి చేశారు. . .

"డబ్బును ఆయన అనాప్రయం (దుర్వ్యయం) చేసిందే లేదు. కనుమలలో వున్నప్పుడు, తమ వూళ్ళో చాల డబ్బు పాడుచేశారు – అని అంటారు. ఇక్కడ ఆయనేమీ అలా చేసినట్టు కనిపించదు. తమ చేతికి డబ్బులు చేరిన తర్వాత, అప్పు అడగడానికి ఎవరయినా వెళ్ళినా, ఎవరినీ మీద వేసుకొన్నవారు కాదు. ఒకసారి చేతులు కాల్చుకొన్న వారు కదా!"

"ఆయనకు కొంచెం అడ్డ వ్యవసాయం వుండేదని విన్నాను."

నవ్వారు సభావంతులు. అదొక టేమిటి మహా! మనలో పెద్దవాళ్లు అనే వారు చాలమందికి ఉండే చాపల్యమది; అదొక రకం షోకు! ఆయనకు ఒకతె ఉండేదనడం నిజం. ఈయన దానికి బంగ్లా కట్టించి, అలంకారం చేయించి, ఊరేగించిన వారు కారు. దానిలోను ఒక మితి వుండేది. దుర్గుణ మనే టట్టయితే, అదొకటి ఆయనలో వుండేది నిజమే. నేను లేదు అనను."

"దానినుంచే ఇంటిలో ఇక్కట్టు వచ్చిందంటారే?"

"ఛా! ఎంతమాత్రమూ అయివుండదు. దానికి ప్రతికూలమయిన నిజమున్నా ఉండవచ్చు."

"అలా అంటే?"

"ఆ మాట చెప్పగూడదు... మీరు అక్కడికే వెళ్లుతున్నారు గదా!

వెళ్లితే, ఆ మహానుభావురాలు ఎలాంటిది అని మీకు ఆమెను చూడగానే తెలుస్తుంది.''

''ఒక్కణ్ణే పోవడానికి నాకు...''

''దానికేమిటి? అంతమట్టుకు నేను మీకు తోడుగా వస్తాను.''

సభావంతులు నాకు ఈ ధైర్యం కలిగించడం వల్ల మరుసటి దినం మధ్యాహ్నం భోజనం ముగించి, నిద్రపోయిన తర్వాత, నేనూ, ఆయనా, కలిసి సీతారామ హెగ్గడెగారి వఖారుకు వెళ్లాము. సభావంతులు మేము వచ్చే సంగతిని ముందుగా తెలుపడం వల్లనో ఏమో సీతారామ హెగ్గడె గారు పూచిన బొండు మల్లెలాగ విచ్చి, తల వాకిలి దగ్గరే మమ్మల్ని కలుసుకొని స్వాగతం చెప్పి తమ అంగడికి పిలుచుకొని వెళ్లారు. రెండు పడక కుర్చీలలో మేము ఒరిగి కూర్చున్నాము. తాంబూలం వచ్చింది. ''టీ చేయించనా?'' అని అడిగారు. నేను ''ఇప్పుడే అయింది'' అన్నాను. ''పరాయి వూరి వారు కదూ, చేయించు'' అన్నారు సభావంతులు. ఆయన ఆ అనుజ్ఞను లోపలికి వెళ్ళి తెలిపివచ్చారు. మొదట ఆయన, నేను పిలుచు కొని వచ్చిన సభావంతులతో వక్కల ధర, సంత, సాగుబడి – గురించి చాలసేపు మాట్లాడారు. నాకు వక్కలు నమలడం తెలుసుగాని, ధర గురించి ఏమి తెలుసు? నేను పూర్తిగా ఉదాసీనంతో వున్నాను. ఆ రోజు సీతారామ్ మా యింటికి వచ్చినప్పుడు, ఉపాధ్యాయ మిత్రునితో కబుర్లలో మగుడినై కూర్చున్నట్టు, ఆయన ఇప్పుడు, అంగడికి వచ్చిన వారితోను, సభావంతులతోను మాట్లాడడంలోనే పొద్దు గడిపారు. నాకూ అదే కావలసింది. మాటల విరసం కన్నా, మౌనపు సరసమే లెస్స!

లోపలినుంచి చిన్న కుర్రవాడు ఒకడు వచ్చి, ''దాహానికి సిద్ధంగా వుంది. లోపలికి రావాలి'' అని తెలిపాడు. అప్పటికి నాకు సంకోచం ప్రారంభమయింది. ఆ దౌర్భాగ్యురాలిని మొదటిసారిగా చూచే నాకు అదొక మంచి సమావేశం – అని అనిపించేట్టు లేదే!

లోపలికి వెళ్ళాము. అక్కడ మూడు పీటలు వేశారు. రెండు మాకు; ఒకటి ఇంటి యజమానురాలికి... మేము కూర్చున్నాము; పళ్ళేల నిండా ఫలహారం వచ్చింది. శీర (హల్వా), శీకరణీ (పళ్లరసం), పూరీ, కారం, కాఫీ!

''ఇదంతా ఎందుకు చేయించారు'' అని అడిగాను నేను.

"మేము ఇంట్లో ఇప్పుడే ఉపహారం ముగించి వచ్చాము" అన్నారు సభావంతులు.

"అలా అయితే, చెప్పంపడం ఎందుకు?" అన్నారు ఆయన.

"నీవు సమయానికి లేకుండా పోరాదు కదూ - అందుకని!"

"నేను ఈ సీజనులో అంగడి విడిచి ఎక్కడికి పోతానట?... తీసుకోండి, తీసుకోండి. శీకరణి, పూరీ ఆరోగ్యానికి మంచిది" అని సీతారామ హెగ్గడెగారు అంటున్నప్పుడు, కమలమ్మగారు అక్కడికి దయచేశారు.

"ఈమె మా తల్లిగారు" అన్నారు సీతారామ హెగ్గడెగారు. నేను కూర్చున్నచోటి నుంచే ఆమెకు నమస్కారం చేశాను.

బాగా లావయిన స్త్రీ. తెల్లటి హృష్టపుష్టమయిన శరీరం; కొడుకు లాగ ఠీవి అయిన నడక. కుంకుమ లోపం ఒక్కటి తప్ప గతకాలపు చిన్న పల్లెటూరి రాణి లాగ కనిపిస్తున్నట్టిది. చెవుల్లో ఇంకా తళతళలాడే కమ్మలు; కట్టుకొన్న చీర పట్టుచీర. ఆమె అత్యంతం ఆత్మ విశ్వాసం గల స్త్రీగా కనిపించింది.

నేను ఉపాహారం ముగించే లోపల సీతారాముడు సభావంతులను వెలుపలికి పిలుచుకొని వెళ్ళి "మీరు కొంచెం విరామంతో మాట్లాడండి. మేము వెలుపల వుంటాము" అని అంటూ వెలుపలికి వెళ్ళిపోయారు.

"కాని, నెమ్మదిగా ఉపాహారం..." అన్నది ఆ తల్లి – నేను మాట్లాడ లేదు.

"మా కుమారుడు అన్ని సంగతులూ చెప్పాడు; మీరు మా వారికి చాల ఆప్తులట."

"చాల ఏమిటి? వారి పరిచయస్తుణ్ణి, ఈ ఆరు సంవత్సరాల కాలం నుంచి."

"ఆయన అంతగా ఒకరిమీద అంత నమ్మకం పెట్టుకున్నారటే! తమ భార్యను, కడుపున పుట్టిన కుమారుణ్ణి నమ్మలేని పుణ్యాత్ములు!"

"అదొక స్వభావం! ఒకొక కాలగతి. ఆయన నా మీద నమ్మకం పెట్టడమేమో నిజం; అదెందుకో నాకే తెలియదు."

"కావాలి కదూ, ఆయన ఆస్తికొక ఉత్తరాధికారి. తమవారికి అది దక్క రాదు - అని పట్టుదలతో వున్నప్పుడు, చివరివరకు ఆ ద్వేషం సాధించ వద్దూ?"

"అమ్మా, ఆయన ఉత్తరాధికారి నేను ఎలా అవుతాను?" ఆయన బొంబాయిలో వున్నప్పుడు, ఎవరితోనూ ఎక్కువ సంబంధం వుంచుకోలేదు ... అటు తర్వాత ఒకమారు నా పరిచయం అయింది; అదిన్నీ రైలులో; నేనూ, ఆయనా పూనానుంచి వెళ్లుతున్నప్పుడు – నేను కన్నడం మాట్లాడే వాడినని ఆయనకు తెలిసింది, అందువల్ల. చివరకు ఆయనకు జబ్బు ఎక్కువయినప్పుడు, ఒక చీటీలో నా పేరు వ్రాసిపెట్టి, ఈ చిరునామాకు తంతి ఇవ్వండని పొరుగింటివారికి చెప్పారట. ఆ పొరుగింటి వారు నాకు అలాగే తంతి యిచ్చారు. అప్పుడు నేను వెళ్లవలసి వచ్చింది; వెళ్ళాను."

"అదంతా చెప్పాడు, సీతారాముడు. ఏమైనా, చేపట్టిన దానిమీది ద్వేషం సాధించనే సాధించారు. న్యాయంగా చూస్తే, ఆయన మీకు ఆ డబ్బు పంపడం సరైందేనంటారా?"

"నాకూ అలాటి సంశయమే వుంది. అందువల్ల నేను ఉభయత్రా చిక్కుకున్నట్టయింది! . . . అందువల్లనే మీ కుమారునికీ నా మీద సంశయం కలిగింది. నేను ఆయన జాబు చూపిన తర్వాత కూడా, మీ కుమారుడు రిజిస్టర్డ్ నోటీసు ఇప్పించారు . . . . "

"ఆయన ఇలా చేయడానికి మారు, ఆ ధారేశ్వర సరసి పేరుతోనే ఒక వీలునామా వ్రాసి వుండవలసింది. ఇంకా, ఆయన పట్టపు కుమారుడు వున్నాడు కదా సీనడు, వారి పేరుకు పంపించండి అదంతా; ప్రారంభించిన ప్రకరణం ముగించినట్టవుతుంది."

"అదంతా నా కెందుకు తల్లీ! నా ముందు ఇదంతా చెప్పవలసిన అవసరమేమిటమ్మా?"

"మీకు అవసరం లేకపోయినా, మాకు చెప్పాలనిపిస్తుంది! మేము ఆయన నుంచి పడిన కష్టం, అవమానాలు అన్నింటికీ!"

"మరణించిన వారి విషయం ఇంతగా ఎందుకు మనస్సుకు పట్టించుకుంటారు? ఎంత కష్టమయినా, మనం దానిని మరణంతో మరచిపోవడం ధర్మం!"

"ఇప్పుడు మీరు మాకు ధర్మం ఉపదేశించడానికి వచ్చినట్టుంది. ఆయనకు, ఆయన వున్నకాలంలో, ఆయన స్నేహితులు అనేవారు చెప్పవలసింది – ధర్మం."

"ఆయన ఉన్నకాలంలో... ఆయన తమ కుటుంబంలోని ఎవ్వరి విషయంలోను ఒక్క మాట నయిన దూరు చెప్పినవారు కారు. చెడుచెప్పిన వారు కారు; మంచీ చెప్పినవారు కారు."

"అనడానికి నోరు రావద్దూ ?"

దానికి నేను బదులు చెప్పలేదు. ఆమె వూరికే వుండిపోతుందని అనుకున్నాను. అయితే, ఆమె "మీరు చొచ్చలు మనె ఒక ముండ కోసం దేవాలయ మొకటి కట్టించారట కదా !" అని కోపం వెళ్లగక్కింది. నేను విని చకితుడయాను.

"తల్లీ, మీ మనస్సు శాంతంగా లేదు – అనే విషయం నాకు తెలుసు; అయినా ఏ ఇతరుల విషయంలోనూ, మీరు అలా అనగూడదు."

"అనగూడదా ? పెళ్లయినదాన్ని నేను వుండగా, నా మొగుడి మీదే ఆ ముండ పారుపత్తెం నడిపింది ! మీరు దాన్ని వెదికి తీసి ఒక దేవాలయం కట్టించారు ; అంతేనా ?"

"నేనేమీ కట్టించిన వాడిని కాదు. అదంతా ఆమె గుణం, ఆమె దేవుని ప్రేరణం, ఆకస్మికంగా నా నుంచి అంతపని జరిపించాయి."

"కానీండి."

ఆమెతో మాట్లాడాలనే నా కుతూహలం మట్టిలో కలిసిపోయింది. అంతే కాక, బెనకయ్య గుడి కట్టించడానికి నాకు ఏలాటి అధికారం వుంది ? – అనీ ఆ క్షణంలో అనిపించకపోలేదు. నెమ్మదిగా లేచాను. అది చూచి, "పొద్దుపోయినట్టు కనిపిస్తుంది. వెళ్ళిరండి. ఎప్పుడయినా ఈ వూరికి వస్తే రండి" అన్నది యజమానురాలు.

"అలాగేనమ్మా !" అని చెప్పి, పులినోటినుంచి తప్పించుకొన్న ఆవు లాగ వెలుపలికి పరుగెత్తి వచ్చాను. అక్కడినుంచి, తొందరగా, సీతారామ హెగ్గడెగారితో "వెళ్ళి వస్తాను" అని తెలిపి బయలుదేరాను.

"నాలుగు రోజులుంటారా ?" అని ఆయన అడిగారు.

"ఒకటి రెండు అనవచ్చు."

"సరే. వెళ్ళిరండి. మీరేమీ వేసట పడవద్దు. మేము ఈ స్వల్పమయిన డబ్బుకోసం కోర్టుకు వెళ్ళరాదని నిశ్చయించుకొన్నాము."

"మంచిదే. అంతయినా, పెద్దలమీద అభిమానం పెట్టారుగదా !"

"ఆయన మీది అభిమానమని కాదు; మీ విషయంలో ఒకరిద్దరు

స్నేహితులు మంచి అభిప్రాయం తెలిపి సమాధాన పెట్టడంవల్ల, మీరయినా ఏం చేస్తారు?"

"ఏమైనా సరే. నా మిత్రుల సంతానానికీ, నాకూ ఎలాటి విరసమూ కలుగకూడదు."

"మీరన్నది న్యాయమే!" అన్నారు ఆయన. నేను నా మిత్రులు సభావంతులతో పాటు ఆ దాక్షిణ్యపు బోనునుంచి తప్పించుకొని దాటి వచ్చాను.

"చేపట్టిన భార్య" అన్నారు కమలమ్మ. ఆ చేతినుంచి పట్టు పట్టించు కొని వెలుపల పడడానికి నా మిత్రులు ఆత్మహత్య చేసుకొని వున్నా ఆశ్చర్యం కలిగేది కాదు. పార్వతమ్మను గురించి ఆమె అన్నమాటలో ముందు, ముండ – అని రెండుసార్లు అన్నప్పుడూ తనకు వచ్చిన వైధవ్యం మరచినట్లే కనిపించింది. చెప్పవలసి వస్తే, ఆమె వైధవ్య ప్రాప్తితో కేశ ముండనం చేయించుకోలేదు. అదే ఆమె మాటల దిట్టతనానికి ధైర్యం కలిగించిందా అని అనిపించింది.

దారిలో, వస్తూ వస్తూ, నా మిత్రులు "ఏమిటేమిటి మాటలు జరిగాయి ఇంటి యజమానురాలితో?" అని అడిగారు.

ప్రత్యుత్తరంగా నేను "అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా!" అన్నాను. మూల సంస్కృత శ్లోకం ఉద్దేశంలో ఈ పంచ కన్యలు నిత్య స్మరణకు అర్హులు. అయితే, మా పల్లె మాటలో అలాటి వారి గుంపునకు రావణుని భార్య అయిన మండోదరి చేరదు; మొగుడి దౌష్ట్యమంతా ఆమెకు ఆరోపించారు. మన జనం, ఏ దిష్టి కళ్ల దానినో, మగరాయిడినో గురించి "అది ఎలా?" అని అడిగితే, "అదా? మండోదరి?" అంటారు. అ జ్ఞాపకంతో నేను ఆ శ్లోకార్థం చెప్పాను. సభావంతులు విని నవ్వారు.

"తెలిసింది. మీకు ఐదే ఐదు క్షణాలలో కదూ!" అన్నారు.

"ఆయన మాటల వల్లనే ఆమె స్వభావం పూరా తెలిసింది. ఆమె ఠీవి, మాటలు, జంభం – అన్నీ చూస్తే పది వూళ్లు గెలిచిన పాతకాలపు రాణీ లాగే వున్నది. ఇప్పుడు నా కొక అభిప్రాయం కలిగింది – ఇలాటి వారితో సంసారం చేసిన యశ్వంతరావుగారు ఎలా రోజులు గడిపారో ఏమో అని."

"సంసారమనేది జోడు గుర్రాల రథం – అనే వారున్నారు. ఈ సంసారానికి కట్టినవి గుర్రాలు కావు కదా! పశువులతో పోల్చేటట్టయితే ఏనుగు,

పులి కట్టిన రథ మయ్యాని. 'పులి—ఎద్దు' అనలేను. యశ్వంతరావుగారు ఎప్పుడూ ఎద్దు కాదు, ఎద్దయి వుంటే, ఈమె, ఆయనను మింగివేసి వుండేవి. ఆయన ఏనుగు కావడం వల్లనే, పులి రథం లాక్కపోయినా, తాము లాగారు. తను గాంభీర్యం చెడగొట్టుకోక చివరకు ఒకనాడు నగలు వదలి ఇవతలికి వచ్చారు.

"తల్లి ప్రభావం సీతారాముని మీద బాగా పడినట్టు కనిపిస్తుంది. అయితే, చూడండి, నిన్న హొన్నెగద్దెలో ఆ ఇల్లాలిని చూచానే? ఎవరు? జలజాక్షి అనే ఆవిడ — ఏమిటి ఆమె నడత, వినయం, సహనం — అంటారు. ఆమె భర్త మంజయ్యా అలాంటివాడే. మొదట నాకు దారిలో కనిపించాడు ఆయన కుమారుడు యశ్వంతుడు. వాడూ అలాగే. నేను ఎవరో తెలుసు కొనడానికి ముందే, 'కేతరకి మంజయ్యగారి యిల్లు చూపిస్తాను' అని బయలుదేరాడు" అని నా అభిప్రాయం వెల్లడించాను.

"స్వామీ, మంచి పిల్లలు కనడానికీ ఒక పుణ్యం కావాలి. డబ్బు వస్తుంది. అదృష్టముండే ఎవ్వరికయినా, అది వస్తుంది. శీలం, గుణం అదృష్టం నుంచి వచ్చేవి కావు. అవి పూర్వ పుణ్యం వల్లనే రావాలి" అన్నారు సభావంతులు.

నేను తల ఊపాను. మనకు తెలియనివి ఏమున్నా, వాటిని మనం 'అదృష్టం, నసీబు' అనో, ఇంకా తెలియకపోతే, "పూర్వ పుణ్యం, ప్రారబ్ధ కర్మ' అనో చెబుతూ మాటలతో తేల్చి వేస్తాము. నిజమే. అయితే, ఇలాటి వ్యవహారాలలో మనకు భవిష్యత్తులో స్థానమేమిటి? లోకం మన నుంచే నడుస్తుందని ఎవరూ అనుకోనక్కర లేదు. అయినా, తమ శీలానికి తామే బాధ్యులమని మనుష్యులు తెలుసుకోకపోతే, వారు కూడా ఆత్మశక్తి లేని వట్టి పదార్థాలు అవుతారు. ఇది నిర్మించవలసిన, పెంచవలసిన, రక్షించ వలసిన శక్తి కదూ? నా మిత్రులు పొందినట్టి సులభమయిన సమాధానం మనమంతా పొందవచ్చా?

నేను సభావంతులను ఆయన యింట్లో వదిలిపెట్టి ఊరికే సముద్రతీరం వరకు వెళ్లి వస్తానని చెప్పి బయలుదేరాను. వెళ్లి చేరడానికి ఒక గంట పట్టింది. నా మనస్సు ఆ సాయంకాలం సమావేశంతో చాలా నొప్పిపడింది. వెళ్లి సముద్రము తీరంలో కూర్చుని, పొర్లివస్తున్న అలలను చూస్తూ పొద్దు గడిపాను. ఆకాశంలో మునుగుతున్న సూర్యుడు ఎరుపెక్కి, క్షణ

క్షణానికి బింబాన్ని పెద్దది చేసుకుంటూ దిగంతపు అంచును సమీపిస్తు న్నాడు. ఆరిపోయే దీపానికి వెలుగు ఎక్కువ అంటారు. అలాగే, మునిగే సూర్యునికే చెలువం ఎక్కువ. నా మిత్రుల విషయంలో ఇంతగా, వాద ప్రతివాదాలు, దూషణ, తెగడ్త, పొగడ్త విన్నాను. అయితే, నాకు ఆయన పరిచయమయింది కడు సంజలో. సంధ్యాకాలంలోని సూర్యునిలాగ ఆయన నిండిన జీవిగా కనిపించాడు. ఆయన ముఖం, ఆకారం, నడవడి, అన్నీ అందమయినవిగా కనిపించాయి. ఆయన మరణానంతరమూ, అలాగే, నా ఎదుట నిజమయిన సూర్యుడు అస్తమించాడు. ఇంకా చాలసేపటి వరకు ఆకాశంలో ఆయన బంగారు రంగు కనిపిస్తున్నది; సంధ్యాకాలపు కాంతిని, సొగసును చూపుతున్నది. యశ్వంతరావుగారు నాకు అప్పగించిన పని, బదిగించిన డైరి అనేవి నా పాలికి దొరికిన అలాటి బంగారు వెలుగులు – అని అనిపించింది.

వాస్తవమయిన సూర్యుడు అస్తమించాడు; రేపు మళ్ళీ వస్తాడనేది మా అనుభవం. అందువల్లనే మానవుడు ఒకనాడు మరణించినా, మరొక దేహం ధరించివస్తాడు అనే భావన పుట్టివుంటుంది మానవుని మనస్సులో. చావడానికే ఇష్టంలేని మనస్సు అలాంటి కల్పలను తానే పేనివుంటుంది. ఈ సూర్యుడయితే, తన దేహంతో రేపూ వస్తాడు; ఎల్లుండీ వస్తాడు. దిన దినమూ వస్తూవుంటాడు. మనం ? శరీరం వదలుకొని, వెళ్ళే మానవ జీవులం. పునర్జన్మలో మరొక శరీరం ధరించి వస్తామట. ఈ 'సూర్యుడు' తిరిగి వస్తే, 'నిన్న వచ్చి పోయిన సూర్యుడు వీడే' అన్నది మనం గుర్తిస్తాము. మానవుడు పునశ్శరీరం అయివస్తే, గుర్తించగలమా ? ఎన్నటికీ గుర్తించలేము. గుర్తించిన వారు లేరు. అయినా అలాటి ఒక కోరిక నమ్మకమై మన భావనలలో వేళ్ళు నాటింది. మనం పూర్వం ఏ అవతారం దాల్చాము, రేపు ఏ అవతారం తాల్చగలం – అని తెలుసుకోలేక పోయినా, మన దేవుని జన్మలన్నీ మనం గుర్తించాము. భావనా ప్రపంచంలో దేవుని అవతారాలన్నీ గుర్తిస్తున్నాడు ఈ మానవుడు!

శాశ్వతంగా బతకాలనే ఆశతో అతడు ఇలా చేస్తున్నాడు కదా ?

ఇలా నా మనస్సులో కడలి తరగలలా పెక్కు భావనలు ఉబ్బి పొర్ల సాగాయి. ఒక తరగ మరొక తరగ పుట్టుకను నాశంచేసి, తాను పైకి వస్తుంది; మెరుస్తుంది. మెరిసి, కొన్ని నిమిషాలలో అదీ నాశమైపోతుంది.

మనం చూచే ప్రతి అలా దొర్లుతుంది, పైకి లేస్తుంది, విరిగి పడుతుంది, మరుగై పోతుంది. అయితే, కడలిలో అలలే లేవనలేము. ఒకటి కాకపోతే మరొకటి వుండనే వుంటుంది; ఒకదాని వెనుక మరొకటి వస్తూనే వుంది. మన జీవితమూ అలా వుండదా? దేహాలు పోయినా, వ్యక్తులనే అలలరూపం నశించినా అలలనేవి తప్పవు. అదే కడలి, అదే నీరు, అదే గాలి. వాటినుంచి జీవిత పరంపర అనేది సదా దొర్లుతూంటుంది. ఇలా వుండదా పునర్జన్మ.

ఇలాటి ఒక కలను పేనుతూ, లేచి నిలబడ్డాను; ఆకాశం సంధ్యా కాంతి హీనమయింది. దానిలో అసంఖ్యాక నక్షత్రాలు మినుకు మినుకు మన సాగినాయి, ఆకాశంలోని నక్షత్రాలన్నీ పుణ్యాత్ములయిన జీవులలాగ స్వర్గమెక్కి మెరుస్తున్న నక్షత్రాలలాగ!

అక్కడ మానవుని వాంఛ కల్పనల గుర్రాలను పరువెత్తించింది. చచ్చినా, ఆకాశంలో చిరాయువుగా ఉండాలనే కోరిక వాడిది. ధ్రువతార శాశ్వతమయిన తార అంటారు. మానవుని ఆయుఃప్రమాణంతో పోలిస్తే గుట్టలు, గుండ్లు చిరంతన మయినవే. నక్షత్రాల మాటేమిటి? నా మిత్రులు యశ్వంతరావుగారు కూడ తారల బలగానికి చేరినట్టివారా?– అని ఆలోచించాను. ఆయనకు మాత్రం అలాటి కోరికే లేదు–అని అనిపించింది.

సముద్ర తీరం వెంబడే ఒక పరువుదూరం నడిచి మళ్లీ కుమటికి వచ్చాను. అప్పటికి ఎనిమిది గంటలయింది – నా మిత్రులు అప్పుడే తమ స్నేహితులతో విహారానికి బయలుదేరారు. ఆయన యింటి అరుగు ఖాళీగా వుంది. ఆయన యింట్లో రాత్రి భోజనమనేది తొమ్మిది, పది గంటలకు. అలాంటప్పుడు, ఇక్కడ ఎందుకు స్తంభానికి జేరబడి కూర్చోవాలి? నా వకీలు మిత్రులను కలుసుకొని విరామంగా మాట్లాడించి రాలేదే - అనుకొని ఆయన యింటికి వెళ్లాను.

అదృష్టవశాత్తు మర్డేశ్వర వకీలుగారు ఇంట్లోనే వున్నారు.

"ఏమండీ, నిన్నా మీరు రాలేదు; ఈ రోజూ కనిపించలేదు" అన్నారు.

"ఇప్పుడు వచ్చాను గదా; ఏమిటి చెప్పండి - మీ వూరి సమాచారం! ప్రాక్టీసు బాగుందా?" అని పలకరించాను.

"ఊఁ! నాకు కావలసినంత వుంది. నేను వున్న దావాలన్నిటినీ ఒంటి మీద లాక్కుని వేసుకోను. కొందరు పాత కక్షిదార్లను మాత్రం పెట్టు

కున్నాను. ఒకడి జీవితమంతా కష్టం చేయడమే అయితే, enjoy చేయడం ఎప్పుడు? చెప్పండి!" అన్నారు.

"ఓహో! ఇప్పుడు మీకు అలాటి ఉత్సాహ లహరి పుట్టిందా?" అని పరిహాసం చేశాను.

ఇలా మా కబుర్లు ఎక్కడినుంచి ఎక్కడికో పోతున్నప్పుడు ఆయన తటాలున "సీతారామ హెగ్గడె ఇంటికి వెళ్ళారటనే?" అని అడిగారు.

"ఎవరు చెప్పారండీ మీకు? మీ వూళ్లో గోడలకు కూడా చెవులుండాలి అలా అయితే?"

"అలా ఏమీ కాదు; ఆ సీతారామే మా యింటికి వచ్చాడు; అతడు నాకు మంచి పరిచయస్థుడు."

"చాల కాలంగానా. . . ."

"అతని తండ్రికాలం నుంచే. ఇతడు తండ్రిలాగ కాదు; చాల ఉత్తముడు. ఇతడంటే, perfect gentleman."

"ఉండాలి, అలాగా, ఎవరైనా ఒకరు."

"మీకూ సీతారాముడికీ ఒక వివాదం వుండినదట కదా! మిమ్మల్ని మొన్న చూచినప్పుడు – మీరు దానికోసం వచ్చారు – అనిపించింది. రావడం మంచిదయిందనండి. ఇలాటిది ఏదైనా వుంటే మీలో మీరే రాజీతో తేల్చుకోవాలి గాని. . . ."

"మాకు వివాదమేమీ లేదే?"

"కాదు; ఆయన మీ కొరక రిజిస్టరీ నోటీసు ఇచ్చారు కదా!"

"నోటీసు! అవును. ఇచ్చారు; మీ వకీళ్ల పరంపర వున్నంతవరకూ నోటీసులన్నా అటూ ఇటూ పరుగులాడ వద్దా?"

"నేను చూచాను-దాని నకలు."

"దేని నకలు. . .?"

"నోటీసు నకలు, యశ్వంత హెగ్గడెగారు వ్రాసిన జాబు నకలును; మీకు వచ్చిన కాయితం వీలునామా కాదు. నేను వచ్చేవరకు, మీ వశంలో నా డబ్బు వుండనీ – అని వ్రాసిన జాబు కదా అది? దానిని రాజీతో తీర్మానించుకోడం మంచిది."

"ఎలా . . . రాజీ అంటే?"

"మీరు ఖర్చుపెట్టిన అల్ప స్వల్పమయిన డబ్బు ముజరాచేసి, తక్కినది

సీతారామునికే ఇచ్చివేయండి. ఏమైనా ఈ మురికి నుంచి చేయి కడు క్కోండి.''

''అలాగే.''

''నేను చెప్పింది సరైందే కదూ?

''వకీలుల దృష్టితో సరి.''

''మరే దృష్టి వుంది?''

''యశ్వంతరావుగారిదీ ఒక దృష్టి వుంది - అనేది నేను మరవడం సాధ్యమా?''

''ఆయన ఒక శతమూర్ఖుడు లెండి. శుద్ధ fool. ఈ వూరిలో వున్నప్పుడు నాకు అతని సన్నిహిత సంబంధం వుండేది కదా! అతడు మొదటినుంచి తప్పుదారే పట్టాడు. అంటే, తన భార్యా పిల్లలవిషయంలో ఎలాటి చింత, కరుణ లేని విధంగానే ప్రవర్తించాడు.''

''ఉండవచ్చు! అలాగే మరణించాడు. ఎవరూ ఆయనను దిద్ది సరి చేసేవాడు లేక. ఇక మీరూ నేనూ సరిదిద్దడమవుతుందా?'' అన్నాను నేను.

''ఇక కాదు. నిజమే - అయితే మీలాంటి తెలిసినవారు, లోకానుభవం కలవారు, న్యాయం, నీతి ఎలా ఉండవచ్చునని తర్కించగలవారు చేరి దానిని సరిచేయాలి.''

''దేనిని?''

''ఆయన డబ్బును గురించి నే నన్నది.''

ఆయన మాటలతో నాకు తీరా వేసట పుట్టింది. ఈ వకాల్తా నాకు సరి పడలేదు. ముర్డేశ్వరులు నాకు పాత మిత్రులయివుండీ, పక్షపాతంతో మాట్లాడడం స్పష్టంగా కనిపించింది. అందువల్ల ''మిస్టర్ ముర్డేశ్వర్, వేరే ఏదైన విషయం మాట్లాడుదాం. మాకూ మీకూ ఏ కక్షి వద్దు'' అన్నాను.

ఆ మీద ఆయన డబ్బును గురించి మాట్లాడక పోయినా, నా స్నేహితులను గురించి ఆడరాని మాటలు అనసాగినారు. ఆయన దృష్టిలో కుమతిలోనే 'పరమ నీచుడు' అనే బిరుదుకు తగిన వ్యక్తి ఒకడెవడైనా వుంటే, అది యశ్వంతరావుగారు.

కడులోభి, కడుమూర్ఖుడు, క్రూర హృదయుడు... ఇంకా ఏమేమో దానికిమారు ఆయన ఇంటివాళ్లు, భార్య, కుమారుడు – అంతా దేవాది దేవతలు.

ఆయన ఈ విషయంలో గాంభీర్య మితితో మాట్లాడివుంటే నాకు వ్యథ కలిగేది కాదు. కాని, ఆ మితిని దాటారు. నేనూ కొంచెం ఉద్వేగ పడ వలసి వచ్చింది!

"స్వామీ, నాకు, యశ్వంత రావుగారి సంగతి హెచ్చుగా కాకపోయినా, చాలినంత తెలుసు. ఐదారు సంవత్సరాల నుంచైనా నాకు ఆయన బాగా తెలుసు. ఆయన దేవుడు కాదు; మీరన్నట్టు రాక్షసుడూ కాదు. ఒక యోగ్య మానవుడు – ఇంత నాకు తెలుసు."

"ఆయనా?"

"నా కన్నా మీకన్నా చాల యోగ్యులు. నాకు అంతే చాలు. వెళ్లి వస్తాను" అని చెప్పి, మనసు నొప్పిపడి, ఆయన యింటి చావడి దిగి వచ్చాను. ఆయనకూ తమ వకల్తా అతిరేకం (విపరీతం) అయినట్టు కని పించిందేమో...

"లేదండీ! ఎందుకు కోపగించుకున్నారూ? ఇలాటి వాటిలో sportiveness కావాలండీ" అన్నారు.

"మరణించిన వారి విషయం మాట్లాడేటప్పుడు తాము దానిని చూప లేదు. మీకు నేను sport అయిపోయాను."

"I am sorry"

"ఎవరిని అన్యాయంగా అన్నారో, ఆయనను క్షమా భిక్ష అడగండి" అని బయలుదేరి వచ్చాను.

ఛీ! ఆ దినమంతా ఒకదాని వెంట ఒక్కటిగా విషమ సన్నివేశాలే నా తల పాడుచేయడానికి కలిసి వచ్చినట్టయింది. ఒక గంట సేపు సముద్రం ముందు కూచుని పొందిన శాంతి ఇప్పుడు నా నుంచీ మరుగయి నట్టయింది. వకీలు మూర్తేశ్వరులు వేరే తెగవారు; నిష్పక్షపాత దృష్టితో ఈ విషయం చూడగలరు. నా మిత్రుల విషయంలో ఒకింతయినా సత్య మయిన చిత్రం ఆయన నుంచి దొరికిని – అని నేను ఆశించిపోతే, జరిగింది మాత్రం తద్విరుద్ధం.

సభావంతుల ఇంటికి నేను తిరిగి వచ్చేటప్పటికి రాత్రి పది గంటలు

కొట్టారు. ఆయన నాకోసం కాచుక్కూచున్నారు. "ఏమండీ, ఎక్కడికి వెళ్లారు, ఆమీదట ?" అని అడిగారు. నాకు చెప్పడానికి మనసు రాలేదు.

"పొద్దుపోయింది ; విస్తళ్లు వేశారు ; భోజనానికి లేవండి. ఆ మీదట చెబుదురుగాని" అని నన్ను లేపి పిలుచుకొని వెళ్లారు. వెళ్లి నేను విస్తరి ముందు కూర్చుంటే, ఏమీ కాబట్టలేదు. నా మిత్రుని కోసమని నాకు చాల నొప్పి కలిగింది. అలా అయితే నేను యశ్వంతరావుగారి విషయంతో పక్షపాతి నయ్యానా ?– అన్న సంశయమూ కలిగింది.

మన వారు మనకు ప్రియ మయినట్టి వారు – అనే మోహం కొంచెం కలిగినా, మన వివేకం, సమదర్శిత్వం, తూనిక, అంతా మరుగవుతుంది. లేకపోతే, నా మనస్సెందుకు అంత ఉద్విగ్నం కావాలి ? సీతారామ హెగ్గడెగారి యింట్లోను, ముర్డేశ్వరులగారి యింట్లో ఆ విధంగా నేను తాలిమి చెడడం ఎందుకు ? దానికి మూరు హొన్నెగద్దెకు వెళ్లినప్పుడు, వాత్సల్య ప్రీతి స్నేహాలన్నీ పుట్టిన దెందుకు ? నేను మానవుడిని. వివిధ రసభావాల జీవిని. అప్రియమయిన మాటలు నన్ను ఉద్వేగానికి గురిచేస్తాయి. దానికి ప్రతిగా, ప్రియమయిన మాటలు సంతోషానికి గురిచేస్తున్నాయి. అలిప్తజీవి కాను నేను !

ఆ రాత్రి పరమాన్నం చేసి వడ్డించారు : "పరమాన్నమండీ అది. రెండు గరిటెలు హెచ్చుగా వడ్డించుకొని బాగా భోజనం చేయండి" అనే ఉపచార వాక్యాలు నా చెవిన పడ్డాయి. అయితే, చేయి కడుక్కొనడానికి వచ్చినప్పుడు, "ఏమి పరమాన్నం వడ్డించారు ?" అని అడిగివుంటే, నాకు ఖండితంగా తెలియదు. భోజనం చేసేటప్పుడు నేను అలిప్తుడుగా వున్నాను. భోజనం రుచి మరచాను. జీవితం విషయంలో అలా వుంటే ఎలా సాధ్యం ? నా మిత్రుల విషయంలో అలా వుండివుంటే ? పరమాన్న భోజనం లాగే అదీ వుండేది ! వంటచేసి, ప్రీతితో వడ్డించిన వారి పాలికి నేను రాయి అయినట్టు నన్ను స్నేహంతో బిగించిన యశ్వంతుల పాలికి రాయి అయి వుండేవాడిని ! అలాంటి నిర్లిప్తత వద్దు తండ్రీ ! మానవుడు మానవుడుగా వుండడమే లెస్స . . . రాయిగా వుండడం భూషణం కాదు – అనిపించింది. ఇవతలికి వచ్చి కూర్చున్నప్పుడు.

పద్మపత్ర మివాంభసి !

పద్మ పత్రం మీద నిలిచిన నీటి బిందువు వలె మానవుడు దేనికి అంట

కుండా వుండాలట. ఆశ్రయమిచ్చిన వారికీ అంటుకొని వుండరాదు - మన మనస్సు.

నీటి బిందువు అలా వుండీని. నీటికి జీవం లేదు; జీవమున్న ఆ పద్మ పత్రం ఆ నీటి స్నేహాన్ని ఏమనుకొంటుందో నాకు తెలియదు. దానికి నీళ్లు వద్దా? జీవమున్న మనుష్యుడు అలా వుంటే, 'జీవం' ఉండే గుర్తే మనకు కనిపించదు. విచిత్రమయిన ఉపమానం. ఉపమేయ వస్తువులతో సాదృశ్యముండడం నూటిలో కేవలం ఒకటి రెండు గుణాలలో మాత్రం; ఉపమానాలను మొత్తంగా మింగితే ఎలాగు ?

ఏమైనా, నేను భోజనం ముగిసిన తర్వాత చావిడికి వచ్చి, తాంబూలం పళ్లెం ఎదుట, సభావంతుల ఎదుట కూర్చుని వున్నా, మా మనస్సు ఎక్కడెక్కడో తేలుతూంది. నాకు భావజీవితం తప్పని కనిపించలేదు; కనపడేట్టు లేదు. దానికి వివేకపు నియంత్రణం వుండాలి. హద్దుమీరిన ఉద్వేగం తప్పు - అనిపించింది. అందువల్లనే నా అంతట నేను సభావంతులతో "ఈ దినం నేనొక తప్పుచేశాను అనిపిస్తున్నది. మీరు యింట్లో లేకపోవడం చూచి, వకీలుగారి యింటికి వెళ్ళాను."

"ముర్డేశ్వర వకీలుల ఇంటికా?"

"అవును. మీలాగే, ఆయన పరిచయమూ నాకు చాల పాతది. ఆయన మీద అభిమానమూ వుండేవి. ఈ దినం అదంతా నుగ్గు నూచయింది."

"అంటే?"

నేను జరిగిన సంగతంతా ఆయనకు సూక్ష్మంగా తెలిపాను. "సాయంకాలం హెగ్గడెగారి యింట్లోనే నా తల చెడింది. ఆయన యింటికి పోతే కొంచెం శాంతి కలుగుతుందేమోనని అక్కడికి వెళ్లాను. అది పుండు మీద వాత పెట్టినట్టుయింది."

"వాళ్లూ, ఈయనా చాల స్నేహం... మన సీతారాముని యింటి వాళ్లు, వకీలుగారూ."

"అది నాకు తెలీదు."

"ఇప్పుడేమైంది అక్కడ?"

నేను జరిగిన సమాచారం మరి కొంచెం వివరించాను; ఆయన నా స్నేహితుని విషయంలో తగని మాటలన్నందుకు కోపంతో సమాధానం చెప్పడమూ తెలిపాను.

"నేను స్నేహితులతో అలాంటి ఉద్రేకపు మాటలు మాట్లాడకుండా వుండవలసింది" అన్నాను.

"ఆయన మరణించిన వారి విషయంలో, మీకు కావలసిన వారి విషయంలో అలా మాట్లాడారని మీరు చెప్పారు."

"ఆయన ఆ రీతిగా ఒక పక్షం వహించి మాట్లాడుతారని నేను అనుకో లేదు."

"అయితే, నేను మీకొక సంగతి చెప్పనా ?"

"ఏమిటది ?"

"మన ముర్డేశ్వర వకీలుగారు కనిపించేట్టున్నారా ? వారి కత మాకు తెలీంది కాదు. ఆమెకూ, ఆయనకూ సంబంధం పాతకాలం నుంచే వుంటున్నది."

"నిజమేనా ?"

"ఊరికే జిహ్వా చాపల్యంతో నేను వారిని దూషిస్తున్నానని అనుకో కండి."

పది క్షణాలపాటు నేను స్తంభితుడినై కూర్చున్నాను. ఆ మీదట సభా వంతులే, "ఈ దినం వెన్నెల వుంది. నాకు పడుకున్నా నిద్ర వచ్చేట్టు లేదు. ఎక్కడికైనా వెళ్ళి తిరుగులాడి వద్దామా ?" అని అడిగారు.

"నేను రాత్రిళ్ళు షికారు వెళ్ళే వాడినే కాదు. . . . మీరు రమ్మంటే. . ."

"ఒక్కనికే పసుగు; భయమేమీ లేదు."

"ఎక్కడికి వెళ్ళుదాము ?"

"మరెక్కడికి ? హైస్కూలుండే గుట్టకు."

## పదకొండు

సద్యా, కుమటలో నా పని పూర్తయినట్టయింది. మరొక మారు హొన్నె గద్దె మంజయ్యగారి యింటికి పోయి ఆయన కష్టసుఖాలు కనుక్కొని, నా మనస్సుకు కలిగిన నొప్పి పోగొట్టుకొని, తిరిగివచ్చాను. ధారేశ్వరం

శీనయ్య కాని, వాడితల్లి కాని, ఎక్కడవున్నారన్న సంగతి ఆయనకు తెలియ లేదు. ఆ శీనయ్యకు ఒక సహోదరి కూడ వుంది. ఆమె ఎక్కడో బడి పంతులమ్మగా పని చేస్తుండాలి – అనే ఒకే ఒక ముక్క సంగతి మంజయ్య గారి నుంచి లభించింది. ఈసారి ఆయన యింటినుంచి తిరిగి వచ్చే టప్పుడు, యశ్వంతుడు, జయంతుడు మాత్రమే కాదు; చిన్న పిల్లవాడు భగవంతుడు కూడ నన్ను కావలించుకొని లాగి "రావాలి, మరొకసారి. ఖండితంగా రావాలి" అని బలవంతం చేశాడు. మంజయ్యగారి భార్య "మా అమ్మ యింటికే వెళ్ళివచ్చారు కదూ? అందరూ బాగున్నారు కదా!" అని మాత్రమే కుతూహలం తెలిపింది.

అక్కడి నుంచి ముందు ఆలోచనలు చేస్తూ, సభావంతుల యింటికి నడిచి వచ్చాను. దారిలో నా అవివేక చిత్రం నాకు కనిపించసాగింది. నా మిత్రులు నాకు అప్పగించిన డబ్బులో ప్రతి నెలా మాసాశనానికి ఎంత డబ్బు పోవాలి? అది వడ్డీ నుంచే పోవాలి కదా! మూల ధనం నుంచి వెనకయ్య గుడికి ఇవ్వవలసినంత యిచ్చాము. ఇప్పుడు మంజయ్యగారి పిల్లల విద్యాభ్యాసానికి ఇక కొంత సహాయం చేయడానికి ఒప్పుకొన్నాను గదా! ఇదంతా ఇలాగే జరిగితే, నా మిత్రులిచ్చిన డబ్బు ఎంత కాలం వచ్చీని? మూల ధనం నుంచే ఖర్చు చేస్తూ పోతే ఎన్నాళ్లు నేను వీళ్ల కంతా సహాయం చేయగలను? అనే ఆలోచనలు కలిగాయి. ఆ ఆలోచన తోనే సభావంతుల యిల్లు చేరాను.

ఆ యింటి వాళ్లతో, సరసి, ఆమె పిల్లల సంగతి ప్రశ్నించవచ్చా? ఆయన కేమైనా తెలిసివుంటుందా? కుమటి వరకు వచ్చినప్పుడు, ఆ ఒక్క సంగతి తెలిస్తే నా భారం ఎంత వుందనే సంగతి స్పష్టమయ్యేని. లేక ధారేశ్వర శీనయ్య వ్రాసినట్టు – అతనితల్లి ఆరోగ్యంతో వుండదు – అనే భావన కలిగింది. యశ్వంతుల లెక్కల పుస్తకాన్ని, తిరుగు రశీదులను పరిశీలిస్తే ఆమెకు డబ్బు చేరినట్టు కనిపించదు. ఆమెకు, యశ్వంతులకు గల పూర్వ సంబంధాన్ని తలచుకొంటే, అది ఎప్పుడూ విరసంలో ముగియ లేదు, వారిద్దరి సంబంధమూ తెగిపోవడం అనివార్య మయినందున – అనీ అని పించింది. అలా అయితే నామిత్రులు బొంబాయిలో గడిపిన పది పదిహేను సంవత్సరాలలో వారిద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరా లేవైనా జరిగాయా? లేకపోతే, తీరా చివరికాలంలో ఆయన ఆమెపై వున్న తమ ప్రేమను

తలుచుకొని, దాని ఋణమన్నట్టు ఈ మాసాశనం నిర్దేశం ఇచ్చారా ఏమిటి? అలావుంటే, ఆమె చిరునామా ఎందు కివ్వలేదు? ఆమె కుమారుని పేరే సూచించారు ఎందుకు? - అనే సంశయాలు కలిగాయి. ప్రాయశః నాకు తమ పూర్వసంబంధపు చిత్రం తెలుపడానికి ఆయన యిష్టపడలేదేమో! ఆ ఉలుకు సహజమైందే. అందువల్ల సరిసి కుమారుని పేరు యిచ్చారు - అనుకున్నాను.

తక్కిన విషయాలకోసం నేను స్నేహితులయిన సభావంతులనే అడగ వలసివచ్చింది. ఆయన మెడ పైకెత్తి ఆలోచించారు. కొంచెం సేపయిన తర్వాత "ఇదిగో చూడండి. ఆమె కుమారుడు శీనయ్య ఇంకా బతి కున్నాడు. సందేహం లేదు. ఆమె కొక కుమార్తె కూడా వుంది. ఆమే ఇక్క డెక్కడో వుండాలి - ఉపాధ్యాయినిగా, పెళ్లి కూడా చేసుకొని నిశ్చింతగా వుండాలి - సిద్ధాపురం మూలలో. ఈ సరసి దూర బంధువు లెవరో వున్నారు, కుమటిలో. చూద్దాం, ఈ దినం వుంటారు కదా! సాయంకాలం లోపల విచారించి చెబుతాను" అన్నారు.

ఆ మధ్యాహ్నం భోజనానంతరం నాకు కావలసినంత అవకాశం కలి గింది. అవకాశమేమిటి? వేరే పనేలేదు. చాలసేపు దిండుకు జేరగిలబడి ఇంటి యజమానిలాగ ఒక కునుకు తీశాను. ఆ నిద్రతో లేనిపోని స్వప్నాలు! సరిసి యశ్వంతుల స్నేహసంబంధ చిత్రం నా కల్పనాకాశంలో చిందులు తొక్కింది. కమలమ్మగారికి విరుద్ధమయిన రూపం ఆమెది; అంత అందమైన దేమీ కాదు. సంగీతం చాల బాగా అభ్యసించింది. కులవృత్తికి విరుద్ధ మైన కులీనత, శీలం ఆమెకున్నట్టూ కనిపించింది. కలగదా! కలలో, నాకు నా మిత్రుల మీదున్న పక్షపాతమంతా ఇలాంటి ఒక చిత్రం కల్పించి యిచ్చి వుండవచ్చు. ఆ చిత్రంలో ఒక వికార సన్నివేశమూ కనిపించింది. అదేమి టంటే - నేను నిన్న పోట్లాడి వచ్చిన వకీలు ముర్డేశ్వరులు, ఒకనాడు నా మిత్రులు లేని సమయంలో సరిసి ఇంటికి వెళ్లినట్టు, ఆమె మీ కిక్కడ ఏమి పని అన్నట్టు, ఈయన యశ్వంత హెగ్గడెగారున్నారేమో నని చూడడానికి వచ్చాను అన్నట్లు; ఆయనను ఆయన యింట్లోనే చూడవచ్చు గదా అన్నట్లు; వకీలుగారు అక్కడి నుంచి వెళ్లిపోక యింకా నిలబడే వుండడం చూచి, సరిసి, వెళ్లండి ఆయన లేరు - అని కోపంతో తలుపులు మూసివేసినట్లు కనిపించింది. ఆ కతె ఇంకా పెరిగేదో ఏమో, అంతలో, నా సమీపంలో పడుకొన్న సభా

వంతులు "రావుగారూ, కాఫీకి టైమయిందట కదా?" అన్నారు. కళ్లు మూసుకొని నేను లేచాను. (తర్వాత ముఖం కడుక్కొని, ఉపాహారం ముగించిన మీదట నా మిత్రులు తమ పని మీద వెళ్ళారు; నేను విహారానికి బయలుదేరాను.)

చాలా దూరం నడిచే కోరిక నా కాళ్లకు వుండలేదు. మనస్సేమో తీరా మూఢ మయిపోయింది. సమీపంలోని ఓడరేవుకు పోయి కూర్చుందాము- అనుకొని నెమ్మదిగా నడిచి, ఓడరేవు దారి దగ్గరికి వచ్చాను. ఉప్పు నీటి కయ్యలో నీరు తగ్గి ఉంది. పది పన్నెండు పడవలు – దోనెలు – నది ఒరదలో లంగరు వేశాయి. దోనెల సంచారానికీ, సముద్రానికి పోయి రావడానికీ కయ్యలో తగినంత నీళ్ళు వుండలేదు. దానిలోనే కొందరు బెస్త కుర్రవాళ్లు చిన్న చిన్న వలలను చేత్తో పట్టుకొని, నడుము లోతు నీటిలో తిరుగులాడుతూ, చేపలు పడుతున్నారు. వలలో పడిన చిన్న చేపలపై చేతులు వేసినప్పుడెల్లా ఎగిరిపడి తుళ్లిపడి, తప్పించుకొనడానికి ప్రయత్నించేవి. ఆ దినమే వాటి ఆయుస్సుకు కొన. కుప్పించి ఎగిరిందొకటే మిగిలింది! అవి తిరిగి బెస్త పిల్లల చేతుల్లోనే పడ్డాయి. వాళ్లు ఆ చేపలు పట్టుకొని, చెంగా గెరల పుల్లలను వాటి మొప్పలలోకి దూర్చి నోటిలోనుంచి పైకి లాగి సరాలుగా గుచ్చుతున్నారు. కొన్నిటికి పూర్తిగా ప్రాణం పోయి వుండదు. అవి సరాలలోనే రెక్కలు పక్కలు కదలాడించడం కనిపించింది. దానినే కుతూహలంతో చూడసాగిన నేను, కనికరంతో ముఖం తిప్పి వేయవలసి వచ్చింది. 'చచ్చిన తర్వాతనన్నా వాటి కొట్టుకలాట తప్పుతుంది కదా!'– అనుకొన్నాను.

నాకు మరేమిటి పని? ఉప్పు కయ్యను చూడడం. బాట మీద వెళ్లి పోయ్యే జనాన్నో, బండ్లనో చూడడం. తదేక చిత్తంతో ధ్యానం చేయడం. మరొక బెస్త పిల్లవాడు వచ్చి ఏటి ఒడ్డున కూర్చున్నాడు. నడుమున వున్న సంచిలో చేయి దూర్చాడు. ఎర పురుగుల తుండొకటి తీసి చిన్న ఇనుప గాలానికి తగిలించి నీటిలో విసిరాడు. నాలాగే వాడూ తపస్సు చేస్తూ కూర్చున్నాడు. నాదీ తపస్సు. వాడిదీ తపస్సే. వాడి తపస్సు ఫలితంగా పది పన్నెండు చిన్న చేపలైనా చిక్కాయి. ఒకటేమో ఆరంగుళాల పొడవు వుంది. నా తపస్సు ఫలం – మనస్సులో తోచిన ఒక్కొక్క ఆలోచనే ఒకటి రెండు క్షణాలు తారట్లాడి, తన గుర్తునే పోగొట్టి మాయం కావడం. ఆ

ఆలోచనలన్నీ నా మిత్రుల పూర్వేతిహాసం నుంచి నాకు తెలియని, అయితే, నేనై కల్పించుకొన్న ఘటనలు. వాటికి వాస్తవ స్థితి లేకపోవడం వల్లనో ఏమో, నా ధ్యానమనే గాలానికి ఏ చేపా దొరకలేదు. ఎంతసేపు నేను అలా కూర్చున్నానో ఏమో! సాయంకాలం కావడం, వెలుగు తక్కువ కావడం మాత్రం తెలిసింది. అలాగే మంకుపట్టిన వాడిలా అక్కడి నుంచి లేచి, సభావంతుల యింటికి బయలుదేరాను. దారిలో సీతారామ హెగ్గడెగారు ఎవరో స్నేహితులతో నా ఎదుటినుంచే వెళ్ళిపోవడం కనిపించెను. ఆయనగా నన్ను పలుకరించలేదు. నేనూ, ఆయన గొడవకు వెళ్లే స్థితిలో లేను. మిత్రుల యిల్లు చేరి, ఒక ఈజీచేర్‌లో పడుకున్నాను. నాకు నిద్ర పట్టి వుంటుంది. ఎనిమిది గంటలయింది - హెచ్చరిక కలిగినప్పుడు. నా దగ్గరే సభావంతులు తాంబూలం నములుతూ కూర్చున్నా, నన్ను మేల్కొలుపలేదు. నేను మేల్కొనడం తెలుసుకున్న మీదట "ఏమిటి ఈ దినం నిద్ర మీద నిద్ర మీకు? మధ్యాహ్నమూ జోరుగా నిద్రపోయారు. చాల అలసట కలిగి వుంటుంది?" అని అడిగారు.

ఆయన అడిగిన ప్రశ్న నా కపాలంలో ప్రవేశించి లోపల చేరడానికి ఒకటి రెండు క్షణాలు పట్టింది.

"హాఁ. అవును. చాల నిద్ర! అంటే చూడండి, నిన్న రాత్రంతా నిద్ర వచ్చినట్టూ లేదు; రానట్టూ లేదు. ఒక విధంగా వుంది" అన్నాను.

"మీరొకరు! ఆ మురేడ్శ్వర వకీలో, ఈ సీతారాముని అమ్మో మీ స్నేహితుల విషయంలో నాల్గు మాటలు హెచ్చు తగ్గులుగా అన్నారని అంతగా మనస్సుకు పట్టించుకోడమా? కూడనే కూడదు. అది కాదు... కుక్క మొరిగితే దేవలోకం పాడయిపోతుందా? వాళ్లు ఎవళ్లు ఏమి చెప్పినా, నేను చెబుతాను గదా, యశ్వంత హెగ్గడెగారు బంగారం వంటివారు. నాకూ ఆయనకూ రాకపోకలు లేకపోయినా, ఆయన సంగతి తెలిసిన వాడిని, చూచిన వాడిని నేను" అని నా మనస్సులోని బాధను తొలగించడానికి ప్రయత్నించారు.

"ఆమె సంగతి ఏమైనా వాకబు చేసి వచ్చారా?" అని అడిగాను.

"ఆఁ! కనుక్కున్నాను. మీరు ఇక సరాసరి మీ ఊరికి పోవచ్చు. సిద్ధాపురం గిద్దాపురమని ఏ తాపత్రయము పెట్టుకోకండి. ఆ సరిసి చనిపోయి రెండు మూడు సంవత్సరాలయిందట. ఆమె కుమారుడు శీనయ్య

సిద్దాపురం దగ్గరిలోని కోడకణి అనేచోట వున్నారు. ఇక్కడ రెండు మూడు కోడకణి అనేవి ఉన్నాయి. వాడుండేది సిద్దాపురం కోడకణిలో."

"అలాగా?" అని చకిత స్వరంతో అడిగాను. ఇంత కనుకున్న తర్వాత ఆమె సంగతి తెలుసుకొందా మనే పట్టుదల నాకు కలిగింది.

"ఇప్పుడు ఆమె లేదు. ఆమె కుమారుడున్నాడు; కుమార్తె ఉంది; ఇటీవల సాణెకట్టికి బదిలీ అయిందట. భార్యా భర్త లిద్దరూ ఒకే ఊళ్లో మాస్టరీ చేసుకుంటున్నారట. మీకు అంతగా కుతూహలం వుంటే, సాణెకట్టి వరకు వెళ్ళండి. గోకర్ణానికి రెండు మైళ్లు ఇటు వుంది. బస్సూ ఉంది. కావలిస్తే మీర్జాన్ తారిలో పడవలో కూర్చుంటే సాణెకట్టికి పోతుంది. వారి కూతురును అల్లుణ్ణి కనుక్కొనిరండి."

"అలాగే చేయవచ్చునేమో!"

"నిజంగానే వెళ్ళుతారా? మీకు వెర్రి!"

"నా స్నేహితుల బిడ్డ కదా, సరసి కుమార్తె. నే నన్నది అర్థమయింది కదా! సరస అనే మాటకు విరుద్ధమయిన పదమే విరస. దాంపత్యంలో అనుకూల దాంపత్యమే 'సరస'; ప్రతికూల దాంపత్యం 'విరసం.' దాంపత్య మనేది శాస్త్రోక్త మయిందే వుండాలనేదేమీలేదు కదా! శాస్త్రోక్త దాంపత్యపు ఒక ఫలం చూచారు గదా! అలాంటప్పుడు నా మిత్రుల గాంధర్వ దాంపత్యం ఎలా వుండిందని తెలుసుకోవాలని కుతూహలం."

"మంచిది, చెడ్డది అనేవి రెండింటిలోను వున్నాయి కదా! తాళి కట్టడం, కట్టకపోవడం అనే దానిలోనే ఆలుమగల ఐక్యం సిద్ధిపొందదు. అంతేకాక, పిల్లల సంగతి, తలచుకున్నప్పుడు మంచివారికి మంచి పిల్లలే పుడుతారు. చెడ్డవారికి చెడ్డ పిల్లలు పుడతారు అని అనడానికి లేదు."

"అదంతూ లేనే లేదు."

"అయితే ఏమిటి చేస్తారు?"

"సాణెకట్టికి వెళ్ళి వస్తాను."

"అక్కడికి పోతే, భోజనానికి? – రాత్రిలోపల రావచ్చు. మధ్యాహ్నం లంఘనం, రేపు ఉదయం వెళ్ళితే?"

"ఒక పూట భోజనం తప్పితే ఏమిటిట?"

"ధారేశ్వర శీనయ్యను చూడడం వద్దు. వాడు ఉన్నది చాల దూరం."

"ఇంకా ఆ సంకల్పం చేయలేదు. వాడు నన్ను కొంచెం వంచించాడో ఏమోననే అనుమానమూ వుంది" అని ఆ సంగతి ఆయనకు వివరించి, "తల్లి చాల ఉపకారమయింది అన్నారు; రెండునాళ్లు భోజనం మానివేసినారు" అని వ్రాశాడు. ఒకటి, వాడి తల్లి మరణించిందే అబద్ధం. లేదా; ఆ నిజాన్ని అణచిపెట్టాడు. మరొకచోటా నాకు ఇలాగే మోసం జరిగింది. దానిని ఎలాగో సరిచేసి వచ్చాను. అందువల్ల శీనయ్య వున్నచోటికి వెళ్లాలనిపించడం లేదు. ఈమె ఉన్న చోటికి వెళ్ళి వస్తాను. సాణెకట్టిలోనే వున్నదన్నారా?"

"ఔను. అక్కడి బడిలో వున్నదట. బాటకు దగ్గరే బడి. చిన్నబడి; అలాటి పెద్దదేమీ కాదు."

"బడి ఎలా వుంటే మనకేమి?"

మరుసటిదినం ఉదయమే లేచి, ముఖం కడుక్కొని, కుమటినుంచి గోకర్ణం వెళ్లే మొదటి మోటారును పట్టుకొన్నాను. చాల దూర ప్రయాణమేమీ కాదు. ఉదయంకాలం కనుక ఎండతాపమూ వుండలేదు. దారికి ఇరుప్రక్కల చెట్టు చేమ, కొండలు, అడవులు, అడ్డంగా వచ్చిన నది, రేవు, దాని తర్వాత దారి - ఇవన్నీ నాకు సంతోషం కలిగించాయి. ముందు రెండు నాళ్లుగా వున్న వేసటంతా నా మనస్సునుంచీ తనంతటే మాయమయింది. దోనె దాటేటప్పుడు కొంచెం ఆలస్యం కాకపోయివుంటే, నేను తొమ్మిది గంటలలోనే సాణెకట్టికి చేరివుండవచ్చు. కాని, తొమ్మిదిన్నర గంటలకు దారి పక్కన కనిపించిన బడి ఎదుటే, బస్సు ఆపించి దిగాను. బడి తలుపులు మూసివుండడం చూచినప్పుడు, "ఇదేమిటి? ఇంతసేపయినా బడికి ఎవ్వరూ రాలేదు? పిల్లలయినా కనిపించవద్దా?" అని యోచిస్తూ, వెళ్ళి బడి అరుగుమీద కూర్చున్నాను. మరి అరగంట గడిచింది. నేను చూడడానికి వచ్చిన చంద్రమతి కాని, విద్యార్థులుగాని ఎవ్వరూ వచ్చేట్టు కనిపించలేదు. ఇదేమిటి? ఈ రోజు బడికి సెలవా? - అని లెక్కబెడితే నిజంగానే ఆదివారం - సెలవు దినం. ఎవరైనా దగ్గరి ఇళ్లవాళ్లను అడిగి ఆ దంపతుల నివాస మెక్కడో తెలుసుకొనడానికి మారు, ఇక్కడే పొద్దు గడిపివేశాను గదా-అనిపించింది. లేచాను. అక్కడినుంచి వెలుపలికి వచ్చాను. నూరు గజాల లోపల ఒకటి రెండు ఇళ్లు కనిపించాయి. ఉపాధ్యాయిని చంద్రమతి యిల్లు ఏదని అడగడానికి సమీపంలోని ఇంటివైపు వెళ్ళినప్పుడే

సంశయం కలిగింది ; సభావంతులు చెప్పిన పేరు, చంద్రమతి యనా, ఇందు మతి అనా – అనే గందరగోళం దానంతటఅదే పుట్టింది. ఆ గందర గోళంలోనే నడిచివెళ్ళి మొదట కనిపించిన యింటి ముందు నిలబడి, ఎవ రైనా, వెలుపలికి వస్తారా అని కాచుకున్నాను. ఎవ్వరూ రాలేదు. "ఈ బడి మాస్టరు వుండేది ఎక్కడ ?" అని గట్టిగా కేకవేసి అడిగాను. ఒక స్త్రీ వెలుపలికి వచ్చి "మాస్టరుగారు గోకర్ణం వెళ్ళారు. ఉదయమే వెళ్ళారు" అన్నది. మనస్సుకు మరొక అఘాతమయినట్టయింది. ఆమె ఇంకా అక్కడే నిలబడింది. ఆమె అలా చెప్పిందంటే, అది ఉపాధ్యాయుల యిల్లు కావడం తప్పదు. ఆమెనే కనుక్కుంటే సరిపోతుంది కదా! అని తోచింది. "నాకు మాస్టరంటే, మాస్టరే అవసరం లేదు. ఈ బడిలో ఒక ఉపాధ్యాయిని పని చేస్తున్నారా ?" అని అడిగాను. ఆమె సంశయంతోనో ఏమో మాట్లాడలేదు. నేను అంతా కలయజూస్తున్నాను. ఆమే నన్ను చూచింది. "ఏ వైపు వారు మీరు ? ఏమి కావాలి ?" అని కుతూహలంతో అడిగింది. ఆమె ముఖం చూచాను. ప్రశ్నకు సమాధానం చెబుతూ, "అమ్మా, నేను ఆమె పేరే మరచినట్టున్నాను – చంద్రమతో, ఇందుమతో– రెండింటిలో ఒకటి. నేను పరాయి వూరివాణ్ణి. ఏదో ఒక పనికోసం వాకబు చేస్తూ వచ్చాను. ఈ బడిలో ఇద్దరు ఉపాధ్యాయినులున్నారా ? ఒక్కరేనా ?" అని ప్రశ్నించాను. ఆమె నవ్వింది. ఆ నవ్వు మెరుపులో తటాలున హొన్నెగద్దె జలజాక్షి ముఖం ఛాయ ఉదయించినట్టు కనిపించింది.

"తమది ఏ వూరు ? తమ పేరేమి ?" అని ఆమె మరొకమారు ప్రశ్నించింది.

నేను రెండూ చెప్పాను. ఆ సంగతి తెలిసినట్టు. "రండి. ఈ ఇల్లే." అన్నప్పుడు నాకు ఆశ్చర్యమయింది. రెండడుగులు ముందుకు వేసి నిలు చున్నాను. "రావచ్చు. మీ పేరు చెప్పగా తెలుసు. మీ పుస్తకాలు చదివాను" అన్నప్పుడు చాలినంత ధైర్యం కలిగింది. నా ఎన్నికలో తప్పున్నా, వెళ్లి విచారించి, తెలుసుకొనడానికి సంకోచం లేదు. అరుగు ఎక్కాను. ఆమె అక్కడున్న ఒక బెంచీని చూపిస్తూ, "కూర్చోండి" అన్నది. "నేను చంద్రమతి కాదు ; నా పేరు ఇందుమతి. నేనే ఉపా

ధ్యాయిని. మా వారికి ఇక్కడే మేస్టరీ. మీరు ఆయనను చూడడానికి వచ్చారా?'' అని ప్రశ్నించింది.

''కాదు. మిమ్మల్నే.''

''నన్నా?''

''ఔనమ్మా. నా స్నేహితుల బిడ్డ మీరు అనడం వల్ల నేను వచ్చాను. మరేమీ పని లేదు. వట్టి ఆ ఒక్క కారణంతోనే. మీ అన్న శీనయ్య నాకు జాబులు వ్రాసేవారు. నేను కుమటికి వచ్చాను. మీరు ఇక్కడ వున్నారని సభావంతుల యింటి వారు వేరే ఎవరినో కనుక్కొని తెలుసుకొని నాకు చెప్పారు. చూచి పోదాము – అని వచ్చాను.''

''శీనన్న గుర్తా?''

''ముఖాముఖి పరిచయం లేదు. జాబుల మూలంగానే అతని గుర్తు, పరిచయం. ప్రత్యక్షంగా చూడలేదు. మీ తండ్రిగారి పరిచయం చాలా.''

ఆమె ముఖం దించుకొంది. ఒకటి రెండు క్షణాలు మాట్లాడలేదు.

''ఏమీ సంకోచ పడకండి. యశ్వంతరావుగారికి కావలసిన వాడిని నేను.''

''నేను ఇంత ఉన్నాను'' అని ఆమె నేలమీద రెండడుగుల ఎత్తున తన చేయి పట్టి చూపించి ''మా నాన్న నన్ను వదలిపోయినప్పుడు'' అన్నది.

''ఆ సంగతి కొద్ది కొద్దిగా విన్నాను.''

''బొంబాయిలో ఎక్కడో వున్నారట గదా–మా నాన్న?''

''ఇప్పుడు లేరమ్మా. ఆయన కాలం చేశారు, ఒక సంవత్సరం కింద.''

''ఏమిటి? మరణించనూ మరణించారా? మా అమ్మ ఆయననే జ్ఞాపకపరచుకొంటూ రెండు సంవత్సరాల క్రితమే చనిపోయింది. ఇప్పుడు ఆయనా పోయారా?''

ఆమె చాలసేపు మాట్లాడలేదు. నేనూ మాట్లాడ లేదు.

''అన్నయ్య సిద్ధాపురం దగ్గరిలోని కోడకణిలో వున్నాడు. మునుపు నేనూ అక్కడే వున్నాను; మా అమ్మ అక్కడే వుండేది. ఆమెకు కుమటి జ్ఞాపకమే గిట్టక మా అందరినీ కట్టుకొని కోడకణికి వెళ్లింది. చివరి చివరకు మాకు చాల కష్టాలు వచ్చాయి. తీరా కంగాలులమైపోయి నప్పుడు, ఎవరెవరి నుంచో చిరునామా తెలుసుకొని, మా అమ్మ అన్నయ్యతో బొంబాయికి ఒక జాబు వ్రాయించిందట. తక్షణమే ఆయన నూరు రూపా

యలు పంపారు. అది రావడం మాత్రం మా అమ్మ చివరి గడియలకు అయింది. "ఏమైనా, మమ్మల్ను మరవలేదు కదా!" అనే సమాధానంతో మా అమ్మ చనిపోయింది. తర్వాత నేనే ఆయనకు ఈ వార్తను తెలుపుతూ జాబు వేయాలని ఆలోచించాను. ఆలోచనలోనే కాలం గడిచింది. ఆ మీదట అంతా మరుపే అయింది. మరవకుండా వుండవలసింది. నేను మరచాను. ఇప్పుడు చూడండి, దేవుడు ఒక రీతిగా మమ్మల్ను నడిపిస్తున్నాడు. మా వారూ, నేనూ ఇద్దరమూ మాస్టరీ చేసుకొని ఇక్కడ సుఖంగా వున్నాము. అన్నయ్యా చాలవరకూ బాగానే వున్నాడు. ఊరి యింట్లో సంగీతం తబలా పాఠాలు చెప్పుకొని సంసారం చేస్తున్నాడు."

ఇంతమాత్రం మాట్లాడి ఆమె ఇంట్లోకి వెళ్ళింది. కొంచెంసేపు లోపల వుండి, అటుకుల ఉసుళి (తిరగమోత వేసిన అటుకులు), ఒక పంచ పాత్రలో పానకమూ తెచ్చి నా ముందు పెట్టింది. అటు తర్వాత, నేను కూర్చున్న మంచం మరొక చివర కూర్చుని తన తండ్రిని గురించి అనేక ప్రశ్నలు వేసింది. సహజ దాంపత్యంతో పుట్టిన పిల్లలు అడుగడాని కన్నా ఎక్కువ కుతూహలంతో అడుగడంవల్ల నేను ఒక్కటొకటిగా, నాకు తెలిసిన విషయాలు చెబుతూ పోయాను. "మీరయినందున నన్ను ఇంత గౌరవంతో మాట్లాడించారు. మా కులం చూడండి - అలాంటిది. మీరు, మీ తండ్రి, మీ తండ్రి అన్నప్పుడు "ఎవరురా, ఇలా నన్ను వెక్కిరించే వారు?" అనుకున్నాను. మా తల్లి, ఆయనను చేపట్టిన ఆమెకన్నా ఎక్కువగా నమ్మి నడచుకొన్నట్టిది. లోకంలో దానికి విలువవుందా? 'లంజ, లంజే' అంటారు గదా! నేనప్పుడు చిన్నదాన్ని. ఇప్పుడయినా, చాల తెలిసిన దానిలాగ ఈ మాటలు చెప్పడంలేదు; మాకు ఆయనంటే, ప్రాణం. మా అమ్మ ఆయనను పూజ చేసేది. మరొకరయివుంటే ఆయన ముల్లెంతా దోచుకొని, తర్వాత ఆయన వదలిపెట్టి పోయినా, తమ జీవనానికి కావలిసిన అనుకూలత చేసుకొనేవారు. మా అమ్మ అలా చేసింది కాదు. మర్యాదతో వుండేది. ఆయన ఊరు వదలి పోయిన ఎన్నో సంవత్సరాల తర్వాత, నాకు కొంచెం బుద్ధి తెలిసిన తర్వాత, ఒక్కమాట చెప్పింది. అబద్ధాలు చెప్పేటటువంటిది కాదు ఆమె. నాన్న తమ సంసారంలో విసుగు పుట్టి కుమటినే వదలి పోవలసివచ్చినప్పుడు, మా యింటికి వచ్చి, కన్నీరు కురిపించారట! "సరసీ, నీకు ఈ వరకు నేను హెచ్చుగా

ఏమీ ఇవ్వలేదు, చేయలేదు, పెట్టలేదు. అయినా, నీవు అగ్నిసాక్షిగా సప్త పది నడిచినదాని కన్నా హెచ్చుగా నాకు నడుచుకొంటూ వచ్చావు. ఇప్పుడు నాకు వనవాసం చేసే యోగం వచ్చింది. నేను ఎక్కడికి వెళ్లతా నన్నదే తెలీదు. ఏమి కావాలో చెప్పు - డబ్బు కావాలంటే డబ్బు ఇస్తాను; ఇల్లు కావాలంటే యిల్లు కొనిపెడతాను. నీ ఋణంలో నేను పడరాదు కదా!'' - అన్నారట. (దొడ్డతనపు అలాటి మాటలు ఎంతమంది నోళ్ల నుంచి వస్తాయి! మా తల్లికి ఆయన పడిన కష్టాలు తెలుసు. డబ్బు లెక్కా చారంలో బతుకు సాగించింది కావామె. అందువల్ల ''మీ ప్రీతివుంటే చాలు'' అని వేడుకొన్నదట. ఆమె చెప్పిన మాట యిది. అది నిజమని నేను నమ్మాను. 'ఔను. ఆయన తన చేతిలో వున్నదంతా మాకు ఇచ్చి, ఒంటరి వారైపోయి, ఎక్కడికి వెళ్లి ఏమి చేసేరూ?' అని అనిపించిందట అమ్మకు. అన్నిటి కన్నా హెచ్చుగా, జీవితమే వద్దని ఆత్మహత్య చేసు కొనే స్థితిలో వుండిరట ఆయన. ఇదీ మా అమ్మే చెప్పింది.''

తర్వాత ఇందుమతి తన తల్లిదండ్రుల జ్ఞాపకంతో ఏడ్వడం మొదలు పెట్టినందున, నాకూ మాటలు పెగలలేదు. లోక రూఢిగా నేనూ కొన్ని సమాశ్వాసన వచనాలు చెప్పినా, అలాటి గూఢాస్మృతులను వట్టి శుష్క మయిన మాటలు పోగొట్టగలవా?

'మీ అన్న మాత్రం మీ తల్లి ఇంకా బ్రతికి వున్నట్టు జాబు వ్రాశాడు'- అని ఆమె ముందు చెప్పి ఆమెను నొప్పించడానికి ఇచ్ఛ కలుగలేదు. దానికి మారు ఆమె ఉద్యోగం సంగతి, భర్త సంగతి, యోగక్షేమాలు అడి గాను. తటాలున ఆమె ''ఔనండీ! మా నాన్న మీ స్నేహితులు. ఐదారు సంవత్సరాల స్నేహం మీది - అన్నారు కదా! ఆయన ఫోటో ఒకటి మీ దగ్గర వుంటే ఇస్తారా?'' అని అడిగింది.

''వుంది, ఒకటి. దాని ప్రతి తీయించి పంపిస్తాను.''

''ఖండితంగానా?''

''నిజంగా, మీ తల్లి ఫోటో వుందా?'' అని అడిగాను నేను.

''ఉండేది ఒక చిత్రం కొనకణిలో. చాల చాల పాతది; మాసిపోయి నట్టిది. ఎప్పుడైనా ఊరికి వెళ్లితే తెస్తాను.''

''తెస్తే, నాకు పంపితే, దానిని చూపించి మంచి చిత్రకారునితో పెద్ద

చిత్రం గీయించవచ్చు. ఆ ఫోటోను చూడకుండా ఇప్పుడే ఏమీ చెప్ప లేను.''

''ఔను. అది మాసిపోయిన చిత్రం.''

''ఇక నేను వచ్చిన పని పూర్తి అయింది; ఎంత పొద్దుకు వస్తుంది. బస్సు?''

''బస్సుల కేమి కరువు? అప్పుడప్పుడు వస్తాయి; పోతాయి. మీరిప్పుడే వెళ్ళేట్టు లేదు. మా వారు ఇప్పుడు ఇంటికి వస్తారు. ఆయన చూడాలి మిమ్మల్ని. ఆయనా మీ పుస్తకాలు చదివారు.''

''నేను పుస్తకాలు వ్రాయడమే ఫజీతి (దురవస్థ) పట్టించింది కదా!''

''ధారవాడ భాష మాట్లాడుతారు మీరు.''

''నాకు ధారవాడ, కుమటి, మంగళూరు, అన్నీ ఒక్కటే'' అంటుం డగా, బస్సొకటి వచ్చి వీధిలో నిలబడింది. ఆగిన ధ్వని విని ఇందుమతి ''వచ్చారన్నట్టుంది'' అని సంతోషంతో అన్నది. మరి అయిదు నిమిషాలకు మాస్టరూ వచ్చారు. ఇందుమతి అరుగు దిగి, పెరటి తలుపు వద్దకు పరిగెత్తి పోయి, భర్త భుజాల మీద రెండు చేతులూ పెట్టి, మెడ వెనక్కు తిప్పి, నన్ను చూపించి, వార్త తెలిపింది. ఆయన ఉత్సాహంతో ఇంటి మెట్లెక్కుతూ, వచ్చి నాకు నమస్కరించాడు. పరిచయం, పీఠిక మొదలయిన పనులను ఇందుమతి అంతలోనే ముగించింది. నేను పరకీయుడిని కాదన్నట్టు అతడు నాతో మాటలకు కూర్చున్నాడు.

ఆ మధ్యాహ్న భోజనం వాళ్ల యింట్లోనే అయింది. అటు తర్వాత కూడా ఆ దంపతులు నన్ను అక్కడనుంచి లేవనివ్వ లేదు. మా వూరి సంగతులు అడిగారు; నా సంగతులు అడిగారు. సాయంకాలం ఇద్దరూ నన్ను సాణెకట్టి ఉప్పు మళ్లకు పిలుచుకొని వెళ్ళారు. బహు విస్తార మయిన పొలాలలో ఉప్పు నీళ్లు పారించి, నీళ్ళు ఎండించి, పేరుకొనేట్టు చేసి, ఉప్పు తయారుచేయడం ఆ స్థలం వైశిష్ట్యం. చాల దూరం వరకు మంచు తెలుపునుతలదన్నే లవణ రాసులు సుందరంగా కనిపించాయి. సాయంకాలం వరకూ మేము లోకాభిరామాయణంగా కబుర్లు చెప్పు కుంటూ, పొద్దుపుచ్చాము. సూర్యాస్తమయ మయిన తర్వాతే ఇంటికి బయలు దేరడం.

ఇందుమతికీ, నా మిత్రుల కుమార్తె అయిన జలజాక్షికీ స్వభావ గుణా

లలో విశేషమయిన సామ్యం కనిపించింది. ఆకారంలోను సామ్యం వుంది. ఇందు రంగు జలజాక్షి రంగుకన్నా కొంచెం కందు (నలుపు). అయితే, నడక తీరు, మాటల తీరు, అలాగే వుండేవి. ముఖ్యమయిన తారతమ్య మేమిటంటే, జలజాక్షి ముగ్గురు పిల్లల తల్లి. సంసారంలో చాలినంత బడలి నట్టిది. ఈ ఇందుమతి దాంపత్యపు గడపలో నిలుచున్నట్టిది. బాల్యపు రాహుకాలం గడిచి, యౌవన శుభోదయమయింది. ఆమెను చేపట్టిన మగడు సదానందుడు, ఆమెకు అనుకూల సహచరుడుగా కనిపిస్తాడు. మాయ మర్మం లేని సరళత ఇద్దరిలోను ఉంది.

మరునటి దినం సాణెకట్టి నుంచి బస్సులో బయలుదేరేటప్పుడు, వారిద్దరూ ఆతగా నాకు వీడ్కోలిచ్చారు. బయలుదేరేటప్పుడు, ఇందుమతి, "ఫోటో జ్ఞాపకముంచి కదూ!" అని జ్ఞాపకపరచింది. నేను కుమటికి వచ్చిన మూడు నాలుగు నాళ్ళలోను పడిన సంతోష కష్టాలను మనస్సు అనే త్రాసులో పెట్టి తూచసాగాను. ఆ లెక్కాచారంలో లాభం పొందాననే నాకు అనిపించింది. లోకంలో పది దుఃఖపు గడియలకు ప్రతి ఒక సుఖపు గడియ కదా! నూరు కన్నీటి బొట్లకు ప్రతి ఒక నవ్వు కదా! వేయి అశాంతులకు ప్రతి నాలుగైదు శాంతి సంఘటనలు కదా! అటువంటప్పుడు నాకు ఈ ప్రవాసం నుంచి విశేషమయిన లాభం కలుగలేదా? అందు వల్లనో ఏమో కుమటికి తిరిగివచ్చి, మిత్రులు సభావంతులను వీడ్కోల్పి, మరునటి ఉదయం మోటారెక్కి మా ఊరికి బయలువేరితే, దారిలో ఎలాటి వేసటా కలుగలేదు. వెళ్ళినప్పుడు కలిగిన బస్సు ప్రయాణపు ఆయాసం, వేసవి తాపం, తిరిగి వచ్చేటప్పుడు కనిపించలేదు. కుమటినుంచి కుందా పురం చేరాను, తర్వాతి ప్రయాణం అక్కడక్కడ విరుస్తూ, అన్ని చింతలూ మరచిన వాడిలాగ మా వూరు చేరాను.

ఇంటికి వచ్చిన తర్వాతనైతే, ఒక దిగ్విజయం చేసివచ్చిన వాడిలాగ నా మనస్సు ఉత్సాహం దాల్చింది. ఇప్పుడైతే నేను, నా మిత్రులు యశ్వంతుల చాలినంత సంపూర్ణ చిత్రాన్ని కల్పించుకోగలను. కల్పనలో చేరగల దోషాలన్నీ దానిలో వుండవచ్చు. అయితే, అది నిరాధారమయిన కల్పన కాదు; ఒకే ముఖచిత్రం కాదు. నేను ఒక నాణ్యం రెండు ముఖాలనూ చూచాను. చెలామణి నిలిచిపోయిన నాణ్యం; అందులోను వేయి చేతు లతో చెక్కి, అరిగి, అక్షరాలు, అచ్చు పోగొట్టుకొన్న మసక నాణ్యం.

గతకాలపు జీవితమంతా అలాంటిదే. అయితే, ఇది నాణ్యం, ఎటువంటి నాణ్యం – అని గుర్తించగల దాఖలాలు నాకు ఒనగూడినాయి. అది ఎలాంటి లోహంది? ఏ కాలంది? అచ్చు ఒత్తించిన వారు ఎవరు? దాని మూల్య మెంత? చెలామణీ నిలిచిపోయిన తర్వాత కూడా దానికి మిగిలిన విలువ ఎంత? అన్న వాటిని చెప్పవచ్చు గదా!

నా ఈ నాణ్యం ఖోటా (చెల్లనిది) కాదు. పెక్కు నాణ్యాలలాగ అది కేవలం సాంకేతిక మయినదీ కాదు. కాయితాల నోట్లు ఉన్నాయి కదా! ....ఒక రూపాయి, పది రూపాయలు – లాంటి నోట్లు. తత్కాలానికి ఒప్పుకొన్న విలువగలవి; ఒప్పుకొన్న వారికి తప్ప తక్కినవారికి కాయిత మూల్యము లేనట్టివి. అలాంటిది కానేకాదు; నాది లోహపు నాణ్యం. నిక్కల్‌తో పాటు ఏమేమో కలిపి, కరిగించిన తర్వాత ఏ లోహమూ పనికి రానట్టు చేసిన నాణ్యం కాదు. అది పాతకాలపు మోటు రాగి డబ్బు కాదు. అటు శుద్ధమయిన పుత్తడిదీ కాదు. కొంచెం తామ్రం చేరిన బంగారు నాణ్యం అయివుంటుంది. ఇది నా కల్పన. ఇంత తూనిక బంగారే దీనిలో వుండ వచ్చు, దానినుంచి సంపాదించడానికి అయ్యాని – అని అగసాలిలాగ నేను ధైర్యంగా చెప్పలేను. దీనిని ఇంకా ఒక ఒరగల్లుకు రాచి చూడాలి. ఆ రాయి, ఒరగల్లుగాను వుండాలి.

నా ఒక్క ఒరగల్లంటే యశ్వంతరావుగారు వ్రాసి పెట్టిన స్మరణ గ్రంథం. వంచన లేకుండా దానిని వ్రాయడం వల్ల, అది ఒరగల్లు కావచ్చు. మరొక ఒరగల్లు అంటే పూనాలో వున్న విష్ణుపంత్ ఘాటేగారు. ఆయన ఆ స్థానానికి తగినవారే – అనడం ఆయనను చూడక ముందు చెప్పలేను. లేక ఇక నాలుగు రోజులలో పూనా వెళ్లి దానిని ధ్రువపరచు కొంటాననే అవకాశమూ నాకు లేదు. అంతవరకు నేను ఆయన డైరీనే తిరగవేయాలి.

సరసి విషయంలో ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని నా మిత్రులు దానిలో నాలుగు మాటలు వ్రాసి వుండరా? ప్రియమైన స్మరణలను మరవడం శక్యమా? అని ఆలోచించసాగాను. అయితే, అలా వ్రాసినట్టు లేదు – అని పైపైన చూచిన నాకు తోచింది. అయినా, మరొకమారు కుతూహలంతో పుస్తకం తెరిచి ఆ మూలాగ్రం చదివాను. చివరిపుట వరకు చదివాను. తీర చివరి పుటలలో 'శిరసి యొక్క నా యింట్లో' అనే శబ్దాలు చూచినప్పుడు దిగులుపడ్డాను. శిరసి ఊరు కదా? స్వాదికి సమీపంలోని

ఊరు – అలాటి భావనతో పూర్వం అదే పుటను తిప్పిన నాకు ఆ సత్యం తోచలేదు. 'శిరసి' 'సరసియే' అనే భావనతో దానిని మరొకమారు చదివితే, ఆశ్చర్యమయింది.

చివరి పుటను డైరీ అట్టకు అతికించారు. దానిని పీకి తీసి చూస్తే, ఆ విషయమే కొనసాగింది. కావాలనే ఆయన వ్రాసిన దానిని మూసిపెట్టారు. తమ జీవితంలో దాని స్థానం దాచినట్టు. వ్యంగ్యం లేని, ఒక స్టాంపు వెడల్పు రేఖా చిత్రమూ దానిలో వుంది. అది సౌమ్యమైన, సలక్షణమైన అందమైన సరసి ముఖం. తమకు కావాలంటే, యశ్వంతరావుగారికి చిత్రాలు రచించడం వచ్చు – అనే వెరగును ఈ చిన్న చిత్రం నాకు కలిగించింది.

## పన్నెండు

"బ్రతుకులో నేను సుఖం చూచినది ఏమైనా వుంటే, అది శిరసి ఇంట్లో; నన్ను పెంచిన పార్వతమ్మ చేతుల్లో."

"మల్లెతీగ సంగతి జ్ఞాపకపరచుకొన్నప్పుడల్లా – అది తనకోసం బతుకుతుంది; మామిడికోసం కాదు – అనే భావన నానుంచి మాసిపోదు. మనస్సుకు శిక్షణ యిచ్చి, మామిడి చెట్టు వలె నేను; అది ఏమైనా, నన్నే చుట్టుకొని పెరిగింది; అది ఇచ్చే పూవులన్నీ నావే అనుకొన్నా, ఆ లత నాది కాలేదు. లతకు అంటిన పూవులూ నావి కాలేదు. దానిని వదులుకొన్న పూవులు వాస్తవ జగత్తులో నావీ కావు; ఆ లతవీ కావు; తలలో ముడుచుకొన్న వారివి కదా అవి? అయినా, అటువంటి పూవుల కయినా, నా జ్ఞాపకం మిగులవచ్చు; లతకు చివరివరకూ, మిగులలేదు.

"శిరసి అలా కాదు; లోక నిందకు గురిఅయిన కులమైనా, కులమొక్కటే శీలం నిర్ణయించదు. సొరతీగ కాయలు ఒక్కటొక్కటి ఒక్కొక్క తీరు. దాని ఒక కాయ కల్లుతాగితే, మరొకటి తంబూరా మధుర నాదానికి ప్రేరకమవుతుంది. శిరసి అలాటి సొరకాయ. ఈ తంబూర పోలికే నా మనస్సుకు ఎందుకు వచ్చింది? అది నా కోసం దానిని నిత్యమూ పట్టుకొని, దాని

తంతులు మీటుతూ, పాడుతూ వుండడం వల్లనే. డబ్బిచ్చి పాట వినవచ్చు. డబ్బిచ్చి శరీర సుఖమూ పొందవచ్చు. మనస్సుకు సుఖం కలుగడానికి, హృదయానికి శాంతి లభించడానికి మనస్సును ఇచ్చేవారు కావాలి. మనతో భావతాదాత్మ్యం పొందేవారు కావాలి.

"శిరసి అలాటిది కామా? అయినా, వదలి వచ్చాను. యాత్రకు బయలు దేరిన నన్ను అదీ వీడ్కోల్పింది. అది ఆక్షేపించివుంటే, నా గతి ఏ మయ్యేదో! ఏ విధంగానైనా, నన్ను ఇంటి ఆవులాగా కట్టి పిండవచ్చు నాయె. నీకేమి కావాలి – అని అడిగితే, "మీరు పెట్టిన ప్రీతి విశ్వాసాలే చాలు" అన్నది. ఇన్నాళ్లు గడిచినా, దాని గుణం, ఉదారబుద్ధి నా స్మృతి నుంచి మరుగుకావు ఎన్నటికీ. దాని త్యాగం దొడ్డది. "నలుగురు పిల్లలకు సంగీతం పాఠం చెబితే నేను బతకలేనా? మీరు ఎంతని కష్టం భరిస్తారు?" అనవంసివస్తే, శిరసి అసామాన్య. ఆమె ప్రీతికి తగిన గుణం నాలో వుండనే నేను అనుకోలేదు."

ఈ మాటల వల్ల, నా మిత్రుల ఉద్గారం వల్ల ఇందుమతి తల్లి ఎటు వంటిదనే చిత్రం నా కనులకు కట్టింది. ఇందు ముఖం చాలావరకు తండ్రిని పోలింది. దాని శరీరచ్ఛాయా అలాగే. గుణం తలచుకొన్నప్పుడూ, అదీ అలాగే వుండవచ్చు ననిపించింది. దాని అన్న విషయంలో ఈ మంచి భావన నాకు పుట్టేట్టు లేదు. స్వల్పమయిన డబ్బు ఆశకు, చని పోయిన తల్లి బదికినట్టు తెలిపినవాని రీతి నా మనస్సుకు అసంతృప్తి కలిగించింది. శంభు హెగ్గడె ఒక రీతిగా నన్ను వంచనచేస్తే, మరొక రీతిగా ఇతడు వంచన చేశాడు.

నేను ఊరికి వచ్చి నెలయింది. వేసవి తాపమంతా ముంగారు వానలు పరిహరించాయి; వాతావరణంలో మరొక రీతి చెలువమే పుట్టించాయి. నా చిరునామా అడిగి దగ్గర పెట్టుకున్నాడు. ఇందుమతి "మా తండ్రిగారి ఫోటో పంపడమే మరచిపోయారే" అని నా పైన నెపం వేయడమే కాక, తమ తల్లి చిత్రాన్ని అన్ననుంచి తెప్పించుకొని నాకు పంపింది. ఈ రెండింటిని కలిపి ఒక భావ చిత్రం వ్రాయించ గలిగితే, ఎంత బాగుండునో అని వాంఛించుకొన్నాను. దానికి తగిన చిత్రకారుడు దొరకవద్దూ! వాడికి వేనే ఆ వ్యక్తి స్వభావం వర్ణించాలి. అలా చేస్తే మాత్రం వట్టి ఆకారం కాదు, రంగు కాదు, లక్షణ బద్ధమయిన ఒక చిత్రం నిర్మాణం కావచ్చు. ఆ

సమయంలో నా చిత్రకార మిత్రుడొకడు నాకు జ్ఞాపకం వచ్చాడు. ఇటు, ఇందుకు నా మిత్రుల ఫోటో ప్రతినేమో పంపించాను. ఇందు జ్ఞాపకంతోనే మంజయ్యగారి పత్ని జలజాక్షి జ్ఞాపకమూ నాకు రావడం సహజం. వారి యింటికి కూడా ఫోటో ప్రతి ఒకటి పంపించాను. జూన్ నెల రావడం వల్ల, "యశ్వంత్ పరీక్షలో ప్యాసయాడా? జయంత్ హైస్కూలు చేరాడా?" అనికనుక్కొని నెలకు పంపుతున్న ఇరవయ్యయిదు రూపాయలకు మరి ఇరవయ్యయిదు రూపాయలు కలిపి పంపాను. జలజాక్షమ్మ యశ్వంతుని తోనే నా జాబుకు తగిన ప్రత్యుత్తరం వ్రాయించింది. అతడు ప్యాస య్యాడు. చిన్న తమ్ములూ పరీక్షలో నెగ్గారు. జయంత్ హైస్కూలు ప్రవేశించాడు అనే సమాచారంతో పాటు "తాతయ్య ఫోటో చూచి, మేమంతా సంతోషంతో చిందులు తొక్కాము. అమ్మ కళ్లల్లో నీరు వచ్చింది. తండ్రిగారు దానినిప్పుడు పడుకొనే గది గోడకు తగిలించి, దేవుడా అన్నట్టు దినం ఒక్కొక్క పూవు సమర్పిస్తున్నారు' అని తెలిపాడు. తమ తమ పెద్దలపై ఉండవలసిన భక్తే అలాటిది. సమీపపు ఋణం చెల్లించని వారు, దూరపు ఋణం చెల్లించగలరా? కంటికి కనిపించని దైవాన్ని కల్పించుకోగలరా? భక్తి భావానికీ ఒక స్పష్టమయిన స్థానం కావాలి కదా!

ఇందు నుంచి అయితే, హర్షోద్గారంతో నిండిన దీర్ఘమయిన లేఖే వచ్చింది. "నేను ఆయనను చూచింది చిన్నదాననయి వున్నప్పుడు కదా! ఆయన తొడ మీద గంతులు వేసినా, ఆయన ముఖం జ్ఞాపకం మాత్రం మీరు పంపిన చిత్రం చూచిన తర్వాత దానంతట అది పునరుద్ధృద్ధ మయింది. మీ ఫోటో వచ్చిన దినమయితే నాకు పొట్ట నిండిన దానికన్నా ఎక్కువ అనిపించింది. నిజానికి ఆ దినం నేను భోజనం చేయడమే నాకు తెలీదు. నేను ఆయన బిడ్డ ననే గర్వాసందాలలో తేలాడాను. మా అమ్మ వుండి వుంటే, ఈ చిత్రం రొమ్ముకు అదుముకొని కూర్చునేది. లోకం అనే మాటలు అంటూ వుండనీ. మనవారు, మనవారే కదా!" అని ఆమె వ్రాసింది.

ఇక నా తల తొలుస్తున్న విషయం - ఒకటే ఒకటి - విష్ణుపంత్ను చూడడం. ఆయన ఇంటికే వెళ్లి చూచి, సంభాషణ జరిపి, నా మనస్సు లోని ఆకలిని తీర్చుకొనడానికి ఎన్నడు అవకాశం కలుగుతుందో, ఏమో!

పూనా నాకు సమీపంలోని వూరు కాదు; అందువల్ల జాబు వ్రాశాను. 'ఘాటేగారు, మీ పుస్తకం పని, పరిశోధనో, వ్రాతో-దాని పని ఎంత వరకూ వచ్చింది? నేను మీ యింటికి వచ్చి, దానిని గురించి మాట్లాడే అవకాశం ఇంకా ఎంత దూరమో చెప్పలేను. అంతవరకు నా ఆత్రం తట్టుకోడమే కష్టమవుతున్నది. మీ దేహస్థితి బాగుంటే, సంగ్రహంగా నైనా, యశ్వంతరావుగారికీ, మీకూ ఎలా స్నేహమయింది? ఏ ఏ విష యాలు ఆయనకు ప్రియంగా వుండేవి. మతం, ధర్మం, విశ్వాసం, భక్తి - మొదలయిన విషయాలలో ఆయన మీతో చర్చ జరిపారా ఎప్పుడైనా? మీరు ధర్మశాస్త్రానికి సంబంధించిన విషయాలు వ్రాయదొడగినవారు. నాకు తెలిసినంత వరకు, ఆయనకు పెక్కు పాత సంప్రదాయాల మీద విశ్వాసం లేదు. మీరు, పాత సంప్రదాయాలలో శ్రద్ధ కలవారుగా కని పిస్తున్నారు. మీ ఇద్దరి మనస్సులు ఎలా మేళవించాయి? ఇదంతా జాబులో వ్రాయడం సాధ్యమని నాకు అనిపించదు. అయినా మీరు విద్వాంసులు, పది పంక్తులలో వ్రాసి ముగించినా నాకు సంతోషమవుతుంది. ఈ నెల డబ్బు, ఈ జాబుతో పాటు పోస్టల్ ఆర్డర్ ద్వారా పంపుతున్నాను. ఆ డబ్బుకు, నా ప్రశ్నలకూ సంబంధముందని దయచేసి తెలుసుకోకండి'' అని వ్రాశాను. దినమూ ఆయననుంచి ప్రత్యుత్తరం నిరీక్షిస్తూనే వున్నాను.

పది నాళ్ళలో, నాకు ఆయన నుంచి చాలినంత దీర్ఘమయిన జాబు వచ్చి, నా మనస్సు ఎంతో కుదుట పడింది. అయితే, దానినుంచి నా తృష్ణ తీరడా నికి మారు ఎక్కువయినదన్నా తప్పు లేదు. ఇంతవరకు విష్ణుఘాటేగారు వ్రాసిన ఉత్తరాలు కార్డులు. 'ఆరోగ్యంగా ఉన్నాను;' లేక 'ఆరోగ్యంగా లేదు;' 'వ్రాతపనే హెచ్చుగా వుంది,' 'మీ ఉపకారానికి ఋణిని' ఇత్యాదిగా కొన్ని మాటలతోనే ముగిసేవి. వెనుకటి నెల ఒక కార్డులో తమ మనస్సులోని ఒక సందేహాన్ని ఆయన తిరగదోడుకున్నారు. ''యశ్వంత రావుగారు నా మీద దయచూపి, మీ యీ పని పూర్తయ్యేవరకు నెలకు ఇరవయ్యయిదు రూపాయల ప్రకారం పంపుతాను-అని చెప్పారు. ఇది వారికి ఎక్కువ అని కనిపించకపోయినా, పుచ్చుకుంటున్న నాకు కొంచెం కష్టమయిన పని. ఇప్పుడు నా అల్లుడూ కొంత డబ్బు యిస్తున్నాడు. నా కుమారుడు పెద్దవాడయి నౌకరీ వెదుక్కుంటున్నాడు. నా వ్రాత పని పూర్తి కావస్తున్నది. దాని ప్రకటన భారం మాత్రం చాల పెద్దది. దీనివల్ల

నా మనస్సు కలవర పడుతున్నది-'' అని తెలిపారు. ఆ సంగతి ముందు వెనుకలు తెలియక, ఆయనకు ఎలాటి సమాధానమూ నేను చెప్పలేదు. ఆయన తన గ్రంథ ప్రకటనకు నా నుంచి సహాయం అపేక్షిస్తున్నారా - అనే సందేహమూ కలిగింది. అయితే, ఉత్తరం ప్రారంభంలో వ్రాసిన మాటలను బట్టి, తనకు తానయి ముందుకు చాచే చేయి కాదు ఆయనది- అనే భావనా కలిగింది. ఆయన స్వభావ శీలాలను గురించి నేను కల్పించు కొనేట్టు లేదు. ఆ విషయం అక్కడికే వదిలాను.

ఆయన ఇప్పుడు వ్రాసిన జాబులో మరికొన్ని ఎక్కువ వివరాలున్నాయి. ఆ జాబు పూర్తిగా నే నిక్కడ ఏ కరువు పెట్టడం లేదు. దాని సారాంశం మాత్రమే తెలుపుతున్నాను : 'మహోదయా!' అనే ఆడంబరపు మాటతో ఆయన జాబు ప్రారంభమవుతుంది. సంస్కృత పండితులయిన వారు శబ్ద జాలం విషయంలో చాల ఉదారులుగా వుంటారు - అని నవ్వుకొని, చదివాను. ''మీరు యశ్వంతరావుగారి విషయంలో పడే కుతూహలం సహజ మయిందే, నేను నాకు తెలిసిన దానిని చెప్పవలసిందీ ఉచితమే! అయితే, ఆయనను నేను తెలుసుకొన్నాను - అనే అహంభావం నాకు లేదు. దృక్ప థాల విషయంలో ఆయన ఉత్తర ధ్రువమయితే, నేను దక్షిణ ధ్రువం. నేను ప్రాచీన సంప్రదాయంపై శ్రద్ధగల వైదికుడిని. ప్రాచీన పరంపర లలో గాఢమైన విశ్వాసం గలవాడిని. మీ మిత్రుల సంగతి మీకు తెలుసు. ఆయన తన నమ్మకాలనే కెదికి, జాడించి పైకెత్తి తూకం వేయగలరు. వాదంలో నన్ను రెచ్చగొట్టి, కోపపడేట్టుచేసి 'పండితులు మీరు; తండ్రి నాటిన మర్రిచెట్టును కౌగలించుకొనే కుమారులలాగ, ఆ చెట్టు వేయి రెండు వేల సంవత్సరాల వేళ్లు, కొమ్మలు, రెమ్మలు వున్నదయినా, దాని మొదలు వదలమని భద్రంగా కూర్చున్నవారు. ఆలోచన చేయదలస్తే గదా చింత ?' అని నన్ను పరిహాసం కూడ చేసేవారు . . .

''మహాబలేశ్వరానికి ఆయన మొదటిసారి వచ్చినప్పుడు . . ఒక్కరే వచ్చారు. బస వెదుకుతున్నారు. నా కుటీరంలో సగం భాగం అద్దె కిస్తాను అవసరమైతే - అని అన్నాను. మా యిల్లు చిన్నదిగా వుండడం చూచి, ''కానీండి, నా కేమీ పెద్ద బంగళా అవసరం లేదు. మనశ్శాంతి కోసం ఇక్కడికి వచ్చాను. ఈ గుట్టలు, పర్వతాలు చూస్తే చాలు, ఆనంద మవు తుంది. మనస్సు కలిగితే, ఇక్కడ కూర్చొని చిత్రాలు గీస్తాను, లేకపోతే

లేదు" అని ఆయన నిర్ణయించుకొని రెండు నెలల పాటు మా యింట్లో వున్నారు. అప్పుడు సొంతంగా వంట చేసుకొనేవారు, అలాగే గడిపారు.

"ఎంతయినా, మానవ జీవితం కదా! వయస్సూ అయింది. అటువంటి గట్టి శరీరమూ కాదు. నావంటి కాయిలా మనిషి కావనుకోండి. అయినా, తనవంట తాను చేసుకొని భోజనం చేయడం కష్టం కదా! రోజులు గడవాలంటే మనుష్య సంసర్గం కావాలి, మనుష్యుడయినవానికి. అందువల్ల చాల ఒంటరితనం అనిపించినపుడు నా గదికి వచ్చి "పండిత్ జీ, ఏమి చేస్తున్నారు?" అని అడిగేవారు. నేనూ చెప్పేవాడిని. ఉబ్బసం, గూరుదగ్గులతో బాధపడుతున్న నేను దేహశ్రమ ఎరుగను. పెద్దల నుంచి నేర్చుకొన్న సంస్కృతభ్యాసం వల్ల ధర్మశాస్త్రాలలో ఆసక్తి కలవాడిని. వాటినే అప్పుడప్పుడు చదివేవాడిని. నూరారు గ్రంథాలు చదివాను. ఒక రోజు నాకు ఏమనిపించిందంటే.... నేనూ చదివినదంతా గాలికి కొట్టుకొని పోరాదు; నాకు తెలిసిన దానిని తెలియనివారికి – అదీన్నీ సంస్కృతం రాని మన మరా జనానికి – చెప్పవచ్చు గదా! అని. అలాఅయి, 'మన ధర్మశాస్త్రాలు" అనే గ్రంథమొకటి వ్రాయడానికి పూనుకున్నాను. యశ్వంతరావుగారు అడిగిన ప్రశ్నకు ఇటువంటి ఒక పని చేపట్టాను" అని తెలిపాను.

"అక్కడినుంచి ఆయన దినమూ ఒక గంటసేపు నా గదికి వచ్చి గడిపేవారు. 'ఇది ఏమి తాళపత్రం?' 'ఇది ఏమి గ్రంథం?' 'దానిలో ఏముంది?' 'ఏ కాలంది?' అని ప్రశ్నలు వేసేవారు. నేను నాకు తోచిన సమాధానం చెప్పేవాడిని. ఒక దినం భగవద్గీత విషయమై చర్చ వచ్చింది.

"శ్రీ కృష్ణ పరమాత్మ ఇలా చెప్పారు" అన్నాను నేను.

"మీరు వినలేదు కదా!" అన్నారు ఆయన. "భగవద్గీత కాలం?" అని ప్రశ్నించారు.

"మహాభారత కాలం. ఐదువేల సంవత్సరాలయినా అయివుండవచ్చు గదా!"

"భారతం అంగం కదా గీత?"

"ఔను."

"భారతం రచించిన వారు వ్యాసులు కదా?"

"ఔను."

"వ్యాసుని కాలం చెప్పండి."

"భారత కాలం."

"ఆ సంగతి వదలండి. చారిత్రక దృష్టితో వ్యాసుడనే కవి మహా భారతం రచించిన కాలం ఏది అని మీ విద్వాంసులు చెబుతారు?" అని అడిగారు.

నేను వైద్యాగారి అభిప్రాయం తెలిపాను.

"అయితే, గీత కూడా ఆ కాలందే అయింది. ఐదువేల సంవత్సరాల ముందున్న కృష్ణుని నోటినుంచి వ్యాసులు పలికించిన గీత ఇది."

"శ్రీ కృష్ణ పరమాత్మ..." అని నేను ఏదో చెప్పబోయేలోగా ఆయన, "నాలుగైదు వేల సంవత్సరాల తర్వాత వ్యాసుని నోటితో చెప్పించాడు" అని వాక్యం పూర్తి చేశారు.

"నేను ఆ దృష్టితో వెళ్లను" అన్నాను.

"మీరు వేదాలను బ్రహ్మ ఋద్దున వచ్చి చెప్పాడు అంటారు."

"కాదా మరి?"

"అలాంటప్పుడు మన మధ్య అటువంటి విషయాలలో చర్చే వద్దు."

"ఇలాటి చర్చలెన్నో మాకు ప్రతిదినమూ నడిచేవి. అందుకనే నేను "ఆయన ఉత్తర ధ్రువం, నేను దక్షిణ ధ్రువం" అన్నది. నాకు ఆశ్చర్యం అది కాదు - నేను ఈ భీవరికంలోను ధర్మశాస్త్రం పై ఒక మరాఠీ గ్రంథం వ్రాయడం చూచిన ఆయన వ్రాయండి, వ్రాయాలి, అని ప్రోత్సాహ మివ్వడం. 'యశ్వంతరావుగారూ, మీ పద్ధతి నాకు అర్థం కావడం లేదు. నా మార్గం మీరు ఒప్పరు కదా? ధర్మ శాస్త్రాలు వేయారు ప్రజల అనే సహ స్రాబ్దాల నమ్మకాలు అంటున్నారు. దానినే వ్రాయండి అంటున్నారు' అని విస్మయం చూపించాను. ఆయన పరిహాసం చేస్తున్నారనే నాకు అనిపించింది. అప్పుడాయన "ఘాటేగారూ, మీరు నేను కాదు కదా!" అన్నారు.

"కావడం ఎలా సాధ్యం?"

"అందుకోసమే, మీరు వ్రాయాలి. నా నమ్మకం నాది; మీ నమ్మకం మీది. మీదే సత్యం కావచ్చు; నాదే సత్యం కావచ్చు. ఇద్దరిదీ తప్పు కావచ్చు. లేక మన ఆలోచనా సరళిలో సత్య మిథ్యాల కలయిక వుండ వచ్చు."

"ఉండవచ్చు."

"ఒప్పు కొంటారా?"

"ఒప్పుకోక !"

"అయినా, మీ జీవితం, మీ ఆలోచనలు, మన జనులకు చెందాలి. మనం ఎంత బుద్ధిమంతులమైనా, మనం ఎంత న్యాయంగా వున్నా, ప్రతి జీవీ తాను చూచిన వెలుగులో నడవడమే న్యాయం. మనందరి సమష్టి జీవితానికి మనం చెల్లించవలసిన ఋణ మేమిటంటే అదే. ఇదే నిజం, ఇదే ఖండితం - అని మరొకరి గొంతు పిసికి వాణిని నిర్బంధించడం సమాజ ఘాతు కత్వం" అన్నారు.

"నాకు ఆయన మాటలు విని చాల ఆశ్చర్యమయింది. విద్వాంసుల వర్గానికి చేరిన మాలో కాని, మన ఆచార్యులనిపించుకొన్న వారిలో గాని మొదటినుంచి పెరిగిన దోషమేమిటంటే - తాను చేసిన వాదమే సరి. తాను చెప్పిన అర్థమే సత్యం; తక్కినదంతా మూఢ జగత్తు; మూర్ఖ జగత్తు - అనే పరంపర పెరిగింది. సహస్ర కోటి అభిప్రాయాల గందరగోళంలో సత్య మనేది తన శక్తితో నిలబడి మనగలగాలే కాని, మన అధికారంతో, ప్రతివాది నోటిని మూసి పెట్టడంతో, కుతర్కంతో మనజాలదు - అని అనిపించింది నాకు. ఆ విషయంలో నాకు కనువిప్పు కలిగించినవారే యశ్వంతరావుగారు. ఇంకేమి వ్రాయనండీ - ఆయన విషయంలో? ఆయన బహు దొడ్డ వ్యక్తి. పైకి కనిపించే శరీరం కాదు వారిది. నేను చూచి వుండ జాలనంత భవ్య శరీరం వారిది.

"అటు తర్వాత చూడండి. ఈ పనినే ఉత్సాహంతో ముందుకు సాగించండి; మీరు చేయగలిగిన పని మీరే చేయాలి. పెద్ద సహాయం నా వలన మీకు కాకపోయినా, సిరా, కాయితాలు, నాల్గయిదు ఆధార గ్రంథాలు - వీటికి కావలసిన డబ్బు నేను ఇస్తాను" అన్నారు. ఆయన సర్వదుంబాల ఫలమే మీరు ఇచ్చే మా శాసనం. ఆయనా అలాగే ఇస్తూ వచ్చారు.

"ఇప్పుడు నాకు పెద్ద భయం పట్టుకుంది. ఈ నెల ఆరంభంలోనే ఐదు వందల పుటల గ్రంథాన్ని కష్టపడి వ్రాసి ముగించాను. నేను సంప్రదాయ వాది - అన్నాను కదా! యశ్వంతరావుగారు నా అభిప్రాయాలను కద లించి ఈ కాలం ఏది? మొదట ఎవరు చెప్పారు? ఆ మాటలు ఏమిటి? తర్వాత ఎవరు చెప్పారు? ఆ శ్లోకానికి ఈ అర్థమే వస్తుందని

ఎలా సిద్ధాంతం చేస్తారు? అని బెనకుతూ వుండడం జ్ఞాపక పరచు కొన్నప్పుడు, నా పనిలో వున్న కష్టం నాకు తెలిసింది. నేను చేసే పనిలోను నాకు సంశయం కలుగసాగింది. . . . అనేక విషయాలలో, అయినా నాకు తెలిసిన దానిని, తప్పో, ఒప్పో సంఘం ముందు పెడుతాను; విద్వాంసుల ముందు పెడుతాను.

"మీ ఆగమనం నేనెప్పుడు ఎదురు చూడవచ్చు?" అని తమ జాబు ముగించారు.

వానకాలం గడిచింది; అక్కడొక మేఘం, ఇక్కడొక మేఘం ఆకాశంలో చెదరుగా తేలుతున్నాయి. అయినా, నానాడు సస్య సమృద్ధి పొంది వర్షా కాలపు అభిషేకంతో నిర్మల మయింది. చలి, గాలి, వానలకు భయపడి, అణిగి కార్పణ్యంతో మనుగడ సాగిస్తున్న పశు పక్షులు ఇప్పుడు స్వచ్ఛం దంగా, స్వేచ్ఛగా మానునుంచి మానుకు కుప్పించి ఎగురసాగాయి. ఆహార సమృద్ధి వాటి కష్టాలన్నిటినీ తొలగించింది. పేరులేని అసంఖ్యాక పక్షులు సంగీత శాస్త్రానికి కట్టుబడని అసంఖ్యాక గీతాలు ఆలపిస్తున్నాయి. ప్రకృతి వాటి కంఠం నుంచి ఉత్సాహపు గానరవాన్ని వెలువరిస్తున్నది. ఇంతవరకు మొయిళ్ల మరుగున దాగుడు మూతలాడుతున్న సూర్యుడు ఇప్పుడు ప్రకృతి దేవి పొందిన లావణ్యం చూచి హర్ష చిత్తంతో నీలా కాశంలో తేలాడుతున్నాడు. పరిసర ప్రకృతే ఇంత సంతోషంతో వున్నప్పుడు, మానవజీవి విసుగు పచ్చడపు మడతలలో పడుకొని నిద్ర పోగలడా?

నాకు బొంబాయి జ్ఞాపకం వచ్చింది. యుద్ధం కారణంగా మా వూరికీ బొంబాయికీ ఓడ రాకపోకలు నిలిచిపోయినా, ఎలాగయినా వెళ్లుదామను కున్నాను. బస్సులో ప్రయాణం చేయదలచినాను. దానిలో కూర్చుని సహ్యాద్రి వీపు ఎక్కాను. అక్కడినుంచి మలెనాడు చెరగులో ప్రవేశించి ముందుకు పోయాను. బయలు సీమలోని (మైదాన ప్రాంతమయిన) కడూరులో రైలెక్కాను. బయలు సీమలో మా వూరి వానలు గాని, మలె నాడు వానలు గాని లేవు. అయినా వర్షర్తువు అనుగ్రహించింది. దారి పొడువునా నల్లరేగడి భూమిలో జొన్న, పత్తి, హుచ్చెళ్లు (గూర్నామాలు అనే ఒక రకపు నూనె గింజలు) మొదలయిన పైర్ల పచ్చ కంబళి యోజ నాల దూరంవరకు వ్యాపించింది. రైలు బండి కిటికీ వద్ద కూర్చున్నాను.

ఈ పచ్చ కడలిలో గాలి విసరులకు తరగలు పుట్టినప్పుడు, మన హృదయాలలోను ఆనంద తరంగాలు పుడుతాయి. దానివల్ల దారి ఎంత గడిచిందీ మనకు తెలియదు. బెళగాంవ్ నగరం వచ్చేవరకు పచ్చని ఆతిథ్యం ఎక్కడ చూచినా. తర్వాత చీకటి. బెళగాంవ్‌లో నేను ఎక్కిన రైలు పెట్టెలోకి ఇతర ప్రయాణికులు తోసుకొని వచ్చి తొక్కి కోలాహలం చేయలేదు. సుఖంగా పడుకున్నాను. తెల్లవారగానే లేచిందే పూనాలో.

విష్ణుపంత్ గారు తమ యింటికి అంటుకొనిన జీవి అని ఆయన జాబులవల్ల తెలుసుకొన్నాను. రైలునుంచి దిగగానే ఒక టాంగా చేసుకొని శనివార పేటలోని వారి యింటికి వెళ్ళాను. అప్పుడు ఆయన యింటిలో లేరు. ఆయన వుండేది అల్లుని యింట్లో. కూతురు, అల్లుడు వున్నారు. "ఘూటే గారు ఏదో పనిమీద నాశిక్‌కు వెళ్ళారు" అనే వార్త వారినుంచి తెలిసింది. అప్పుడు నేను నా నాసికను గోక్కోవలసి వచ్చింది.

"రేపే వస్తారు?"

వాళ్లు అడగడం వల్ల నేనేదో చెప్పవలసి వచ్చింది. పంత్ గారు వచ్చే వరకు తమ యింట్లో వుండవలసిందని వారిద్దరూ ఒత్తిడి చేశారు. పంత్ గారు లేక అక్కడ వుండడం కష్టమని నా మనస్సుకు తోచడంవల్ల 'ఇక ఎనిమిది నాళ్ళకు వస్తాను' అని భరోసా చెప్పాను. వారిచ్చిన ఉపాహారం స్వీకరించాను. పంత్ గారికి ఒక ఉత్తరం వ్రాసిపెట్టాను. అక్కడి నుంచి మరుసటి రైలులోనే బొంబాయికి పరుగుతీశాను.

నా మనస్సు ఉత్సాహం పొందినప్పుడూ, విసుగు వేసట బాధపెట్టినప్పుడూ, బొంబాయి నగరంలో నాల్గయిదు నాళ్ళు గడవడం కద్దు. నా వూరయితే, జనసంఖ్య, గోలలు తక్కువగా వుండే వూరు. అయితే బొంబాయి బొంబాయే. లక్షలాది జనం తమదిగా చేసుకొన్న ఆ నగరం జనారణ్యం. నా మిత్రులు యశ్వంతరావుగారి మాటలలో వర్ణించేటట్టయితే - అరణ్యం పెద్దదయితే, చెట్టుచేమల సంఖ్య ఎక్కువగా వుంటుంది. ఏ ఓషధి మూలిక అయినా దొరకవచ్చు. చెట్ల గుర్తు మనకుంటే, మనకు కావలసినవన్నీ పొందవచ్చు.

అలాగే, నేను, ఆ నగరంలో కొన్ని చెట్ల గుర్తు తెలుసుకొన్నాను. చెట్లు అంటే మనుష్యులే. 'బొంబాయి నగరం విడిచి కదలను. నా పుట్టుకా ఇక్కడే; బ్రతుకూ ఇక్కడే. చావూ ఇక్కడే!" అని నిర్ధరించుకొన్న

మిత్రులు కొందరున్నారు. అటువంటి నరవృక్షాలను చూడడంలో కాలం గడిపాను.

ఇంకా, నా మనస్సులో మోసుకొన్న పని ఒక్కటుంది. నేను కోరినట్టి చిత్రకారు డొకడున్నాడు. . . . వచ్చిన మొదటి దినమే, ఆయన ఇంటికి వెళ్లి, ఆయనను చూచి, "ఇన్ని సార్లు వచ్చినట్లు ఇప్పుడు రాలేదు. మిమ్మల్ని పరీక్షించడానికి వచ్చాను" అని గప్పాలు కొట్టి నా దస్త్రం నుంచి యశ్వంతరావుగారు గీచిన నాలుగైదు చిత్రాలను తీసి ఆయన ముందు పెట్టాను. వెంట యశ్వంతరావుగారి ఫోటో కూడా ఉంచాను. ఆయన యశ్వంతరావుగారి ఫోటో చూడలేదు. అప్పుడు దానిని తీసుకొని జేబులో వేసుకొన్నాను. చిత్రకార మిత్రుడు కుతూహలంతో పదిహేను నిమిషాల పాటు ప్రతిదానినీ చూచారు. 'అవు-గేదె దూడ,' 'దాదా,' 'రీనా'- ఇలాంటి చిత్రాలు అవి: ఆయన చూచి నవ్వారు.

"ఏమిటి నవ్వారు ?" అని అడిగాను.

"ఈయనకు మనలో లేని కన్నొకటి వుంది. చిత్రం గీచే సాంకేతిక పద్ధతి ఏమీ చాలదు. నిజమే; దానిని నేర్చుకోవలసి వుండడమూ నిజమే. ఈయనకు సాంకేతికత సిద్ధించకపోయినా, ఏమీ తెలియదు అనడానికి వీలులేదు. చాల ప్రపంచం చూచారు. గంభీరమయిన చూపూ వుంది. ఎవరు వీటిని గీచినవారు ?" అని అడిగారు.

అప్పుడు జేబులో పెట్టుకున్న ఫోటో తీసి చూపాను.

"ఈయనది ఏ వూరు ?"

"స్వర్గూరు వారు."

"స్వర్గూరు ఏదండీ ?"

"స్వర్గ పురమే స్వర్గూరు."

"చనిపోయారా ?"

"ఇప్పుడు ధైర్యం కలిగింది కదా! మీరూ చిత్రకారులు; ఆయనా చిత్రకారులు. అయినా, మీ ప్రతిస్పర్థి కాదనడం ధ్రువపడింది కదా!" అని చెప్పి, అటుతర్వాత, ఆయన బొంబాయిలో వసించిన సంగతి తెలిపాను. తర్వాత నా ఉద్దేశం సాధించడానికి, ఆయన జీవిత కథలోని భాగాలు వర్ణించాను. అటుతర్వాత నెమ్మదిగా "ఇదిగో చూడండి. నేను వచన రచయితను. ఈయన జీవిత చరిత్రను-చరిత్ర అనలేము. చరిత్ర అనదగిన

ఒక కథానకం వ్రాస్తున్నాను. మీరూ ఆయనను చూచివుంటే బాగుండేది. చూడలేదు; చచ్చినవారిని చూపడం నా సాధ్యమూ కాదు. దానికి బదులు ఈ ఫోటో దగ్గర పెట్టుకోండి. దానికితోడు ఇదీ ఉండనీ!" అని సరసి మాసిపోయిన ఫోటోను ఆయన చేతికి అందించాను. అంతేకాక డైరీ చివరి పుటలోవున్న టపాబిళ్లంత రేఖా చిత్రమూ ఆయనముందు పెట్టాను. ఆయన దాంపత్య జీవితపు విరసజీవితం, 'శిరసీ' జీవితం గురించి చెప్పాను. 'ఇక నాలుగు నాళ్లలో నేను తిరిగివస్తాను. వీటిని దగ్గరవుంచుకొని ఏమి చేస్తారో చేయండి. ఏమీ కాకపోతే, మరొకమారు వచ్చినప్పుడు వీటిని వెనక్కు ఇవ్వండి. మీనుంచి పని కాదు అన్నట్టైతే మా వూళ్లో ఒక డ్రాయింగ్ మాస్టరున్నారు. ఆయనకు చెబుతాను. ఆయన ఎప్పుడెప్పుడో చచ్చిపోయిన వారిని, పేరైనా విననివారిని కూడా పెద్దగాచేసి, రంగులు పూసి, జల్తారు తలపాగా పెట్టి దగ్గరొక పూవులుపెట్టే ఫూల్‌దాన్ పెట్టి "బొమ్మన హళ్లి మహారాజాగారు" అనేట్టు పెయింటింగ్ చేస్తారు. ఒకటి మీరు ఈ పని చేయాలి. లేకపోతే, ఆయన గీచిన చిత్రం చూచి ఆత్మహత్యయినా చేసుకోవాలి' అని పరిహాసం చేశాను.

ఆ మిత్రులు "ఇప్పుడు నేనే మీ చెప్పలేను. మీ అదృష్టం. నాకు ఆత్మహత్యా ప్రసక్తి వచ్చినా రావచ్చేమో! వస్తే, ఒక కప్పు కాఫీతో ఎగిరిపడి చస్తాను" అన్నారు.

నాల్గో దినం నేను ఆయన యింటికి పోయినప్పుడు, చిత్రం సిద్ధంగా వుంది. తంబూరా పట్టుకున్న నిరలంకార సుందరి అయిన సరసి పాట పాడుతున్నట్టు, దగ్గర నా మిత్రులు యశ్వంతులు కూర్చొని భావతాదాత్మ్యం పొందుతున్నట్టు – ఒక భావనా చిత్రం ఆ చిత్రకారులు గీచారు.

"అయ్యో! ఈ చిత్రం చూస్తే మా ఇందుమతి ఎగిరి గంతులు వేసేని?" అన్నాను.

"ఇందుమతి అంటే ఎవరు?" అని అడిగారు నా చిత్రకార మిత్రులు. అప్పుడు ఆమె కథ తెలిపాను.

నా ముఖ్యమయిన పని పూర్తయిన తర్వాత, బొంబాయి, చెట్టు చేమల నుంచి సంగ్రహించ దగినన్ని చివురుటాకులు, పూవులు కోసుకున్న మీదట, పుణ్యనగరానికి వెళ్లాను. ఈసారి వెళ్లినప్పుడు, విష్ణుపంత్ ఘాటేగారే నా కోసం తలుపు తీశారు. ఘాటేగారు సామాన్య కాయులు, తెల్లని రంగు,

దుర్బలాంగులు - నాకు స్వాగతం చెప్పి తాము వ్రాత కోసం కూర్చునే కృష్ణాజినం మీద కూర్చోపెట్టి సంభాషణ ప్రారంభించారు. యోగ క్షేమాలు విచారించారు. యశ్వంతరావుగారిని గురించి అభిమాన వర్షమే కురిపించారు. తర్వాత తాము వ్రాసి ముగించిన "ధర్మ శాస్త్ర విచార" అనే గ్రంథం లిఖిత ప్రతిని నా ముందు పెట్టారు. సంతోషంతో చూచి "ఆయన నాకు డబ్బు సహాయం చేయడం మాత్రమే కాక పని చేయడానికి ప్రోత్సాహమిచ్చి, ఈ ఒక పని నాతో జరిగేట్టు చేశారు. ఇది అచ్చవు తుందని, జనం దీనిని చదువుతారని - నాకు విశ్వాసం లేదు. నేను అలాటి మహా వ్యక్తి కాను. కర్తవ్యం కోసం కర్తవ్యం నిర్వహించాను.

"ఇంకొక మాట - మీరు ఏమీ అనుకోరాదు. ఈ పని ముగిసిన తర్వాత గూడ నేను యశ్వంతరావుగారి లెక్కలో మీ నుంచి డబ్బు తీసుకోలేను."

నాకు అటువంటి మాటలు, నడవడి విని ఆశ్చర్యమయింది.

ఆ రోజంతా నేను విష్ణుపంత్ గారితో బహు ఆత్మీయంగా గడిపానంటే తప్పులేదు. ఆయన మరాఠీ వదలి నాతో ఇంగ్లీషులో మాట్లాడడానికి ప్రయత్నించారు; అది సఫలం కాలేదు.

ఆయన అల్లుని సహాయంతో ఇంగ్లీషువల్ల ఒకరినొకరు తెలుసుకొన్నాము. ఆయన నుంచి నాకు వస్తున్న జాబులు కూడ ప్రారంభంలో మరాఠీలోనే వచ్చేవి. అప్పుడు అనువాద సహాయం కావలసివచ్చేది. తర్వాత తమ అల్లుడితో ఇంగ్లీషులో వ్రాయించేవారు. ఇప్పుడూ ఆయన అల్లుడే మా యిద్ద రికీ దుబాసి అయ్యారు.

పెక్కుసార్లు యశ్వంతులకూ తమకూ నడిచిన సంభాషణల విషయం ఆయన వివరంగా తెలియజేశారు. ఘాటేగారు ధార్మిక విషయాలలో ఆసక్తి గలవారన్న మీదట, వారిద్దరి మధ్యా జరిగిన చర్చలన్నీ దానికే సంబం ధించినవి. నమ్మకం, స్థానం, ప్రయోజనం ,జీవిత సమస్య, మతధర్మాల ఇతి, మితి - ఇలాంటివే వారి చర్చల విషయాలట. ఇద్దరి అభిప్రాయాలూ మాత్రం ఆయన అన్నట్లు - ఉత్తర దక్షిణ ధ్రువాలు.

"అభిప్రాయం ఏమిటయితే ఏమి ? మేమిద్దరమూ భిన్న సంస్కారం పొందినట్టివారం. అభిప్రాయాలలో విభిన్నత కనిపించడం సహజం. అయితే, ఆయన మానవత్వం దొడ్డది కావడంవల్లనే నాకు ఇంతగా

సహాయం చేశారు. మీ మార్గంలో మీరు పోవలసింది – అని నాకు పక్క బల మిచ్చారు. జీవితంలో ప్రామాణికత అంటే ఇదే కదా ?''

నేను ఆయన మాటలకు తలవూపాను. ''పంత్ గారూ, జన్మాంతరం విషయంలో, ఆత్మ పరమాత్మల విషయంలో మీ యిద్దరి అభిప్రాయాలు ఎలా వుండేవి ?'' అని అడిగాను.

''ఉత్తర దక్షిణ ధ్రువాలే ! విష్ణుపంత్ విష్ణుపంతే ; యశ్వంతులు యశ్వంతులే.''

''ఆయన అభిప్రాయం ఏమిటని మీకు స్పష్టపడిందా ?''

''ఆయనది ఒక రీతి అద్వైతం. దానిని ఆధునిక అద్వైతం అని అననా ? ద్వైతులు శంకరాచార్యులను నాస్తికులు అని అన్నట్టు, నేను ఏదైనా పేరు పెట్టవచ్చు. కాని, అలా కాదు. ఆయన వ్యక్తి జీవితం నమ్ముతారు. వ్యక్తి గతమైన ఆత్మను నమ్మరు. అందువల్ల ఆయనకు పరమాత్మ ప్రశ్నే ముఖ్య మనిపించదు. భక్తి, మోక్షం – ఈ విషయాలలోను ఆయనకు ఆసక్తి లేదు. ''దేవుడే లేడంటారా ?'' అని ప్రశ్నిస్తే ''అది మీకే తెలుసు. మీరు చూచారా ?'' అని అడుగుతారు.

''వేదం చెబుతుంది ; ప్రతి ఒక ధర్మమూ ఉద్ఘోషిస్తుంది'' అని నేనంటే,

''మీరు చెప్పిన ప్రతి ధర్మంలోనూ'' అంటారు. ''దైవం సుద్దే ఎత్తని ధర్మాలూ వున్నాయి,'' అంటారు. ''తమకు తెలియని విషయాలను అలాటి ధర్మాలు చెప్పడానికి పూనుకోలేదు'' – అంటారు.

''సనాతన ధర్మమే శ్రేష్ఠం !'' అని నేనంటే,

''నమ్మిన వారికి అదే పూరా పూరా శ్రేష్ఠం'' అని నవ్వుతారు.

''అలా అయితే ఆయన నాస్తికులా?– అని మీరు నన్ను ప్రశ్నించవచ్చు. యావత్తు జగత్తూ జీవంతో వున్నదంత మమతతో చూచారు. ఆయన మనో విస్తారంలో అన్ని జీవరాసులూ సమానం. అటువంటి జీవితంలో, జీవంలో, పూర్వమూ, నేడూ, రేపూ – భేదం చూడనట్టి ఒక రకం అద్వైత విచార సరణి ఆయనది. నేను అద్వైతం అనడం ఇందుకే ; అది ఆయనదే అయిన ఒక విధమయిన అద్వైతం ; అది సాంప్రదాయిక విచారసరణి కానే కాదు.''

నా కొత్త మిత్రులయిన ఘాటేగారికి యశ్వంతరావుగారి విచార

సరణిలో విశ్వాసం లేకపోయినా, ఆయన వ్యక్తిత్వంలో అత్యంతాదర మున్నట్టు తెలిసింది.

అలా అయితే, నేనూ పుణ్య పట్టణానికి వచ్చిన పని ముగియలేదా? ముగుస్తూ వచ్చింది. పంత్ గారిని వీడ్కొని రావడానికి ముందు "మీ గ్రంథం అచ్చు వేయించడానికి ఏమి ఏర్పాటు చేశారు?" అని అడిగాను.

"ఏమీ చేయలేదు" అన్నారు ఆయన.

"ఎంత డబ్బు కావలసి వుంటుంది?"

"ఆర్య భూషణ ఛాపఖానా (ముద్రణాలయం) వారు మూడు వేల రూపాయలయినా కావాలంటున్నారు."

"ఎవరైనా పుస్తక ప్రకాశకులను చూచారా?"

"చూడలేదని కాదు. చూచినందువల్ల ప్రయోజనం కలుగలేదు. ఇది ఎక్కడ అమ్ముడుపోతుంది? ఇదేమయినా నవలా? ఈ కాలంలో ధర్మ శాస్త్రం ఎవరికి కావాలి? – అంటున్నారు" అన్నారు. నేను ఆ మాటలు విని నవ్వాను. "చూడారూ, నేను కథలు, నవలలు వ్రాసేవాడిని. కతలు వ్రాస్తే జనం చదువుతారు. దీనిని వ్రాస్తే జనం ఎలా చదువుతారు? మన జనం ఆధునికత అంటే ఇలాంటిది. ఆకాశం నుంచే ఎగిరి భూమి మీద వచ్చి కూర్చునేటటువంటి ఆధునికత, అదీ ఎప్పుడు? ఈ రోజే! అంత ఆధునికులం – మనం. ఇక్కడ ఏమి పెరిగినా, ఎంత ఆధునిక మయినా, చెట్టు విత్తు వేళ్ల సహాయంతో చిగురించి రెమ్మలు కొమ్మలు వేసి, దానినుంచి పూవులు పూచినట్టు – అని తెలుసుకోరు జనం. అయినా, మీరు చేసే ప్రయత్నం చేయాలి" అని వారికి సమాశ్వాసం కలిగించి బయలుదేరి వచ్చాను.

నేను మా వూరు చాల హర్ష చిత్తంతో చేరానని మీరు ఊహించవచ్చు. నా సమస్య చులకన కాసాగింది. యశ్వంతులు అప్పగించిన బాధ్యతను నిర్వహించే పనీ కష్టం కాదు. పార్వతమ్మ చనిపోయింది. బెనకయ్య గుడికి రెండు వేల రూపాయలంత డబ్బు అయింది. శీనయ్య జ్ఞాపకం నేను మరచిపోవచ్చు. మంజయ్యా గారిని, ఆయన పిల్లలను మరిచేట్టు లేదు. ఇక ఏముంది? ఇచ్చి పోయినదెంత? మిగిలినదెంత? – అనే లెక్కాచారం చేశాను. యశ్వంతుల కోసం మరొక బెనకయ్య గుడి కట్టక తప్పదని పించింది. అదేమిటంటే – విష్ణుపంత్ గ్రంథ ప్రకటనకు యశ్వంతుల

పేర మూడు వేల రూపాయలు ఒదిగించడం. ఆ మీదట, మిగిలిన డబ్బును నా మిత్రుల అల్లుని కుటుంబానికి – అంటే, మంజయ్యగారి సహాయానికి ఏదో ఒక విధమయిన ముడుపుగా (నిధిగా) పెట్టడం – అనే నిర్ధారణ చేసి, దానికి తగిన వ్యవస్థ చేశాను. మంజయ్యగారితో ఈ విషయం చర్చించాను; పంత్ గారికి జాబు వ్రాశాను. ఇందుమతికి కూడా "మీ తండ్రి జ్ఞాపకార్థం నీకేమి వస్తువు కావాలి?" అని వ్రాశాను. ఆమె నుంచి జవాబు వచ్చిన తర్వాత, దానికి తగిన ఏర్పాటు చేశాను. నేను నా వద్ద పెట్టుకొన్నది — ఆయన డైరీ లేక స్మరణ గ్రంథం మాత్రం.

మొత్తంమీద లెక్కాచారం చేసి చూస్తున్నాను – నా లెక్కాచారం కాదు; నాకు తెలిసినంతవరకు బతికి మనిన యశ్వంతుల లెక్కాచారం, ఆయన సిద్ధాంతం ప్రకారం – తాము సంసారం నుంచి, సమాజంనుంచి పొందిన దానికన్నా, తక్కువ చెల్లించారా? ఎక్కువ చెల్లించారా? – అనే లెక్కాచారం. ఋణాల చెల్లింపుల లెక్కాచారంలో ఎవరు ఎవరికి ఋణి?

యశ్వంతులు అన్ని విధాలుగా, తాము తీసుకొన్న దానికన్నా, ఇచ్చింది తక్కువా?

ఎన్నటికీ లేదు అని అనిపిస్తుంది నాకు.

నేషనల్ బుక్ ట్రస్ట్ వివిధ భారతీయ భాషలలో ఇంతవరకు 350 పుస్తకాలకు పైగా ప్రచురించింది. ప్రస్తుతం అమలుపరచబడు చున్న ఈ పుస్తక ప్రచురణ కార్యక్రమంలోని ప్రధాన అంశాలు:

## 1. భారతదేశము - ప్రజలు

భారతదేశమునకు సంబంధించిన సమాచారము, ముఖ్యముగా భౌగోళిక స్థితిగతులు, వ్యవసాయము, పరిశ్రమలు, భాషా సాహిత్యాలు సంస్కృతి తదితర రంగాలను గురించిన సమాచారమును స్థూలముగ సామాన్య పఠితకు అందజేయడం ఈ గ్రంథాల లక్ష్యం. సులభశైలిలో జనసామాన్యానికి అర్థం కాగల భాషలో ప్రచురితమయ్యే ఈ గ్రంథాలు భారతదేశమును గురించిన 'సంగ్రహ విజ్ఞాన సర్వస్వం' గా రూపొంద గలవు.

## 2. జాతీయ జీవిత గ్రంథమాల

భారతదేశములో జన్మించి, మతము, సాహిత్యము, కళలు, సంగీతము, విజ్ఞాన శాస్త్రములు తదితర రంగాలలో ప్రఖ్యాతినందిన భారతీయుల జీవిత చరిత్రలను ప్రచురించాలని ప్రయత్నం. ఈ గ్రంథ మాలలో సుమారు 100 గ్రంథాలు వెలువరించాలని సంకల్పం.

## 3. పాప్యులర్ సైన్సు

విజ్ఞాన శాస్త్రాల అభివృద్ధి, దైనందిన జీవితంలో విజ్ఞాన శాస్త్రాల ప్రాముఖ్యమును సామాన్య పాఠకునకు తెలియజెప్పడం ఈ గ్రంథమాల లక్ష్యం.

## 4. ప్రపంచ సాహిత్య మణిపూసలు

విభిన్న రంగాలలో ప్రపంచ ఆలోచనా సరళిని ప్రభావితం చేసిన ప్రముఖ గ్రంథాలకు, సాధారణ పాఠకునకు అర్థమయ్యే రీతిలో వివిధ భారతీయ భాషలలో సరళ అనువాదాలు ప్రచురించే కార్యక్రమం.

## 5. సమకాలీన ప్రపంచము

ప్రపంచ దేశాల చరిత్ర, తదితర ముఖ్య విషయాలను సాధారణ పాఠకునకు అర్థమయ్యే రీతిలో సులభశైలిలో ప్రచురించే పథకం.

## 6. భారతదేశ జానపద సాహిత్యం

భారతదేశ ఐక్యతను సుస్పష్టం చేస్తూన్న, దేశంలోని ప్రధాన ప్రాంతాలలోని జానపద సాహిత్యమును గురించిన గ్రంథాలు ప్రచురించే పథకము.

## 7. యువ ప్రపంచము

భారతీయ యువతకు పనికివచ్చే పుస్తకమాల. ఆధునిక ప్రపంచంలో శాస్త్ర విజ్ఞాన ప్రగతిని గురించి మాత్రమేగాక జాతీయ జీవితంలోని మహత్తర ఘట్టాలను, వీరోచిత కృత్యాలను వివరించే పుస్తక ప్రచురణ కార్యక్రమము.

# జాతీయ సమైక్యత

## 8. నెహ్రూ బాల పుస్తకాలయం

జాతీయ సమైక్యత ప్రధాన విషయంగా ఉండగల పుస్తకాలు ప్రచురించే పథకము. నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలంలో, ప్రధానమైన భారతీయ భాషలన్నిటిలో సుమారు 100 పుస్తకాలు ప్రచురించాలని సంకల్పం. అన్ని భాషలలోను ఈ పుస్తకాల రూపురేఖలు, ధర ఒకే విధంగా ఉండగలవు.

## 9. సాహిత్య వినిమయము

ప్రతి భారతీయ భాషలోని 10 ప్రముఖ గ్రంథాలను మిగిలిన భారతీయ భాషలన్నిటిలోనికి అనువదించి నాలుగవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రచురించే పథకము.

ఇంతేగాక నేషనల్ బుక్ ట్రస్ట్ అందుబాటులో లేని ప్రముఖ గ్రంథాల పునర్ముద్రణ, ప్రత్యేక ప్రాముఖ్యంగల ప్రాత ప్రతులను సంస్కరించి ప్రచురించే కార్యక్రమం కూడా నిర్వహిస్తున్నది.

వివిధ గ్రంథమాలలలోని గ్రంథాలు ఆయా రంగాలలో నిష్ణాతులైన వారి రచనలు. సరసమైన వెలలకు లభింపజేయాలన్న ఆశయమును దృష్టిలో ఉంచుకొని గ్రంథ ప్రచురణ వీలయినంత ఉన్నత స్థాయిలో జరుగుతున్నది.

తెలుగులో వెలువడిన గ్రంథములు

## అంతర భారతీయ పుస్తకమాల

| | | | |
|---|---|---|---|
| 1. | స్మృతి రేఖలు | రూ. | 6-50 |
| 2. | జీవితం - ఒక నాటక రంగం | ,, | 4-50 |
| 3. | కథా భారతి - హిందీ కథలు | ,, | 4-25 |
| 4. | కథా భారతి - తమిళ కథలు | ,, | 4-00 |
| 5. | పంజాబీ కథలు | ,, | 3-50 |
| 6. | ఐన్ గర్ వాడీ | ,, | 2-75 |

## జాతీయ జీవిత గ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| 1. | సముద్రగుప్తుడు | రూ. | 1-25 |
| 2. | శంకరాచార్యులు | ,, | 2-00 |
| 3. | అహల్యాబాయి | ,, | 2-00 |
| 4. | చంద్రగుప్త మౌర్యుడు | ,, | 1-50 |
| 5. | సుబ్రహ్మణ్య భారతి | ,, | 2-25 |
| 6. | గురునానక్ | ,, | 2-25 |
| 7. | త్యాగరాజు | ,, | 1-75 |
| 8. | హర్షుడు | ,, | 2-00 |
| 9. | రామానుజాచార్యులు | ,, | 2-25 |
| 10. | నానా ఫడ్నవీస్ | ,, | 2-00 |
| 11. | రాణీ లక్ష్మీబాయి | ,, | 2-00 |

# నెహ్రూ బాల పుస్తకాలయం

1. బాపు
   (మహాత్మా గాంధీ జీవిత చరిత్ర సచిత్రముగా రెండు భాగాలు)
   రచన, చిత్రములు : ఎఫ్. సి. ఫ్రెయిటాస్
2. కాశ్మీరు
   కుమారి మాలాసింగ్
3. మన నదుల కథ (మొదటి భాగం)
   శ్రీమతి లీలా మజుందార్
4. హిమాలయ శిఖరాలు
   బ్రిగేడియర్ గ్యాన్‌సింగ్
5. పక్షుల లోకం
   శ్రీమతి జమాల్ ఆరా
6. స్వర్గయాత్ర – ఇతర కథలు
   శ్రీమతి లీలావతీ భాగవత్
7. సరస వినోద కథలు
   శ్రీ మనోజ్ దాస్
8. మన రైల్వేల కథ
   శ్రీ జగజీత్ సింగ్
9. విదేశీయులు భారత దర్శనం
   శ్రీ కె. సి. ఖన్నా
10. స్వాతంత్ర్య గాథ
    శ్రీ విష్ణు ప్రభాకర్
11. ఒక నాటకం వేద్దాము
    శ్రీమతి ఉమా ఆనంద్

ఈ శీర్షికలోని పుస్తకములు ప్రతి ఒక్కొక్కటికి వెల రూ. 1-50

# భారత దేశము – ప్రజలు

| | | |
|---|---|---|
| 1. భారతదేశ ఖనిజములు | రూ. | 5–75 |
| 2. పెంపుడు జంతువులు | ,, | 4–75 |
| 3. సామాన్య వృక్షము | ,, | 4–25 |
| 4. నికోబార్ దీవులు | ,, | 4–25 |
| 5. జనాభా | ,, | 3–75 |
| 6. ఉద్యాన పుష్పములు | ,, | 6–00 |
| 7. భారతదేశ ఆర్థిక భూగోళ శాస్త్రము | ,, | 5–25 |
| 8. భారతదేశ భౌతిక భూగోళము | ,, | 2–75 |

# ఇతర ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. ప్రాక్పశ్చిమ పవిత్ర జ్ఞానాలు | రూ. | 5–00 |
| 2. భారతదేశము : నేడు-రేపు | ,, | 0–75 |
| 3. కల్పి లేక నాగరికత భవిష్యత్తు | ,, | 0–75 |
| 4. జ్వాలాముఖి (నవల) | ,, | 3–50 |
| 5. ఏక ప్రపంచము - భారతదేశము | ,, | 0–75 |
| 6. జ్యోడీ-లక్ష్మి | ,, | 1–50 |
| 7. పోతన | ,, | 1–50 |
| 8. విజ్ఞానం విశేషాలు | ,, | 1–50 |
| 9. నవ భారత పునర్నిర్మాణము | ,, | 1–25 |
| 10. మహా విప్లవ వీరుడు | ,, | 4–25 |
| 11. శాస్త్రి విజ్ఞానము - మానవ జీవితము | ,, | 2–75 |